**దుష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెడ్డది, చెడినది. ౨. అధమము, తక్కువైనది. ౩. దుండగము కలది, దుడుకైనది. (దుష్టవృషభము మొ.) ౪. దోషయుక్తము, దోషము కలది, తప్పు గలది. వి. అ. న. ౧. దోషము. ౨. ఒక జాతికుష్ఠము.

**దుష్టవ్రణము.** సం. వి. అ. పుం. చికిత్సచేయఁగష్ట మగు వ్రణము.

**దుష్టాత్ముఁడు.** సం. విణ. (న్.ఆ,న్.న్.) చెడ్డ మనస్సు కలవాఁడు.

**దుష్టి.** సం. వి. ఇ. స్త్రీ. దోషము; చెడుట.

**దుష్ఠు.** సం. అవ్య దుష్టము. (దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

**దుష్పచము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వండ శక్యము కానిది. ౨. జీర్ణముచేయ శక్యము కానిది.

**దుష్పత్త్రము.** సం. విణ. (అ. ఆ, అ.) చెడ్డ యాకులు కలది. వి. అ. పుం. ౧. దుష్ట మగు పత్త్రము. ౨. నల్లకచోరము f. (బలుఁగక్కుసి. అని కొందఱు.)

**దుష్పరిగ్రహము.** సం. విణ. (అ. ఆ. అ.) పరిగ్రహింపశక్యము కానిది. వి. ఆ. స్త్రీ. చెడ్డ భార్య. అ. పుం. దుష్ట మగు ప్రతిగ్రహము, చెడ్డ దానము పుచ్చుకొనుట.

**దుష్పానము.** సం. విణ. (అ. ఆ. అ.) త్రాగుటకు కష్ట మయినది. వి. అ. న. దుష్ట మగు పానము.

**దుష్పారము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. దాఁట శక్యము కానిది. ౨. నెఱవేర్ప శక్యము కానిది.

**దుష్పూరము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. పూరింప శక్యముకానిది. ౨. పూర్తిగావింప శక్యము కానిది, తీర్పరానిది (ఆశ, ఆకలి, మొ.)

**దుష్ప్రకృతి.** సం. విణ. (ఇ) దుష్టస్వభావము కలది. వి. ఇ. స్త్రీ. దుష్ట మగుస్వభావము.

**దుష్ప్రజము.** సం.విణ. (స్) దుష్టజనము కలది. (దేశము మొ.) ౨. దుష్టసంతతి కలది. (వంశము మొ.)

**దుష్ప్రజసము.** సం = దుష్ప్రజము.

**దుష్ప్రజ్ఞానము** సం=దుర్జ్ఞానము.

**దుష్ప్రజ్ఞుఁడు.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. దుష్ట మగు ప్రజ్ఞ కలవాఁడు. ౨. మందప్రజ్ఞుఁడు; ప్రజ్ఞ లేనివాఁడు.

**దుష్ప్రధర్ష.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దురాలభ, తీఁటకసిందf. ౨. ఖర్జూరిf.

**దుష్ప్రధర్షణము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧. ఎదిరింప శక్యముకానిది. ౨. తాఁక శక్యముకానిది.

**దుష్ప్రధర్షణి.** సం.వి.ఈ. స్త్రీ.వార్తాకి,ములకf.

**దుష్ప్రధర్షము.** సం=దుష్ప్రధర్షణము.

**దుష్ప్రధర్షిణి.** సం. వి.ఈ. స్త్రీ. కంటకారి,వాఁకుడుf.

**దుష్ప్రమేయము.** సం. విణ. (అ. ఆ. అ.) అపరిచ్ఛేద్యము, కొలఁది యిడ శక్యము కానిది, ఇంత యని చెప్ప శక్యము కానిది.

**దుష్ప్రవాదము.** సం. వి. అ. పుం. అపవాదము, సడి, దూఱు.

**దుష్ప్రవృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. చెడ్డనడత. ౨. చెడ్డవార్త.

**దుష్ప్రవేశ.** సం. వి. ఆ. స్త్రీ. కంథారి, ఒకానొకముండ్లచెట్టు.

**దుష్ప్రవేశము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రవేశింప శక్యము కానిది, చొరరానిది.

దుష్ప్రసహము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సహింప శక్యము కానిది. ౨. క్రూరమైనది; బెట్టిదమైనది.

దుష్ప్రాపము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రాపింప శక్యము కానిది.

దుష్ప్రీతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. దుష్ట మగు ప్రేమ, కూడని ప్రేమ. ౨. అసంతుష్టి.

దుష్యంతుఁడు. సం. వి. అ. పుం. ఒకచంద్రవంశపురాజు. (శకుంతలభర్త, భరతునితండ్రి.)

దుష్యత్. సం. (శతృ) దుష్ట మగుచున్న, చెడుచున్న.

దుష్షమము. సం. అవ్య. ౧. విషమము, పొసఁగనిది, అసంగతము. ౨. ప్రతికూలము. ౩. దుష్టము, అసమంజసము. ౪. నింద్యము. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము కనఁబడలేదు.)

దుసరులువాఱు. అ. క్రి. క్రేళ్లుఱుకు.

ద్వి. మిసిమిసిలంపులు మేసి తాఁ గ్రొవ్వి, దుసరులువాఱి గంతులుగొనులేళ్లు. నవ. ౧. ౪౮ పా. ౧ పం.

దుసికిలఁబడు = దుసికిలు. (దుసికిలన్ + పడు.) (జాఱు.)

క. కలకంఠకమ్రగాత్రలు, గలవంటుకుఁ జవులు తెలుపఁ గలకంఠమునన్, బెళుకంటఁ జెలఁగఁ జెలి బం, తులవెంటఁ బయంట చెఱఁగు దుసికిలఁబడియెన్. బహు. ౪. ౩౨.

దుసికిలఁబాఱు = దుసికిలు. (దుసికిలన్ + పాఱు.) (జాఱు.)

చ. దుసికిలఁబాఱు కోరసిగ దుప్పటినీటు లలాటపట్టికం, బొసఁగువిభూతిపైఁ బసుపుబొట్టును దొట్టినకల్లుచొక్కు వెక్కసముగ నెత్తువాటినవికారపుఁజూపులు గాఁ గనంబడన్, వెసఁ జనుదెంచె నొక్క  మీఁపభూమికిన్. శుక. ౨. ౪౧౩. (దుసికిల జాఱు. ముద్రి. పా.)

చ. దుసికిలఁబాఱుచీకటులఁ దూఁకొనుచుండెడు కీలుగంటుపైఁ, బసు పొసరించునిగ్గు గలఫాలతలంబునఁ జాఁదుబొట్టు... హంస. ౪. ౪౦. (దుసికలజాఱు. ముద్రి. పా.)

దుసికిలు(ల్లు) అ. క్రి. (√దుసుకు) ౧. జాఱు.

గీ. అట్టివేసవి బెడిదంపువెట్టకతన, హస్తము సెమర్చ సారెకు లస్తకంబు, దుసికిలఁగఁగాదె సవరింప వసము గాక, పువ్వుబాణునిచెఱకువి ల్లూడమిఁ బడియె. ఆము. ౨. ౬౫.

గీ. కనుఁగొని భయాన నెమ్మేను గడగడమన్న, చెమటలు గ్రమ్ముఁగొంగేలఁ జెఱకువిల్లుఁ, బూవుటమ్ములు దుసికిలి భూమిఁ బడిన, మగుడఁ దెంపునఁగైకొనుమారుఁజూచి. పార్వ. ౩. ౩౭

సీ. జాతినవెండ్రుకల్ సవరించి కట్టినపపిఁడివ్రాఁతరుమాలు దుసికిలంగ. నిరం. ౨. ౨౧.

౨. తప్పుకొను, తొలఁగు.

చ... వీరవినోదచాతురీ, రసికుల రామలక్ష్మణుల రాజకుమారుల మోసపుచ్చి నేఁ దుసికిలి డాఁగి పోయి యొకతుచ్ఛుఁడు నేఁ డని చింత నొందుచున్. రామా. ౮. ౨౦.

దుసుకు = దుసికిలు. అ. క్రి. జాఱు.

చ. ఒసపరి గబ్బిగుబ్బగవయుబ్బునఁ గొనని యాడఁ గ్రొమ్ముడిన్, దుసికి పిఱుందుపై సరులు తుంపెసలాడ బిరాన సిగ్గుతోఁ, ముసిముసినవ్వు మోముపయి ముచ్చటలాడ రవందెమ్రోఁతతోఁ, గుసగుసలాడ సంచగమి గూడఁ జనెన్ జెలి శారదమ్రోలకున్. ముకుంద. ౩. ౨౪౩.

జః దుసికిలఁబడు, దుసికిలఁబాఱు, దుసికిలు.

దుస్తరము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తరింప శక్యము కానిది; దాఁటరానిది. ౨. మీఱరానిది.

దుస్తర్కము. సం. వి. అ. పుం. కుతర్కము, చెడ్డతర్కము.

దుస్తు. వి. (క. దుప్తు.) ౧. వస్త్రము, బట్ట.
సీ. శుభశోభనముల దుస్తు లొసంగ వెన్కముం దులను నట్టెలు సేయఁగలరుగాక. చంద్రా. ౩. ౪౫.
౨. అందము. (శ. ర.)
విణ. అధికము.
శా. అస్తోకక్రతుహోమధూమములచాయల్ శీర్షకుండంబులకు, దుస్తై తోఁపఁగఁ జూచి ... చంద్రా. ౩. ౭౯.

దుస్త్యజము. సం. విణ. (అ. ఆ. అ.) విడువ కూడనిది.

దుస్పర్శ. సం. వి. ఆ. స్త్రీ. వాఁకుడుకీ.

దుస్సంచారము. సం. విణ. (అ. ఆ. అ.) సంచరింపశక్యముగానిది. వి. అ. పుం. చెడ్డసంచారము.

దుస్సంధానము. సం. విణ=దుస్సంధేయము. వి. అ. న. ౧. దుష్ట మగుసంధానము. ౨. కష్ట మగుసంధానము.

దుస్సంధేయము. సం. విణ. (అ. ఆ. అ.) సంధింప శక్యము కానిది, కూర్పరానిది.

దుస్సర=దూసర. వి. ౧. సుదర్శనలత.
సీ... దుస్సర యనఁగ సుదర్శనలత పేరు దనరుచుండు. ఆం. భా. ౨. ౫౫.
౨. వత్సాదనికీ.
చ... చెంచలియుఁ గుచ్చలి చిత్తి తగిరస తుమ్మి దుస్సర... హంస. ౪. ౧౩౨.

దుస్ససేనుఁడు. వి. (సం. దుశ్శాసనః) దుర్యోధనునితమ్ముఁడు, దుశ్శాసనుఁడు.
ఆ. కర్ణునగవు లోకగర్హితుం డగుదుస్ససేనుచె…ద్దుకంటె శిఖియపోలె, సడరి సాహసంబు నతిదారుణక్రియ, నేర్చుచున్నయది మహీధరుండ. భార. ఆర. ౧. ౧౩౯.

దుస్సహము. సం. విణ. (అ. ఆ. అ.) సహింపరానిది.

దుస్సాధము. సం. విణ. (అ. ఆ. అ.) సాధింప శక్యము గానిది.

దుస్స్థ(స్థ)ము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెడ్డస్థితిలో నుండునది; కష్టములో నుండునది. ౨. అస్వస్థము, ఆరోగ్యము లేనిది. ౩. నిలుకడ లేనిది, కుదురుపాటు లేనిది. వి. అ. పుం. ౧. కోఁడి. ౨. కుక్క.

దుస్స్థి(స్థి)తము. సం. విణ=దుస్స్థము.

దుస్స్థి(స్థి)తి. సం. విణ.(ఇ.) దుష్టస్థితి గలది. ౨. నిలుకడ లేనిది. వి. ఇ. స్త్రీ. ౧. చెడ్డస్థితి. ౨. నిలుకడలేమి.

దుస్స్ప(స్ప)ర్శము. సం. విణ. (అ. ఆ. అ.) స్పృశింప శక్యము కానిది. వి. అ. పుం. ౧. దుష్ట మగుస్పర్శము. ౨. తీఁటుకసిందకీ.

దుస్స్మరము. సం. విణ. (అ. ఆ. అ.) స్మరింప శక్యము కానిది.

దుస్స్వప్నము, సం. వి. అ. పుం. చెడ్డకల.

దుహిత. సం. వి. ఋ. స్త్రీ - తల్లిదండ్రులయొద్ద ధనమును పాలు పిదికినట్లు అరణముగా తీసికొనిపోవునది-కూఁతురు, పుత్రిక.

దుహిలీ. వి. హస్తాభరణవిశేషము.
ద్వి. తోరంపువజ్రాలదుహిలీలడాలు, పేరింపుఁగెంపులపిడి మీఁదఁ దిరుగఁ, గరప దమ్మునిమించు గమకించుగచ్చు, సురటీ వట్రువగాఁ గుడియంగఁ ద్రిప్పి. నవనాథ. ౧. ౫౩ పా ౧౯౫౯.

# దూ

దూఁకలి. వి. ఘా. (సం. దుఃఖమ్. ప్రా. దుక్ఖో.)

బాధ.

క. ఆఁకొంటి రిన్నిదినములు, పోఁకంతయు భిక్ష వీటఁ బుట్టకయునికిన్, ఆఁకటిదూఁకట నలిఁగితి, శేఁకఁట వాయంగ భిక్ష లిడియెద రండీ. భీమ. ౨. ౧౨౪.

ద్వి. పెద్దమాటలెకాని వేల్పులకన్న, దొడ్డవాఁ డప్పుర నాదూఁకలి దీర్పు. ద్వి. క. సా. ౧. ౩౦ పా. ౧ పం.

దూఁకు= దుముకు.

(ఉఱుకు, గంతువేయు.)

చ...రవి దూఁక లేమతో, యమునను జిందు బిందువులయట్లు నభంబున భంబు లేర్పడెన్. ముకుంద. ౩. ౪౩.

దండకము...నింగికై చంగునన్ దాఁటుచుం గ్రిందికిన్ దూఁకుచున్...దశా. ౪. ౨౩౨.

చ...జెట్టి వగ దూఁకొని మింటికిఁ దూఁకె దూఁకినన్, గెలువు కకుత్థ్స యీయసుర గెల్వకమున్న...కకు. ౫. ౧౭౦.

సీ. అనిలంబురీతి టివ్వున దూఁకి ధరణిపైఁ బదములు నిలుపక పఱచి పఱచి. అని. ౪. ౩౨.

(శ. ర. పా. దూఁగి. ముద్రి. పా.)

జః దూఁకుడు.

దూఁకుడు. వి. (√దూఁకు.) ౧. వల్గితము, అశ్వగతివిశేషము.

సీ. చౌకళిం పనఁగను దూఁకు డనంగను వల్గితమగును...ఆం. భా. ౨. ౧౯౭.

౨. వేగము, త్వర.

(వ్యవ.) నీదూఁకు డణఁచెదను.నీ కింత దూఁకుడు పనికిరాదు.

విణ. ఎగుడుదిగుడు (శ. ర.)

దూఁకొనుఁస. క్రి. (దూఁటు+కొను) ...

(క) ప్రాపించు.

ఉ. తొమ్మిదివెన్ని ధానములు దూఁకొని యర్థవిభుం డనం బ్రశ, స్త మ్మగుపేరి నిందుధరసఖ్యముఁ గాంచినమేటి యొండుచో, టిమ్మెయి మెచ్చ కివ్వరమహీధరపాదము నాశ్రయించి సౌఖ్యమ్మున మూరిఁబోయె...హరి. ఉ. ౬. ౧౦.

ఉ. నేత్రమ నేను జీరయును నేత్రమ చీరకు నాశ్రయింపఁగాఁ, బాత్రత గల్గె నాకు నిటఁ బాత్రత లే దని నామసామ్యమై, చిత్రకతంబునన్ బలిమిఁ జేకొనినట్టులు రాజదృష్టి యా, క్షత్రియకన్యచాఱుకటిచక్రము నూరుయుగంబు దూఁకొనెన్. నైష. ౩. ౧౫౨.

క. ఆయుంగరంబుఁ గనుఁగొని, తోయజముఖి మోహమూర్ఛ దూఁకొని యుండెన్. రామా. ౬. ౧౩౭.

(చ) స్వీకరించు.

చ. అహిమరుచిప్రతాపుఁ డగునాకళనాథుఁడు బ్రహ్మదత్తుకై, దుహితృశతంబు నీ నతఁడు దూఁకొని వారిఁ గ్రమంబునన్ గరగ్రహణము సేయ నావిభుకరం బటు మోపినయంతలోన నమ్మహిళలు కుబ్జరూపములు మానఁగ నొప్పిరి చారుమూర్తులై. భా. రా. బాల. ౩౨౨.

(ట) ఆస్వాదించు; త్రావు.

ఉ. తొంగలిపువ్వుఁదేనియల దూఁకొని మత్తిలి తుమ్మెదల్...యయా. ౪. ౪౯.

అ. క్రి. అతిశయించు.

క...రమా, వరుఁ డంబుదగంభీరమధురభావ మలఁ బల్కెఁ బ్రియము దూఁకొను చుండన్. భాగ. ౪. ౯౦౪.

మానిని...జని పొందెను వైష్ణవపూజితధర్మశ్మశి ... ... న కాసురకేశవుఁ డష్టహిదేవకులా

గ్రణికిన్, దోషవిదూరత దూఁకొను చైత్రకథూర్జటితారవిధుం డెసఁగన్. పరమ. ౫. ౨౦౬.

దూఁట. వి. అరఁటియూఁచ, గెలవేసినయరఁటిచెట్టులోపల నుండుభాగము, దవ్వ. (శ. ర.)

దూఁటిపుచ్చు. స. క్రి. (√దూఁటు.) తిరస్కరించు.

సీ. తేఁటిమొత్తము నేపు దూఁటిపుచ్చఁగ నోపు కమనీయనీలాలకములు చూచి. పి. శకుం. ౨. ౧౪౦.

దూఁటు. స. క్రి. ౧. పొడుచు, కుమ్ము; (పక్షులు మొ.) ముక్కుతో పొడుచు.

ఉ. ఆదివరాహ మప్పు డమరాహితుఁ గూలఁగ దూఁటి తీక్ష్ణదంష్ట్రిదళితాంగుఁ జేసి... హ. వరాహ. ౩. ౪౧.

సీ. ఎండ్రి కాలికిన నెగసి యొక్కించుక డొలఁగి శితత్రోటి దూఁటి తినుచు. ఆము. ౨. ౫౩.

సీ. ఇగురంచు గండుఁగోయిల దూఁటు నంచునో తరళాక్షి పెదవి గదల్ప వేమి. దశా. ౨. ౩౨౪.

౨. (క)- దూడ పాలు త్రాగునపుడు ముట్టెతో తల్లిపొదుగు- పొడుచు.

ఉ. తల్లులచన్నుఁ బాలు మును ద్రావుతఱిం దమకర్ణవీథులన్, వల్లభ మైనమాధవునివంశరవామృతధార సొచ్చినన్, దుర్లక పాలు రాఁదివక దూఁటక మానక కృష్ణుమీఁద దృగ్వల్లులు సేర్చి నిల్చె నదె వత్సము లంగనలార గంటిరే. భాగ. ౧౦. పూ. ౮౭౭.

(చ) -పిల్లలు పాలు త్రాగునపుడు తల్లులబొమ్మన మూతితో- పొడుచు.

సీ. ఎత్తి చన్నిచ్చుచో నిరుదెసఁ బాలిండ్లు చేతులఁ బుడుకుచుఁ జేఁపు సలుపఁగ... దూ-టు దురు గ్రుక్క గ్రుక్కకు... భాగ. ౧౦. పూ. ౨౭౯.

౩. (క. దూటు, దూంటు) లంఘించు, దాఁటు, దుముకు.

(వ్యవ.) వాఁడు గోడ దూఁటి పోయి వాఁడు.

గీ. ఏడుపాతాళములు దాఁటి యిలయు దూఁటి, యంబరము దాఁకె నవ్వరణాంబుధార. కాశీ. ౫. ౧౩౭.

అ. క్రి. పాఱిపోవు, పోవు.

శా. తానే దొంగిలి గిన్నె శిష్యవరు చేతం బంపి చౌర్యంబు పై, పైనం దూఁటి చనంగ నేరమిని... విప్ర. ౫. ౬౨.

క. వాలమ్ముల దంష్ట్రికర, వాలమ్ముల నెత్తి పైచి వాలమ్ముల వేఁ, జాలమ్ములఁ దగిలినకిటి, జాలమ్ములు దూఁటె నింద్రజాల మ్మనఁగన్. పారంగ. ౧. ౧౦౨.

సీ. కెంగేల జలపాత్ర గీలించి మొలదోఁటు త్రోవగా నవ్వల దూఁటె నొకతె. దశా. ౭. ౨౩౭.

౨. చొచ్చు, ప్రవేశించు.

చ. జలనిధిలోన దూఁటి కులశైలము మీఁటి... దా. శ. ౩౩.

వి. పొడుపు.

సీ. పొదుగుదూఁటులు మాని యొదిగి క్రేపుల గుంపు జననీనికాయంబుచాటుఁ జేర. శుక. ౨. ౩౪౨.

జః దూఁకొను, దూఁటిపుచ్చు, దూఁటుకట్టు, దూఁటుకొను.

దూఁటుకట్టు. అ. క్రి. (దూఁటు + కట్టు.) నిండు, నిండుకొను. (తూటుకట్టు. అని బ్రా.)

సీ. కంఖాణఖురగరింఖాపూజితక్షమాధూళి నభ్రపథంబు దూఁటుకట్టు. వరాహ. ౫. ౨౮.

గీ. గుహునిపై నిట్లు యత్యుగ్రరోషభాతిఁ, దారకాసురుఁ డేసినఁ దత్క్షణంబ, నెఱయ

బ్రహ్మాండసుహారంబు దెలిపి యెల్ల, దొనవిధంబున నమ్ముల దూఁటుకట్టె. కు. సం. ౧౨. ౯౨౦.

దూఁటుకొను. అ. క్రి. (దూఁటు + కొను.) ఎగురు.

వ. ...వానివదననిశ్వాసపవనంబు... భూనభోంతరంబెల్లను నిరంతరనికతారజఃపటలంబు దూఁటుకొనం జేయు... భార. అర. ౪. ౩౭౪.

దూఁబిడి. వి. (దూయు + పిడి.) నూలు తోడున పుడు చీడు తగిలించుటకు నిలిపెడిపీట మమర్చిన కొయ్య. (శ. ర.)

దూగఱ.[1] వి. (దూపము + కఱ.) కఱదూపము. (శ. ర.)

దూగఱ.[2] వి. ధాన్యములో నుండుధూళి.

(వ్యవ.) ధాన్యము కొలిచినప్పుడు దూగఱ మీఁదఁ బడుటచే శరీర మంతయు దురదపెట్టుచున్నది.

దూగిలాట. వి. బాలక్రీడావిశేషము.

సీ. గోటదొర్లుడుకాయ గొబ్బిళ్లు మోపిళ్లు నీగ పోగిస బంతి దూగిలాట. హంస. ౩. ౧౪౬.

దూచి. వి. బాలక్రీడావిశేషము.

సీ. దూచియు జాబిల్లి బూచి కన్నులకచ్చి గుడుగుడుగుంచాలు కుందెనగిటి. హంస. ౩. ౧౪౬.

దూడ. వి. ౧. పశుజాతిశిశువు, లేఁగ; క్రేపు.

క. కాంచి హర్షించి శబలీ, యంచున్ బిలుచుటయు నోడయఁ దరలెంచినవాఁడంచు నది దూడతోఁ జన్నుదెంచి తనువు మూర్కొనంగ... ఉ. రా. ౬. ౩౫౯.

చ. కఱ వరదెంచినన్ ఘటముగర్భమునం గల సత్త్వవంతయున్, దఱుఁగక యమ్మి మేఁకఁ గోన దానికిఁ బిల్లలు రెండు గల్గ నమ్మఱకలు కొంటికిం గలుగు మానుగ దూడలు నాల్గు... సా. పంప. ౫. ౧౧.

చ. అలయక లేడిదూడగుమి... ఉ. రా. ౭. ౪౧౭.

౨. ఇది నిందయందు మనుష్యశిశువులకుఁ బ్రయుక్త మగు.

సీ. పసుచుదూడలచేత పనియౌనె వీ రేల యవనూయఁ బోతేరఁ బసుపరమ్మ. కుపల. ౨. ౨౬.

బ. పశువులు.

(వ్యవ.) దూడలుత్రొక్కినదారి యగుటచే ధూళి యధికముగ నున్నది.

(,,) వాఁడు సంతకు వెళ్లి నాలుగు కాఁడులదూడలను కొన్నాఁడు.

క. తలిదండ్రులయనుమతి దూడలఁ గాయఁగఁ బూని గొఱుపడము చల్లడమున్, దలచీర కోల కిఱుచెప్పులు బిల్లనగ్రోవి యమరఁ బొలము దిరుగుచున్. చెన్న. ౩. ౩౧.

సా. దూడలతరమా దంటులు కొఱుకన్.- అల్పులు గొప్పపని చేయఁజాలరనుట కుపమానముగా గ్రహింపఁబడును.

క. నాదుమనోరథ మాలక్ష్మీదయితుని చేతఁ గాని మిముబోఁటులచేఁ, గాదు చనుఁడు దూడలతరమా దంటులు కొఱుక ననిన మానివతంసుల్. వరాహ. ౭. ౭౧.

జః దూడపాల.

దూడపాల. వి. (√దూడ) గోపిక, సుగంధిపాల.

సీ... దూడ, పాల యన గోపికాఖ్య యై పరఁగు ... ఆం. భా. ౨. ౫౭.

దూత (తుఁడు.) సం. వి. అ. పుం. ౧. రాయబారి.

క. తనకడకు వచ్చి మొగమోడనివాఁ డగు దూత వల్కుటకుఁ గోపింపం, జనదు జననాథునకు దూతునిఁ జంపిన నరక మగుట ధ్రువ మని రాజ్యుల్. భార. శాం. ౨. ౭౭౭.

...నీకుఁ దెగనొల్లక రమ్మందుట

నీపరాక్రమం,బారసి కాదురా వెఱవ కా
డుము దూతుఁ డవధ్యుఁ డెంగు నీ,వీరుల
నిన్ను సమ్మెటనె వ్రేయుదు డాయుదుఁ
బోర శౌటికిన్,నీకి బాహుసార మెడసే
యుదుఁ జేయుదు రాజనూ యముకా. ఉ.
హరి. ౪. ౨౦౫.

౨. కుంటెనవాఁడు.

గీ. అనిలుఁ డనుదూత వోయి త్రోడ్కొనియుఁ
దెచ్చె... అతిపరిశ్రాంతుఁ డైనయయాతి
నంత. భార. ఆది. 3. ౧౫౬.

దూతఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. - పరితాపమును
బోఁగొట్టునది - కదంబపుష్పి, పెద్దబోడసర
ము.

దూతము. సం. వి. అ. న. పరితాపము.

దూతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. రాయబారము
చేసెడియాఁడుది. ౨. కుంటెనకత్తె.

దూత్యము. సం. వి. అ. న. ౧. దూతధర్మము.
౨. దూతకృత్యము, రాయబారము.

దూది. వి. (క. దూది.) విత్తు దీసినప్రత్తి, తూ
లము.

ఉ. నూదులు ద్రిప్పు చంద మగుచున్ వెతవెట్ట
కయుండ నెచ్చెలుల్, దూదులు వెట్టరే
చెవులలోపల సంతతపాంథలోకవ్వా, ద్భ
దులు మత్తరాజకుకభీషణభావలు బాల
పల్లవా, స్వాదికషాయకంఠవిలసత్కలకంఠక
టుస్వనంబులున్. వి. కకుం. 3. ౧౫౪.

ఉ...దూది రాశిగాఁ,జేసినరీతి నున్న యొకజీర్ణ
మునిం గని కౌతుకంబునన్.మనుచ.౪.౭౫.

జః దూదిదబ్బ, దూదినిమ్మ, దూదిపింజె, దూది
మడుఁగు.

దూదిదబ్బ. వి. (√దూది.) ఒకజాతిదబ్బ,తోలు
దళసరిగా నుండుదబ్బపండు. (శ. ర.)

దూదినిమ్మ. వి. (√దూది.) ఒకజాతినిమ్మపండు.(దూది
దబ్బ అని చి. ని.)

దూదిపింజె. వి. (దూది + పింజె.) దారము తీయు
టకు అను వగునట్లు చక్కగా చేసినదూదిముద్ద.
(వ్యవ.) ఆ మెశరీరము దూదిపింజెవలె అతిమృ
దువుగా నున్నది.

దూదిమడు(ణు)ఁగు. వి. (√దూది.) భక్ష్యవిశే
షము.

సీ. అప్పడాలకొటారు లమృతఫలాదులు వడల
కుప్పలు దూదిమడుఁగుగిరులు. శ్రీరం. మా.
౬. ౧౧౦.

దూదేకు. వి. (√దూది.) తురకలలో నొకజాతి;
ఆజాతివాఁడు.

గీ. ఎసఁగుఁ బింజారి నాఁగ దూదేకువాఁడు.
ఆం. భా. ౨. ౨౭౪.

సీ. దూదేకులహుశేను దొమ్మరిగోపాలు...
వేణు. ౭౧. చంద్ర. వి. ౨. ౫౬.

దూనము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. ఉప
తప్తము, సంతాపము నొందినది. ౨. దుఃఖితము,
దుఃఖము నొందినది. 3. పరిశ్రాంతము, బడలినది.

దూప. వి. ౧. పిపాస, దప్పి.

సీ.. చాన నీకెమ్మోవిపానకం బానక తెరలెడు
బలుదూప దీఱిపోదు. రసిక. ౬. ౭౫.

క. అదె కొలను దూర్పుదెసఁ జెన్నొందెడు నటు
కేఁగి దూప యుడుగఁగఁ దెలినీరు దగన్
గ్రోలిటు రమ్మా,పదపడి కర్ణంబు లెల్ల బాగగు
ననుడున్. అచ్చ. రా. యు. ౪౧౫. కవి.
౪. ౫౧. ఆం. భా. ౨. ౨౬౦.

౨. శ్రమము, అలసట; తాపము.

సీ.తోరంపుటూర్పులఁ దొడరి పాతాళము దాఁ
కంగ సాగరౌఘములు గలఁగ, వికటంపు టెఱ
కలవిసరున నుప్పొంగుతుప్పర దెందంబుద్రు
పడఁగ, హరి. ఉ. ౫. ౧౬౧.

గీ. తనయనుఁగుఁగూన చెఱ నుంట దలఁచి వెత
లఁద్రూలు నేలపాలంతుక దూప యడఁప, మొ
గిలుకడవల జేజేలు ముంచి నించు, వలిచదలు
వాఁకనీ రన వాన లెసఁగె. అచ్చ. రా.
కిష్కిం. ౬౨. ప్రబంధ. ౭౮౮.

జః దూపటిలు, దూపట్టు, దూపించు[1], దూపిడు, దూపిలు.

**దూపటిలు(ల్లు)**=దూపించు, దూపిలు. అ. క్రి. (దూప+ఇలు.) ౧. దగగొను, దప్పిగొను.

గీ. అలసి బడలికఁ గడు దూపటిలి ప్రభాత,
సమయరతితాంతకాంతాకుచప్రరోహ, కలి
తకర్పూరశీతలఘర్మవారిఁ, గ్రోలి మెలఁగు
మరుద్బాలజాల మచట. చంద్రా. ౧. ౪౧.
(చి. ని. పా.)

ద్వి. కడు దూపటిలి యుదకంబులు గ్రోలఁ, దడ
యక యయ్యేటిదరి కేఁగుదెంచి. నవనాథ.
౩. ౨౦౮ పా. ౧౫ పం.

౨. అలయు, శ్రమపడు.

వ. ..పతులప్రార్థనంబులం బుంభావసురతాడంబ
రంబునకుం దోడునూపిదూపటిలి.., మను చ.
౩. ౨౮.

చ. అదియునుగాక గంధకరియాకృతి శేపటిఁ
బట్టి యొక్కటిం, గద కపిరాట్పుమూకదళికా
వనవాటిఁ జెకల్చి యాడి తిం, తదడవుదాఁక
దూపటిలి నాఁడవు కయ్యముసేయ నెల్లి వ,
చ్చెద విపు డేమి దప్పె నిలు చేరి సుఖంబున
నుండు నేఁటికిన్. రామా. ౮. ౧౩౫. భీమ.
౨. ౧౦౧.

**దూపట్టు.** అ. క్రి. (దూప+పట్టు.) అలయు, శ్రమపడు.

సీ. దూరంబు వచ్చినపా రిట సైన్యంబు ప్రజలె
ల్లఁ జాల దూపట్టినారు. పి. శకుం. ౧. ౧౨౩.

**దూపము.** వి. (సం. ధూపః.) సుగంధద్రవ్యము.
(వాసన గలపొగ అని శ. ర.)

సీ. తఱచుగాఁ బెట్టినతావిదూపప్రఁబొగల్ గుం
పులై మెలఁగుమొగుళ్లుగాఁగ. యయా. ౪.
౧౫౩.

జః దూగఱ, దూపార్తి, దూపించు[2].

**దూపార్తి.** వి. (దూపము+ఆరతి.) దూపము వే
సెడుపాదము పెట్టినతట్ట, దూపము వేయుపాత్ర
విశేషము. (శ. ర.)

**దూపించు[1]**=దూపటిలు. (√దూప.)
(శ్రమనొందు, అలయు.)

క. క్రేపుఁ దలఁచి పసి మేయుచుఁ, జేపినపా
ల్గలయ నెండచేఁ బాంథజనుల్, దూపింపమి
కజుఁ డంపిన, యాపాగా యనఁగ నదుల
నంచలు మెఱసెన్. అము. ౪. ౧౬౮.

శా. ఏప్రె చీకటి సూది మోప నెడయీ కేర్పడ్డ
వేళ ధ్వనుల్, చూపట్టక జిటిపాటిచిన్కుల
ఘనాళుల్ మింట వర్తిల్లఁగా, దూపించుక
జెలఁగుక దళుక్కునఁ దటిత్తుల్ దోఁచిన
ల్లెల వ్వెల్లాపుంగత్తె చరించుచుక...మల్ల
భూ. శ్రం. ౯౪.

**దూపించు[2].** అ. క్రి. (√దూపము.) ధూపము వేయు.

ద్వి. అగలు దూపించిన నలరులు దుఱిమి, మృగ
మదపంకంబు మెయినిండ నలఁది. నవనాథ.
౨. ౭౪ పా. ౪ పం.

**దూపిడు.** స. క్రి. (దూప+ఇడు.) అలయించు, శ్రమపెట్టు.

ద్వి. తొమ్మిదియమ్ముల దూపిడ్డవానిఁ, గొమ్మని
గిరి యెత్తికొని వైచె నతఁడు. రం. రా.
యు. ౩౫౫ పా. ౮ పం.

**దూపిలు(ల్లు)**=దూపటిలు. అ. క్రి. (√దూప.) ౧. దప్పిగొను, దగగొను.

నీపరాక్రమం,బారసి కాదురా వెఱవ కా
డుము దూతుఁ డవధ్యుఁ డెంచు నీ,వీవల
నిన్ను సమ్మెటనె క్రేయుదు డాయుదుఁ
బోర శౌరికిఁ,సీరికి బాహుసార మెడసే
యుదుఁ జేయుదు రాజసూయముఁ. ఉ.
హరి. ౪. ౨౦౫.

౨. కుంటెనవాఁడు.

గీ. అనిలుఁ డనుదూత వోయి త్రోడ్కొనియుఁ
దెచ్చె... అతిపరిశ్రాంతుఁ డైనయయాతి
నంత. భార. ఆది. ౩. ౧౫౬.

దూతఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. - పరితాపమును బోఁగొట్టునది - కదంబపుష్పి, పెద్దబోడసరముః.

దూతము. సం. వి. అ. న. పరితాపము.

దూతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. రాయబారము చేసెడియాఁడుది. ౨. కుంటెనకత్తె.

దూత్యము. సం. వి. అ. న. ౧. దూతధర్మము. ౨. దూతకృత్యము, రాయబారము.

దూది. వి. (క. దూది.) విత్తు దీసినప్రత్తి, తూలము.

ఉ. నూదులు ద్రిప్పుచండ మగుచుఁ వెతవెట్ట
కయుండ నెచ్చెలుల్, దూదులు వెట్టరే
చెవులలోపల సంతతపాంథలోకహృ, ద్భే
దులు మత్తరాజకకభీషణభాషలు బాల
పల్లవా, స్వాదకషాయకంఠవిలసత్కలకంఠక
టుస్వనంబులుఁ. వి. శకుం. ౩. ౧౫౪.

ఉ...దూది రాశిగాఁ,జేసినరీతి నున్న యొకజీర్ణ
మునిం గని కౌతుకంబునఁ.మనుచ.౪.౭౫.

జః దూదిదబ్బ, దూదినిమ్మ, దూదిపింజె, దూదిమడుఁగు.

దూదిదబ్బ. వి. (√దూది.) ఒకజాతిదబ్బ,తోలు దళసరిగా నుండుదబ్బః. (శ. ర.)

దూదినిమ్మ. వి. (√దూది.) ఒకజాతినిమ్మః.(దూదిదబ్బ అని చి. ని.)

దూదిపింజె. వి. (దూది+పింజె.) దారము తీయుటకు అను వగునట్లు చక్కగా చేసినదూదిముద్ద. (వ్యవ.) ఆమెశరీరము దూదిపింజెవలె అతిమృదువుగా నున్నది.

దూదిమడు(ఱు)ఁగు. వి. (√దూది.) భక్ష్యవిశేషము.

సీ. అప్పడాలకొటారు లమృతఫలాదులు వడల
కుప్పలు దూదిమడుఁగుగిరులు. శ్రీరం. మా.
౬. ౧౧౦.

దూదేకు. వి. (√దూది.) తురకలలో నొకజాతి; ఆజాతివాఁడు.

గీ. ఎసఁగుఁ బింజారి నాఁగ దూదేకువాఁడు.
ఆం. భా. ౨. ౨౭౪.

సీ. దూదేకులహుశేను దొమ్మరిగోపాలు...
వేణు. ౭౧. చంద్ర. వి. ౨. ౫౬.

దూనము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. ఉపతప్తము, సంతాపము నొందినది.౨. దుఃఖితము, దుఃఖము నొందినది. ౩. పరిశ్రాంతము, బడలినది.

దూప. వి. ౧. పిపాస, దప్పి.

సీ.. చాన నీకెమ్మోవిపానకం బానక తీరలేదు
బలుదూప దీటిపోదు. రసిక. ౬. ౭౯.

క. అదె కొలను దూర్పుదెసఁ జెన్నొందెడు వెడు నట
కేఁగి దూప యుడుగఁగఁ దెలిసీ,రు దగఁ
గ్రోలిటు రమ్మా,పదపడి కర్జంబు లెల్ల బాగగు
ననుచుఁ. అచ్చ. రా. యు. ౪౧౫. కను.
౪. ౫౧. ఆం. భా. ౨. ౨౬౦.

౨. శ్రమము, అలసట; తాపము.

సీ.తోరంపుటూర్పులఁ దొడరి పాతాళము దాఁ
కంగ సాగరౌఘములు గలఁగ, వికటంపుటెఱ
కలవిసరున నుప్పొంగుతుప్పర డెందంబుదూ
పడంగ. హరి. ఉ. ౫. ౧౬౧.

గీ. తనయునుఁగుఁగూన చెఱ నుంట దలఁచి వెత
లఁ,దూలు నేలపాలంతుక దూప యడఁప, మొ
గిలుకడవల జేజేలు ముంచి నించు, వలిచదలు
వాఁకనీ రన వాన లెసఁగె. అచ్చ. రా.
కిష్కిం. ౫౨. ప్రబంధ. ౪౭౭.

జః దూపటిలు, దూపట్టు, దూపించు[1], దూపిడు,
దూపిలు.

దూపటిలు(ల్లు)=దూపించు, దూపిలు. అ. క్రి.
(దూప+ఇలు.) ౧. దగగొను, దప్పిగొను.

గీ. అలసి బడలికఁ గడు దూపటిలి ప్రభాత,
సమయరతితాంతకాంతాకుచప్రరోహ, కలి
తకర్పూరశీతలఘర్మవారిఁ, గ్రోలి మెలఁగు
మరుద్వ్యాలజాల మచట. చంద్రా. ౧. ౪౧.
(చి. ని. పా.)

ద్వి. కడు దూపటిలి యుదకంబులు గ్రోలఁ,దడ
యక యర్యోటిదరి కేఁగుదెంచి. నవనాథ.
౩.౨౦౭ పా. ౧౫ పం.

౨. అలయు, శ్రమపడు.

వ...పతులప్రార్థనంబులం బుంభావసురతాడంబ
రంబునకుం దోడునూపిదూపటిలి...మనుచ.
౩. ౨౭.

చ. అదియునుగాక గంధకరియాకృతి రేపటిఁ
బట్టి రొక్కటిం, గద కపిరాట్చమూకదళికా
వనవాటిఁ ద్రెకల్చి యాడి త్రిం,తదడవుదాఁక
దూపటిలి నాఁడవు శయ్యముసేయ నెల్లి వ,
చ్చెద విపు డేమి దప్పె నిలు చేరి సుఖంబున
నుండు నేఁటికిన్. రామా. ౭. ౧౩౫.భీమ.
౨. ౧౦౧.

దూపట్టు. అ. క్రి. (దూప+పట్టు.) అలయు,
శ్రమపడు.

సీ. దూరంబు వచ్చినవా రిటు సైన్యంబు ప్రజలె
ల్లఁ జాల దూపట్టినారు. పి.శకుం.౧.౧౨౩.

దూపము. వి. (సం.ధూపః.) సుగంధద్రవ్యము.
(వాసన గలపొగ అని శ.ర.)

సీ. తఱచుగాఁ బెట్టినతావిదూపప్రఁబొగల్ గుం
పులై మెలఁగుమొగుళ్లుగాఁగ. యయా. ౪.
౧౫౩.

జః దూగఱ, దూపార్తి, దూపించు[2].

దూపార్తి. వి. (దూపము+ఆరతి.) దూపము వే
సెడుపాదము పెట్టినతట్ట, దూపము వేయుపాత్ర
విశేషము. (శ. ర.)

దూపించు[1]=దూపటిలు. (√దూప.)
(శ్రమనొందు, అలయు.)

క. క్రేపుఁ దలఁచి పసి మేయుచుఁ, జేపినపా
ల్గలయ నెండచేఁ బాంథజనుల్, దూపింపమి
కఱుఁ దంపిన, యూపాగా యనఁగ నదుల
నంచలు మెఱసెన్. ఆము. ౪. ౧౨౭.

శా. ఏపై చీకటి సూది మోప నెడయీ కేర్పడ్డ
వేళ ధ్వనుల్, చూపట్టన్ జిటిపొట్టిచిన్కుల
ఘనాళుల్ మింట వర్తిల్లఁగా, దూపించున్
జెలఁగున్ దళుక్కునఁ దటిత్తుల్ దోఁచిన
ట్లెల్ల వెల్లాపుంగత్తె చరించుచున్...మల్ల
భూ. శృం. ౯౪.

దూపించు[2]. అ. క్రి. (√దూపము.) ధూపము
వేయు.

ద్వి. అగలు దూపించిన నలరులు దుఱిమి,మృగ
మదపంకంబు మెయినిండ నలఁది. నవనాథ.
౨. ౪౪ పా. ౪ పం.

దూపిడు. స. క్రి. (దూప+ఇడు.) అలయించు,
శ్రమపెట్టు.

ద్వి. తొమ్మిదియమ్ముల దూపిడ్డవానిఁ,గొ మ్మని
గిరి యెత్తికొని వైచె నతఁడు. రం. రా.
యు. ౩౫౫ పా. ౭ పం.

దూపిలు(ల్లు)=దూపటిలు. అ. క్రి. (√దూప.)
౧. దప్పిగొను, దగగొను.

ఉ...తాపసపుత్రుఁ డాత్మవిద్యాసముదగ్రు
లైనతలిదండ్రులు దూపిలియుండ వారల,
గానిల కుండఁ గుండ నుదకంబుల ముంపఁగ
...రామా. ౨. ౩౬.

సీ. శివుఁ డైన దూపిలి చిక్కఁడే జాహ్నవి
నెలమితో శిరసావహింపఁడేని. చమ. ౩.
౧౨౭.

౨. పరితపించు.

గీ. జెదరు...నించు దూపిలుఁ గృశించుఁ,
బంచశరఘోరశితచూతభల్లభగ్న, మానసాం
భోజ యగుచు నమంజువాణి. రసిక. ౪. ౮.

వ...పార్వతీవల్లభుండు దనకుఁ జేసిన యవమా
నంబునకు దూపిల్లుచుండెను...భీమ. ౨.
౩౩. (శ.ర. పా. దురపిల్లుచుండె. ముద్రి.)

దూబ. వి. ౧. షండుఁడు, నపుంసకుఁడు.

సీ. పంద యనంగ దూబ యనంగఁ బేడి నా
షండనామంబు గాఁ జనును...ఆం. భా. ౨.
౧౧౪.

౨. అవలక్షణము.

సీ. అవలక్షణభగాఖ్య లలరు దూబ యనంగ...
ఆం. భా. ౩. ౪౫.

౩. భగము, ఆఁడుగుఱి.
ఆం. భా. ౩. ౪౫.

౪. దిబ్బ, ఎత్తైన ప్రదేశము.

సీ. ఎలమావి జొంపముల్ బలసిన నెత్తమికొలని
లోపలిదూబ నెలమిఁ బొదలి. కు. సం.
౫. ౬౨౪.

విణ. ౧. అధముఁడు; అధమురాలు.

సీ. శ్రుతికి వేదంబు సెప్పెడిదూబ వేదనిందకుఁ
డు విమోహపాతంబు గనుటం. గీ.చూచి దశ
కంధరుఁడు తల లూచి మఱియు.ఉ.రా. ౩.
౩౨౫.

గీ. కొంటె కసుమాలమును దూబ...

పు. హంస. ౫. ౧౧౩.

౨. లజ్జితుఁడు; లజ్జితురాలు.

సీ. నిర్జరాంగన లెల్ల నీఱంకు వెలిపుచ్చ దూబ
వై యిచ్చోట దూఱితొక్కొ. (అడిదము
సూరకవిచాటువు.)

దూబఱ. విణ. నిష్ఫలము, పనికిమాలినది.

(వ్యవ.) వానికి యింట దూబఱఖర్చు ఎక్కువ
గుటచే ఎంతధనము సంపాదించినను నిల
చుట లేదు.

జః దూబఱదిండి.

దూబఱదిండి. విణ. (√దూబఱ. త. తూపిర
తంటి- 'దూబఱఁదిండి' చి. ని. 'దూఁబఱదిండి.
దూయు + పఱ + తిండి = మిగులఁబెట్టక ఎంత
ఉన్నను అంతయు వెచ్చించి తినువాఁడు' అని
శ. ర.) ౧. దుష్టుఁడు; దుష్టురాలు.

సీ. నక్కచిక్కులమారి వెక్కసురూపి దూ
బఱదిండి బొంకులబాన మొండి. చెన్న.
౨. ౨౪.

సీ. ఓగు దూబఱదిండి యోచవాఁ డవలక్షణ
ములాఁడు గోల వ్రాత్యము బజారి. హంస.
౫.౧౧౩.

౨. తేరదిండికాఁడు, అక్రమముగా లభించిన
కూడు తిని జీవించువాఁడు.

వ...రుద్రా! నీవు భద్రదేవదుమాటవీవాటి
యందు దిసమొలదూబఱదిండిమిండజంగం
బవై ఋషులపుణ్యాంగనలయీలువు లపాం
గరంగస్థలీలాస్యలంపటంబు లగుకటాక్షవీక్ష
ణంబుల హరింపుచు భిక్షాటనక్రీడను నటిం
చితి...భీమ. ౩. ౨౧౧.

దూబూచి. వి. (దూయు + బూచి- దోబూచి.
బ్రౌ.వా.) బాలుర నాడించుటయందు ఆనెడు
మాటకు అనుకరణము.

...చెలంగి మఱుంగున నడంగి,

తొంగిచూచి దూబూచి యన్నం గికాకి, కన్నఁ గుమారుఁ గౌఁగిట గారవించి. సారంగ. ౧. ౪౯.

౨. బాలక్రీడావిశేషము. (శ. ర.)

సీ. పచ్చతాజినుఁగుఁగ్రొంబనులసొరణగండ్ల బుడిబుడిఁ బొదలి దూబూచు లాడి. చంద్రా. ౧. ౪౨.

దూముడి=దూయుముడి. వి. (దూయు+ముడి.) జాఱుముడి.

ఉ. కంగులడాల్ చెలంగుఱవికల్ సడలించి చెఱంగుబంగరుల్, రంగు లెసంగువల్వలు తెరల్చుచుఁ బావడదూముడుల్ గళల్, సింగపుఁజిన్ని కౌనులను జిక్కఁగదించి బిగించి కాంతు లుప్పొంగెడుమేనులం దుదుటు భూషలు గొన్ని దొలంగఁ జేసినన్. ఉ. హరిశ్చ. ౩. ౩౪.

దూయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తపించుచున్నది. ౨. తపింపఁజేయఁబడుచున్నది.

దూయు=డుయ్యు, డూయు, దుయ్యు. స. క్రి. ౧. (ఒఱనుండి కత్తి) లాగు, పైకి తీయు.

గీ. అసి జరీలున దూసి దైత్యాధినేత. దశా. ౪. ౧౫౯.

చ...నృపశిఖామణి...కటారి జరీన దూసి... ఉ. రా. ౭. ౨౧౧.

౨. పుచ్చుకొను; లాగుకొను, బలవంతముగాఁ దీసికొను.

ఉ...కోమటివారిఁ జేరి శం, కాసమవాప్తి నొల్ల మనఁగాఁ దనుమర్దన మాచరించుచుం, గాసును గీసు దూసికొని గాని విడం దతఁ డేమి చెప్పుదున్. శుక. ౨. ౩౬౨.

౩. (చింత మొ. చెట్లఆకులను) గుప్పిటిపట్టుతో ఒక్కసారిగా కోయు.

శా. మాయం జొచ్చె మదుండు శేఁజిగురుగుత్తుల్ జంక నిక్కించుచున్, గాయం జొచ్చెఁ ద్వితీయయామకృకవాకుల్ కొక్కొకోకో ధ్వనుల్. నిరం ౨. ౧౦౩.

ఆ. వెలఁదిచేతివిడెము విభునకు నిప్పించి, విభునిచేతివిడెము వెలఁది కొసఁగఁ, జేసి కల్లపనులు చెప్పక యొండొరుల్, దూసి రిండ్ల కాకు దూసినట్లు. రుక్మి. ౫. ౧౧౧.

౪. (అప్పు అధికముగా) తీసికొను, చేయు.

సీ. తాతతండ్రులనాఁటిధన మెల్లఁ బోకార్చి, తులువ యై యప్పులు దూయఁ జొచ్చె. శేష. ౪ ఆ. (శ. ర.)

వ్యవహారములోని ప్రయోగవిశేషములు :

నేఁడే ఈచాఁప దూసితిని. (చాఁపకు పొర వేసితి నని భావము.)

ఆగ్రామమువా రందఱును ఆకపటసన్న్యాసిని దూయఁబట్టుకొనిరి. (వారిమాటలకు సమాధానము చెప్పలేనట్లు చేసి బాధించి రని భావము.)

ఊరందఱును వానిని దూసివేసిరి. (నిందించి రని భావము.)

అ. క్రి. ౧. చిల్లిపడు.

ఆ. వక్షుఖుండు దివ్యశరమున ఘననితంబంబు దూయనేయఁ బాలవెల్లిగరిమఁ దడుపుచుండు వరుణుండు రక్షింప...భాగ. ౫. ౨౬౫.

౨. చొచ్చు, తటాకించు.

గీ. తూకొనెను జొచ్చెఁ జొరఁబాఱెఁ దూఱె దూసె, నసఁ దటాకించె ననుమాట కర్థ మగును. ఆం. భా. ౩. ౧౨౨.

౩. వెళ్లు. (పాఱు అని శ. ర.)

ఆ...కల్లపనులు చెప్పక యొండొరుల్, దూసి రిండ్ల కాకు దూసినట్లు. రుక్మి. ౫. ౧౧౧.

౪. (నాఁటి) వెడలు; రాచుకొనిపోవు.



శా. ...ప్రతుల్లలోన నెంతయును జాణ వటంచును

నేను గాఁగిలించితి నిటు మాఱుమో మిడఁ
గఁ జెల్లునె యోరసికాగ్రగణ్య యద్భుత
మగునట్టిబంగరపు బొంగరపుంగవఁ బోలునీ
కుచద్వితయము బొమ్మ నాఁటి యల వీపున
దూసె నటంచుఁ జూచితిక్. (కూచిమంచి
తిమ్మకవిచాటువు.)

సీ. మందేహదైతేయసందోహదేహముల్ దూసి
పోవెడువాఁడితూపు లనఁగ. గీ... తనరా
రెఁ గ్రమముతో నరుణకిరణ, బాలభానువు
లాకాశభాగమునను. భాను. ౩. ౭౨. (చి.
ని. పా.)

(వ్యవ.) ఆఱాయి వాని ప్రక్కనుండి దూసికొని
పోయినది.

జః దూఁబిడి, దూబూచి, దూముడి, దూయుతీఁ
గ, దూయుముడి.

దూయుతీఁగ= దూసర, దుస్సర. వి. (√దూ
యు.) సుదర్శనలత.

సీ...దూసర యనంగ, దూయుతీఁగ యనంగ
దుస్సర యనఁగ సుదర్శనలతపేరు దనరు
చుండు. ఆం. భా. ౨. ౬౫.

దూయుముడి= దుయ్యుముడి, దూముడి. వి.
(√దూయు.) జాఱుముడి, సులభముగా నూడఁ
దీయునట్లు మొన మడిచి వేసినముడి.

సీ. బ్రహ్మాస్త్రబంధంబు పట్టుఁదోరపుదూయు
ముడియె యనాయాసమునను విడువ.
రామా. ౩. ౩.

దూరగతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దూ
రముఁగా పోయినది. ౨. మిక్కిలి హెచ్చినది,
మిక్కుటమైనది.

వ...దూరగతమన్మథా క్షమేయం కాలహరణ
స్య...శాకుం. ౩.

దూరగ్రహణము. సం. వి. అ. న. దూరమం
దున్నవానిని గ్రహించుట.

దూరదర్శనము. సం. విణ. (అ. ఈ. అ.) దూ
రవస్తువులను చూడ సాధనమైనది.(యంత్రాది.)
వి. అ. న. దూరమందలివస్తువులను చూచుట.
౨. దూరాలోచన. పుం. గ్రద్ద.

దూరదర్శనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧.
దూరస్థవస్తువులను చూచువాఁడు. ౨. దూరా
లోచన కలవాఁడు. వి. అ. పుం. పండితుఁడు.

దూరదర్శి. సం. విణ. (న్. నీ. న్.) ౧. దూర
మందలివానిని చూచువాఁడు. ౨. దూరస్థవస్తు
వును చూపునది. వి. న్. పుం. ౧. గ్రద్ద. ౨.
పండితుఁడు. ౩. ఋషి. (విల్యమ్సు.)

దూరదృక్కు. సం. విణ. (శ్)=దూరదర్శనుఁ
డు. వి. శ్. స్త్రీ= దూరదృష్టి. శ్. పుం. ౧.
పండితుఁడు. ౨. గ్రద్ద.

దూరదృష్టి. సం. విణ. (ఇ) దూరదృష్టి కల
వాఁడు. వి. ఇ. స్త్రీ. ౧. దూరముగా వ్యా
పించుచూపు. ౨. దూరాలోచన.

దూరపాత్రము. సం. విణ. (అ. ఆ. అ.) దూర
మైనతటాంతరము కలది, రెండుఒడ్లకు నడుమ
విశాలమైనప్రదేశము కలది. (నద్యాది.)

దూరపార. సం. వి. ఆ. స్త్రీ. గంగానది.

దూరపారము. సం. విణ. (అ. ఆ. అ.) దవ్వుల
నున్నయవ్వలిగట్టు కలది, మిక్కిలి వెడలుపు
కలది. (నది మొ.) వి. అ. పుం. వెడలుపు కల
నది.

దూరబంధువు. సం. విణ.(ఉ)దూరమం దున్న
బంధువులు కలవాఁడు, బంధువులకు దూరమం
దున్నవాఁడు. వి. ఉ. పుం. ౧. దూరదేశమం
దున్నబంధువు. ౨. అసన్నిహితబంధువు, దూర
పుచుట్టము.

దూరము. సం. విణ. (అ. ఆ. అ.) విప్రకృష్ట
ము, దవ్వైన నున్నది. వి. అ. న. విప్రకర్షము,

దూరవర్తి. సం. విణ. (న్. నీ. న్.) దూరమం దున్నవాఁడు.

దూరవిలంబి. సం.విణ.(న్. నీ. న్.) చాలక్రిం దికి వ్రేలునది.

శ్లో. నవాంబుభిర్దూరవిలంబినో ఘనాః. శాకుం. ౫. ౧౨.

దూరవేధి. సం. విణ. (న్. నీ. న్.) దూరము నుండి వేధించునది. (బాణము మొ.)

దూరసంస్థము. సం. విణ. (అ. ఆ. అ.) దూర మం దున్నది, దవ్వులది.

దూరస్థితుఁడు. సం = దూరస్థుఁడు.

దూరస్థుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దూరమం దున్నవాఁడు.

దూరారూఢము. సం. విణ. (అ. ఆ. అ.) దూ రముగా నెక్కినది, మిక్కిలి పై కెక్కినది; మి క్కిలి యుత్కట మైనది.

దూరారోహి. సం. విణ. (న్. ణీ. న్.)=దూరా రూఢము.

దూరించు. సం. స. క్రి.(సం. దూరమ్.) దూర ముగా చేయు.

క. పంచాననుసేవకు దూ,రించితి రతితంత్రము లకు రిత్తకు రిత్తే, వంచనఁ బొందితి నిన్ను వ, రించుట కెంటికిని జెడ్డ రేవనికరణిన్. రుక్మా. ౪. ౪౩.

సీ. అఖిలేష్టదాయకుం డగువాఁ డొసంగఁడే దూరింపక స్వస్వనోరథంబు. ల.వి.౪.౧౦౬.

దూరీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) దూర ముగా చేయఁబడినది.

దూరీభూతము. సం. విణ. (అ. ఆ. అ.) దూర మైనది.

దూరేత్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దూర మం దున్నవాఁడు.

దూరేరితేక్షణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దూరముగా ప్రసరింపఁజేయఁబడినకన్నులు కల వాఁడు. ౨. కేకరుఁడు, మెల్లకంటివాఁడు.

దూర్యము. సం. వి. అ. న. -దూరముగా విస ర్జింపఁ దగినది- ౧. విష్ఠ, మలము. ౨. కట్టిగం ట్లకచోరము ?.

దూర్వ. సం. వి. ఆ. స్త్రీ. గఱిక ?.

దూర్వాష్టమి. సం. వి. ఈ. స్త్రీ. భాద్రపద శుక్లాష్టమి.

దూఱగు. అ. క్రి. (√దూఱు.) నింద్యమగు.

ఉ...దూఱగునాఁడిచావు మాన్పఁగాఁ,జూచు ట మేలు...దశకు. ౩. ౧౪౦.

దూఱనాడు. స. క్రి.(దూఱు + ఆడు- స్వార్థము న.) నిందించు, దూషించు; తిట్టు.

క. ఈకరణి దూఱనాడిన, యాకృష్ణమృగంబు పల్కు,లు...తనమనంబు నెఱియంజేయన్. మనుచ. ౬. ౯౨.

సీ. అతని నెవ్వరు దూఱనాడినవారితోఁ జల పట్టి పట్టివాదులకుఁ బోదు.శువల. ౪.౧౮౦.

దూఱు. స. క్రి. (త. తూఱు. క. మ. దూఱు- చూ. సర్వ. సా. ఇది లఘురేఫక మని చి. ని. లఘురేఫప్రకరణమున, సీ. దూరులు వలుకుట నారచీరలు వింటినారి విన్నారు కన్నారుచ్చు మ నఁగ. అప్ప. ౨. ౧౯౬ న్న, సీ. ఆఱడి యవసడి యగడాఱు దూఱు దూరు దిసంతు సడి కోయి కోఁత రొచ్చు. ఆం. భా. ౧. ౧౧౫- ఇట్లు పఠించి ఆఱు దూఱు భిన్నపదములు అని కొంద ఱు. అము. ౬. ౧౧౩.)

౧. నిందించు, దూషించు; తిట్టు.

క. వీటఁడితనంబు వెట్టుచు,దూఱం బని లేదు నిన్నుఁ దొల్లిటిచెయువుల్, దీఱ వవి యను భవింపక, వేఱుందునె పూర్వజన్మవివిధకృ తంబుల్. భా. రా. యు. ౨౨౭.

సీ. ఇంతకీ డొనరించెనే రాజు నూడ నీదుప్రాత
కుం డని దూఱువారు. భార. విరా. ౨.
౧౪౬.

సీ. ప్రాభవంబులు మాలి బాహుశక్తులు దూలి
పొఱువారను విధి దూఱువారు. వరాహ.
౩. ౪౭. మనుచ. ౩. ౧౦౯.

వి. నింద,అపకీర్తి; తిట్టు.

గీ. అనుజతనుజులుఁ జెలులు వియ్యములు నడు
గ్గుమాలి పోదురు నీకుఁగా మనుజనాథ,
దొరకుఁ గులనాశనం డనుదూఱు మేలె.
భార. ఉద్యో. ౩. ౩౪౧.

చ...దశానన దుష్టచరిత్ర మింకనైనను నిది
మాని సత్పథమునం జను దూఱు లడంగు
నంతలోకా. నిర్వ. ౪. ౨౯.

క. మన మెంతలావు సేసినఁ,బని దీఱదు సేవ
అందు పగతుఁడు లోకంబున దూఱు రాదె
యితరుల,ననిఁ జంపినఁ గాన వలవ దాహవ
మింకన్. హరి. ఉ. ౬. ౧౭౬.

గీ. వెలఁది దూఱినదూఱులు వినఁగదయ్య. వసు.
౪. ౧౦౮.

వెడదూఱు=వట్టిదూఱు, అపదూఱు.

చ. మది మదిఁ దప్పితోయి మునిముఖ్య భవత్
నయన్ గృహంబునన్, బదిలము చేసి వచ్చి
మఱి బట్టబయల్ వెడదూరు దూరె ద్యాస
దన మిఁ కొక్కమా టరసి చంచలలోచనఁ
గానకున్న దూ,రెదు మఱి కాని బుద్ధి విప
రీతతఁ బొందక పోయి చూడుమా. ఆము.
౬. ౧౧౩.

జః దూఱగు, దూఱునాడు, దూఱుచెప్పు, దూ
ఱువడు, దూఱెక్కు.

దూఱుచెప్పు. అ. క్రి.(√దూఱు.) తగవుపెట్టు.

గీ. అమరపతికొల్వునకు వచ్చె సుమశరుండు,
గులుకుఁబాలిండ్లగయ్యాళితలిరుబోఁడ్ల, యా
రజపుశేరజపుఁజేఁత లపుడు http://sanskritcentral.com/
కొని దూఱు చెప్పంగ వచ్చుకరణి. చంద్రా.
౩. ౨౭.

దూఱుదుంకములు=దూఱుదుంకెనలు. వి. బ.
బాలక్రీడావిశేషము.

సీ. వక్షోజములు జాతి ప్రాలిపో మీఁగాళ్లకడ
దాఁక దూఱుదుంకంబు లాడ. విప్ర. ౪. ౧౯.

దూఱుదుంకెనలు=దూఱుదుంకములు. (శ. ర.
వి. బ. తూరనతుంకములు, తూరనగోలలు. చి.
ని.) బాలక్రీడావిశేషము.

సీ. తొంగలిఱెప్పల దూఱుదుంకెన లాడు
సోలుఁజూపులు మరు మేలుకొల్పు. విక్ర.
౮. ౧౦౧.

దూఱువడు. అ. క్రి. (దూఱు + పడు.) నిందిం
పఁబడు. (శ. ర.)

దూఱెక్కు. అ. క్రి. (√దూఱు.) నింద పొందు,
అపకీర్తి నొందు.

ఉ...బంధుసుహృజ్జనంబు ల్యాదిక్కున నున్న
వారు గణుతింపక సంపదకై వధించి దూ,
ఱెక్కుట దోషమందు టనునీదురవస్థల
కోర్వవచ్చునే. భార. ఉద్యో. ౩. ౧౩.

దూల. వి. కండూతి, దురద, నవ.

గీ. దూల జిల నవ నస గాఁడు దురద యనఁగఁ,
బరఁగుఁ గండూతి...ఆం. భా. ౨. ౧౨౯.

జః దూలగొండి, దూలగోవెల, దూలపోతు,
దూలాలు.

దూలగొండి=దూలగోవెల. (√దూల.)

సీ. దూలగొండి యనంగ దురదగొండి యనఁగఁ
దీఁటకోవెల యనఁ దేజరిల్లుఁ, గండూర...
ఆం. భా. ౨. ౫౪.

దూలగోవెల. వి. (√దూల.) కండూర, దురద
గొండి శ్రీ.

సీ. మానవముసు నేలమాపెన యటికమా

మిడి దూలగొవెల మేఁక మేయు. గీ. నాకు ...హంస. ४. ౧౦.

దూలపోతు. వి. (√దూల.) ౧. ఎప్పుడును దూల గలవాఁడు. (శ. ర.) ౨. పామనుఁడు, గజ్జి కలవాఁడు.

గీ...పామనుండు, దూలపోతన విలసిల్లు దురిత దూర. ఆం. భా. ౨. ౧౨౨.

దూలము. వి. (సం. స్థూలమ్. ప్రా. థూలమ్. క. దూల.) ౧. ఇంటిగోడలపై అడ్డుగా వేయు పెద్దకిఱ్ఱు.

క. విమలమణిమయము లగుదూ,లములం గంబముల గోడలను వేదులఁ గుట్టిమములఁ జుట్టి సప్రాకారములను గర మొప్పుచుండ రచియించె సభకా.భార. సభా. ౧. ౧౧.

౨. తనాబి, గృహస్థూలతిర్యగ్దారువు.

మ. కలుకుండంతపుబొమ్మచెక్కడపుబల్కంబంపు మేల్పోడెలం,దళ మానీలపుటాలదూలములపై దార్కొన్న నున్నంచదం,తెలఁ దాపించినకెంపుటిటికలసందిం బొంది...దశా. ४. ४౯.

వ...గట్టురాయనిపట్టి నెమ్మేనిచాయలం దొట్టిన గట్టినీలంపుదూలంబులదండితనంబు లెచ్చరించి...ఉ. రా. ౧. ౧౩౯.

దూలాలు. వి. (దూల + ఆలు.) వ్యభిచారిణి యగుస్త్రీ.

క. దూలాలు బెంకి నుండిన,వాలాయము చేటు వచ్చు వసుమతిలోనన్, లోలాక్షి విడిచి పెట్టిన, మేలిమిగా బ్రతుకవచ్చు మేదిని వేమా. వేమన. ౩. ౨४౭.

దూలి. సం. వి. ఈ. స్త్రీ. నీలి

లోదయమునఁ గలిగె...భార. అను. ४. ౫౦.

పెంమాళి=పెద్దమాళి.

సీ. పెంమాళి యెసఁగ నందంద కాల్దొవ్వు ప్రతి మహీతలము గ్రక్కదలుచుండ. మార్క. ౬. ౧౦౭.

దూశ్యము. సం. వి. అ. న. మాష్యము, గుడారము. (వాచ.)

దూషకుఁడు. సం. విణ. (అ. షి. క్ష్వా. ఆ.) ౧. చెఱుపువాఁడు, దోషయుక్తముగాఁ జేయువాఁడు. ౨. తప్పు చేయువాఁడు, నేరము కావించువాఁడు, అపరాధి. ౩. నిందించువాఁడు. ४. దుష్టుఁడు.

దూషణ. సం. వి. ఆ. స్త్రీ. దూషణము, దూషించుట.

దూషణము. సం. విణ. (అ. ఆ. అ) ౧. చెఱుపునది, దోషము కలిగించునది. ౨. అవమానపఱచునది, భంగపఱచునది. ౩. నిందించునది. ४. నేరము చేయునది, తప్పు చేయునది. వి. అ. న. ౧. చెఱుపుట, దోషము కలదిగాఁ జేయుట. ౨. (స్త్రీ లోనగువారిని) భంగపఱచుట. ౩. (ఒడంబడిక లోనగువానిని) అతిక్రమించుట. ४. నిందించుట, దూఱుట. ౫. ప్రతివాదముచేయుట, ఆక్షేపించుట. ౬. (యుక్తిలోనగువానిచే) ఖండించుట. ౭. దోషము, తప్పు. ౮.పాపము.

దూషణీయము. సం. విణ. (అ. ఆ. అ) దూషింపఁ దగినది.

దూషయత్. సం. (శత్రు.) ౧. దూషించుచున్న. ౨. చెఱుపుచున్న.

౧. దూషించువాఁడు. ౨. చెఱుచువాఁడు.

**దూషి.** సం. విణ. (న్. డీ న్.) దూషించువాఁడు. వి. ఇ, ఈ. స్త్రీ. నేత్రమలము, కంటిపుసి.

**దూషించు.** సం. స. క్రి. ౧. నిందించు, దూఱు.

మ. తల లింగంబులు మేన బూడిదలు గంతల్ బొంతలుం దాల్చి శాస్త్రుల వేదజ్ఞుల సర్వదైవతములన్ దూషించుపాషండు లై.

క. పోవుదురుగాక...వరాహ. ౧౦. ౬౬, ౬౩.

౨. త్యజించు, విసర్జించు, వీడు.

క. కులమునకు నఖిలలోకంబులకు నపాయంబు సేయుపురుషాధము నిమ్ముల దూషించి జగంబును, గులమును రక్షించు టుఱదె కువలయనాథా. భార. ఆది. ౫. ౧౧౧.

వ...ఒక్కనికారణంబునఁ గులంబున కెగ్గగు నేని వాని దూషించి కులంబు రక్షించుట ధర్మంబు...భార. సభా. ౨. ౧౯౯.

**దూషిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కంటిపుసి. ౨. తూలిక, కుంచె. ౩. సాలెపురుగు. ౪. కోపిష్ఠియగుకన్య. ౫. వర్తి, వత్తి. ౬. వీణ. (కే. ని.)

**దూషికము.** సం. విణ. (అ. ఆ. అ.) దూషించునది. వి. అ. న. కర్ణమలము, గులిమి. (కే. ని.)

**దూషిత.** సం. వి. ఆ. స్త్రీ. కన్యాత్వము చెడిన స్త్రీ, చెఱుపఁబడినకన్య.

**దూషితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెఱుపఁబడినది. ౨. భంగపఱుపఁబడినది. ౩. నిందితము, దూఱఁబడినది. ౪. అభిశస్తము, మైథునాపవాదము నొందినది, అంకు మోపఁబడినది. వి. అ. న. దోషము, తప్పు.

శ్లో. యదస్యాః పత్యుర్వా రహసి పరమం దూషితమభూత్. ఉ. చ. ౪. ౧౪.

**దూషితవ్యము.** సం=దూషణీయము.

**దూషుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.)- సమాసాంతములందే- చెఱుపువాఁడు. (పంక్తిదూషుఁడు మొ.)

**దూష్య.** సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగునడుమునఁ గట్టెడుతోలుమోకు.

**దూష్యమాణము.** సం. విణ. (అ. ఆ. అ.) దూషింపఁబడుచున్నది, చెఱుపఁబడుచున్నది.

**దూష్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెఱుపఁదగినది, దూషింపఁదగినది. ౨. నిందింపఁదగినది, దూఱఁదగినది. వి. అ. న. ౧. గుడారము, డేరా. ౨. వస్త్రము. ౩. విషము. ౪. పూయము, చీము.

**దూష్యుఁడు.** సం. వి. అ. పుం. రాజ్యోపఘాతకుఁడు, రాజద్రోహి.

**దూసర**=దుస్సర. వి. ౧. సుదర్శనలత.

సీ...దూసర యనంగ, దూయుతీఁగ యనంగ దుస్సర యనఁగ సుదర్శనలతపేరు దనరుచుండు. ఆం. భా. ౨. ౬౫.

౨. వత్సాదని‡. (శ.ర.)

**దూసరి[1].** వి. తృణవిశేషము‡. (శ.ర.)

బ. తృణధాన్యవిశేషము, ఒకదినుసువడ్లు.

సీ...తృణధాన్యములు చెలంగు, నునుకలు దూసరుల్ గోలివె లనంగను...ఆం.భా.౨.౨౩౯.

చ. పిడికెఁడుదూసరొడ్లు కడుఁజేర్తి దినంబును నేతి తెచ్చి యా, పడఁతికిఁ దద్విభుం డొసఁగ ... కుచేల. ౧. ౩౪. (ఇట యీకవి వడ్లు అనుదానికి అపరూపము 'ఒడ్లు' అని ప్రయోగించినాఁడు.)

జః దూసరిబియ్యము.

**దూసరి[2].** వి. అపవాదము.

(చూ. దూసరికాఁడు.)

**దూసరికాఁడు.** విణ. (దూసరి[2] + కాఁడు.) అప

వాదము వేయువాఁడు.

ఆ. దోసకారి యైన దూసరికాఁడైనఁ, బగతుఁడైన వేదబాహ్యుఁడైన, వట్టిలేనిపేదవానికిఁ దగు నీవి, ధనికునకు నొసంగఁదగదు వేమ. వేమన. ౩. ౨౦౬.

దూసరిబియ్యము. వి. (√దూసరి1.) అడవిలోఁ పండెడిధాన్యవిశేషము.

వ...ఒడిసెప్రాలు దూసరిబియ్యంబు నివ్వరివడ్లు గునుకు లూద లాదిగాఁ గలుగువన్యధాన్యంబులు...పి. శకుం. ౩. ౧౨.

దూసలు. వి.బ.ధాన్యవిశేషము.

వ...తేటచలములు నూఁదుఘుటికలు గాజుకడియములు జాజికుసుమలు దూసలు భీమగుదెలు నేడాకుమొలకలు గుజ్జరులు...ప్రబంధ. ౧౧౨. (దూసరులు?)

## దృ

దృంఫువు. సం=దృన్ఫువు.

దృంభువు. సం. వి. ఊ. పుం. ౧. వజ్రాయుధము. ౨. సూర్యుఁడు. ౩. రాజు. ౪. అంతకుఁడు, యముఁడు. స్త్రీ. సర్పము, పాము.

దృంహితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రవృద్ధము; ప్రవర్ధితము. ౨. దృఢము, దృఢీకృతము.

దృకము. సం. వి. అ. న. రంధ్రము, బొక్క. (వాచ.)

దృక్కర్ణము. సం. వి. అ. పుం. చక్షుశ్శ్రవము, పాము.

దృక్కు. సం. విణ. (శ్) ౧. చూచువాఁడు. ౨. కనుఁగొనువాఁడు, తెలియువాఁడు. వి. శ్. స్త్రీ. ౧. దృష్టి, చూపు. ౨. కన్ను. ౩. (గణిత.) రెండు అనుసంఖ్య. ౪. బుద్ధి.

దృక్పథము. సం. వి. అ. పుం. ౧. దృష్టిమార్గము. ౨. చూపుమేర.

దృక్ప్రసాద. సం. వి. ఆ. స్త్రీ. -కన్నులకు తేట తెచ్చునది - ౧. కులుత్థము, ఉలవలు. ౨. కులుత్థాంజనము.

దృక్ప్రియ. సం. వి. ఆ. స్త్రీ. - కంటికింపైనది- శోభ. (రాజ. ని.)

దృక్శ్రుతి. సం. వి. ఇ. పుం. చక్షుశ్శ్రవము, కనువినికి, పాము.

దృగధ్యక్షుఁడు. సం.వి. అ. పుం. సూర్యుఁడు.

దృగ్గోచరము. సం. విణ. (అ. ఆ. అ.) కంటికి అగపడునది. వి. అ. పుం. కనుచూపుమేర.

దృగ్గోళనము. సం. వి. అ.న. ౧. ఖగోళాంతర్గతమగుగోళభేదము. ౨. కనుగ్రుడ్డు.

దృగ్జ్యా. సం.వి. ఆ. స్త్రీ. (జ్యోతి.) దినమానాదులు తెలియుటకై శంకుచ్ఛాయ నుపయోగించునదియు దృష్టియోగ్యము నగుదృగ్వృత్తక్షేత్రమందలిమౌర్వీరూపసరళరేఖ.

దృగ్లంబనము. సం.వి. అ. న. (జ్యోతి.) గ్రహణదర్శనమున నుపయోగించునదై దృక్క్షేత్రమందున్నలంబరేఖ.

దృగ్వృత్తము. సం. వి.అ.న. (జ్యోతి.) వృత్తాకార మగుదృక్ప్రచారస్థలము.

దృఙ్నతి. సం. వి. ఇ. స్త్రీ. (జ్యోతి.) గ్రహణదర్శనమున నుపయోగించుటకై దర్శిత మగుదృక్ప్రచారముయొక్కనతివిశేషము.

దృఢకాండము. సం. విణ. (అ. ఆ. అ.) గట్టిబోదె కలది. వి.అ.పుం.౧. వెదురు*. ౨. కత్తృణము*.

దృఢగాత్రిక. సం.వి.ఆ. స్త్రీ. ౧. ఫాణితము, కండచక్కెర, పటికబెల్లము. ౨. దృఢశరీరము కలది.

దృఢగ్రంథి. సం. విణ. (ఇ) గట్టికనుపులు కలది. వి. ఇ. పుం. వెదురు†.

దృఢతరువు. సం. వి. ఉ. పుం. నారింజ†. (చంద్ర† అని కొందఱు.)

దృఢతృణము. సం. వి. అ. పుం. ముంజికసవు†.

దృఢత్వక్కు. సం. విణ. (చ్) దృఢ మగుత్వక్కు కలది. వి. చ్. పుం. యావనాళశరము, ఒకజాతి రెల్లు†.

దృఢదంశకము. సం. వి. అ. పుం- దృఢముగా కఱచి పట్టుకొనునది-నక్రము, మొసలి.

దృఢధన్వుఁడు. సం. విణ. (న్. ఆన్. న్.) దృఢ మగుధనుస్సు కలవాఁడు.

దృఢనీరము. సం. వి. అ. పుం- క్రమముగా గట్టిపడి కొబ్బెరగా మాఱునీరు కలది- కొబ్బెర†.

దృఢపత్రము. సం. వి. అ. పుం - గట్టిఆకులు కలది- వెదురు†.

దృఢపాది. సం. వి. ఈ. స్త్రీ. నేలయుసిరిక†.

దృఢప్రతిజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ప్రతిజ్ఞ తప్పనివాఁడు, ఆడి తప్పనివాఁడు.

దృఢప్రత్యయము. సం. విణ. (అ. ఆ. అ.) గట్టి నమ్మకము కలది. వి. అ. పుం. గట్టినమ్మకము.

దృఢప్రరోహము. సం. విణ. (అ. ఆ. అ.) గట్టి మొలక కలది. వి. అ. పుం. వటము, మఱ్ఱి†.

దృఢఫలము. సం. వి. అ. పుం. కొబ్బెర†.

దృఢబంధిని. సం. వి. ఈ. స్త్రీ. శ్యామ, ప్రేంకణపుఁదీఁగ.

దృఢబీజము. సం. వి. అ. పుం. ౧. బదరము, రేఁగు†. ౨. చక్రమర్దము, తగిరిస†.

దృఢభూమి. సం. వి. ఇ. పుం. ౧. (యోగ.) మనస్థైర్యము కలిగించుఅభ్యాసభేదము. ౨. గట్టినేల.

దృఢమతి. సం. విణ. (ఇ) దృఢబుద్ధి కలవాఁడు, దృఢనిశ్చయము కలవాఁడు. వి. ఇ. స్త్రీ. దృఢ మగుమతి.

దృఢము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కఠినము, గట్టిది. ౨. పట్టుగలది, పూనిక విడువనిది. ౩. అశిథిలము, గుత్తమైనది. ౪. బలము కలది. ౫. స్థూలము, లావైనది. వి. అ. న. ౧. ఇనుము. ౨. అతిశయము, పెల్లిదము.

దృఢముష్టి. సం. విణ. (ఇ) ౧. గట్టిగా పట్టినపిడికిలి కలవాఁడు. ౨. పిసినిగొట్టు, కృపణుఁడు. (త్రి. ని.) వి. ఇ. పుం. ౧. -పిడి కలది- ఖడ్గాద్యాయుధము. ౨. గట్టిపిడికిలి.

దృఢమూలము. సం. విణ. (అ. ఆ. అ.) గట్టివేరు కలది. వి. అ. పుం. ౧. కొబ్బెర†. ౨. ముంజిగడ్డి†.

దృఢరంగము. సం. వి. అ. పుం. -దీనికూడికవలన రంగు నిలఁబడును- పటిక, పటికారము.

దృఢలత. సం. వి. ఆ. స్త్రీ. పాతాళగరుడీలత.

దృఢలోమము. సం. విణ. (న్. న్, ఆ, మ్నా. న్.) గట్టిరోమములు కలది. వి. న్. పుం. అడవిపంది. న. గట్టిరోమము.

దృఢవల్క. సం=దృఢవల్కల.

దృఢవల్కల. సం. వి. ఆ. స్త్రీ. చిఱుబొద్ది, అంబష్ఠ†.

దృఢవల్కలము. సం. విణ. (అ. ఆ. అ.) గట్టిపట్ట కలది. వి. అ. పుం. పూగము, పోఁక†.

దృఢవైరి. సం. విణ. (న్. ణీ. న్.) గట్టిపగవాఁడు, బద్ధవైరము కలవాఁడు.

దృఢవ్రతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) విఘ్నములచేత చలింపనిసంకల్పము కలవాఁడు, గట్టి

సంకల్పముతో కూడినవాఁడు; గట్టిపట్టుదల కల వాఁడు.

దృఢసంధి. సం. విణ. (ఇ) గట్టిగా సంధింపఁబడినది, గుత్తముగా కూర్పఁబడినది. వి. ఇ. పుం. దృఢమగుసంధి.

దృఢసూత్రిక. సం.వి.ఆ.స్త్రీ. మూర్వ,చాగ.

దృఢస్కంధము. సం. విణ. (అ. ఆ. అ.) గట్టి బోదె కలది. వి. అ. పుం. క్షీరవృక్షము, పాల చెట్టు.

దృఢహస్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గట్టి చేయి కలవాఁడు; ఖడ్గాదిధారణమందు ఆరి తేఱినచేతులు కలవాఁడు.

దృఢాంగము. సం. విణ. (అ. ఆ, ఈ. అ.) దృఢమైనఅవయవయములు కలది. వి. అ. న. వజ్రము, మగఱాయి.

దృఢీకరణము. సం. వి. అ. న. దృఢపఱచుట; స్థిరపఱచుట.

దృఢీకరించు. సం. స. క్రి. దృఢపఱచు.

వ... నారాయణుండు సమస్తపరిపూర్ణుం డని భావంబున దృఢీకరించి నానావిధోపచారంబుల... ఆరాధింపుము...వరాహ.౧.౧౪౭.

దృఢీకారము. సం = దృఢీకరణము.

దృఢీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) దృఢముగా చేయఁబడినది.

దృత. సం. వి. ఆ. స్త్రీ. జీలకఱ్ఱ. (వాచ.)

దృతము. సం. విణ. (అ. ఆ. అ.) ఆదృతము, ఆదరింపఁబడినది.

దృతి. సం. వి. ఇ. పుం. స్త్రీ. ౧. నీళ్లు మోయుతోలుతిత్తి. ౨. కొలిమితిత్తి. ౩. తోలు, చర్మము. ౪. చేఁప. ౫. గళకంబళము, గంగడోలు. ౬. మేఘము.

దృతిహరి. సం. వి. ఇ. పుం - తోలితిత్తిని హరించునది - కుక్క.

దృతిహారుఁడు. సం. వి. ఆ. పుం. తిత్తితో నీరు తెచ్చువాఁడు.

దృన్ఫువు. సం.వి.ఊ.స్త్రీ.౧.సర్పము. ౨. వజ్రాయుధము. ౩. చక్రము. పుం. సూర్యుఁడు.

దృన్భువు. సం = దృంభువు.

దృప్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దర్పించినవాఁడు. ౨. హర్షించినవాఁడు, ఉబ్బు కలవాఁడు.

దృప్రుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. బలయుక్తుఁడు. ౨. గర్వించినవాఁడు.

దృబ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) గ్రథితము, గ్రువ్వఁబడినది. ౨. భీతము, భయపడినది. వి. అ.న. ౧. గ్రథనము,గ్రుచ్చుట. ౨. భయము.

దృబ్ధి. సం. వి. ఇ. స్త్రీ. గ్రథనము, గ్రుచ్చుట.

దృశ. సం. వి. ఆ. స్త్రీ. కన్ను. (వాచ.)

దృశత్తు. సం = దృషత్తు.

దృశాకాంక్ష్యము. సం. వి. అ. న. - కంటికి కోరఁదగినది - తామర, పద్మము.

దృశానము. సం. వి. అ. న. జ్యోతి, తేజస్సు.

దృశానుఁడు. సం. వి. అ. పుం. - చూచువాఁడు, కనుపెట్టి చూచువాఁడు - ౧. ఆచార్యుఁడు; ఉపాధ్యాయుఁడు. ౨. బ్రాహ్మణుఁడు. ౩. లోకపాలుఁడు. ౪. సూర్యుఁడు.

దృశి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. కన్ను. ౨. శాస్త్రము. ౩. ప్రకాశము. ౪. దృష్టి,చూపు; చూచుట.

దృశించు. సం. అ. క్రి. కనఁబడు, ప్రత్యక్షమగు.

ఉ.అతప మిచ్చ మెచ్చి శివుఁడు...జగదద్భుతమై దృశింప సమ్మదుం, డాతతభక్తియుక్తి

నతుఁడై నుతియించె ననేకరీతులన్. ఉ. రా. ౭. ౩౬.

దృశోపమము. సం. వి. అ. న. తెల్లతామర పువ్వు. (వాచ.)

దృశ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) చూడఁబడుచున్నది.

దృశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దర్శనీయము, చూడఁదగినది. ౨. కంటికి కింపయినది. ౩. జ్ఞేయము, తెలిసికొనఁ దగినది. వి. అ. న. ౧. కనఁబడువస్తువు. ౨. మౌక్తికభేదము.

సీ. మూఁడుమూలలు గలముత్యంబు దృశ్యంబు ప్రక్కగుంతలదియె పార్శ్వకృశము. రత్న. ౫౦.

దృశ్వుఁడు. సం. విణ. (న్. శ్వరీ. న్.) -సమాసాంతములందు- ౧. చూచినవాఁడు. ౨. తెలిసినవాఁడు. (ఉదా:- బ్రహ్మవిద్యాపారదృశ్వుఁడు మొ.)

దృషత్తు. సం. వి. త్. స్త్రీ. ౧. ఱాయి. ౨. సన్నెకల్లు.

దృషత్పుత్రి. సం. వి. ఈ. స్త్రీ. కల్వపుగుండు, నూఱెడుఱాయి.

దృషదిమాషకము. సం. వి. అ. పుం. పిండి విసరుట మొదలగువ్యాపారము చేయువాఁడు రాజునకీయఁదగినమాషపరిమితి గలపన్ను.

దృషద్వతి. సం. వి. ఈ. స్త్రీ. ఒకనది. (ఇది సరస్వతీనదిలోఁ గలియునొకయుపనది.)

దృష్టకూటము. సం. వి. అ. న. - గూఢమైన యర్థము కలది- ప్రహేళిక.

దృష్టపృష్ఠుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) - యుద్ధాదులందు శత్రువులచేఁ జూడఁబడినవెన్ను కలవాఁడు - పలాయితుఁడు, వెన్నిచ్చి పాఱిపోయినవాఁడు.

దృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చూడఁబడినది, విలోకితము. ౨. జ్ఞాతము, తెలియఁబడినది. ౩. అనుభవింపఁబడినది. (ఉదా:-దృష్టకష్టుఁడు, దృష్టదుఃఖుఁడు మొ.) వి. అ. న. ౧. దర్శనము, చూపు. ౨. రాజునకుఁ దనరాష్ట్రమందలిజనులవలనఁ గాని పరరాష్ట్రజనులవలనఁ గాని కలుగుభయము. ౩. సాక్షాత్కారము, ప్రత్యక్షత. ౪. దృష్టాంతము. (ఈయర్థమున నాంధ్రగ్రంథములందు మాత్రమే ప్రయోగము కనఁబట్టుచున్నది.)

చ. సదయుఁ డహోబిలేశుఁడు...మున్, జదివిన భార్గవాదులకు సన్నిధిఁ జేసెను దైత్యజాతుఁ డయ్యదన సమస్తమందుఁ గలఁ డంటకు దృష్టము చూపినట్లుగన్. భోజరా. ౧. ౭౨.

చ...మీ రెఱుంగరె యనంతఫలప్రద మన్నదానమే, తెలుపఁగ నేల వేఱె యొకదృష్టము చెప్పెదఁ జిత్తగింపుఁడా. భోజరా. ౩. ౨౫౭.

దృష్టరజ. సం. వి. స్. స్త్రీ. రజస్వలయైనస్త్రీ, సమర్తాడినపడుచు.

దృష్టాంతము. సం. వి. అ. పుం. ౧. ఉదాహరణము. ౨. ఒకయర్థాలంకారము.

క. బింబప్రతిబింబత్వమ్మునం బరఁగినవాక్యయుగమునం గలసాధర్మ్యంబు చెలంగిన దృష్టాంతం బగు నది కృతులయందు ధరనెట్లన్నన్.

క. అసదసురవిసరవిశసన, రసవిస్ఫురసాహసుండు రాముఁడె ధరలోఁ, నసమసమరతలసమద్వారిసమూహవిభేది వీవె శ్రీనరసింహా. నరస. ౫. ౧౫౫, ౧౫౬.

౩. శాస్త్రము. ౪. దిష్టాంతము, చావు. (మే. ని.)

దృష్టాంతీకరించు. సం. స. క్రి. ఉదాహరించు.

మ. ఓరాజవర్ధన రాజపాణిగ్రహణంబు దృష్టాం

తీకరించి పలికిననీసుభాషితంబులకు సరం
భెయ్యది యంతిమవర్ణంబునకు వేదవర్ణంబు
సుంభో లె నయ్యర్థంబు నావీనులు ప్రవే
శింప నర్హంబుగాదె...నైష. ౨. ౬౫.

దృష్టార్థము. సం. విణ. (అ. ఆ. అ.) చూడఁబడినయర్థము కలది, కనుఁగొనఁబడినయర్థము కలది. ౨. చూడఁబడినప్రయోజనము కలది, స్పష్టమైనప్రయోజనము కలది.

దృష్టి. సం. వి. ఇ. స్త్రీ. (బ.దృష్టులు, దృష్టు.) ౧. చూపు,చూచుట, దర్శనము. ౨. కన్ను. ౩. అభిప్రాయము. ౪. ఎఱుక, జ్ఞానము. ౫. ప్రకాశము. ౬. కనుఁబాటు, దృష్టిదోషము.

సీ. తెలియఁ జూచినయెడ దృష్టి తాఁకునో
యని వేడ్కఁదీఱఁగఁ జూడ వెఱతు నిన్ను.
సారంగ. ౩. ౧౦౦.

మ...క్షిప్రపక్వలసస్యం బిడి యేకధాటి బలి
రా కట్టించి తా దృష్టి క్షేదులఖానోగ్రక
పాలమరపహారిద్యూభజాంగలశ్రేణికన్.ఆము.
౧. ౪౨.

క ... రాగమ్మున నన్యోన్యస్నేహమ్ములు నెడి
దృష్టు నిలిపి రయ్యువతిపయిన్. భార. ఆది.
౭. ౧౦౬.

దృష్టించు. సం.స.క్రి. చూచు.

శా...నలుగడన్ దృష్టించుచున్ స్రుక్కఁగన్.
ఉ. రా. ౨. ౫౯.

ద్వి...వగలఁ, బొగులుచుఁ గళలచేఁ బున్నమ
చంద్రుఁ, డెగడురామునిమోము దృష్టించి
మఱియు. రం. రా. అయో. ౧౧౧ పా.
౧౪ పం.

అ.క్రి. దృష్టినిలుపు, ఏకాగ్రత కలిగియుండు.

ద్వి. దృష్టికి దాఁటిన తేజంబునాఁగ, దృష్టించి
చూచినఁ దెలు పగువాఁడు. బస. ప్ర.౧౪౫
పా. ౧౫ పం.

ద్వి. దృష్టించి బ్రహ్మాదిదేవత లెఱుఁగ,సృష్టికిఁ
బ్రతిసృష్టి చేసినయట్టియే నుండ ... ద్వి.
హరిశ్చ. పూ. ౩౦౪ పం.

దృష్టిక్షేపము. సం. వి. అ. పుం. ౧. దృష్టిపాతము; దృష్టిప్రసరించుట. ౨. దృష్టి ప్రసరింపఁజేయుట.

దృష్టిగోచరము. సం.విణ. (అ. ఆ. అ.) కంటికగపడునది, కనఁబడునది. వి. అ. పుం. చూపుమేర.

దృష్టిదండ. మి. వి. దృష్టిదోషము తగులకుండుటకు వేయుదండ.

ఉ...పూదెలగొల్సును బెద్దగంట సింగారపు
దృష్టిదండ మెడ గజ్జెలపేరులు నందె లొ
ప్ప...హంస. ౫. ౯౬.

దృష్టిపట్టు. మి. అ. క్రి. (దృష్టి + పట్టు.) కనుపట్టు, చూపట్టు.

క. ఒకనరునివిక్రమము మాటికి బొగడెద వింత
కడుఁగడిందిగ మనయోధికకుఁ గలయోధవీర,
ప్రకరము నీ కేల దృష్టిపట్టదు చెపుమా.
రాఘవ. ౪. ౫౪.

దృష్టిపథము. సం.వి.అ. పుం. ౧. చూపుమేర. ౨. చూపు ప్రసరించుమార్గము.

దృష్టిపాతము. సం=దృష్టిక్షేపము.

దృష్టిపిడుత. మి.వి. సస్యాదులకు దృష్టిదోషము తగులకుండుటకు సున్నముతోను మసితోను బొట్లు పొడిచి తగిలించుపిడుత.

సీ. నగలపేరింటిసున్నపుబొట్లతో దృష్టిపిడుతల
చందాన వీను లొప్పె. చంద్ర. వి. ౧. ౬౭.

దృష్టిపూతము. సం. విణ. (అ.ఆ.అ.) దృష్టిచే పవిత్రీకరింపఁబడినది. (నేల మొ.)

దృష్టిబంధువు. సం.వి.ఉ.పుం. మిణుఁగురుఁ బుర్వు.

దృష్టిబొట్టు. మి.వి. దృష్టిదోషనివారణకై పెట్టు కాటుకబొట్టు.

మ. తొలుగెం పన్నులఁ గింపుమై నలఁది తోడ్తో ప్రాగ్దిశాతన్వి గ్రొన్నెల యక్షోపాపనిఁ దాన మార్చి మును గన్నీరుబ్బినా నూత్నరశ్ములు మించెక్ పిదపక్ నిరుద్ధసలిలంబు ల్పర్వెనా వెన్నెలల్, నలువొందెం బయి దృష్టిబొట్ట నఁగఁ జిహ్నం బొప్పె నీలద్యుతిక్. చంద్ర. ౪. ౩౩.

దృష్టివిక్షేపము. సం. వి. అ. పుం. ఓరచూపు, కడకంటిచూపు.

దృష్టివిద్య. సం.వి.ఆ.స్త్రీ. నేత్రవిద్య, చూపును గుఱించినవిద్య, దానిగుణదోషాదులను దెలుపు శాస్త్రము.

దృష్టివిభ్రమము. సం.వి.అ.పుం.దృష్టివిలాసము.

# దె

దెంగ. వి. భూమిపరిమితివిశేషము.

వ...ఉత్తరదక్షిణములకెనిమిదిదెంగ్గలు తోఁపు గా...దా. శా. ౧౩౦౩.

దెంగు. స. క్రి. (క. దెంగు.) సంభోగించు, రమించు.

చంద్ర. వి. ౨. ౪౯.

వి. సంభోగము.

క్రీడా.పీఠి.౫౩ పా.

దెంచేనము = దంచేనము.

(కోటలు మున్నగునవి బద్దలుకొట్టుట కుపయోగించుఆయుధవిశేషము.)

సీ. క్వథితతైలములఁ బక్వము సేయఁబడువారు దెంచనంబుల వ్రేయఁ ద్రెళ్లువారు. కవిక. ౫. ౧౧౩.

దెంచిక. వి. దూలముమీఁద నడ్డముగా నుంపఁ బడుగృహావయవవిశేషము.

చ. పగడపుఁగంబముల్ తళుకుబంగరుబోదెలు కెంపుదూలముల్, జగమగజాలదెంచికలు చక్కనినీలపుఁబల్క చాల్ మెఱుం, గగు తెలిమిన్నలోవయును నచ్చపుబంగరుపేర రంగునం, దగఁ గనుపట్టు నొక్కవికసన్మణి మండప మప్పు డోపఁగక్. చంద్రి. ౨. ౨౩.

దెందము = డెందము.

(హృదయము, మనసు.)

ఉ...విప్రమాత్రుఁగా, దెందమునం దలంచి తివో దెప్పర మప్పని... దశా. ౨. ౭౯.

దెపగుప. వి. (బాణములు) తాఁకుటయం దగు ధ్వని కనుకరణము.

చ. అపుడు యుగంధరోజ్జ్వలశరాసనముక్తశర ప్రతానముల్, దెపగుపఁ జాఁకి వక్షములఁ ద్రెంచి డొనల్ దెగటార్చ... చంద్రా. ౬. ౧౦౬.

దెప్పము. వి. బాణాదుల కెదుట నిలిపినకృత్రిమ లక్ష్యము, కూటలక్ష్యము; లక్ష్యము.

చ. అలికులవేణి తెప్పయిడ కానరపాలుఁడు సూచుచుండె నిశ్చలమతిఁ గామురూపు లకు జానుగ నిల్పినదెప్పమో యనన్. పాండ. ౭. ౪౫.

సీ...అయ్యతివరూప, మచ్చొత్తినట్లు నాయంతరంగంబునఁ బాయ కున్నది మరుబాణము లకు. అ. దెప్ప మైతి...భోజరా.౩. ౩౦.

దెప్పరము = డెప్పరము. వి. ౧. ఆపద.

క. దెప్పర మప్పురుషాగ్రణి కెప్పాటను గలుగ నేర దెందును...భా. రా. అర. ౨. ౩౧.

క...రామునస్త్రహతుం డై, దెప్పర మొందిన వాలినిఁ, దప్పక వీక్షించి రచటితరుచరు లె ... రా. కిష్కి. ౨౯౩.

౨. అతిశయము, ఆధిక్యము.

గీ. దినదినంబును గసికాటు చెనకువలన, దప్పి తీఱ నితమకంబు దెప్పరంబుఁ, బాపసమకట్టి జారుఁ డప్పాఱుఁ డసతి, సెత్తుగొనిపోవ నిందందు నెడరు చేచె. పాండు. ౩. ౭౨.

౩. విధము, రీతి, ప్రకారము.

వ...ఊఁతలు గ్రమ్మినలీలను పొంగు పాటినచాయను వలలు వేసినపొందికను సుడిగాలి వీచు దెప్పరంబునఁ గొంగలకుఁ దూఱు బైరి డేగలగతిని...ప్రబంధ. ౭౮౮.

౪. దుష్టవచనము.

చ. పరమపతివ్రతక్ సభఁ దపస్వినిఁ బాండవ ధర్మపత్ని ధర్మరత నయోనిజం బ్రకృతి మానవభామినిఁ గాఁ దలంచి దెప్పరములు పల్కఁగాఁ దగునె... భార. సభా. ౨. ౨౫౫.

విణ. ౧. అధికము, గొప్పది.

ఉ. దిగ్గన వచ్చి శంకరుఁడు దెప్పర మైనవడిం జెమర్చుచుక్. హర. ౧. ౨౧.

క. తెప్పిరి లేచి బిరాలున, ముప్పిరి గొనుకినుక విత్తు మోసులు సూపక్, దెప్పరపుదిటముఁ దాల్చుచు, కప్పెరశివసత్తిపోల్కి ఖానుం డంతక్. రంగా. ౩. ౧౩౧. శుక. ౨. ౧౧.

౨. విషమము.

క. దెప్పరపుఁజోటు నీ కీ, యొప్పనివిధ మెచటు నుండి యొదవెను విను మీ, చొప్పవివేకుల యది యిది, దప్పించును సద్గతియు నుదాత్తయశంబుక్. భార. భీష్మ. ౧. ౧౯౦.

శ్లో. కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితం, అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున. సం. భార. భీష్మ. ౨౬. ౨.

క...అరుల లెఱుం, గరయుచు వా రెదురునడచు నట్టి దయిన దెప్పరపుఁ దెరువున డప్పిం, బో రసినయెడ విడియుచోటఁ బొడుచు టురవగుక్. భార. శాం. ౩. ౪. భోజరా. ౫. ౯౭.

౩. ఆపత్కరము, కష్టదాయకము.

సీ. ఎదిరివా ఖండించు టిది దెప్పరము సుమ్మి... హర. ౨. ౫౧.

ఉ...ఓరి సంక్రందన నన్ను నెవ్వనిఁగఁ గాంచితి విప్పుడు విప్రమూర్తుఁగా, దెంచి నం దలంచితివో దెప్పర మప్పని నన్ను విన్న గోవిందధృతాబ్జరోచిరరవిందభవాదులు దల్లడింపరే. దశా. ౨. ౭౯.

వ...చెవులసంకులు లోవంకభుజంబులు కొంకిసిగలు గావిదుప్పటులు నొప్ప నిమ్ము దెప్పరం బై ముప్పున నప్పురంబు సేరి...ఆము. ౪. ౩౫.

జ: దెప్పరించు, దెప్పరిలు, దెప్పతికము.

దెప్పరించు. స. క్రి. (√దెప్పరము.) ఆపదనొందించు, సంహరించు.

చ...చంద్రిణి నేక్రియ వాంఛ దీర నేపరిణయ మాదు నాకుటిలభావుని నేక్రియ దెప్పరింతు నేసరణి ఘటించునో శరభసాళువ మూర్తి...చెన్న. ౫. ౧౪౨.

దెప్పరిలు(ల్లు) అ. క్రి. (√దెప్పరించు.) కష్టమునొందు, బాధచెందు.

క. అప్పుడు సాందీపని మన, చొప్పరయుచు వచ్చి వానసోఁకునను వలిం, దెప్పరిలుటఁ గని ఖేదం, బుప్పతిలం బలికె...భాగ. ౧౦. ఉ. ౧౦౦౩. (తెప్పిఱిలుట అముద్రి.)

శ్లో. ఏతద్విదిత్వా ఉదితే రవౌ సాందీపనిర్గురుః, అన్వేషమాణో నశ్శిష్యా నాచార్యోపశ్యదాతురాక్. సం. భాగ. ౧౦. ౮౦. ౩౯.

దెప్పతికము = దెప్పతీకము. వి. (దెప్పరము + తికము.) బాధ, కష్టము.

నట్టు³ = నట్టుగుఁడు, నట్టువ. వి. (సం. నటః. త. నట్టు.) ౧. నర్తకుఁడు, నటుఁడు.

క. అనుచుఁ దలంగి పోక యిట్టు నట్టుం బొట్టు మెట్టాడుచిట్టిపడుగుల నానట్టు నగవునుం గోపంబుఁ గదుర నదలించుచు...ప్రభా. ౧. ౧౦౪.

సీ. నటుఁ డొప్పు నట్టన నట్టువుం డనఁగను ...ఆం. భా. ౨. ౧౭౭.

౨. నాట్యము. (చూ.నట్టాడు, నట్టుపులుఁగు.)

౩. నాట్యోపాధ్యాయత్వము, నాట్యము నేర్పుట. (చూ. నట్టుసేయు.)

జః నట్టాడు, నట్టించు, నట్టుఁగుడు, నట్టుపులుఁగు, నట్టువ, నట్టువకాఁడు, నట్టువచావడి, నట్టువపక్కి, నట్టువము, నట్టువముట్టుకాఁడు, నట్టువాఁడు, నట్టువుఁడు, నట్టువొజ్జ, నట్టుసేయుట్లు.

నట్టు⁴. వి. (క. నట్టు.) ౧. తృణవిశేషము, దూర్వ, గరికగడ్డి.

ఉదా : కుందురునట్టు, గరికనట్టు. (బ్రౌ.)

౨. గరికవలె నిస్సార మగుట, శుష్కించుట.

గీ. ఇట్టి చెట్టగువెట్టకు నట్టుఁ జెంది, జడలఁ జదరేఁజుఁ దాలిచెఁ జంద్రమౌళి. ధర్మ. ౨. ౪౬.

౩. వికృతి, మార్పు. (చూ. నట్టువడు.)

౪. పస్యరోగవిశేషము. (శ. ర.)

జ : నట్టువడు.

నట్టు. సం. వి. ట్. పుం. నర్తకుఁడు. శ్. స్త్రీ. నాశము.

నట్టుకొట్టు. అ. క్రి.(నట్టు¹ + కొట్టు.) ౧.ఆలస్యముచేయు. (శ. ర.) ౨. సంకోచించు, సందేహించు, వెనుదీయు.

క. పలికిన నిమఁ గా దన భీతిలి యిటు నటు నట్టుకొట్టు తెఱవ తెఱఁగు [illegible] చూచి యిది యే, పలికుంతల తెలుపు మను చు నడిగెఁ బొరిఁ బొరిన్. కళా. ౪.౧౪౦.

వ...తమవిన్నపంబులకుం దటి యాఱియుచు నింతనంతఁ గొంత దగ్గటి యిట్టటు నట్టుకొట్టుచున్నం జూచి. పరమ. ౩. ౭౮.

స. క్రి. అడ్డుకొను, నిరోధించు.

రగడ. తగిలి పట్టు మనుచుఁ దిట్టుతన్నిఁ దుట్టు పెట్టె నొకతె, మగుడి పెట్టుకానియొట్టు మాన్ప నట్టుకొట్టె నొకతె.రా.వి.౩.౧౨౧.

నట్టుకొను= నెట్టుకొను.అ. క్రి.(నట్టు² + కొను.) (నివసించు, నెలకొను.)

చ. పడితిమి కుక్కలుం బడనిపాటులు దుర్భరమైనవృత్తి వెన్బడితిమి గర్భయాచకులభంగి దరిద్రత నట్టుకొంచు లోఁ,బడితిమి...హర. ౩. ౧౫.

ద్వి. కొఱవిదయ్యము నట్టుకొనియున్న కరణి, న న్న భేతాళవటోర్వీరుహంబు. ద్వి. హరిశ్చ. పూ. ౨౦౦౭ పం.

నట్టుగుఁడు=నట్టువ, నట్టువకాఁడు, నట్టు౩, నట్టువుఁడు. (శ. ర.)

నట్టుపడు. అ. క్రి. (నట్టు¹ + పడు.) నిరుద్ధమగు. (చూ. నట్టుపఱచు.)

నట్టుపఱచు. స. క్రి. (నట్టు¹ + పఱచు.) అడ్డుకొను, నిరోధించు.

గీ. నట్టడవిలోన నన్నిట్టు నట్టుపఱచి, గొట్టుమిట్టాడ నేటికిఁ బట్టభద్ర, పుట్టునపు మున్న లేమకు బొట్టు గట్టి, చెట్టపట్టుట కొకరుండు పుట్టెఁ జూవె. కృ. శతం. ౨. ౭౪.

నట్టుపులుఁగు= నట్టువపక్కి. వి. (నట్టు³ + పులుఁగు.)నాట్యముచేయుపక్షి, నెమిలి.(శ.ర.)

నట్టువ= నట్టు౩, నట్టుగుఁడు. వి. (√నట్టు³. క నట్టువ.త.నట్టువన్.హిం. నటువా.) ౧. నాట్యము నేర్పెడువాఁడు, నాట్యోపాధ్యాయుఁడు. [illegible] ప్రోఁతయె యుపాంగము గాఁగఁ

ఖికాగ్రనాదమే, గానము గాఁగ నాప్ర
గశుకస్ఫుటపత్త్రరవంబు మర్దళ,ధ్వానము
గాఁగ లేఁజివురుబాహులు ద్రిప్పులతాంగనా
ళి నెం, తేనియ నాడఁజేయుఁ బురిఁ దెమ్మెరన
ట్టువ పూవుఁదోఁటలన్. ప్రబంధ. ౪౮.

ఉ. చిత్తరుచిత్తరుల్ నడ భజించి రసన్ జిగి
నీలికాసె దృళ్కొత్తెసుపాత్రకత్తియల కొ
జ్జరికంబు వహించి కోహళుం, దత్తిలునైసఁ
గా దనెడునైపుణి మార్గవిధంబు దేశియున్,
బెత్తము కేలఁ బూని వినిపింపఁగనోపుదు రిం
దు నట్టువల్. చం. రా. ౩.౬౪.

౨. నటుఁడు; నటి.

గీ. పాఠకులకొజ్జ నట్టువపాలియదుర్ఁ,గ్రోవి భర
తంపుటయగారిగుండెదివులు. శుక. ౩.౨౦.

(సోమకాసురుఁడు.) గీ. తానవరుసలు పెంచు
గంధర్వగాయ, కులనుజతగూడు నట్టువకుల
మువారి,...చూచుచు...దశా. ౧. ౨౬౪.

క. ఇరువుసు నేసినబాణము, లిరుబరులును దాఁకి
తిరిగె నిరుదెసలకు న్రక్కరి యిరుమొఁగముల
నట్టువ, తిరుపుఁగొనెడుక్రమముతో నతిత్వ
రితగతిన్. కాళ. ౪. ౧౮౧.

౩. నాట్యము.

వ. మఱియు విరితేనియ లాని పూని మత్తలి
తత్తరంబునం దిరుగుతేఁటిమొత్తంబులయొఱ
కలసన్నం గరువలిగట్టిననట్టువ గఱప నామ
నిరాతనికడ నాడుతీవపాతరలముందఱ...
యయా. ౪. ౧౩.

నట్టువ(వల్)ద్రొక్కు=నాట్యముచేయు; చలించు.

చ. నొసలను ముంగురుల్ చెదర నూల్కొని
ముక్కెరడాలు మోవిపై, వెసఁ గొనసాఁగఁ
జన్నుఁగవ నిక్కుచు నట్టువద్రొక్క హార
ముల్, మసరి పెనంగులాడ నగుమోము
చెమర్ప నొకర్తు చంపక, ప్రసవసుగంధితైల

మున భద్రనకుం దలయంటె నేర్పునన్. జా
హ్నవీ. ౧. ౧౪౬.

సీ. నట్టువల్ ద్రొక్కఁగా నవయామునీయమూలం
బుగాను రణస్థలంబు గాని. సిం. నార. ౧౫.

నట్టువకాఁడు=నట్టువుఁడు. వి. (నట్టువ + కాఁడు.)
ఆటకాఁడు, నర్తకుఁడు.

సీ. పంచాంగమయ్యెకుఁ బాగ సమర్పించు నట్టు
వకానికిఁ బెట్టు మువ్వు. హంస. ౫. ౧౩౪.

నట్టువచావడి. వి. (√నట్టువ.) నాట్యశాల. (బ్రా.)

నట్టువడు. అ. క్రి. (నట్టు[4] + పడు.) వికృతినొందు.

క. కటపెట తొటతొట రాలెను,పాటుపాటచి
నుకుల ధరిత్రి పొడ నట్టువడన్, సొటసొట
నాఁకట సోలుచుఁ, దటతటపడుచాతకముల
దైన్యము వాసెన్. వైజ. ౨.౧౪౬.

వ... వెన్నెలచేత నట్టువడినమణికుట్టిమంబులు
తుడిచి...ఉ. హరి. ౩. ౧౩౫.

నట్టువపక్కి=నట్టుపులుఁగు. వి. (నట్టువ + పక్కి.)
-నాట్యముచేయుపక్షి- నెమిలి, మయూరము.

క. కొక్కును నట్టువపక్కియు, నెక్కుడులు
గ నమరుకొమరు లిరువురు మ్రోలన్,విక్క
చు నాడఁగ నెలమిన్, జొక్కుడు వేలుపు
లరాయ సోఁకుడురాయా. అచ్చ. రా.
యు. ౫౮౮.

ఇట్లే : నట్టువపిట్ట, నట్టువపులుఁగు.

సీ. కొదమనట్టువపిట్టకొదలు తాలిమిఁ ద్రోయ
వెలిలావుపులుఁగుచా ల్వీసము గ్రాయ. రసిక.
౩. ౯౪.

సీ. పురి విచ్చి నట్టువపుల్గు లాడెడుచోటఁ బడఁ
తి వేనలి యంచుఁ బరువువెట్టు. అచ్చ. రా.
అర. ౮౫.

నట్టువము. వి. (√నట్టు[3]. సం. నాట్యమ్. ప్రా.
నట్టం.) నాట్యము. (ఆ. ని.)

నట్టువముట్టుకాఁడు. వి. (నట్టువ + ముట్టు + కాఁడు.) నాట్యపరికరములు కలవాఁడు.

ఉ. నట్టువముట్టుకాండ్రు కెలనం బొరిఁ గుండెలు ప్రవ్వఁదండెలుక్, బట్టిఁబూదిగిన్నియలు ప్రక్కలమల్ పయిగంట మగ్గుడు, బట్టువవారమట్టు శివపాఁపనతండము దండఁ గోడె కాం, డ్రట్టునిటుక్ బరాబరుల నగ్రమునం దతకారు లేఁగఁగక్. పాంచా. ౧. ౭౯.

నట్టువాఁడు. వి. (నట్టు³ + వాఁడు.) నట్టువుఁడు, నటుఁడు.

సీ. బండలు బూతులు పరిహాసకులు నట్టువారాదిగాఁ గలవారు దక్కఁ, దెఱవారియాలు తాఁ బ్రియుఁడు వారింపంగఁ బరుషోడఁ బల్కనఁ బణశతంబు. విజ్ఞా. ప్రా. ౧౧౬.

నట్టువుఁడు = నట్టుగుఁడు. వి. (√నట్టు³. సం. నర్తకః. ప్రా. నట్టఓ.) నాట్యముచేయువాఁడు, నటుఁడు. (వేశ్యల కాటుగఱపునటుఁడు అని శ. ర.)

సీ. నట్టు నట్టువుఁ డన నటుఁ డగు...ఆం. పదా. సర. ౭౯.

వ...గొండ్లి పరిభవించునట్టువులునుం బోలెఁ జాళెలు చూపి...పోరునవసరమున...ఉ. హరి. ౪. ౭౫౬.

మ... నాలిగాఁడ్రుల పేరం గలనట్టువుల్ గఱపఁ గోపుల్ చూపులేఁదీవపాత్రల కయ్యామని పూవుముత్తెపుసరుల్ దాల్పంగ నిచ్చెం గడుక్. యయా. ౪. ౧౭.

నట్టువొజ్జ. వి. (నట్టువ + ఒజ్జ.) నాట్యోపాధ్యాయుఁడు, నృత్యము నేర్పువాఁడు.

గీ. ఇన్ని తెఱఁగుల శ్రమము సేయింతుఁ జతురతావిహీనము లైనపాత్రములనైన, నట్టువొజ్జ నై మెలఁగుదు నగళులందు. భార. విరా. ౧. ౭౪౭.

నట్టుసేయు. అ. క్రి. (నట్టు³ + చేయు.) నాట్యోపాధ్యాయత్వముచేయు.

సీ. వజ్రకుట్టిమశోభ వరమౌక్తికస్యందనచ్ఛాయ కెప్రొద్దు నట్టుసేయు. నిరం. ౧. ౪౫. (పెంపొందించు అని భావము.)

నట్టె. వి. ౧. సంతోషముచే చేయునాట్యము.

సీ. శుభశోభనముల దుస్తులొసంగ వెన్కముందులకు నట్టెలు సేయఁగలరుగాక. చంద్రా. ౩. ౪౫. ~~(తాళపత్ర ప్రతులు, ముద్రి. పా. వడ్డెలు. శ. ర. పా. చూ. దుస్తు.)~~

నట్టెండ. వి. (నడుము + ఎండ.) తీక్ష్ణాతపము, తీక్ష్ణముగా కాసినఎండ.

మ. ఇవముం గందువలం జలంబునను నట్టెండల్ వెసం గాయువేసవులం బంచమహాగ్నిమధ్యమున...నిల్చి చేసెఁ దపముం దాత్పర్యధైర్యంబునక్. పి. శకుం. ౨. ౧౧౨.

నట్టెము. వి. భిక్షాపాత్రము.

ద్వి. కప్పెరనట్టెంబుఁ గత్తుపాలయును, నొప్పుగా బిగిసినయోగపట్టెయును. ద్వి. పరమ. ౨. ౮౭ పా.

నట్టేఱు. వి. దే. (నడుము + ఏఱు².) ఏటిమధ్యము, నదీమధ్యము.

సీ. నట్టేట దాశకన్యకకు నువ్విళులూరి జాలిఁ బొందినపరాశరువిరాళి. నైష. ౭. ౧౫౧.

సీ. నెఱసు వెట్టితి పరాశరులంతవాని నట్టేటఁ బామరకన్యగాటు మఱపి. పి. శకుం. ౩. ౧౯౯.

సీ. పొఱుఁడ నని పట్టపగలు నట్టేటిలోఁ బలువచేతలకుఁ బాల్పడినవాని. విప్ర. ౪. ౪౪.

నట్టేటికెదురీఁదు = మిక్కిలి కష్టమునొందు.

క. మాటికి నీకసంసారం, బేటికి ననుబుద్ధి పుట్టు బృధ్వీశ్వర నట్టేటికి నెదు రీఁదినగతి, వీటికి వచ్చితి విమరలివిన్నఁదనముతోక్. వరాహ. ౨. ౫౩.

నట్టేట ద్రోయు = పరిత్యజించు, విడిచిపెట్టు.

క... చనునే నట్టేటఁ ద్రోయ కరణాగతులఁ. దశా. ౧. ౧౩౨.

నట్య. సం. వి. అ. స్త్రీ. నటులసమూహము.

నట్లొట్లు. వి. బ. జలధార లోనగునవి నిరంతరముగా పడి ఉడిగినవెనుక అచ్చోట నిలిచి నిలిచి పడెడుబొట్లు; చూరునుండి పడిన నీటిబొట్లు.

సీ. నవమాలికలతేనె నట్లొట్లు పడుచోట మాణిక్యదీపముల్ మలయుచోట. మనుచ. ౩. ౧౧౧. ("తేనె నట్లొట్లుపడుచోట" శ. ర. పా, "తీవె నట్లుట్టిపడుచోట" ముద్రి.పా.)

గీ. వాన వెలిసియుఁ జూరునఁ బడిననీరు, బొట్లు వంగుళ్లు వాఁగ నట్లొట్లు నాఁగఁ, బేరులు వహించు...ఆం. భా. ౧. ౩౫.

నట్వాలు=నటువాలు. (శ. ర, బ్రా, చి. ని.)

నడ=నడక, నడత. వి. (√నడచు. క. నడె. త. నడై. మ. నట.) ౧. నడక, గమనము.

సీ. కొలఁకులకెలఁకులఁ గూడి క్రీడించుచుండె డునంచతండంబునడబెడంగు. భార. అను. ౧. ౧౯౧.

క. భువి నంతదవ్వు నేమును, రవరవ లేకరుగుదుము హుటాహుటినడలఁ. మనుచ.౧.౩౬.

ఆ. వీరసేనసుతుఁడు వీరుండు హంసల, నడబెడంగుఁ జూచి నగుచు వాని, నెగచి యొగచియందు నెగయకుండఁగ నొక్క,హంసఁ బట్టుకొనియె నతిరయమున. భార. అర. ౨. ౧౨. రా. వి. ౨. ౫౯.

౨. అశ్వగతివిశేషము.

చ. జవమున భంజలిక మురళిఁ జౌకమునఁ నడ నైదుధారలఁ...యూథి కెక్కి యా,హవజయశీలముల్ గలుగునశ్వము లెన్నఁగఁ బెక్కులవ్వరిఁ. భా. రా. బాల. ౩౦.

నడక=నడ, నడత. వి. (√నడచు.) ౧. గమనము.

గీ. ఇపుడు ఘటికాద్వయం బయ్యె నినుఁడు పొడిచి, దవ్వు చాల దిచ్చోటికి దక్షవాటి, కేవలము మంచినడ కైనఁ గీస వెళ్తిరెండుజాములు నిట నూర కుండ నేల. భీమ.౪.౪౬.

౨. ప్రవర్తనము.

క. ననుఁ దేఁచూడఁ జెల్లదు,నినుఁ జేసిన బ్రహ్మకైన నిక్కువ మిది యీ,యనుచితపునడక నాయువు, కొనసాగమి నెందు నీకుఁ గొఱగా దంటిఁ. రామా. ౬. ౧౬౧.

చ. శివుఁ డిటు ర మ్మటంచు దయ చేసినచోఁదల కెక్కి తుగ్రమై,భవమునఁ జూచుచో నడుగు వట్టితి వే మన వచ్చు నీగుణం,బవు నవు నందినఁ పిగయు నందకయున్న ను గాళ్లుపట్టుకొం,దువు హరిణాంక మేలకొలఁదుల్ గద నీనడకల్ దలంపఁగఁ.విజ.వి.౩.౫౧.

౩. వృత్తి, జీవనోపాయము.

సీ. నడక యనంగను నడత యనంగను నడపడి యనఁగను నడరు వృత్తి. ఆం. భా. ౨. ౨౭.

నడకము. సం.వి.అ.న. మూఁపులనడుమ కిక్కసకసవువలె నుండునో కానొకయెముక.(వాచ.)

నడకీయము. సం. విణ. (అ. ఆ.అ.) కిక్కసగడ్డి కలది. (దేశాది.)

నడకొలఁకు=నడబావి. వి. (నడ+కొలఁకు.) దిగుడుబావి.

క. ఒడికపుదనసొబగున కెక్కుడు చెన్నలగలుగఁ జూచి కొల నాయన్నన్, నడకొలఁకు లంచు వారికిఁ, గడువేడుకఁ దమ్మితావి కానుకఁ జేసెఁ. యయా. ౩. ౫౩.

నడగఁడు. వి. (√నడ.) అశ్వవిశేషము, ఒకజాతిగుఱ్ఱము. గుఱ్ఱము.

విణ. నడమునది. (చూ. నడగొండి...)

క. ఒనరించిననీలని నడ,గని బొల్లనిఁ గ త్తలానిఁ గైరని సారం,గని జారని జన్నని నిమ్మవని, మొదలుగఁ దెచ్చి నిలిపె వాహకుఁ డెదు రజా. ద్వా. ౩. ౧౪౧.

వ... మందరమను దూరంబుగా వచ్చితిమి నడగఁ దు నడ తెగె...పి. కథం. ౨. ౧.

గీ. పఱపుకుంగడివీథు లేర్పఱచి కొంచెపాటి నడగని నెక్కి యాపాళె మెల్లవిడియ నియ మించి తిరిగె...కువల. ౨. ౧౫.

గీ. త త్తడిరవాలు నడగఁడు క త్తలాని, తురికి బాబా యనఁగ నొప్పుఁ దురగమునకు. సాం.ని. తిర్య. ౭౧.

నడకొ(గొ)ండ. వి. (నడ+కొండ.) నడక కల కొండ.

వ...నడుచునడకొండగమియునుం బోనిగజరాజిత్తో రాజు రథారూఢుండై...భార.భీష్మ. ౧. ౧౩౦.

చ. తనువున నెల్ల రక్తజలధారలు గ్రమ్మఁగ వారణేంద్రుఁ డేపున నెలయేఱు లొక్క మొగి బో రనఁ బె క్కడరంగ లీలఁ గ్రొ, కొని ఘనకేళి సల్పునడకొండగతిజా సము దగ్ర మూ ర్తి యై. భార. భీష్మ. ౨. ౨౪౦.

గీ. క్రొవ్వి నడగొండ కైవడి గుసుకుసొక్క,యొంటిగాని మహీనాథుఁ డొదిఁగి యేయ. మను చ. ౪. ౪౭.

నడగొట్టు. అ. క్రి. (నడ+కొట్టు.) నిలుచు, ఆఁగు, ఉండు.

క. పోక నడగొట్టి తేనియు, రాకింతుఁజుమీ మొగంబు రాచట్టుపయిం, శ్రీ కాశిక నిందించిన, నీ కింతటు నేల పోవు నీచచరిత్రా. భీమ. ౨. ౧౫౩. (ప్రయోగాంతరము మృగ్యము.)

నడగోట. వి. (నడ+కోట.) నడక కల్గోట.

సీ. రంగదుత్తుంగతరంగసంఘాతంబు నడగోటల తెఱంగు నడుపుచుండ. ప్రభా. ౧. ౬౪.

నడచియాడు=నడచు. (√నడచు.) (ప్రవ ర్తించు.)

సీ. ధ ర్మంబు కాశికాస్థానమధ్యంబున నాల్గుపాదంబుల నడచియాడు. కాశీ. ౨. ౫౦.

నడచు=నడిచియాడు, నడయాడు, నడుచు.అ.క్రి. (త.నడక.క.నడె. మ. నటక్క. తు.నడపుణి.)

౧. గమనముచేయు, చరించు.

వ...మార్తాండుండు కొండ ప్రక్కం జిక్కి కడలి మొగయక్కలిం దగులువడినజోగునుం బోలె నెదురు నడవ మఱలం బఱవ లేక చీకాకుపడి యున్నవాఁడు...కాశీ. ౨. ౧౧.

ద్వి. కడఁగి దుశ్శకునముల్ గనిపింప నిటకు, నడచితి నటుగాన నావివాహమున, కేకీడు పుట్టునో యెఱుఁగంగ రాదు. ద్వి. నల. ౨. ౬౦౧. (ఇట వచ్చు అని భావము.)

౨. పోవు, వెడలు.

క. సేనమొగ మీతఁ డైనం, బూని మహీశ్వరులు నీకుఁ బొడిచెదర్, దుర్గాని యని కాదె యీతని,తో నడచుట కొల్లనెతి దురమున కధిపా. భార. ఉద్యో. ౪. ౨౪౪.

గీ. నడచెఁ దుండీర దేశంబునడిమిచాయ,గగన ఘంటాపథంబునఁ గమలహితుఁడు. కాశీ. ౧. ౧౨౬.

క. విడిపించుకొని మఱుంగున, నిడినతనదుభూషణంబు లెల్లను బ్రేమజా, దొడిగి గృహంబున కల్లన, నడచెఁ బతిచరిత్రభావనల మనమలరజా. కళా. ౪. ౧౦౨.

౩. ప్రవర్తించు, నడచుకొను.

ఆ. యోగ్యతప్పఁ దార లుచితంపుఁగొలఁదిమై, నడచినట్టివారు బెడిదములకు, నంత పాత్రు లెట్టు...భార. ఉద్యో. ౧. ౩౦౭.

  

క. ఇది చెప్పినట్లు చేయుదు, మిది పంచినయట్ల నడతుమిది కల్యాణాభ్యుదయనిధానము మా కని, హృదయంబులఁ దలఁచుచుండి రిరుదెస వారల్. హర. ౬. ౧౦౭.

క... తారే దిక్కుగ నడతు రళంక నల్లికొని దుస్సనిచివుల్. ఆము. ౪. ౨౨౮.

౪. జరుగు.

గీ. నాముఖంబునఁ గార్యంబు నడవ దేమి, సేయు వాఁడ నొం డెద్దియుఁ జెప్పలేదు. భార. ఉద్యో. ౩. ౩౨౬.

క. ము న్నొక్కపట్టనంబున, సౌన్నారిమిటారి సేర్పు శూరత్వము గైకొన్నది యై నడచిన కథ, చెన్నుగ విని పొమ్ము కడువిచిత్రము కొమ్మా. హంస. ౨. ౧౭౭.

౫. చెల్లు.

క. దేవా క్రమక్రమంబునఁ, బావనులై సృష్టిఁ గలుగుప్రజ లీకరణిన్, గైవల్యంబున కేఁగెదు, హావళిచే మాకు నడవ నధికారంబుల్. వరాహ. ౧౦. ౧౭.

౬. (గ్రాసము) కడచు.

గీ. తగినవేషంబు దనుఁ దాన పొగడుకొనమి, నొచ్చియును గీడు వలుకమి యిచ్చి వగవ, కునికి దన కెంత నడవక యున్నఁ బథము, దప్ప కుండుట నడవడి కొప్పు సేయు. భార. ఉద్యో. ౨. ౪౫.

సీ. గతి లేక దాస్యంబు గైకొని దానిచే గ్రాసంబు నడవక కడుఁ గృశించి. కవిక. ౫. ౧౭.

౭. ఉండు.

సీ. ఇఁకఁ గావు మఱింతు నే నోయఖండదయాసముద్రుండ నాయందుఁ గరుణ, నడవఁ గట్టి పగఱ నడగించి తే నేమి చెప్ప నమోఘ వాంఛితుఁడ నగుదు. రాఘవ. ౪. ౭౧.

౮. కవియు.

ఆ. స్వశ్రితనికురంబవనశిఖి ... నఁ డాబలాఢ్యుమీఁద, నడచి దుర మొనర్చె సభమున నుండి నిర్జరులఁ జెగడ నిగుడు పాయకముల. రాఘవ. ౪. ౨౧౬.

నడనిచ్చు=నడువనిచ్చు.

సీ. అడుగైన నడనీక యాఁకవెట్టినపిగ్గు సంపూర్ణమదధారసరణిఁ బొదల. కళా. ౫. ౧౦.

జః నడ, నడక, నడకొండ, నడకోలఁకు, నడగఁడు, నడగొట్టు, నడగోలు, నడచియాడు మొ.

నడజోదు. వి. (నడ + జోదు.) పదాతి, కాలిబంటు.

వ... అడిదంబులఁ బొడి పొడి గా నడుచునడజోదుభటులును ...ఉ. హరి. ౪. ౨౨౯.

నడత=నడ, నడక, నడితి. (√నడచు.)

(నడవడి, ప్రవర్తనము.)

సీ. కామపాలాఖ్యుఁ డై గరిమ సర్వజ్ఞుఁ డై నరవరోచిత మైననడత యెఱిఁగి. నరస. ౧. ౭౦.

శా... బలిమి యెవ్వాఁ డొందు వాఁడే కదా, త్రైలోక్యంబున పేటి యానడతయే ధర్మంబు యత్నేశుపై, నేలా యీమొగమోటు యాతనిపురంబే లంక శంకింపఁగన్. ఉ. రా. ౨. ౨౨౭.

గీ. ఇట్టిమీవారినడతలు గట్టిపెట్టి. శశాం. ౩. ౮౧.

(వృత్తి, జీవనోపాయము.)

సీ. నడక యనంగను నడత యనంగను నడవడి యనఁగను నడరు వృత్తి. ఆం. భా. ౨. ౨౨౮.

నడతాడి. వి. (నడ + తాడి.) నడక కలవాడి.

క. పొడుపును బోడియు నై యిల, నడతాడిం బోలి కరమునం బుస్తకపుం, దడక ధరియించి కటిఁ జం, పుడువల్కము దూల బుద్ధముని శిష్యునితోన్. ప్రబోధ. ౩. ౨౦.

నడతెంచు. అ. క్రి. (√ నడచు.) ౧. వచ్చు.

ఉ. దంతిఘటల్ మహోగ్రసముదగ్రతతో నడతేర...భార. కర్ణ. ౧. ౭౫.

ఉ. ... లంక మకరాలయ మేగ్గతి నైన

దాఁటి సుగ్రీవపురస్సరంబుగ నొగిఁ నడ
తెంతుర తప్ప దాహకం, జేవెర వాచరించి
న జయింతుము చెప్పఁడు... భా. రా. యు.
౫౦.

ఉ. అన్న కుమారచంద్ర తగునయ్య నిరంతర
దుఃఖవారిలోన న్నిటు ముంచి యీవిధము
నఁ భయఘాతువులం దపంబు స్సేయ న్నడ
తెంచి తిట్టు ... వి. పు. ౨. ౫౦.

౨. పోవు.

వ... వాకంబు వెడలి యాకసంబున నడతెంచు
చున్న సమయంబున... ప్రభా. ౧. ౫౩.

ఉ. పాండవకోటిచూపు్కలకుఁ బందువు గాఁ
జనుదెంచె ధృష్టకేతుండు సహోదరుండు
తనతో నడతేరఁ బరాక్రమోద్ధతిఁ. భార.
భీష్మ. ౧. ౧౧౪.

చ... దిగంతభాగములు వగుల్పఁగా నెదురుగా
నడ తెంచిరి వైరికోటికిఁ. హరి. ఉ. ౯. ౧౬౪.

నడతెగు. అ. క్రి. (నడ + తెగు.) నడక తెగిన
దగు, శ్రాంతమగు, డయ్యు.

వ... మందకును దూరంబుగా వచ్చితిమి నడగఁ
దు నడ తెగ మానిసి మట్టచిట్టాడవియాచి
ట్టడవి నెట్లు చన నేర్తు ... పి. కళం. ౨. ౮.

నడత్రోవ. వి. (నడ + త్రోవ.) నడుచుట కుపయో
గించుమార్గము.

(విష్ణుపాదవర్ణనము.) చ. బలికి మణికిరీటము సు
పర్వులకుఁ నడత్రోవ కూలికిఁ, జలకము
బిందె మానిజనవాధునికాంతకు జీవవామధం,
బు... చంద్రా. ౧. ౫౬.

నడది(దీ)విియ. వి. (నడ + దివియ.) కరదీపిక,
దివటీ, కాగడా.

సీ. నడదివియలు నేసె నగరికి మాణిక్యమకుట
మల్ ఘూనినమనుజపతులు. భార. విరా.
౫. ౩౨౦.

వ... నడదివియ లై మకుటారవిందరాగంబులు
వెలుంగ నలుగడల సామంతసందోహంబు
క్రందుకొన ...మనుచ. ౫. ౭౧.

వ... ముందఱం జనుమూర్ధాభిషిక్తుల మణికిరీటం
బు లనునడదీవియలతోడం గూడి ... నైష.
౬. ౮౦.

నడదీఁగె. వి. (నడ + తీఁగె.) నడక కలతీఁగె.

ద్వి. నడదీఁగెలో యన నవకంపుఁగాంతి, కడు
నొప్పుమేనులు ఘననితంబములు, చిఱుతన
వ్వులు తీయచెయ్యులు గల్గు, తెఱవలు వల
రాజుదీమంబు లనఁగ. రం. రా. ఉ. ౧౧౦
పా. ౧౦ పం.

నడపందిరి. వి. (నడ + పందిరి.) - నడక కలపందిరి -
ప్రయాణకాలములందు రాజాదులయుపచారము
నకై పరిచారకులు మోసికొనిపోవుపందిరి.

ద్వి. ఉడువీథి గప్పి సమున్నతలీల, నడపందిరులు
వెలిగొడుగులుదనర. బస. పు. ౨. ౧౬౨ పం.

నడపాడు = నడుపాడు. అ. క్రి. (నడపు + ఆడు.)
నడచు, సంచరించు.

(పార్వతి.) సీ. కలహంసకులమందగమనంబున
య మిటిదని చూపుగతి నడపాడఁ దొడఁగె.
కు. సం. ౩. ౨౩౫.

సీ. నడపాడ నేర్చిననవకంపులత లనఁ బొలు
పొందువెన్నెలబొమ్మ లనఁగ. ధనా. ౨.
౨౩. కు. సం. ౫. ౬౦౦.

నడపించు = నడపు.

(గమనింపఁజేయు, చరింపఁజేయు.)

సీ. పూరియుఁ గట్టి యల్ నీరును గలపథంబున
నేన నడపించుభూరికి క్తి. ఉ. రా. ౪. ౧౪౬.

గీ... నీయడుగుఁదమ్ము, లెంతదూరము నడపింప
నిచ్చగించె. నైష. ౪. ౭.

(ప్రవర్తిల్లఁజేయు.)

గీ... నీయభ్యనుజ్ఞ, ననుమతింపుము... రాజు నడ
పింపనెట్టి/ధర్మంబు నధము. కాశీ. ౬. ౩౧.

నడపీనుఁగు. వి. (నడ + పీనుఁగు.) నడచునట్టి శవము.

ఆ...అర్థంబు సువ్వె సకలధర్మకారి, యొడమె లేనివాఁడు నడపీనుఁ గనుసవ్వు,షోక్తి వినమె దాని నూఁద వలదె. భార. శాం. ౧. ౪౯.

క. గడ నుడుఁగుమగనిఁ జూచిన, నడపీనుఁగు వచ్చె ననుచు నగుదురు సుమతీ. సు. శ. ౪౩.

నడపు= నడపించు, నడిపించు, నడుపు. స. క్రి. (√నడచు.) ౧. గమనింపఁజేయు.

ఆ. మూలబలముతోడ మోహరంబుగఁ దీర్చి, సుమతిసుతుఁడు సైన్యసమితి నడపె. విక్ర. ౫. ౮౪.

క...ప్రహస్తుఁడు ముంగలి, యై రాక్షససేన నడపె నపుడు నృపాలా. ఉ. రా. ౨. ౩౨౯.

౨. ప్రవర్తింపఁజేయు.

క. నానావిధభూతమయము, మే నతిచంచలము మనము మెయికొని నిక్కం, బేనరున కుఁ జెల్లింపం,గా నగు సత్యంబు నడపుక్రమ మట్లుండెన్. భార. విరా. ౧. ౧౯౩.

గీ. క్షత్త్రియునిఁ దెచ్చి తొలితొలి గద్దియనిడి,పట్టబద్ధుఁ గావించుచోఁ బ్రజలు దమ్ముఁ, గావ ధర్మంబు నడపను గాదె సమయ,మరిఁ బలుకుదు రీ వది యరయ వలదె. హరి. పూ. ౧. ౧౦౩.

౩. జరుపు.

సీ. వెలివెలివస్తువుల్ విడిచెఁబో నరుఁడు కర్మరహితం గాదె శరీరయాత్ర, నడపువాఁ డది మోక్షణంబు కానేరదు...భార. శాం. ౧. ౮౪.

గీ. ఇట్లు తనుయాత్ర నడపు మన్నితనితాత. ఆము. ౪. ౧౯౦.

ఆ. తా నెఱిఁగినకొలఁది నానారివృత్తాభి,ధాన కథ లొకింతతడవు నడపె. రాఘు. ౪. ౩౮. (చెప్పె నని భావము.)

౪. ఆచరించు.

క...అద్దనుజునిఁ, బొడ కడఁగింపఁ దలంచి భూరివ్రతము౯.

చ. నడప మదాత్త యగ్ని యయి నావదనంబున నిర్గమించి...భార. అను. ౪. ౪౦౬,౪౦౮.

గీ. వరుస నడపిరి వీరశైవవ్రతంబు. హర. ౨. ౧౧౯.

౫. పోషించు.

చ. పదసితి నిమ్మహోత్తుల నపాయము నొందక యుండఁ బెంచుచు౯, నడపు మటంచు నన్ను మునినాథుఁడు మీజనకుండు పంచి ...భార. ఆది. ౮. ౩౦౫.

ఉ...ఆ త్తతురగంబుల కెల్లను సన్న యుక్తిఁగా, నత్తిలి నిల్పి యూఁగియుఁ బ్రియంబున నాయెడ నాఁడునాఁటికిం, జేర్చి వహించుచుండ నడపెం దనత్తములలోవివాదిగా౯. భార. విరా. ౧. ౨౬౬.

సీ. పడఁతి నే నడపినబాలసారంగంబు ఋషినివాసముల కర్పింపు మమ్మ. చంద్ర. ౪. ౯౬.

౬. సమకూర్చు.

క. ఆకోదండ్రకు సొమ్ములు, కోకలు ననులేపనములు కొదయించుకయు౯, లేక ప్రవర్తిల నడపెన, నాకులతం గొమరుడెంద మలరారుటకై. కళా. ౬. ౮౧.

౭. పొందు.

సీ. రాజుగ్రనేముఁడై రాజిల్లఁ దాను దీర్ఘరితనం బెంతయుఁ బ్రభుతతోడ, నడపువాఁ డయ్యొ సన్మాన్యుఁ గాశ్యపుఁ డనువిప్రుఁ బురోధ గావించె...హరి. ఉ. ౨. ౧౬౮.

౮. ఇచ్చు.

వ...త్రిభువనాంకుశమానవిత్య మానెందును ఇ నడపం గ్గలాండు ఆచంద్రార్కము గాను. దా. శా. ౧౧౯౧.



౯. గమనము, నడక.

ఆ... పాదతలముఁ జనుకట్టుఁ గచము న్యానన
ము నడపు నద్రితనయ కమరు. కు. సం. ౭. ౧౨.

సీ. అల్లదసంబున యనువు మైకొనఁ జూచు నడపు కాంతికి వింతతోడవు గాఁగ. భార. విరా. ౧. ౨౬౫.

చ. నడపుతెలుంగు మాటజతనంబు నపాంగవిలాసముఁ మునుం, గిడినబెడంగు ముద్దుమొగ మించుక వంచినసిగ్గుఁ బార్వతిం,దడ మఱుపంగ నొప్పెసఁగ దర్పక వైరికి...ఉ.హరి. ౫. ౫౭.

నడపుకొను= నడుపుకొను. స. క్రి. (నడపు+కొను.) పోషించుకొను.

గీ. ఉనిచి కడుగారవంబున ననఘచరిత, నట్టనడుకేయి చెప్పచున్నాను మమ్ము, నరమరలు లేక మీయుపాధ్యాయువలెను, నడపుకొనువార లెవ్వ రున్నారు గనుక. విప్ర. ౪. ౬౫.

నడప్రాయము. సం. విణ. (అ. ఆ. అ.) కిక్కసకసవు అధికముగా కలది. (దేశాది.)

నడబావి. వి. (నడ + బావి.) నడచిపోవుటకు మెట్లేర్పఱచినబావి, దిగుడుబావి, దీర్ఘిక.

ఉ. ఆనడబావిదండఁ గలయం జిగిరించినదేవదారుశాఖానికరంబు క్రిందట నొకానొకచో... ధరాధిపుఁ డొంటి సమాధినిష్ఠుఁడై. తపతీ. ౩. ౯.

సీ. విమలంబు లైనకూపములు నూటికిం బైఁ బరికింప నొకనడబావి మేలు. కృ. శతం. ౩. ౧౧౪.

సీ. కడ లేనియమృతంపునడబావి సంసారి ... మనుచ. ౧. ౬౬.

భక్తము. సం. విణ = నడప్రాయము.

మామిడి. వి. (నడ+మామిడి.) నడక కు మామిడిచెట్టు.

క. కలయఁగఁ గరములఁ జరణం,బుల నురమున శోణితంబు బోరనఁ దొరఁగం, దలి రెసఁగిననడమామిడి,చెలువునఁ బఱతెంచె భీమసేనుఁ డచటికిన్. భార. భీష్మ. ౩. ౨౨౩.

నడమీనము. సం. వి. అ. పుం. కిక్కసకసవు నడుమనుండుచేఁప, చిలిచిమను, తేలుమీను.

నడము. సం. వి. అ. పుం. కిక్కసకసవు.

నడయాడు= నడచు. అ. క్రి. (√నడ.)

(నడచు; సంచరించు; విహరించు.)

సీ... ఇవ్వామనయన, నడయాడఁ గఱచిననాఁడ చిత్తంబునఁ గాంతిమతీకన్యక్రమముఁ దలఁచి. దశకు. ౭. ౭౫.

గీ. ఇందు రావయ్య విందులు విందు లనుచు,నర్థిఁ దనుఁ బిలువఁగ నడయాడి యాడి,యుల్లసిల్లెఁ గృష్ణుఁడు శైశవోత్సవముల.హరి.పూ. ౫. ౧౯౦.

సీ. ఘులుఘులు మని యందియలు మ్రోయ నడయాడునడుగులా యివి ప్రోదియనుఁగుఁజూల. సారంగ. ౩. ౨౪౬.

(వీచు, వీతెంచు.)

క. వాడెం బయిరులు కాఁకలు, గూడెం గొలఁకులు దవాగ్నిఁ గుజనిచయంబుల్, మూడెం బ్రాణులపై నడ, యాడెం బలుసెకలగాడుపక్కాలమునన్. సమీర. ౨. ౯౩.

శా. త్వంగద్వాహఖురాగ్రభిన్నధరణీతత్త్వంబు రేణ్వాకృతిన్,మింగ న్వారిధులన్ గ్రసించె హిమరుఙ్మిత్రాదులం బుష్కరం,బుం గప్పెన్ నడయాడ దయ్యెఁ బవనంబున్ ... దశా. ౨. ౩౭౯.

(ఉండు, నివసించు.)

క. వచ్చెఁ గద బెడఁద మన కిఁక, నిచ్చట నడ యాడఁ గూడ దెటకేనియు నే, వచ్చెద ర

మ్మటు లైన, న్విచ్చలవిడి నడువవచ్చు వెఱవకు మదిలోన్. శుక. 3. ౫౦౨.

నడలింగమూర్తి. వి. (√నడ.) నడక కలలింగ మూర్తి, చరలింగము.

సీ. నాకు మీపాదార్చనము సేయ నడలింగ మూర్తి చేకు ఱె ... కాళ. ౧. ౩౫.

నడ(డు)వ. వి. (√నడచు. క. నడవ. త. నడై.)

౧. అలిందము, తలవాకిటికిని నడిమివాకిటికిని నడిమిచోటు.

(వ్యవ.) నీవు మాయింటినడవలో కూర్చుండుము.

౨. సేతువు.

క. ఆచేప లిపుడు మీరలు, వైచినమల లెల్ల మ్రింగి వైచెం జుమీ యో, రాచల్వ యేఁడ పదిలుఁడ, వై చెచ్చెర నడవఁ గట్ట నంపుము నలునిన్. అచ్చ. రా. యు. ౭౪, ౭౫.

గీ. నడవ గావించుచున్న యన్నలుని సేతు,క ర్తకా శల మీక్షించుగగనచరుల, కనిమిషత్వంబు చరితార్థమయ్యె నపుడు. భా. రా. యు. ౨౫౨

3. (తె. నడవై) మార్గము; సోపానము.

ఆ... మార్గంబు, తెరువు త్రోవ దారి తెన్ను సర వి, చనుప నడవ చొప్పు జాడ డొంక యనం గఁ, బొలుచుచుండు... ఆం. భా. ౨. ౭.

వ... కూలినబావి తెఱంగున నడవ లేక... కవిక. ౪. ౧౧౩.

నడవడి. వి. (√నడ.) ౧. గమనము, నడక.

సీ. నడవడి గలదివ్యనాగదంతము లట్లు...గీ... వెలసె రన్నలువు రంత. చం. రా. ౨. ౫౩.

సీ. హిమశైల్యగిరులఁ బేరెదబల్మి నదలించి నడవడిఁ జౌదంతిఁ గడకుఁ ద్రోచి. వె. శకుం. ౧. ౪౩.

క. కుడిరెడమ వాడులందున్, నడచున్ వాయు వులు వానినడవడి చెలి యో... [illegible]

నెపుడు మెలఁగున్, నడిమినడక నంటి నె మ్మనంబు కుమారా. సీతారా. ౧. ౧౫౦.

౨. ప్రవర్తనము, నడవడిక.

క. నడవడి యనుమున్నిటిం, గడవం బెట్టంగ నోడకరణిం దగి... భార. ఉద్యో. ౨. ౩౯.

చ. నడవడి మంచిదైనను జనంబులు పెద్దఁగఁ జూతు రాతనిన్, నడవడి చక్కఁగానినరు నచ్చిన చుట్టము లైనఁ జేరనీ, కెడ గలుగంగఁ దోలుదురు... నా. పంచ. ౧. ౧౦౬.

క. తెలిపితివి సోమసూర్యుల, కులవిస్తారంబు వారికులము ధరిత్రీ, కులనడవళ్లును వింటిమి ... భాగ. ౧౦ పూ. ౩.

3. ధర్మము, న్యాయము.

సీ... తమకు, నధిపతియుగ నొరు నాసపడక యుండి నడవడి బహుకారణములఁ జిక్కి, వడిన విష్ణులె బ్రహ్మఁ గానఁగఁ బోయి మాకు రక్షకుఁడుగ మహిపుఁ డొకఁడు. గీ. వలయు రూపింపుము ... భార. శాం. ౨. ౨౫౭.

ఆ. ఎమ్మెకాఁడె యగ్గి యెలగాఁగఁ బెండిల్లియైన చెలిని డించి యకట యొంటి, నేఁగ దగునె మీర లెఱుఁగనినడవడు, లింకఁ బుడమిఁ గలవె యేర్పఱింప. అచ్చ. రా. అయో. ౭౦.

౪. జీవిక, వృత్తి.

సీ. నడక యనంగను నడత యనంగను నడవడి యనఁగను నడరు వృత్తి. ఆం. భా. ౨. ౨౨౭.

నడవడిక. వి. (√నడవడి. త. నడవడిక్కై.) ప్రవ ర్తనము. (శ. ర, చి. ని.)

నడవడికాఁడు. విశే. (√నడవడి.) ప్రవర్తనము కలవాఁడు.

చ. అడిగినఁ దెచ్చువాఁడొ గకు నందమునన్ గన నెవ్వాఁడొ మీ, ల్లు నడవడికాఁడొ వీటఁ

దగునాయకమై చరియించువాఁడో ...ప్రబంధ.౬౩౪.

నడశేషము. సం. విణ. (అ. ఆ. అ.) నడముతో కూడినది.

నడసంహతి. సం. వి. ఇ. స్త్రీ. కిక్కిసగడ్డిమేటి.

నడీ. సం. విణ. (న్. నీ. న్.) నడతృణము అధికముగా కలది. (కౌండ మొ.)

నడుఁకించు=నడుఁకఁజేయు. స. క్రి. (√నడుఁకు.) వడఁకించు.

సీ... తురగచయము. ఆ. నాల్గుసాయకముల నడుఁకించి సారథి, నొక్కమార్గణమున నుబ్బణంచి, యార్చుటయును ద్రోణుఁ డలిగి ...భార. ద్రో. ౪. ౭.

నడికట్టు. వి. (నడుము+కట్టు.) కాసె, దట్టీ.

సీ.అరచట్ట మయిఁ గుంకుమాంబువు నడికట్టు చెంగావి పైజిగిఁ జికిలిసేయ. రా.వి.౩.౧౨౫.

(కలికిమూర్తి.) సీ. కడవన్నె జిగిపట్టునడికట్టు పడుదలపట్టంబు నేజాయు బాగుదేర. గీ.వెడలు దిగ్విజయార్థియై...దశా. ౧౦. ౧౧౨.

రగడ. నడికట్లు మేఘవర్ణంబులును ద్రోపులును మొకమాలులును...హంస. ౫. ౩౫౬.

నడికట్టుత్రాడు. వి. (√నడుము.) ఏనుఁగు మొదలగువానినడుమునకు కట్టెడుత్రాడు.

(కళాపూర్ణుడు.) క...తద్వ్యదండము నడికట్టు త్రాళ్లఁ దగ బంధించెన్. కళా. ౮. ౮౬.

నడికలను. వి. (√నడుము.) యుద్ధరంగముయొక్క మధ్యభాగము.

వ...నడికలన నింటివారిం దలంచుకొని కేడించి వచ్చి యచ్చటచ్చట మచ్చరంబుల నెదిరి బలంబుల సొచ్చి వ్రచ్చి నొచ్చువారిం జచ్చువారిం జూచి...ఉ.రా. ౪. ౨౮౧.

నడికిరే(యి)=నడిరేయి. వి.(√నడుము.) అర్ధరాత్రము.

సీ. అతఁడును దద్భావ మరయంగ మదిఁ గోరి రూపించి యొకమరి రేప వత్తునని పోయి నడికిరే యర్థితోఁ జనుదెంచు...భార.ఆర. ౭. ౩౨౨.

ఉ...త్రైక్కొనుకాఁకచే నడికిరే లరుదెంచిన గోపికావళిన్, బొక్కఁగఁ జేసి...ఆము. ౫. ౬౮.

గీ. ఈనడికిరేయి నొంటిమై యింతదూర,మేమి కార్యంబు మదిఁ గోరి యేఁగుదెంచితి... హర. ౭. ౧౨౩.

గీ. వండ వలయదు వేవురు వచ్చిరేని, అన్నపూర్ణవు నుద్దియా నతనిగృహిణి, యతిథు లేతేర నడికిరే యైనఁ బెట్టు,వలయుభోజ్యంబు లింట నవ్వారి గాఁగ. మనుచ. ౧. ౫౬.

నడిగండి. వి. (√నడుము.) యోని,ఆఁడుగుఱి.

సీ. తొడపల్చ నగునింతినడిగండి కడుఁ బెద్దరిత్తనిమనసుకోరికలు పెద్ద. వేణు. ౨౦.

నడితల. వి. (√నడుము.) శిరోమధ్యము.

(భీమజరాసంధులు.) చ. నడితల లూరుజానుజఘన ప్రకరంబులు బిట్టు వ్రయ్యఁగాఁ,బిడుగులఁ బోలు పెన్గదలఁ బెట్టుగ వ్రేయుచుఁ బాయుచున్ వెసన్. భాగ. ౧౦. ఉ. ౭౩౬

వ...అంత నెగసి పగతునడితల బెడిదంపుఁగుడంక నడువ...కూలినఁ బ్రతిభటుండు పొలిసె ననుచు...హరి. ఉ. ౨. ౬౧.

నడితి=నడత. (త. నడత్తై.) ప్రవర్తనము. (బ్రౌ. శ. ర.)

నడిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. నడతృణసమూహము. ౨. నడతృణ మధికముగా కలనది.

నడిపించు=నడపు. (√నడుచు.)

(గమనింపఁజేయు.)

గీ. ఘల్లుఘల్లునఁ బెండెంబుగండుమీలు,గదల నల్లన నడిపించి పొదివి తెచ్చె,నెచ్చెలులపిండు యువతి నాన్నృపతికడకు. మను చ. ౬.౫.

క. నలకూబరమణికంఠులు, బలముల నడిపింప నర్థపతి తురగముపై, ధళధళితచంద్రహాసో,జ్జ్వలితభుజుం డగుచు నడచె వాసవుప్రోలన్. పారి. ౪. ౭౩.

(జరుపు, జరిగించు.)

గీ.అనినఁ జిఱునవ్వు నవ్వి యజ్ఞనవరాగ్ర,గణ్యుఁ డతనికిఁ గట్టువర్గంబు లొసఁగి, మంచి దటువలెనే నడిపించుకొండ్నమంచు వీడ్కొల్ప నాదైత్యుఁడరుగుటయును. కువల.౨.౧౦౪.

(రథము మొ. కడపు, తోలు.)

క. అరదము దశముఖుమీఁదం, బరువడి నడిపింపు వేగ మాతలి యనుచున్. ఉ. రా. ౪. ౩౩౪.

నడిమికట్టు. వి. (√నడుము.) నడుమునకు కట్టుకొనెడుకట్టు.

సీ. కటిమండలంబునఁ గరకంచుపుట్టంబు మడఁచి కట్టినమేలినడిమికట్టు. హర. ౨. ౯౩.

నడిమిన్ను. వి. (నడుము + మిన్ను.) ఆకాశమధ్యము.

చ...కడువేడ్క యొనర్పఁగ బంతి యాడ నె,మ్మిని గనకంపుఁగోల నడిమింటనె త్రిప్పరఁ దారి కొట్టుచున్. ప్రభా. ౨. ౩౦.

క. నడిమింటఁ దపనిడెందపు,నడిమింటం జెలఁగుతమ్మినంటు వెలుంగన్. ఘటికా.౨.౧౧౩.

నడిమిలోకము. వి. (నడుము+లోకము.) భూలోకము.

గీ. కారణం బేమి నడిమిలోకమునకుండి,నరపతులు రారు మునుపోలె నాకమునకు. నైష. ౩. ౯.

నడిమివాఁడు. విశే. (√నడుము.) మధ్యముఁడు.

సీ. కూడు లే కాతనిచేడియ మువ్వురుకొడుకులలోపల నడిమివాని, మెచ్చఁ బ్రాకు వోపి యమ్మెద నూఱుగోవుల కెవ్వరేఁ గొనుఁడను నెడ...హరి. పూ. ౨. ౪౦.

నడిరాతిరి=నడిరేయి. (త. నడురా.) నిశీథము.

సీ...నడిరాతిరి యన, నడిరేయి యనఁగఁ గాందారిమాందారిప్రొద్దన...నిశీథాఖ్య దగు... ఆం. భా. ౧.౯౪. ("అపరాతిరి యన నడిరేయి యనఁగ." ప్రాఁతవ్రాఁతప్రతులపా.)

నడిరేయి=నడికిరేయి, నడిరాతిరి. వి.(√నడుము. త. నడు ఇరవు.) అర్ధరాత్రము.

సీ. నరవర మనవీడు నడిరేయి కృతవర్మయును గృపాచార్యుండుఁ దనకుఁ దోడ్పుగా వచ్చి ...భార. సౌ. ౨. ౩.

ఉ...కొక్కరొక్కో యని కూయఁడే యతఁడు కుక్కుటమై నడిరేయి గౌతమప్రేయసిఁ బొందఁ గోరి...నైష. ౭. ౬౯. ఆం. భా. ౧. ౯౪.

నడిలము. సం. విశే. (అ. ఆ. అ.) కిక్కసకసవు కలది. (నేల మొ.)

నడివంక. వి. (√నడుము.) మధ్యభాగము.

సీ. బెట్టుగా నడివంకఁ జుట్టివచ్చినమబ్బు వెలయునేనికతోలు వలువ గాఁగ. యయా. ౨. ౩౬.

నడివీథి. మి. వి. (√నడుము.) వీథియొక్క మధ్యభాగము.

గీ. పెద్దనడివీథి నిలుచుండి భిక్ష యడుగు, నాశ్రమంబునయందుఖట్వాంగపాణి.హర.౫.౫౫.

నడివీపు. వి. (√నడుము.) వీపునడిమిభాగము.

క. ఉఱుకుచు నె కఠినముష్టిన్, నెతి చెడ నడివీపు వొడిచి నిజభుజముల నేన్దొటి మెఱయ

వానిసందులు, బిఱుసున వెనుకకుఁ గుదించి
వెఱకే ల్పట్టెన్. కళా. ౮. ౮౫.

నడిమ్రేలు. వి. (√నడుము.) మధ్యమ, నడిమి
వ్రేలు.
గీ...నడిమ్రే లన మధ్యమ నెగడు...ఆం. భా.
౨. ౧౩౯.

నడుఁకఁబడు. అ. క్రి. (నడుఁకు+పడు. స్వార్థమున.) నశించు.
వ...నిజదాసజనపాపతాపత్రయచయమ్ముల నడు
గక నడుఁకఁబడఁ జేయునడుగుతండంబులును
...ఘటికా. ౨. ౬౫.

నడుఁకు(గు). అ. క్రి. (త. నడుంకు. క. నడుగు. మ. నడుంగు. తు. నడుంగుణి.) ౧. చలించు; వడఁకు.
చ. నడుఁకక బాల్యచాపలమునన్ దనపిమ్మటి వ్రే
లఁ జొక్కపుంగడియపుటట్టుంచుఁ ద్రిజ
గజ్జను లచ్చెరువంది చూడ న,క్కడపటి కొం
డసాంపు లెఱుఁగం దవిలించి నటించుశూలి
పెన్గొడుకు ...వేం. పంచ. ౧. ౪.
ద్వి. కనుఁగొని యిది యేమి కాంత నీచంద,
మనవుడు నాలేమ హస్తముల్ మొగిచి,
నడుఁకుచుఁ బలుకను నాలుక రాక. రం.
రా. ఉ. ౪౨ పా ౪. పం. (నడకు ముద్రి.)
గీ. అమరుబృంహితహేషితఘుమఘుమితభు,జా
సమాస్ఫాలితంబులజడికి నడిఁకె, కులకుధర
మండలము కలగుండువడియె. వసు. ౨.
౧౫౨.

౨. ఒదుఁగు, సంకుచితావయవుఁ డగు.
గీ. వామనుం డైనకైటభవైరివిధము, నభినయిం
చు క్రమంబున నధిపసుతుఁడు, నడిఁకి నడిఁకి
యల్లలన నడిచి పట్టెఁ, బాణిపద్మద్వయంబు
నఁ బసిఁడియంచ. నైష. ౧. ౧౦౨.
క. ప్రబ్బికొనినవెంటకట్టి, నిబ్బరముగ నడిఁకి
నడిఁకి నింగికి వడితో, గొబ్బున నెగసి తటా
లున, బెబ్బులి మందావుఁ బట్టెఁ బెలుకుచి
యఱకన్. భాగ. ౬. ౩౫.
ఉ...వాఁడుం దగఁ బోయి యల్లన నడుంకుచు
భూవిభుఁ జేరి నమ్రుఁడై. నిర్వ. ౨. ౫.

౩. నమ్రుఁ డగు.
గీ. బ్రతుకఁ దలఁతేని వినుము నాపనుపు సేసి,
చక్ర మాదిగ విడిచి మత్సంజ్ఞ యుడిగి,
నడిఁకి చనుదెమ్ము నాశరణమ్ము సొరఁగ. హరి.
ఉ. ౬. ౧౯౦.

౪. భయపడు, జంకు; వెనుదీయు.
క. వెఱవార లధికభీతిన్, విఱిగి చనిరి భీష్ముఁ
డేచి వీరరథికు లం,దఱఁ జూచి రాచకొడు
కుల, నఱుమాడెడు భీముఁ డిట్లు నడుఁకం
దగునే. భార. భీష్మ. ౨. ౨౩౪.
చ. నడిఁకెడువాఁడు గాఁడు గురునందనుఁ
డక్కట తండ్రిచావునప్పుడు మొగ తప్పి
యొండుగడఁ బోరుచు నుండెనో ...భార.
ద్రో. ౧. ౯౨.
క. యాదవులు కృష్ణప్రాపున, నాదగు వేఁడిమికి
నోర్చి నడుఁకక యెదురై, యేదియు నెఱుఁ
గరు శౌర్యోన్మాదంబున నున్నవారు మహి
మోద్ధతులై. హరి. ఉ. ౬. ౮౯.
గీ. ఉడుము నడిఁకిన నడుఁకునే బడియపెట్టు.
కాశీ. ౨. ౧౪౪.

౫. ఆపదనొందు, ఇక్కట్లుపడు.
చ. అడవులఁ గందమూలముల నాఁకలి దీర్చి
పంబు సేయుచున్, బడలినవృద్ధతాఁగ
బాలికలన్ సుకుమారమూర్తులన్, గడునుఖ
లైనవారలను గట్టిఁడినై వెసఁ గట్టి త్రోచి
తిన్, నడుఁకుచు వార లెవ్విధమునన్ దు
ష్పిల్లుచు నున్నవారొకో. వి. పు. ౫. ౧౬౩

౬. నశించు. (చూ. నడుఁకఁబడు.)

నడుఁకు. వి. చలనము; భయము.

(వ్యవ.) నన్ను చూడఁగనే వానికి నడుఁకు పుట్టినది. (శ.ర.)

(నడుఁగు ప్రయోగములకు చూ. నడునడు.)

జః నడుఁకఁబడు, నడుఁకొత్తు.

నడుఁకొత్తు. అ. క్రి. (నడుఁకు + ఒత్తు.) నిర్భయుఁడగు.

ఉ. దేవకి మున్నుగాఁ గలసతీనివహంబులకెల్లఁ జూప న, ద్దేవునియాజ్ఞ వాహకులు దెచ్చినె డక్ నడుఁకొత్తి యొంటిమైఁ, గావున శోహటింప కనుసాళ్వుఁడు సాళ్వము దూఱినట్లు యో, ధావలిఁ గిట్టి పట్టె సవవాళ్వము విశ్వభయంకరంబు గన్. జై. భా. ౩. ౯౦.

సీ. దేవర మువ్వురేతెంచిరి వారిలో నడుఁకొత్తి కొంతసైన్యము వధించి. గీ. పవన హారిఁ గొంచు నెగసె నద్దివికి నొక్కఁడు ... జై. భా. ౨. ౪౧.

నడుగడ్డ. వి. (నడుము + గడ్డ. క. నడుగడ్డ.) ద్వీపము, నలుదిక్కుల జలము కలభూభాగము.

క. నడుగడ్డ లిసుకతిప్పలు, మడలు దరులు వాఁకలును గ్రమంబున నొకఁడున్, గడవఁబడకుండఁ గృష్ణుఁడు, పడఁతులకును యమున యాటపట్టుగఁ జేసెన్. హరి. పూ. ౭. ౩౭.
(క్రొత్తప్రతి. పా. నడకట్ట ప్రాఁతప్రతిపా, నడుకట్ట. శ. ర. పా.)

నడుగాలు. వి. (√నడుము.) గుఱ్ఱములకు శరీర లాఘవమునకై వెనుకకాళ్లకును ముందుకాళ్లకును కట్టెడుసాధనము.

గీ. కట్టుఁగొయ్యలతో నడుగాళ్లతోడ, రత్నసార్థమయూరమరాళి మేవ, బలిముఖప్రముఖములతోఁ బంచవర్ణరజ్జువులతోడ బహుమందురలు జనించె. వరాహ. ౪. ౧౧౪.

నడుగుంటి. వి. (√నడుము.) తలనడిమిపల్లము, బ్రహ్మరంధ్రము.

సీ. చను రూక నడుగుంటి నిమురుచుఁ దల యంటి యంగంబు లెల్లఁ జక్కఁగ దీటి. చంద్రా. ౨. ౩.

నడుచక్కి. వి. (నడుము + చక్కి.) మధ్యప్రదేశము.

వ... ఆయాశ్రమంబు నడుచక్కి నుండి యమునీంద్రుండు హరిణవత్సంబులకుం జేయు వాత్సల్యంబునకు నద్భుతంపడి... పార. ౧. ౩.

క. చందురుఁ గనునరవిందము, చందంబున మోము వంచి సంయమికులసంక్రందనుఁ డారామద్రుమ, బృందము నడుచక్కి నవుడు సొచ్చెం జనుడున్. వైజ. ౨. ౭.

గీ. ప్రోలిపల్లోటకొమ్మలఁ బులుఁగులాలు, గతికయని డాసి చెంతఁ జెక్కడపుసింగములను గన్గొని నడుచక్కిఁ బోవ వెఱచి, ప్రొద్దుతేజీలు బలువడిఁ బోవుఁ గడల. నీలా. ౧. ౩౨.

నడుచు = నడచు. అ. క్రి. గమనముచేయు, సంచరించు.

చ. అడిగితి నొక్కనాఁడు గమలాసను తేరికి వారువంబవై, నడుచుచు ... వైవ. ౨. ౫౭.

మ... ద్రవిడాంగనల్ నడుతు రుద్యానంపులోఁ ద్రోవలన్. ఆము. ౧. ౫౬.

క. ఇటు నవ్వరూథినియు నొక్కటఁ గతిపయ సఖులు దన్నుఁ గొలిచి నడువఁగాఁ, జటుల ఝణంఝణరవపద, కటకసమాకృష్టకేళికలహంసిక యై. మనుచ. ౩. ౭౨. (వచ్చు అని భావము.) దశా. ౩. ౧౭౧.

౨. వెడలు, పోవు.

వ... లేదు నడువుండు పొండు కూడదను నిషేధ వాక్యంబులు చెవులు నిండుకొన... భీమ. ౨. ౧౦౧.

సీ. నగరామనో వాఘునగరికి నడుచువా రెడ

పక క్రొన్నెల మడచువారు. భల్లా. ౨. ఆ. (శ. ర.)

౩. ప్రవర్తించు, నడచుకొను.

వ...ఇంత విచారించి రచించినట్లు నడువుము ...ఆము. ౬. ౩౧.

౪. జరుగు, ప్రవర్తిల్లు.

ఉ. ఆగమమంత్రతంత్రములు సాంగము లై నడువంగ...భోగివిభూషణుం గొలుచుపుణ్యుల కబ్బును భోగమోక్షముల్. భీమ. ౩. ౧౦౫.

వ...గుడులకుఁ బూజ నడువ దనియు... ఆము. ౪. ౫౩. వి. పు. ౪. ౪.

౫. పుట్టు, కలుగు.

క. కామం బనుపురుషార్థము, నామము వినియు నిదిదక్క నలినానన యే, నేమియు నెఱుంగఁ జెపుమా, యేమిట నది నడుచు సిద్ధి యెట్టెయిఁ బొందున్. దశకు. ౫. ౨౬.

౬. ఉండు.

క. వచ్చెఁగద పెడఁద మన కిఁక, నిచ్చట నడయాడఁ గూడ దెటకేనియు నే, వచ్చెదర మ్మట్టులైనన్, విచ్చలవిడి నడువవచ్చు వెఱవకు మదిలోన్. శుక. ౩. ౫౦౨.

క...సత్యం, బనఁగా దైవం బనఁగా, జనులకు లేకున్న నెట్లు జగములు నడుచున్. కళా. ౩. ౧౭౨.

౭. అనుభూత మగు, భుక్త మగు.

క...మన్నె వజీర్లకు, నడుచు ముఖాసాలుగాక ...ఉ. హరిశ్చ. ౧. ౬౬.

౮. సరిపడు, అనుకూలమగు.

(వ్యవ.)ఈమందు వేడితత్త్వముమీఁద నడువదు.

౯. అందు, చేరు.

పీ. పని గల్గి యుండినఁ దనకు మంత్రులకు లేఁ జిగురుఁబోఁడులచేతఁ జిట్లు నడుచు. కువల. ౪. ౧౦౧.

జ: నడిపించు, నడుపాడు, నడుపు, నడుపుకొను.

నడుజాము. వి. (√నడుము.) అర్ధరాత్రము.

ద్వి. వారక నడుజాము వచ్చి వేఁడినను, గోరిన ధనములు కొండు కొం డనుచు. ద్వి. హరిశ్చ. ఉ. ౪౭౫ పం.

నడుత(ద)ల. వి. (నడుము+తల.) నడునెత్తి.

సీ. నడుతల యందంద పిడికిట మెదళులు గలఁగంగఁ బొడిచి మోఁకాల నురము, దాఁకింప ...హరి. పూ. ౯. ౧౩౭.

గీ...గువ్వ...గ్రద్ద వాయస మాదిగాఁ గలుగు పులుఁగు, లడరి నడుతల వ్రేసిన నమ్మనుష్యుఁ, డాఱునెలలుగాని మనఁ డుదాత్తపుణ్య. మార్క. ౩. ౩౪౮.

సీ. చేతులు నడుదల సేర్చు టుత్కటశోక మాకారములు దాల్చినట్టు లుండ. భార. స్త్రీ. ౧. ౯౮.

నడుదింపు. వి. మాంసవిశేషము. (శ. ర.)

వ... మృగంబులనడుదింపునంజుడు నపులినయతం డంధుండును బంగుండును నై యావిర్భవించు...మార్క. ౨. ౧౧౫. (శ.ర. పా. మృగముల నడిచి వీపునంజుడు అని ముద్రి.)

నడుదీవి. వి. (నడుము+దీవి.) మధ్యద్వీపము.

సీ. పుష్పకేతనువలపులయేటినడుదీవి శంబరారాతియార్జవపురీవి. వైజ. ౧. ౧౦౨.

నడుదెస. వి. (నడుము+దెస.) మధ్యప్రదేశము.

క. వెలయుఁ బెనుబైలు నిమధ్యాచలకూటము నందు నడుదెసన్...వరాహ. ౧౦. ౧౩౫.

నడునట్టు. వి. (నడుము+నట్టు.) మధ్యస్థానము.

సీ. పాటలం బగుజటాజూటంబునడునట్టుపూప
చుక్కలరాజు పొడవుచూపు. భీమ. 3. ౧౯.

నడునడు. వి. నడుఁకుటయం దగునను కరణము.
సీ...భండనమున, వారిహేతిచ్ఛత్రవాహనధ్వ
జములు నఱకిన నడునడు నడిఁకి వార, లభ
యంబు వేఁడిన నందఱఁ గృపఁ గాచి...
భార. ద్రో. ౨. ౨౦౬.
క. బాలుపయి నడచున ట్లుబ్బాలిక నడునడు
నడింగి భయమున... భార. ఆది. ౨. ౧౫౫.
వ. అక్కన్యకయు నట్టితేజోరూపంబు నూచి
విస్మయంబునను భయంబునను గడు సంభ్ర
మించి నడునడు నడుంగుచున్న దాని నోడ
కుండు మని సూర్యుండు ప్రసన్నుండై...
భార. ఆది. ౫. ౨౧. (వ్రాతప్రతి. పా.
నడున్నడనడుంగు ముద్రి. పా.)
(సతీదేవి.) వ... భయంబున నడునడు నడుంగు
చు...కు. సం. ౨. ౧౭౪. వ్రాతప్రతిపా.

నడునీరు. వి. ఔ. అన్న. (నడుము + నీరు.) నీటి
నడుము, జలమధ్యము.
క. వననిధినడునీటఁ గలుము, మునిఁగిన బెగడందు
చిత్తములు గలిగినత్యజ్జనులక్రియ నున్న సే
నలు... భార. ద్రో. ౧. ౨౬.

నడునె(ట్న)త్తి. వి. (నడుము + నెత్తి.) శిరో
మధ్యము.
ద్వి. హనుమంతువదనాబ్జ మర్ధచంద్రాస్త్రమున
నొంచి పదిబాణముల బాహుయుగము,
నాఁటించి యొకశక్తి నడునెత్తి పగుల, మే
టి యై యేసిన మిగుల రోషించి. రం. రా.
సుం. ౨౬3 పా. ౨3 పం.
క. అత్తోరణంబె కొని నడు,నెత్తి పగుల నూ
ర్యభానునిక్ మొత్తినచోఁ, దుత్తుము రై
వాఁ డిలఁ బడె... ఉ. ... ...

ద్వి. ఇవురుఁ బోలెడికేల నెత్తి నడ్నెత్తి, నివు
రంగ నంటి మై నిండ్రగా నిమిరి.అ.మ.క.
౧. ౨౪ పా. ౧౯ పం.

నడుపాడు=నడపాడు. అ. క్రి. (నడుపు + ఆడు.)
నడుచు, సంచరించు.
ద్వి. పట్టి మెల్లన నెత్తి పాదంబు లుర్వి, మె
ట్టింప ధైర్యంబు మిగుల రాకుతుఁడు, లా
గుగా నూఁది మెల్లనె నడుపాడ. నవనాథ.
౨. ౧3౨ పా. ౧3 పం.
సీ.నడుపాడ నేర్చిననవకంపునుడిఁగ మురిపెం
బుఁ బూనిన విరులయెత్తు.కేయూర.౪.3౦.

నడుపు=నడిపించు, నడపు. స. క్రి. (√నడుచు.)
(ప్రవర్తింపఁజేయు.)
క. పెక్కండ్రు గూడి సమయం, బొక్కటి క
ల్పించి నడుపుచుండుదు రేనిక్, నిక్కముగా
నాసమయము, దక్కని చెల్లించుటయును
ధర్మము పతికిక్. విజ్ఞా. ప్రా. 3౮.
(జరుపు, జరిగించు.)
క. ఎప్పుడును మీవచస్స్థితిఁ, దప్పక యే నడు
పుచున్నదాన నిపుడు న్యాతప్పొప్పులు మీ
రరయుట, యొప్పక్... కళా. ౨. 3౧.
(ఆచరించు, చేయు.)
సీ. నైజంబు లగునిత్యనైమిత్తికంబులు నడుపు
చో బ్రహ్మార్పణంబు సేసి. కాశీ. ౧.౨3.
గీ. దివిజు లరు దందఁగా జయంతివ్రతంబు, నడి
పి చంద్రప్రభుం డనుకొడుకుఁ గాంచి.
శేష. ౪. ౨౬.
(పోషించు.)
క. ఇద నని విడువం జెల్లునె, నడుపవలయు
నేర్చినట్లు నమ్మకయె కృపక్. ఆము. ౪.
౨33.
(రథము ఘో. నడిపించు, తోలు.)

గీ. అమరవిభుతేరు మాతలి యప్రుకు నడిపె. ఉ. రా. ౪. ౩౨౧.

వి. (గమనము, నడక.)

గీ. మురిపముల మజ్జగించిన ముగుదనడుపు, కలికిచూపుల వీడ్కొన్న కన్నుఁగవయు. ఉ. హరి. ౧. ౫౪.

మణిగణనికరము. పడఁతులు చిడిముడి పడియెడుమదితో, నడుగులు తడఁబడ నడరెడు నడుపుం, గడఁకలనడుములు గడగడవడఁకం, బడిబడిఁ బోడముఁగ బడలికఁ జెమటల్. కళా. ౬. ౨౫౦.

నడుపుకొను. స. క్రి. (నడుపు+కొను.) పోషించు.

శా. మాభోగంబులె యాత్మభోగములు గా మామాటయే మాట గా, నోభవ్యాత్మక మమ్ముఁదా నడుపుకొంచున్నాఁ డితండు... కళా. ౫. ౨౧౫.

నడుభూమి. వి. (నడుము+భూమి.) మధ్యభాగమున నున్నభూమి.

క. కడపటిభూములు నడు మగు, నడుభూములు కడప లగు విన్ముస్థలి న్నిల్లడ గొండ్రు జనులు పెఱుపఁబడుఁ జేనులు చిత్రవృష్టిఁ బండవు మిఱ్ఱుల్. హరి. ఉ. ౭. ౪౦.

నడుమంతరము=నడుమంత్రము. వి. (నడుము+అంతరము. శ. ర. నడుము+మంతరము?) ౧. నడుము, అవలగ్నము.

విశ. మధ్యకాలమున కలిగినది.

గీ. చక్రభావనచేఁ గాంచి శక్తి దనకుఁ, బ్రాపు గలుగుటనో లేమిఁ బాపుకొనియె, వెలఁది నడు మంతమాత్రవే విఱ్ఱవీఁగె, నహహ నడుమంతరపుఁగల్మి కది విజంబు. అని. ౩. ౧౦౦. (వి. విశ. లకు ఇదియే యుదాహరణము.)

నడుమంత్రము=నడుమంతరము. వి. (నడుము+మంత్రము?) ౧. కౌను.

క. నడుమంత్రము కుచభారము, నడుమంత్రము సైఁపదు... శృంగారరసాలవాలము. ౨. ఆ. (శ. ర.)

౨. మధ్యకాలము.

మ. నడుమంత్రంబున బల్మిఁ దెచ్చుకొని యన్యాయంబునన్ మూర్ఖుఁ డెక్కుడువారిన్ దొడరంగఁ బోయి మడియున్... ఉ. రా. ౨. ౭.

విశ. మధ్యకాలమున కలిగినది.

చ. వఱలు మరాళికాగమనవా తెఱతియ్యఁదనంపుసొంపుతోఁ, గుఱుచఁదనంబుఁ దాల్చి మఱి కుంభినిలోపల వ్రేటుఁబడ్డది, నఱచి వరేఖపంక్తి నడుమంత్రపు సంపదచేతఁ గ్రిందుమీఁ, దెఱుఁగక సాటివత్తు నని హెచ్చిన నాటకుఁ బెట్టకుందురే. భానుమతి. ౨ ఆ. (చి. ని.)

చ. అతివకుచంబులున్ మెఱుఁగుటారును వేనలియున్ ధరాధిపోన్నతియు నహీనభూతికలనంబు ఘనాభ్యుదయంబు నిప్పుడో౦, దితి మని మాటిమాటికిని నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీఁగెడున్, క్షితి నటు గాదె యొక్కొకరికిన్ నడుమంత్రపుఁగల్మి కల్గినన్. విజ. వి. ౧. ౩౪.

సీ. నడుమంత్రమా యిది నరులయాకర్ణంబు నేఁటిదా జగము వర్ణించి చూడ. నీతి. ౪౦. వి. పు. ౪. ౧౫౬.

నడుము(ద్రు). వి. దే. (క. త. నడు. వృత్తియందు వికల్పముగా 'నడి, నడు' అగును.) ౧. మధ్యము, కౌను.

చ. నడు మస దింతి చన్నులతనర్పన ముందఱు నాకాలుము... కు. సం. ౭. ౧౬.

సీ. ఘన మైన రారాపుచనుదోయి రాయిడి నిఱు పేదనడిమికి వెఱపుఁ జూప. కాశీ. ౧. ౯౦.

సీ. పిడికిలింపఁగ వచ్చు నడిమి యొప్పిదముతో నురమువిస్తారంబు సిరి వహింప. పి. శకుం. ౨. ౭౦.

చ. తురగరథంబు లాశ్వికులతోడ నడుము డ్రెవ్వి ధారుణిఁ, దొరఁగ... కు. సం. ౧౧. ౭౧౨.

౨. మధ్యభాగము.

చ. ...ఎదిర్చినదుస్ససేనువిల్, నడిమికిఁ ద్రుంచి గాండివగుణధ్వని దిక్కులు పిక్కటిల్ల ... భార. కర్ణ. ౧. ౨౦౨.

చ. కడువడి వీరధన్వుఁడు త్రిగర్తులు వొంగఁగ ధృష్టకేతువిల్, నడిమికిఁ ద్రుంచినఁ బెంగ మునం దళుకొత్తెడుకెంపుసొంపుతో. భార. ద్రో. ౩. ౨౫౦.

ద్వి. ...లోకకంటకుఁడు, మెఱసి పోవుచు నడ్డ మేరుశృంగమున, నొఱపుగా విడిసి యం దొకరాత్రి పుచ్చి. రం. రా. ఉ. ౬౦ పా. ౨ పం. ఉ. హరి. ౫. ౧౫౯.

౩. మధ్యప్రదేశము, అంతరము.

క. కడు నలిగి వాని నన్నియు, నడుమన తుని యంగ నేసె నరుఁ డస్త్రములన్. భార. ఆది. ౬. ౭౧.

౪. మధ్యకాలము.

క. అనఘా యీయజ్ఞము విధి,సనాథబుత్విక్ప్ర యోగసంపూర్ణం బ్యయ్యును గడచన నేరదు నడుమన యుడుగును భూసురోత్తమనిమిత్త మునన్. భార. ఆది. ౨. ౨౦౯.

ఆ. మీఁదమీఁద సుఖనిమిత్తంబు లాదవుచో, నడుమఁ బెందు నిజజనంబుపీడ. కళా. ౫. ౩౨.

విశ. మధ్యనుండువాఁడు,మధ్యనుండినది.

ఆ. పూర్వదత్త మైనభూమి తెవ్వఁడు త్రుచి కొనియె నతఁడు తనముకులమువారి, నిరువ దొక్కతరము నరకవాసులఁ జేయు, దాను నడుము గాఁగ ధర్మనిరత. భార. అను. ౨. ౩౬౫.

క. మగఁడును మాఱుమగఁడును, దగ నిరువెసఁ బక్షిలింపఁ దా నడు మై యొప్పఁగ జేయ నించె... వి క్ర. ౭. ౯౫.

జః నట్టునడుము, నట్టనడుచేయు, నట్టుడవి, నట్టనడుము,నట్టనడుచేయి, నట్టిల్లు, నట్టెండ మొ.

నడుముకట్టు. అ. క్రి. (నడుము + కట్టు.) ౧. సిద్ధపడు.

(వ్యవ.) దేవుని కల్యాణమున కందఱు నడుముకట్టి పనిచేసిరి.

౨. సంభోగమును విడుచు.

(వ్యవ.) వాఁడు నడుముకట్టినాఁడు కనుకనే అం తబలము కలిగియున్నాఁడు.

నడుముకట్టుకొను. అ. క్రి. (√నడుము.) సిద్ధపడు.

(వ్యవ.) ఏమి జరిగినను ఈపని మాన నని వాఁడు నడుముకట్టుకొని వచ్చినాఁడు.

నడుముకొను. అ. క్రి.(నడుము + కొను.)సన్నద్ధమగు.

లయవిభాతి. కడలంకొనురౌద్రమునఁ గడఁగి సమరోత్సవము వెడపడక యుండ వొగి నడుముకొని శక్తిం, దడఁబడక పేర్చి వడి నడుగు లిడువేగమున...భా. రా. యు. ౧౭౪౩.

నడుముక్కు. వి. (నడుము + ముక్కు.) ముక్కు యొక్క మధ్యభాగము, నాసామధ్యము.

ఆ. మరిసి మరిసి రాలె మునివ్రేళ్ల నడుము క్కు, చదుకఁబడియెఁ జీము జాలుకొనియెఁ, దనువుమీఁద మసరెదొనదొన సీఁగలు, వే గిరంబె వెడరోగమునను.వరాహ. ౯. ౭౯.

నడుముదాఁకు. స. క్రి. (నడుము + తాఁకు.)
ఎదుర్కొను, ఎదిరించు.
సీ. నల్లచీమలబారు నడుముదాఁకినపీఁక నున్న దీచెలువంపుఁగన్నె యారు. విజ. వి. ౨. ౧౦౬. (ఇట ఔపమ్యవాచకము.)

నడుమువిఱుఁగు. అ. క్రి. (నడుము + విఱుఁగు.)
దుఃఖాదులవార్త వినుటచే వివశుఁడగు.
(వ్యవ.) ఈదుఃఖవార్త వినఁగానే నాకు నడుము విఱిగినది.
ఇట్టే: నడుముజాఱు ము.

నడురాతిరి=నడురే. వి. (√నడుము.) రాత్రియొక్క నడిమిభాగము, అర్ధరాత్రము.
ఉ. అతరళాక్షి యొక్క తెయ యానడురాతిరి వెక్కుమోసలల్, వే తఱియంగఁ దూరి... వా. రా. ౨. ౧౭౪.

నడురే(యి)=నడురాతిరి. వి. (నడుము + రేయి.)
అర్ధరాత్రము.
క. అవ్వృష్ణివరుండాత్తజు, నావిర్భావం బెటింగి యంతర్గృహముక్, వేవేగఁ జొచ్చి నడురే, యా వనజాప్తుండు పొడిచి నట్లై యుండెక్. హరి. పూ. ౫. ౧౧౭.
క. నడురేయి సంధ్యలందును, నడవఁగ నోడుదు రళక్తనరులు... భార. ఆది. ౭. ౩౯.

నడులేఁత. విశే. (నడుము + లేఁత.) మిక్కిలి లేఁత ముదురుకానిది.
ద్వి. పరిపూరితం బైన బంధురం బైన, నడులేఁత యై సువర్ణప్రాప్తమైన. పండితా. పురా. ౧౨౪ పా.

నడువానకాలము. మి. వి. (√నడుము.) వానకాలముయొక్క మధ్యము.
వ... ఉభయవ్యూహంబులును... నడువానకాలంబునం బొంగినగంగాయమునలుం బోలె కొండొంటం దాక్కొ...

భార. ద్రో. ౧. ౨౩౧.

నడువీఁపు. వి. (√నడుము.) వీఁపుయొక్క మధ్యభాగము.
ఆ. ఖంగు రనఁగ నాదికమఠంబు నడువీఁపు, దాఁకఁ ద్రవ్వి త్రవ్వి... వరాహ. ౯. ౧౪౭.

నడుసొ(చొ)చ్చు. అ. క్రి. (నడుము + చొచ్చు.)
నడుమఁ బ్రవేశించు, మధ్యభాగముచేరు.
ద్వి. ఎనసి సుగ్రీవుతో నేను బోరాడ, నను నేయఁ దగునయ్య నడుసొచ్చి నీవు. రం. రా. కిష్కి. ౨౧౧ పా. ౨౦ పం. (చి. ని. పా.)

నడ్డి. వి. ౧. నడుము.
గీ. పెతికయే చాలు నానడ్డి విఱుఁగఁ జేయ, దానిపైఁ దాను నెక్కు నింతయును గాక. శుక. ౩. ౪౦౬.
క. నెటి సరిగ దానిపైఁ బడి, కటువక్ లాఘవము లేమిఁ గాళ్లీడ్చుచు న, డ్డ్విఱువం గదిసిన నతెఱఁ, గెఱిఁగి ఖరం బదరి తిరిగి యోఁగుచు నుండెక్. వేం. పంచ. ౪. ౫౩౦.
౨. పూర్వకాయము వెనుకకు వంగియుండుట. (పూర్వకాయము ముందటికి వంగియుండుట, గూను అని శ. ర.)
విశే. చప్పట.
ద్వి. నరసినగడ్డంబు నడ్డినాసికయును. నళ. ౩. భా. (శ. ర.)
జ: నడ్డిగుంట, నడ్డిముక్కువాఁడు.

నడ్డిగుంట. వి. (√నడ్డి.) కుకుందరము, నడ్డిక్రింది గుంట. (శ. ర.)

నడ్డిముక్కువాఁడు. విశే. (√నడ్డి.) అపటీటుఁడు, చప్పటముక్కు కలవాఁడు.
సీ... నడ్డిముక్కుగలాఁ డన నతనాసుఁడగు... అం. భా. ౨. ౧౨౧.

నడ్డినడితి. (శ. ర.)

నద్య. సం. వి. ఆ. స్త్రీ. కిక్కిసగడ్డి మేటి.

నడ్వంతము. సం.విణ. (త్. డ్వతీ. త్.) కిక్కి సకసవు అధికముగా కలది. (నేల మొ.)

నడ్వలము. సం. విణ. (అ. ఆ. అ.) కిక్కిసక సవు అధికముగా కలది (దేశము మొ.)

నతనాసికుఁడు. సం. విణ. (అ. ఆ, ఈ. అ.) చప్పటిముక్కు కలవాఁడు.

నతభ్రువు. సం. వి. ఊ. స్త్రీ. వంకరకనుబొమలు కల స్త్రీ.

నతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నమ్రీభూత ము, వంగినది. ౨. నమస్కరించునది. ౩. కుటి లము, వంక రైనది. అణఁగినది; లోఁ తైనది.

మ. అతఁడావాతపరంపరాపరిమళవ్యాపారలీ లన్ జన్యాన్విత మిచ్చో టని చేరఁ బోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్, శతపత్రే క్షణఁ జంచరీకచికురన్ జంద్రాస్యఁ జక్ర స్తనిన్, నతనాభి న్నవలా నొకానొక మరు న్నారీశిరోరత్నమున్. మనుచ. ౨. ౨౫.

వి. తగరము, నందివర్ధనము.

నతాంగము. సం. విణ. (అ. ఆ, ఈ. అ.) వంగి నదేహము కలది, వంగినది.

నతాంగి. సం. వి. ఈ. స్త్రీ. వంగినదేహము కల స్త్రీ; నారి, ఆఁడుది. (రూ. నతాంగ.)

నతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. వంగుట. ౨. వంపు, వంకర. ౩. నమస్కారము, మ్రొక్కు.

నతోన్నతము. సం. విణ. (అ. ఆ. అ.) నిమ్నో న్నతము, మెరకపల్లములుగా నుండునది.

నత్త. వి. క్షుద్రశంఖకీటకము, క్షుద్రశంఖపుగుల్ల యందుండు పురుగు.

గీ...నత్తనాఁ జెలఁగు క్షుద్ర, శంఖకీటంబు... ఆం. భా. ౨. ౧౨౨.

జః నత్తగుల్ల.

నత్తగుల్ల. వి. (నత్త + గుల్ల.) క్షుద్రశంఖము.

సీ...నత్తగుల్ల చుట్టుదుఁగుల్ల కరిమించ...గీ.ఆ దిగొ ఆగానిజంతువులు...హంస. ౪. ౧౫౬.

చ. అనయము నత్కవుల్ వొగడదప్పిత కావ్య రసంబు మెత్తు రొ,య్యనఁ గుకవుల్ వ్వసన్ నెరసు లారయుచుండుదు రేమి చిత్రమో, ఘనసరసీలసత్కమలక్షి రసంబు మేరగిం పుమన్, మునుకొని నత్తగుల్లలకు ముక్కులు సాఁచుబకంబులున్వలెన్. కలశేఖరమహీ పాలచరిత్రము. ౧. ఆ. (చి. ని.)

నత్తి. వి. (√నత్తు[1].) మాటలాడునపుడు మొదటి యక్షరము పలుమాఱు లుచ్చరించుటయు ఆఁగి యాఁగి కష్టముమీఁద మాటలాడుటయు మొద లగులక్షణములు కలజిహ్వాదోషము.

(వ్యవ.) వానికి నత్తి యుండుటచే అట్లు మాట్లా డుచున్నాఁడు.

నత్తివాఁడు. విణ. (√నత్తు[1].) నత్తికలవాఁడు, లోహలుఁడు.

సీ...నత్తివాఁడన లోహలవాచక మగు. ఆం. భా. ౩. ౧౨.

నత్తు[1]. అ. క్రి. (క. నత్తు.) తడఁబడుచు మాట లాడు. (శ. ర.)

జః నత్తి, నత్తివాఁడు.

నత్తు[2]. వి. (త. క. నత్తు.) ముక్కుపోఁగు, స్త్రీల నాసాలంకారవిశేషము.

ఉ. కెంపులఁ జేసె మోవి మనుఁ గెంపుచొకాటు పునత్తుము త్తెపుం, గుంపులఁ జెక్కుటద్దము లఁ గూర్చినకస్తురివ్రాత గంబురా,సొంపొన రించె తెక్కు తెలిమాపులు కుంకుమచిత్ర కంబు ఫాలంపుఁగురుల్ మృగీమదవిలాస [illegible] నింతికిన్. ముకుంద. ౨. ౧౯౯.

సీ. అధరంబునకు నద్ద మగునట్టుము త్తెంబు నోర
గాచించెనుహారాయలు దలఁచి. కజివేల్పు
శతకము. ४३. (చి. ని.)

నదనువు. సం. వి. ఉ. పుం- గర్జించునది- ౧. సిం
హము. ౨. మేఘము. (వై.ని.) ३. యుద్ధము.
(కే. ని.)

నదపతి. సం. వి. ఇ. పుం. సముద్రము.

నదము. సం. వి. అ. పుం- శబ్దించునది- ౧. పడ
మరగా పాఱెడియేఱు. (సింధువు, శోణము,
భీష్యము, బ్రహ్మపుత్రము, ఘైరవము, దామోద
రము మొ. నదములు, తూర్పుగా పాఱెడివి న
దులు; పడమరగా పాఱెడివానిలో నర్మదానది
తప్ప తక్కినవి నదములు.) ౨. (నీటి)మడుఁగు.
३. సముద్రము. ४. ధ్వని, మ్రోఁత.

నదరు=నజరు. వి. (హిం. నజర్.) కానుక.
సీ. వాహనరాజముల్ వానికి నద రుంచి యిను
మలకును లోకమెల్లఁ జుట్టి.మల్లుపు.३.౫३.

నది. సం. వి. ఈ. స్త్రీ. ఏఱు; అమడకు మీఱి
పాఱెడియేఱు.

నదీకదంబము. సం. వి. అ. పుం. మహాశ్రావణిక,
పెద్దబోడసరముశ్రీ. న. నదీసమూహము.

నదీకాంత. సం. వి. ఆ. స్త్రీ. ౧. జంబువు, నేరే
డుశ్రీ. ౨. కాకజంఘ, కాకిదొండశ్రీ.

నదీకాంతము. సం. వి. అ. పుం. ౧. హిజ్జలము,
ఎఱ్ఱగన్నేరుశ్రీ. ౨. సిందువారము, వావిలిశ్రీ.
३. నిచులము, ప్రబ్బశ్రీ.

నదీకాంతుఁడు. సం.వి.అ.పుం. ౧. సముద్రుఁడు.
౨. గంగాధరుఁడు, శివుఁడు.

నదీకూలప్రియము. సం.విణ. (అ. ఆ. అ.) నదీ
తీరము దిట్టము కలది. వి. అ. పుం. జలవేతస
ము, నీటిప్రబ్బశ్రీ.

నదీజ. సం. వి. ఆ. స్త్రీ. అగ్నిమంథము, నెల్లిశ్రీ

నదీజము. సం. విణ. (అ. ఆ. అ.) నదియందు
పుట్టినది. వి.అ.పుం. ౧. అర్జునము, ఏఱుమద్దిశ్రీ.
౨. యావనాళసరము, ఒకజాతి జొన్నశ్రీ. ३.
హిజ్జలము, ఎఱ్ఱగన్నేరుశ్రీ. న. ౧. స్రోతోంజన
ము. ౨. ఒకజాతిఅనుము, ఎఱ్ఱఅనుముశ్రీ.

నదీజుఁడు. సం. వి. అ. పుం. భీష్ముఁడు, గంగా
పుత్రుఁడు.

నదీదోహదము. సం.వి.అ.పుం.ఏఱుదాఁటుటకై
పడవవాని కిచ్చుపాలు, తరపణ్యము, ఓడకేవు.

నదీభవము. సం. విణ=నదీజము. వి. అ. న. సైం
ధవలవణము, ఇందుప్పు.

నదీమాతృకము. సం. విణ. (అ. ఆ. అ.) ఏటి
నీళ్లచేత పండెడుపైరు కలది. (వ్యతి. దేవమాతృ
కము.)

నదీముఖము. సం. వి. అ. న. ఏటినీరు సముద్ర
ములోనికి పోవుద్వారము, ఏఱు సముద్రములో
కలియుచోటు.

నదీశుఁడు. సం. వి. అ. పుం. ౧. సముద్రుఁడు.
౨. వరుణుఁడు.

నదీష్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నదీస్నాన
మునందు కుశలుఁడు, నదిలో మునుఁగుట ఈఁదు
టలలో నేర్పరి.
శ్లో. తతస్సమాజ్ఞాపయదాశు సర్వానానాయిన
స్తద్విచయే నదీష్ణాన్. సం.రఘు.౧౬.४౫.
౨. కుశలుఁడు, నేర్పరి. (కే. ని.)

నదీసర్జము. సం. వి. అ. పుం. వీరతరువు, ఏఱు
మద్దిశ్రీ.

నద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. బద్ధము,
కట్టఁబడినది. ౨. కూర్పఁబడినది. ३. ఖచితము,
తాఁపఁబడినది. ४. ఉద్వృత్తము, పైకెత్తఁ
బడినది. (నిక్కినది అని కొందఱు.) వి. అ. న.
బంధము, కట్టు, ముడి.

నద్ధి. సం. వి. ఇ. స్త్రీ. బంధించుట, కట్టుట.

నద్ధ్రి. సం. వి. ఈ. స్త్రీ. వరత్ర, టంగువాఱు, గుఱ్ఱములకు కట్టెడువాఱు.

నద్యావ్రము. సం. వి. అ. పుం. సమష్ఠిల, ఏఱువంగ, గండీరము.

నన=అనటి. వి. (√ననుచు. క. ననె. త. నన్నై.)

౧. పువ్వు, పుష్పము.

ఆ ... వేగుఁబోక తెమ్మెర లెలదీఁగ, కొనలవంక లొత్తు ననలఁ బ్రోచు. భార. ఉద్యో. ౨. ౧౧౨.

రగడ. ననలు వేఁడిన మొఱఁగి తప్పదు నాలి నా లికుచంబు ముట్టకు. పారి. ౪. ౧౬. విక్ర. ౫. ౬.

౨. పల్లవము, చిగురు. (చూ. ననలెత్తు.)

౩. మొగ్గ, కోరకము.

చ. కుసుమము లెల్లఁ గామినులకొప్పుల నుండ నటుండ లేమి స్నిగ్ధసఁగఁగ వంగినట్లు జనియించె ననల్...ఆము. ౫. ౧౧౩.

క. గురివెందఁ జైత్రుఁ డొందఁగఁ, గర మలుక న్మావి యవుడుగఱచిననునువా, తెరమీఁదఁ గాన నగుపల్వరుస యన న్ననలు పల్లవముపై మెననెఁ. పారి. ౩. ౪౭.

ననంద. సం=ననాంద.

ననందిని. సం. వి. ఈ. స్త్రీ.=ననాంద.

ననఁబోణి(ఁడి). వి.(√నన.)పుష్పమువలె మనోజ్ఞురా లగుస్త్రీ.

సీ. నుడువుల ననఁబోణి జడియకు మని వెన్ను సఱచుప్రాణేశు జిచ్చవడి చూచె. దశా. ౨. ౫౫.

క...ఆ, ననఁబోఁడి వెంట రాఁగా, ధనవంతుఁడు గంగగుడి కుదగ్రత నరిగెఁ. శుక. ౨. ౭౫.

చ...ఇపు డీననఁబోఁడి కందమూ, నెనిమిటిఁ గూర్చి సొం పలరఁ బెండ్లి యొనర్ప మదిం దలంచెదఁ. నీలా. ౧. ౭౯.

పల్కు-ననఁబోఁడి = సరస్వతి.

గీ. పల్కు-ననఁబోఁడి జానగు పల్కు లిడుచుఁ, గనికరం బెచ్చ మము నిచ్చఁ గాచుఁగాత. అచ్చ. రా. బాల. ౬.

ననకారు. వి.(√నన.)వసంత కాలము.(చి.ని.శ.ర.)

ననతేనియ. వి.(√నన.) మకరందము,పూఁదేనె.

సీ. నునుఁగావిజిగిమోవి ననతేనియలబావి ...

గీ...అమ్మించుఁబోఁడి కరయ. నీలా. ౧. ౫౬.

ననదండ. వి. (√నన.) పుష్పమాల.

ఉ...మున్ను గొంటి మేవ న్ననదండ యొక్కమగవాఁ డిడ... ఆము. ౧. ౧౪.

క. అన దండ మిడి తదాజ్ఞఁ, ననదండగతిఁ శిరంబునం దాల్చి ధరా,వనమునకై రఘువీరుఁడు, వనమునకై చనుకడంక వర్తిలె సంతతఁ. చం. రా. ౪. ౩౭.

ననసీరు. వి. దే (√నన.) మధువు, పూఁదేనె.

సీ. ననసీట గుప్పలించెను గళావతి యొత్తు జిగిమోవి బీటిక లెగయకుండ. భాను. ౨.౭౪.

ననయు. అ. క్రి. (√నన. క.ననె.) ౧. పూచు.

౨. చిగిరించు. (శ. ర. అప్ర. అని శ. ర.)

ననలెత్తు=ననుచు. అ. క్రి. (ననలు+ఎత్తు.) ౧. మొలకలెత్తు.

గీ. పడినగింజల ననలెత్తి పండె ధరణి, రఘుకులోత్తంస మీరేలు రాజ్యమునను. ఉ. రా. ౫. ౩౧౭.

౨. పల్లవించు, చిగుర్చు.

సీ. తొలుదొల్తఁ బండుటాకులు రాలి ననలెత్తి యొండుకొండిపురుల నొఱపుమీఱె. కృష్ణ. శతక. ౧. ౩౧.

సీ. ... కలకంఠకంఠములు ప్రాణువుల్ ననలెత్త

మధురగానంబు సేయ. దశా. ౨. ౨౪౮.

ననలొత్తు=ననుచు. అ. క్రి. (ననలు+ఒత్తు.) మొలకలెత్తు; కలుగు, పుట్టు.

చ...రోమకుండు తత్త్వ్రిణుతికి లేఁతనవ్వు ముఖపద్మమునన్ ననలొత్త...హ. వరాహ. ౧. ౩ పా.

ననవింటిజోదు=ననవింటిదంట, ననవింటిదొర, ననవింటిమన్నెవాఁడు. వి.(నన+విల్లు+జోదు.) పుష్పధన్వుఁడు; మన్మథుఁడు.

సీ. జటినిటలానలోత్కటపీడితుఁడు గాక సొంపారుననవింటిజో దనంగ. విక్ర. ౩. ౨౪.

ననవింటిదంట=ననవింటిజోదు. వి. (నన+విల్లు+దంట.) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

సీ. ననవింటిదంట సెట్టన బూదిఁ గలిపినకడిఁది చిచ్చుఱకన్ను గలుగువాఁడు. పె. శకుం. ౧. ౧౩.

సీ. ననవింటిదంటఁ గన్నమిటారినూఁగారుతీరులా యీనాఁచుతీవెచాలు. దశా. ౧. ౧౭౪.

ద్వి. మనవి చేకొను మని మదవతి మ్రొక్క, ననవింటిదంటు యాననఁబోఁడి కనియె. మృ. వి. ౧. ౪౩.

ననవింటిదొర=ననవింటిజోదు. వి.(నన+విల్లు+దొర.) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

ద్వి. ననవింటిదొర ఫాలనయను జయింపఁ, దన మేనమామచెంతను దాఁచుకొన్న, విలు నమ్ములనఁగ భ్రూవిలసదపాంగ, ములు వొల్చె... మృ. వి. ౧. ౧౧.

ననవింటిమన్నెవాఁడు=ననవింటిజోదు. వి. (నన+విల్లు+మన్నెము+వాఁడు.) మన్మథుఁడు.

వ...ననవింటిమన్నెవానికీర్తి మూర్తీభవించి భువనంబుల వ్యాపించె...ఉ. రా. ౪. ౧౭౩.

నన(ల)విలుకా(లా)ఁడు=ననవిల్తుఁడు. వి. (నన+విలు+కాఁడు.) పువ్విలుకాఁడు, మన్మథుఁడు.

చ...శపథంబు చేసెన్, ననవిలుకానిపాదవలినంబుల పైరతిచన్నదోయి పై. నైష. ౨. ౬౮.

చ. ననవిలుకాఁడు సంతసమునన్ దనపూనికయాట కుబ్బఁగన్. యయా. ౫. ౨౫.

గీ. తనకుఁ జెయి మించినట్టిఁడు ధరణి లేని,ఘనుఁడు నాళంబుతోడిపంకజముఁ గేల, నిరవుగాఁ బట్టి సురలు వర్ణింప నపుడు, ననలవిల్కాఁడు యుద్ధసన్నద్ధుఁ డయ్యె. చిత్రభా. ౨. ౧౦౬.

ననవిలుకానిపోరు. వి. ఔ. అనా. (నన+విలు+కాఁడు+పోరు.)-మదనకదనము- సురతము, మైథునము.

చ...ఇద్దఱు నేక కాంక్షతో, ననవిలుకానిపోరునఁ బెనంగెడువేళ నిజేశ్వరుం డొగిన్. హంస. ౩. ౧౦౩.

ననవిల్తుఁడు=ననవిలుకాఁడు. వి.(నన+విల్తుఁడు.) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

వ...ననవిల్తునకుఁ బసగలపసిండిమెఱుంగుములుకు లనం గలికిచిలుకలకొలుకు లగుబిసరుహదళనయనలు...భీమ. ౩. ౨౧౧.

సీ. ననవిల్తుశాస్త్రంపుమినుకు లావర్తించుపని వెన్నతోఁ బెట్టినది మాకు. మనుచ. ౨. ౪౩.

ననసానాగడకెంచెపుమాస్టీఁడు. వి. (న. సానా+గడ+కెంచము+మాస్టీఁడు.) ...థుఁడు.

క. కాంచిన ననసానాగడ,కెంచపుమాస్టీఁడు టు గెరలుచుఁ జెలిఁ బై,కొంచు నెదఁ దటాయించన్, గొంచించక మొగలితేకు గుమ్మితిఁ జిమ్మెన్. ఉ. హరిశ్చ. ౪. ౧౧౪.

ననాంద. సం. వి. ఋ. స్త్రీ- ఎంతసేవ చేసినను సంతోషపడనిది- మగనితోఁడఁబుట్టువు, ఆఁడుబడుచు.

ననుఁబ్రా(న్బ్రా)యి. వి. (నాను¹ + ప్రాయి.)
చక్కఁగా నుడుకనిబియ్యము, ఉడికియు నుడుక
నిబియ్యము.
సీ. రాగిలోహండి నన్బ్రాయి లే కుండఁగ వండి
డించిన యిపుర్వంటకంబు. కాశీ. ౩.౧౨౧.

ననుఁబ్రాయివడు. అ. క్రి. (ననుఁబ్రాయి + పడు.)
ననుఁబ్రాయి యగు.
క. విరు పింత గాక నడిమికి, మఱియక ననుఁ
బ్రాయివడి చిముడఁబాఱక యే, జెరికియును
లేక మిక్కిలి, గరగర నగు నేఱుప్రాలకలమా
న్నంబుల్. జై. భా. ౭. ౧౯౭.

ననుచు=ననలెత్తు, ననలొత్తు. అ. క్రి. ౧. పూచు.
గీ. ప్రావృషేణ్యపయోధర ప్రభవ మైన, గాలి నని
చిననీపవృక్షంబుపోలె. నైష. ౩. ౪౭.
మ. విను మింతు ల్దిలకంబుఁ జంపకముఁ గ్రోవిన్
సిందువారంబుఁ బ్రేంకసముఖ్ మామిడి గోఁ
గుఁ బొన్నఁ బొగడన్ గంకేళి నూహించి
కన్గొన మో మెత్తఁగ గౌఁగిలించుకొన
మూర్కోఁ బాడఁ జే నంటఁ బల్కన గం
గల్లుమియంగఁ దన్న ననుచుం గల్పాగ
మాయావిరుల్. పారి. ౪. ౯.
చ. తరుణులకౌఁగిటన్ ననుచు తమ్ము వృథా
విరు లెత్తిచేసెమోపరులుగఁ జైత్రుఁడు...
ఆము. ౫. ౧౨౬.
౨. చిగుర్చు, చిగిరించు.
ఆ. ఏచి ననిచి పూచి కాచి పండినయమ్మాన్న
రము మేలితోఁటు లరసి కాంచు, ముసలివారి
కైనఁ బసిబిడ్డలకునైనఁ, బండ్లు వచ్చు నలరుఁ
బ్రాయ మొదవి. యయా. ౧. ౩౭.
౩. మొగ్గయెత్తు, కోరకితమగు.
గీ... కోరకితం బొప్పు ననిచిన దన. ఆం. భా.
౨. ౩౫.
౪. వికసించు.
సీ. ననిచె నాఁగఁ జెన్నొ నవుటయు వికసించె
ననుటయు నర్థమై యలరుచుండు. ఆం. భా.
౩. ౧౦౧.
చ. అనిన మహాప్రసాద మిప్ప డానతియిచ్చి
తిరే కదా యఁకం, గనఁబడఁ జెప్ప నేమి
టికిఁ గార్యముఖంబున స్వామిచిత్తమే, నను
చు నదేల కాకలసిరన్ దనుజన్ వశీయింపఁ
జాలరే, నను గరుణావలోకనమునన్ ఘనుఁ
జేయఁగఁ గాక వచ్చుటల్. కుచేల. ౨.౪౪.
౫. అనురాగ మొందు, అనురక్తుఁడగు; ఇష్టపడు.
సీ. పీతాంబచెలి దొఁగపేకి హలంకృతిమగ్న ననిచి
కాపుండు నేనగరికేలన. భీమ. ౨. ౫౨.
క. ననిచిన ప్రియుఁడవు ఫక్తవ్వ, ననుపసుబంధుఁ
డవు నాకు ...భా. రా. కిష్కి. ౩౪౦.
ద్వి. అని యూరడించిన నర్కనందనుఁడు,నని
చినబంటుగా నన్ను నేకొంటి. రం. రా.
కిష్కి. ౨౧౧ పం. ౩౦ పం.
క. చాళుక్యవిశ్వవిభుఁడు మహీలలనాపాలన
మున నెసక మెసఁగుచో, నోలి యతీంద్రులు
మనముల, నాలవపురుషార్థసరణి ననిచిరి మి
గులన్. కావ్యా. ౧. ౧౩౫.
౬. అతిశయించు.
ద్వి. ననిత రాముఁడు వచ్చి వసధి బంధించి,ననిచి
నకడిమిమై నన్ను సాధించి, గొనకొని వేడ్క
తోఁ గొనిపోవు నిన్ను, నని విచారించెద వా
తలో నీవు. రం.రా. సుం. ౨౪౯. పం. ౨౨పం.
(క్రొత్తప్రతి. పా. ననిచిన ప్రాఁతప్రతిపా.)
వ. అని యమ్మంజులాలాప కెంజిగురు రంటెవచం
దంబునఁ గేలుఁగెందమ్మి నగ్రజహస్తంబునం
బన్నిదం బని చరచి యనుచరనిచయంబు
తోడం గూడ నిజనగరంబున కనిచి ననిచినకు
తుకంబునం గపటనటన పరిచయంబునం గాని
పించఁబొక్కింప రా దనివితర్కించి, ...విప్ర.

గీ. అనుచు ననిచిన ప్రేముడి నాఁడె నచటు, గదలి వదలని వేడ్కఁ బొదలి వార, లరిగిరిమ్మ్ముల కిమ్ముల...అచ్చ. రా. బాల. ౪౩.

౭. ఇంపగు. (శ. ర.)

౮. కలుగు, పుట్టు.

సీ. కావు కా వనుట రక్కసులమాఁకనె కాని నని చె నీయెడ సింహనాదవివృతి. పాండు. ౧. ౧౪౫.

చ. అనఘుఁడు యాజ్ఞవల్క్య గురుసంస్తుతులకుం బ్రణమిల్లి నామదిఁ, ననిచినభక్తితోఁ బలికినాఁడను గర్వము లేదు దుష్టగా, నను టయు...వి. పు. ౪. ౮౩.

జ: నన, ననఁబోణి, ననకారు, ననతేనియ, ననదండ, నననీరు, ననయు, ననలెత్తు, ననలొత్తు, ననవింటిజోదు, ననవింటిదంటు, ననవింటిదొర, ననవింటిమన్నవాఁడు, ననవిలుకాఁడు, ననవిలుకానిపోరు, ననవిల్తుఁడు, ననసానగడ కెంచపుమాస్టీఁడు, నను పు, ననుపుకత్తె, ననుపుకాఁడు, ననుపువాఁడు, నన్పు.

**ననుపు=నన్పు.** స. క్రి. (√ననుచు.) వికసింపఁ జేయు.

సీ. కళ లూను నెలకూన కాదేని యీచాన నయ నోత్పలంబుల ననుపు పెట్టు. దశా. ౨. ౩౦౬.

విణ. ౧. అనురాగము కలవాఁడు.

వ...బహువల్లభ నైననాకు నిదుర గలదే బహువల్లభ నైతి నంటేని మొదల మహామోహుండు ననుపువిటుండు కామక్రోధలోభులు మచ్చికబోజుంగులు ...ప్రబోధ. ౨. ౬౯.

మ. ననుపుంజుట్టము లెంద రేని గల రింటఁ వారు నూకై చలం,బునఁ బోరాడుదురు... చంద్రా. ౩.౧౦౮. (నమవు ము ద్రి.)

క. అని యొడఁబడుటయు నమ్మని, యనురాగము చెంగలింప నంబురుహాని [illegible]

సుఖముల, నను పై పెక్కుఁడులు నటనంబులు చేసెఁ. వి. పు. ౨. ౨౨౦.

౨. అధికము, అతిశయము కలది.

గీ. స్వప్నసంభోగశతసహస్రములు వోయె, భ్రమసమీక్షావినోదార్బుదములు ననియె, మన ములో నిండి యున్నది ననుపుఁగూర్మి, యింక లజ్జాభయంబుల కెడము గలదె. నైష. ౪. ౧౯౧.

గీ. పురము మేడల నుండి యంభోజముఖులు,కమ్మ కస్తురి తలపుఁగొమ్మమూఁక, కర్పణము సేసి వారిచే నందికొండ్రు, ననుపుఁదావులహారిచందనద్రవంబు. ఘటికా. ౨. ౨౦౧.

వి. ౧. అనురాగము, ప్రేమ; ~~జీవనోపాధి.~~

ఆ...వనితమనముఁ జొచ్చి క్రీడకుఁ జొచ్చి, యిచ్చ మెఱసి ననుపు నిచ్చ క్రొత్త, చేసి కొనుచు ... దశ. కు. ౬. ౧౮౦.

ఉ. కావున నెన్నఁడుఁ దెగనికాంక్ష నెపం బొకఁ డెన్ని రోసి నేఁ, బోవఁ దలంతు నేని వలపుఁ ననుపుఁ దగవుఁ బ్రియంబునుఁ, నీవలనఁ సమగ్రములు...మనుచ.౩.౧౩౪.

~~౨. జీవనోపాధి.~~

సీ. తనవానుల సమస్తవనవానులకుఁ దానననవానుల హరించి ననుపు లిచ్చె. రా. వి. ౨. ౪౬.

౩. ఇంపు, ఒప్పు; ననుపు.

ఉ. చామని మేనులుఁ ననుపుఁ జల్లెడుమోములలోనఁ గలుబల్, గోములు మానపుం బొడవులుం బిడికింట నడంగుకొనులుఁ. శుక. ౨. ౩౩౧.

**ననుపుకత్తె.** విణ. (ననుపు+కత్తె.) ౧. ప్రియురాలు. (శ. ర.) ౨. విటురాలు. (శ. ర.)

**ననుపు(న్పు)కాఁడు.** విణ. (ననుపు+కాఁడు.) విటుఁడు, వలపుకాఁడు.

క. ననుపునకై వేల్పునాగవాసముఁ గూడి

మహిమఁ గోల్పడియె నే మాందకర్ణి. మను చ. ౨. ౭౩.

వ...పెందలకడనె వచ్చెద మని వాప్రచ్చి ప్రొద్దు పోయి వచ్చిన ననుపుకాండ్రఁ గటాక్షింపక...ఉ. రా. ౪. ౧౬౩.

సీ. చని చూడఁ గల్గినఁ జాలుఁ జేయుదు నన్పు కాని గాఁ బూవిలుకాని నైన. యయా. ౧. ౧౩.

చ. అలికముఁ జూచుకొన్నెలుఁబు నందపుమోమును గల్గి నన్పుగాం, డ్రెలమి వహింప బాల్యమున నెంతయుఁ బొల్చితి నూత్నసంపదన్. జాహ్నవీ. ౪. ౩౪.

లోననుపుకాఁడు=ఆంతరంగికవిటుఁడు.

చ. చలువవెలుంగు రేమగఁడు జక్కవనెచ్చెలి జోడుకోడె చుక్కలజవరాండ్రలోననుపుకాఁడు...చందమామ కడు నింగిఁ జెలంగి వెలింగె నెంతయున్. రామా. ౨. ౯౫.

ననుపువడు. అ. క్రి. (ననుపు+పడు.) అనురక్తమగు, ప్రియపడు.

వ...మార్గాంతరంబులు వెదకుచుం బెక్కు దినంబులు ననుపువడియును నెడయ గలిగిన నొండొక్కనిం గూడుకొనుటది స్వభావగుణంబు...కవిక. ౪. ౧౨౦.

ననుపు. వి. ౧. అందము.

ద్వి. ననుపుమిటారుల నాలిచేష్టలకు, మన స్సొగ్గి వలచు దుమారంబు సేయు. రం. రా. సుం. (చి. ని.)

గీ. అంతకంతకుఁ దనుకాంతి యతిశయించి,నవక మెక్కిన పూఁదీఁగననుపు దోఁప.పద్మ.౨.ఆ. (చి. ని.)

౨. ఒప్పు, ఇంపు, ననుపు.

సీ. మొగలివాకిలిఁ దూటి దిగువ శాక్వరరాజు నగరిపై వెన్నునిననుపుఁ జూచి. భీమ. ౧. ౧౧౩.

చ. ననుపుగ పీనిలక్షణ మొనర్తు ఠ్ఠతిన్ జియఁ దన్ను ఠ్ఠుషుఁ డన్,ఠ్ఠని...నరస. ౨. ౯౯.

౩. నక్తవచనము.

చ. ననుపులు మించె మేలములు నాయలకైవ్రాల యల్కచేరలన్, జెనఁగి కవుఁగిలించు నెడ పేయలమొత్తులు గోరటొత్తులుం, దనువుర మిాఱఁగా...చిత్రభా. ౨. ౬౫.

చ...నెచ్చెలుల్, ననుపులు పల్కఁ గ్రొగ్గెల నవ్వుధరాసుత మమ్ముఁ బ్రోవుతన్. వైజ. ౧. ౨.

నన్న. విణ. (హిం.నన్హా.) కుఱుచ. (శ.ర, చి. ని, బ్రౌ.)

నన్నడుము. వి. దే. (నడుము+నడుము.) మిక్కిలి మధ్యభాగము.

గీ. నడుమరవి తేరు మింటినన్నడిమిచక్కి, బ్రగ్గనఁగఁ దాఁకె వింధ్యపర్వతముచరుల. కాశీ. ౧. ౧౩౨.

నన్ని. విణ. (క. నన్ని. త. నన్ను.) ౧. ప్రియము. ౨. సుందరము. ఉదాః-నన్నినారాయణాయు. నందంపూడిశాసనము. నన్నిమార్తండ. ద. శా. ౪. ౯౭౬. (ప్రాచీనశాసనములందు నామాంతములవచ్చు 'అయ్య' శబ్దమునకు బదులుగా 'ఇయ' కానవచ్చుచున్నది. చూ. ఇయ./ఉదాః-నన్నియ, నన్నయ, నన్నియచోడుఁడు నన్నచోడుఁడు మొ.)

నన్పు=ననుపు. విణ. (√ననుచు.) (అనురక్తుఁడు.)

చ...తమి దీటినన్ నిదురవోయిరి నన్పుబోఁటం గులత్తతిన్. శువల. ౨. ౧౧౦.

వి. (అనురాగము.)

చ. నయమున భీతి వాపి మది నన్పునఁ దేఁకువ నొంది...శు. సం. ౯. ౩౪౫.

(స్నేహము, మైత్రి, పరిచయము.)

చ. తన కంటె యిల్లు కట్టె నంటె తా దొర
నా కంటె యిల్లు లేదు న,న్నూరక నవుఁ గ్రొ
వ్వె నీవ్రుఁగు పుచ్చెద దీనిపదం బటుం
చుఁ దెల్లనఁ దరుశాఖ విచ్చి కికి యప్పటి
చేరువఁ బల్వలోదకంబునఁ బడవైచె నంత
వెఱ పుట్టి ఖగాంగన గూయుచుండెఁగదా.
కేయూర. ౩. ౭౨౦.

నపాత్. సం. (శత్ర.) రక్షింపని.

నపాత్తు. సం. వి. త్. పుం. సర్పము, పాము. (కే. ని.)

నపుంసకము. సం. వి. అ. న. ౧. నపుంసకలింగము. ౨. నపుంసకలింగశబ్దము.

నపుంసకుఁడు. సం. వి. అ. పుం. న- పురుషుఁడు స్త్రీ కానివాఁడు - షండుఁడు.

నప్త. సం. వి. ఋ. పుం. - పితృదేవతలు అధోగతిని పొందకుండ చేయువాఁడు - ౧. మనుమఁడు, కొడుకుకొడుకు; కూఁతుకొడుకు. ౨. ప్రపౌత్రుఁడు, మునిమనుమఁడు. (కే. ని.)

శ్లో. "వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషం, పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్."

నప్తృక. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిపక్షి.

నప్త్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కొడుకుకూఁతురు. ౨. కూఁతుకూఁతురు.

నప్ప. వి. బాలుఁడు.

సీ... బాలకసంజ్ఞ నప్ప నవ్వ, పాప పాపఁడు...
ఆం. భా. ౨. ౧౧౯. (ప్రాత తాళపత్ర ప్రతి, బ్రౌ. పాఠములు.)

నప్త్రుఁడు. సం. వి. ఆ. పుం. నటుఁడు. (వై. ని.)

నఫీరి. వి. (హిం. నఫీరీ = బాకాఊఁదువాఁడు.) ఒక విధ మగు ఊఁదెడివాద్యము. (మి. బ్రౌ.)

క. సూనయుతనాళ మూనగ, మానం గ్రేంకార మొప్పఁగ హంస మొనర్చెన్, మానిను లటరా జలఖగ, సేనల కెత్తింప నఫీరి సేసె ననంగన్. చంద్ర. ౪. ౭౯.

నబాబు. వి. (హిం. నవాబ్.) మహమ్మదీయప్రభువు.

చ. అపుడు శ్రీగాకుళాఖ్యపురమందు వసించు నబాబుగారు... రంగా. ౧. ౧౧౯.

నభఃకేతనుఁడు. సం. వి. అ. పుం. ఆకాశమునకు జెండావంటివాఁడు - సూర్యుఁడు.

నభఃక్రాంతి. సం. వి. న్. పుం. సింహము.

నభఃపాంథుఁడు. సం. వి. అ. పుం. - ఆకాశమునందు ప్రయాణము చేయువాఁడు - సూర్యుఁడు.

నభఃప్రాణము. సం. వి. అ. పుం. వాయువు.

నభము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కాంతి లేనిది. ౨. నక్షత్రములు లేనిది. ౩. హింసకము, హింసించునది. వి. స్, అ. పుం. -వర్షముచే కీటాదులను హింసించునది - మేఘావృతమగుటచే కాంతిలేనిది- శ్రావణమాసము. స్. పుం. ౧. వర్షాకాలము. ౨. ఘ్రాణము, ముక్కు. ౩. తమ్మపడిగము, పతద్గ్రహము. ౪. తామరతూఁటిదారము, బిసతంతువు. ౫. పలితశీర్షము, నరసిన తల. ౬. (జ్యోతి.) లగ్నమునకు దశమస్థానము. అ. స్. న. ౧. ఆకాశము. ౨. మేఘము.

నభశ్చక్షువు. సం. వి. స్. పుం. - ఆకాశమునకు కంటివంటివాఁడు- సూర్యుఁడు.

నభశ్చమసము. సం. వి. అ. పుం. ౧. ఆకాశమండలిదేవతాపానపాత్రము, చంద్రుఁడు. (దేవతలు అమృతరూప మగుచంద్రకళలు త్రావుదురని ప్రసిద్ధి.) ౨. చిత్రాపూపము, ఒకవిధమైనభక్ష్యము. ౩. ఇంద్రజాలము.

నభశ్చరము. సం. విణ. (అ. ఈ. అ.) ఆకాశమున సంచరించునది. వి. అ. పుం. ౧. పక్షి. ౨. సూర్యాదిగ్రహము.

నభశ్చరుఁడు. సం. వి. అ. పుం. ౧. దేవత, వేల్పు. ౨. విద్యాధరుఁడు.

నభసంగమము. సం. వి. అ. పుం- ఆకాశమున సంచరించునది- పక్షి, పిట్ట.

నభసము. సం. వి. అ. పుం. ౧. ఆకాశము. ౨. సముద్రము. (వై. ని.)

నభస్యము. సం. వి. అ. పుం- మేఘములకు అనుకూల మైనది- భాద్రపదమాసము.

నభస్వంతుఁడు. సం. వి. త్. పుం- ఆకాశము గమనస్థానముగా కలవాఁడు - వాయువు, గాలి.

నభస్సదము. సం. వి. ద్. పుం- ఆకాశమున తిరుగునది- ౧. పక్షి. ౨. నక్షత్రము.

నభస్సదుఁడు. సం. వి. ద్. పుం. దేవత, వేల్పు.

నభస్స్పృక్కు. సం. విణ. (శ్)-ఆకాశమును తాఁకునది- మిక్కిలి ఉన్నతమైనది.

నభస్స్పృశము. సం. విణ. (అ. ఆ. అ.)=నభస్స్పృక్కు.

నభాక. సం. వి. ఆ. స్త్రీ. ౧. చక్రవాక మను పక్షి జాతి. ౨. ఆఁడుకాకి. (కే.ని.)

నభాకము. సం. వి. అ. పుం. న- కాంతిలేనిది- ౧. తమస్సు, చీకటి. ౨. తమోగ్రహము, రాహుగ్రహము. (వాచ.) పుం. కాకి. (కే. ని.)

నభోంబుపము. సం. వి. అ. పుం- ఆకాశమునందలినీరు త్రాగునది- చాతకము, వానకోయిల.

నభోగజము. సం.వి.అ.పుం. మేఘము. (త్రి.ని.)

నభోగతి. సం. విణ. (ఇ) ఆకాశమునందు గమనము కలది. (పక్షి మొ.) వి. ఇ. స్త్రీ. ఎగురుట, ఆకాశమున పోవుట.

నభోగము. సం. విణ. (అ. ఆ. అ.) ఆకాశమున పోవునది. (పక్షి దేవగ్రహాదు.)

నభోదుహము. సం. వి. అ. పుం- ఆకాశమునుండి ఉదకము ఇచ్చునది - మేఘము.

నభోద్వీపము. సం. వి. అ. పుం. మేఘము.

నభోధూమము. సం. వి. అ. పుం. మేఘము.

నభోనది. సం.వి.ఈ.స్త్రీ.ఆకాశగంగ,మిన్నేఱు.

నభోమండలదీపము. సం. వి. అ. పుం. చంద్రుఁడు. (కల్ప.)

నభోమణి. సం. వి. ఇ. పుం. చదలుమానికము, సూర్యుఁడు.

నభోరజస్సు. సం.వి.స్.న. చీకటి. (వాచ.)

నభోరేణువు. సం.వి.ఉ.స్త్రీ. దట్టమైనమంచు.

నభోలయము. సం. వి. అ. పుం - ఆకాశమున లయ మగునది - ధూమము.

నభోలిహము. సం. విణ. (హ్) - ఆకాశమును నాకునది- అభ్రంలిహము, ఆకాశము నొరయునది, మిక్కిలి యెత్తయినది.

నభ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నాభికి- బండికంటినడిమితూమునకు - హిత మైనది. (తైలాది.) ౨. నాభికి తగినది. వి. అ. పుం. అక్షము, ఇరుసు. న. ౧.(రథచక్రమునకు అనుగుణమైన) కందెన, మసి. ౨. బండిచక్రమునడిమి భాగము, బండికుంచము. (వాచ. మాత్రము.)

నభ్రాట్టు. సం. విణ. (జ్) ప్రకాశింపనిది. వి. జ్. పుం. నల్లని మేఘము, కారుమబ్బు.

నమత్. సం. (శతృ.) ౧. వంగుచున్న. ౨. నమస్కరించుచున్న, పూజించుచున్న.

నమతము. సం.విణ. (అ. ఆ. అ.) ౧. నమ్రము, వంగినది; కుటిలము, వంకరైనది. ౨. హ్రస్వము, [illegible] (కే. ని.) వి. అ. పుం. ౧. ధూమము,

పొగ. ౨. కంబళి. (వై. ని.)

నమతుండుఁడు. సం. వి. అ. పుం. ౧. నటుఁడు.౨. ప్రభువు. ౩. సూర్యుఁడు. (వై. ని.)

నమనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వంగునది. ౨. వంచునది. ౩. మ్రొక్కునది. ౪. మ్రొక్కించునది. వి. అ. న. ౧. వంగుట, నమ్రమగుట. ౨. మ్రొక్కు.

నమసీయుఁడు. సం= నమ్యుఁడు.

నమయత్. సం. (శతృ.) ౧. వంచుచున్న. ౨. నమస్కరింపఁజేయుచున్న.

నమయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వంచుచున్నది. ౨.నమస్కరింపఁజేయుచున్నది.

నమలఁబెట్టు. స.క్రి.(√నమలు.)౧. నమలించు.

సీ. భూపాలనందన పుత్త్రెంచె నీ కని నాతమ్మ యింపార నమలఁబెట్టి. దశకు. ౬. ౧౨౫.

౨. స్తన్యమొసఁగు, పాలిచ్చు.

(వ్యవ.) పిల్లవాఁ డేడువకుండ నమలఁబెట్టుము.

నమలి= నమిలి.వి. (త. ఇమలి. క. నవల్.) కేకి, మయూరము.

ద్వి. నాకాధినాథుండు నమలియై జముఁడు, కాకరూపం బైనఁ గడు భీతి నొంది. రం. రా. ౩ర పా. ౧౪ పం.

నాకాధినాథుండు నమలి నీక్షించి.రం.రా. ఉ. ౩౯ పా. ౧౬ పం.

గీ. నమలిపింఛంబుతోడ నీరమణివేణి, చెలిమి సేయుట బగగొంటఁ దెలియ సరిది, యందుఁ బువ్వులఁ బూజించునట్టి తెఱఁగు, నర్ధచంద్ర ప్రహారచిహ్నముల కలిమి. నైష. ౩. ౧౫౯. (చి. ని. పా. నెమిలి ము ద్రి. పా.)

నమలు. స. క్రి. (త. నమై.) ౧. (తినెడిపదార్థము నలఁగునట్లు) దంతములతోఁ పలుమాఱు ఖండించు.

చ. గుములు గట్టి యీఁకెలు గుటి ప్రవాళ్ము వట్టి కింకతో, నమలక మ్రింగి ... ఆమనిని రేయుఁ బగల్ వడిఁ గూయుఁ గోయిలల్. కు. సం. ౪. ౪౬౩.

ఆ. నమలి మ్రింగఁ గేలఁ జమరి మొగంబునఁ, బూసికొనఁగ ... కు. సం. ౧౦. ౫౩౪.

౨. భక్షించు, తిను.

గీ. ... మహాదాదిమత్స్యకూర్మములఁ దిగిచి, హుతులలాటాగ్నిలోపల నెరియఁబెట్టి,నమలు నిజభుజభూరివిక్రమము మెఱయ. కు. సం. ౧౦. ౫౩౫.

గీ. ... అధిప యూపాఢముఖ్యంబు లైనవెలలు, నాలుగింటను మాంసంబు నమల కుడుగు. భార. అను. ౪. ౩౦౧.

౩. ఆస్వాదించు, అనుభవించు.

క. విని చెవుల ముట్టితోలం, గని కన్నుల నమలి నాలుకను మూర్కొని ముక్కున... కు. సం. ౬. ౪౨౪.

క. అమృతరుచు లారఁ బాకము, లమరించిన మోదకంబు లాదిగ బహుభక్ష్యము లొగి నిచ్చిన నానందమతో నందుకొని నమలి తనిసినమదితోఁ౯. భా. రా. బాల. ౪౦.

నీళ్లునమలు = సమాధానము చెప్పలేక అస్పష్టముగా మాటాడు.

(వ్యవ.) నీళ్లు నమలక నే నడిగిన దానికి సమాధానము చెప్పుము.

సా : నమల వశము కానినారికేళము.

ద్వి. నమల వశము కానినారికేళంబుఁ, దెమలక మ్రింగ దంతికి జీర్ణ మైనవడువున...ప్రభులిం. (చి. ని.)

జ : నమలఁబెట్టు.

నమసము. సం. వి. అ. పుం. ౧.వేత్రము, బెత్తము. ౨. ప్రణామము, నమస్కారము.(కే.ని.)

నమస్సితుఁడు. సం= నమస్యితుఁడు.

నమసుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) అనుకూలుఁడు.

నమస్కరణము. సం. వి. అ. న. వందనము, చేమోడ్పు.

నమస్కరించు. సం. అ. క్రి. ఎఱఁగు, వందనము చేయు.

గీ. విష్ణుఁ బ్రభవిష్ణు నచ్యుతు విగుణు సగుణు, హరిఁ జతుర్వ్యూహు నవ్యయు నభవుఁ బరము, నెలమిఁ దమచిత్తముల భావహించి హర్ష,మగ్నులగుచు నందంద నమస్కరించి. మార్క. ౧. ౧౦౩.

నమస్కారము. సం. వి. అ. పుం. ౧. వందనము, చేమోడ్పు. ౨. విష భేదము. (వాచ.)

నమస్కారి. సం. విణ. (న్. ఈ. న్.) నమస్కరించువాఁడు. వి.ఈ.స్త్రీ. ముడుఁగుఁదామర.

నమస్కృతి. సం. వి. ఇ. స్త్రీ. నమస్కారము.

నమస్కృతుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) ౧. నమస్కరింపఁబడినవాఁడు. ౨. పూజింపఁబడినవాఁడు.

నమస్యా. సం. వి. ఆ. స్త్రీ. ౧. నమస్కారము. ౨. పూజ.

నమస్యితుఁడు. సం. విణ. (అ. ఆ.అ.) ౧. నమస్కరింపఁబడినవాఁడు. ౨. అర్చితుఁడు, పూజితుఁడు.

నమస్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నమస్కరింపఁ దగినవాఁడు. ౨. పూజింపఁ దగినవాఁడు. ౩. నమస్కరించువాఁడు. ౪. పూజించువాఁడు.

నమస్సు. సం. అవ్య. వి. స్. న. నమస్కారము, వందనము.

గీ. విధిగృహాతిథయవిత్తసేవధికి శరణ్యు,నతమృడాదికసుమనస్సునకు నమస్సు... అము... క...

నమాజు. వి. (హిం. నమాజ్.) మహమ్మదీయుల దైవప్రార్థనము.

సీ. పాశ్చాత్యులనమాజుపై బుద్ధి పుట్టెనో మా నులజపముపై మనసు రోసి. హిం.నా. ౧.

పా:- నమాజు చేయఁబోయిన మసీదు విఱిగి మీఁదఁ బడ్డట్లు.

నమించు. సం. స. క్రి. నమస్కరించు.

ఉ...వా,ల్మీకిఁ దలంతు వ్యాసుని నమింతు న తింతును గాళిదాసునిన్. శకు. ౧. ౧౭.

నమిత. సం. విణ. (బు. త్రి. బు.) ౧. వంచువాఁడు. ౨. నమస్కరింపఁజేయువాఁడు.

నమితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వంపఁబడినది. ౨. నమ్రమైనది, వంగినది. ౩. నమస్కరింపఁబడినది.

నమిలి=నమలి, నమ్మి, నమ్మిలి, నెమలి, నెమిలి, నెమ్మి, నెమ్మిలి. వి. (క.నవిల్.) కేకి, మయూరము.

ఆ. వేఁటకాఱు ముట్టి వెనుకొనఁగా శ్వేత,నగముచటికిఁ దాఁటునమిలివోలె. కు. సం. ౨. ౨౦౫.

సీ. ప్రణవాక్షరాభ్యాసపరిపాటిఁ బాటించునా నావిధంబుల నమిలిపిండు. భీమ. ౩.౭౭.

ద్వి. నక్కల నుడుతల నమిళులఁ బంద్రి,కొక్కుల ...పండితా. పర్వ. ౩౪౩ పా.

నముచి. సం. వి. ఇ. పుం. ౧. ఒకఅసురుఁడు. (ఇంద్రహతుఁడు.) ౨. మన్మథుఁడు.

నముచిసూదనుఁడు. సం.వి.అ.పుం.ఇంద్రుఁడు.

నమురు. వి. ఆము, మదము.

వ ... జలగ్రహంబు లొండొండ నంటునంటుగ నొరసి...కలహంబునకుఁ దిమురుచు నమురు గవిసి యప్పటప్పటికి జిఱజిఱం ద్రిప్పివేయు చటులవాలఘాతంబుల...శ్రీరం.౧.౧౩౨.

నమేరువు. సం. వి. ఉ. పుం. ౧. సురపొన్న♣. (దీనికి దోహదము స్త్రీహాసితము.) ౨. రుద్రాక్ష♣.

నమోగురువు. సం. వి. ఉ. పుం - నమస్సునకు తగినపూజ్యుఁడు - బ్రాహ్మణుఁడు. (వాచ.)

నమోవాకము. సం. వి. అ. పుం. ౧. నమో అని పలుకుట, వాగ్రూపముగా నమస్కరించుట. ౨. నమస్కారము, వందనము.

క. వాకిటికి వచ్చునతులన్, గైకొని వినయావలోకగతి నలరించున్, శ్రీకార్యపరులకు నమోవాకం బొనరించి వికచవదనాంబుజయై. ఘటికా. ౨. ౨౨.

నమ్మకము=నమ్మిక. వి. (√నమ్ము.) విశ్వాసము.

(వ్యవ.) వానిమాటమీఁద నాకు నమ్మకము లేదు.

నమ్మదుంప. వి. గోట్టిగడ్డ, కశేరుకము♣. (శ. ర.)

నమ్మి=నమిలి.

లయగ్రాహి. నమ్ము లలకొప్పులు ఘనమ్ము లని సైజసదనమ్ములను బొంగి నటనమ్ములఁ దగన్ ఆయా, నమ్ములకు లోఁగి పులినమ్ములను హంసమిథునమ్ము లతిమందగమనమ్ములను రా ... చంద్రా. ౩. ౯౬.

గీ. శీతగిరిమీఁద మదకరుల్ సీత్కరించు, నెలుఁగు నవఘనారవ మని యెసఁగి యాడు, నమ్మిపదుపులు గడు నొప్పు నగవిభునకు, బలసి పట్టినపింఛాతపత్రభాతి. కు. సం. ౩. ౨౫౦.

సీ. రాయంచ దే నమ్మి రా యంచ మర్ష్మియై సాది తో వాదించె మణ్ముఖుండు. దశా. ౧. ౨౨.

నమ్మించు. స. క్రి. (√నమ్ము.) విశ్వసింపఁజేయు.

గీ... నమ్మించి చంపఁ, జనదు మాయాబలంబునఁ జనదు చంప. భార. ఆది. ౫. ౫౬.

నమ్మిక= నమ్మకము, నమ్మిగ. వి. (√నమ్ము. క. నంబికె. త. నంబిక్కై.) ౧. విశ్వాసము.

గీ. ప్రజకు నమ్మికగా నిన్నుఁ బట్టఁబద్ధుఁ, జేసె ...దశకు. ౭. ౫౧.

మ... మీ తేజంబునం దొల్లి యీ, జగమే నోర్చితి నాదునమ్మిక వృథాసంకల్ప మయ్యెం దుదిన్. హరి. ఉ. ౪. ౧౭౭.

౨. నమ్ముటకు ఆధారమగువాక్యము, ప్రమాణము.

ఉ. నాకు మనంబు నిండ నొకనమ్మిక సేయుము ...శివరా. ౩. ౪౯.

సీ. నాదు సేయ నటించు నమ్మి కిచ్చినఁ గాని మినుకుఁజెక్కిలి ముద్దుగొనఁగనీయ. దశా. ౪. ౧. ౧౩౪. శుక. ౨. ౭౯౯.

నమ్మికకాఁపు. విశే. (√నమ్ము.) నమ్మకముతో కాచువాఁడు.

చ. జలరుహమిత్రుఁ డాత్మరుచిసంపదఁ జీకటి బందికానికిం, గలఁగుచు వీనిలోన నిడి కైకొనె నమ్మికకాఁపులంచు...పారి. ౨. ౫౯.

నమ్మిగ=నమ్మిక. వి. (√నమ్ము.) నమ్మకము, విశ్వాసము.

క. తగుమాట లాంబికేయుం, డగు నని కైకొను నె యెన్నఁడైనను గొడుకున్, మగఁటిమి గలఁ డని యెడున్ నమ్మిగఁ జూచుచు నుండు విదుము మ్రింగనయేనిన్. భార. ఉద్యో. ౧. ౩౧౫.

క. మగఁ డింక నన్ను సైఁచునె, దిగవిడుచుం జంపుఁ గాక తెల్లము మది న్నమ్మిగ పుట్టునె యిది చెప్పిన, మొగమోటన మనుపు చుండి మూసితి వబలా. హరి. పూ. ౫. ౨౨౨.

నమ్మినకాఁపు. విశే. (√నమ్ము.) విడువక కనిపెట్టుకొనియుండువాఁడు. (బంటు.)

ఉ... కీ, నాళని వేశనమ్మునకు నమ్మినకాఁ పగుపంక్తి కంఠుఁడున్, నీళరవృష్టి నీల్గు... భా. రా. యు. ౧౩౦౩.

నమ్మినవాఁడు. విశే. (√నమ్ము.) ౧. ఆప్తుఁడు.

సీ. నమ్మినవాఁ డన నచ్చినవాఁ డనఁ జనపతి య సఁగను దనరు వాఁడు... ఆం. భా. ౨. ౧౭౩.

౨. విశ్వసించినవాఁడు.

ఉ...హారిం బలి సేయుమమ్మ నిక్క, నమ్మినవారి కెన్నఁడును నాశము లేదు గదమ్మ యీశ్వరీ. భాగ. ౧౦ పూ. ౧౩౪౨.

ఉ...ఇమ్ముగ నమ్మినవారిఁ బేల్పునుల్, చక్కఁ గఁ జేయుదేవరకు...నీలా. ౧. ౩.

ఇష్టి: నమ్మినబంటు.

క. అన విని ధృతరాష్ట్రుం డి, ట్లను నమ్మినబం టు పిఱికి యై యిటు పఱవం, గని మంద బుద్ధి దుర్యోధనుఁ డే మని తలఁచెనొక్కొ తవచి త్తమునక్. భార. ద్రో. ౪. ౧౩౭.

నమ్ము. స. క్రి. ౧. విశ్వసించు.

(దుష్యంతుఁడు.) చ. ఇది మునికన్య యేని మతి యేలాకో యీలలితాంగియందు నా, హృద యము దద్దయుం దవిలె నిప్పలు కింకను నమ్మ నేరన, య్యెద...భార. ఆది. ౪. ౩౦.

చ...ఆత్త నమ్మినం, జెఱుపఁ దలంతురే ఘనులు చిత్తమునం బగవారిసేనియుక్. వైమ. ౧. ౧౦౪.

సీ...ఇతనిమాటలు నమ్మి పెట్టు లనక. ఉ.రా. ౧. ౩౦౬. ఆము. ౪. ౨౩౫.

౨. ఆశ్రయించు.

సీ. నమ్మితి మన్న నెంతటివరిద్రులనైన శ్రీలచేఁ జెలొందఁ జేయుకరుణ. దశా. ౧. ౪౧.

జః నమ్మించు. నమ్మిక, నమ్మికకాఁపు, నమ్మిగ, నమ్మినకాఁపు, నమ్మినవాఁడు.

నమ్యమానము. సం. విణ. (అ. ఆ. ఆ.) ౧. వంపఁబడుచున్నది. ౨. నమస్కరింపఁబడుచున్నది; పూజింపఁబడుచున్నది.

నమ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నమస్కరింపఁదగినవాఁడు; పూజనీయుఁడు. ౨. వంపఁదగినవాఁడు.

నమ్రకము. సం. విణ. (అ. మై. నా. అ.) నతము, వంగినది. ౨. అ. పు. వేతసము, ప్రబ్బలి.

నమ్రము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నతము, వంగినది. ౨. లోఁతయినది, లోపలికి అణఁగినది. ౩. అడఁకువ కలది, వినయాన్వితము. ౪. మ్రొక్కినది.

నమ్రితము. సం. విణ. (అ. ఆ. అ.) నమ్రముగా చేయఁబడినది, వంపఁబడినది.

నయ=నయము. వి. (క. నయ=మృదుత్వము.) అందము, మనోజ్ఞత.

సీ. నయ కల్లవేళ్ల మట్టియలుఁ బిల్లాం డ్లిడి పా యవట్టుముఁ బెట్టెఁ బై వౌక్తు. ఆము. ౬. ౧౨౭.

గీ. జాఱునలసుల తేనియ గార యిచ్చి, గామ్ప సంధించు నయ కాని యూడ్పవెఱచు, నెం దునయ్యాఁకవిరితోఁట నిందుముఖుల,నగవు నునుమంచుసొనవో లె నయము దటి. పాం డు. ౫. ౭౫౪. (గామ్పసంధించు నయ కాని యూష్పవెఱచు. అని ముద్రి. ఇట యతి భ్రంశము. అర్థము విచార్యము.)

నయకోవిదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నీతి చక్కఁగా తెలిసినవాఁడు.

నయగారము. వి. (నయము + కారము?.) మనోజ్ఞత, ఒప్పు, అందము. (మృదుత్వము అని శ. ర.)

క. ప్రియ మై రమణీయమణీ, మయ మై యతి చిత్రభిత్తిమంజిమనయ మై, నయ మైనచలువపలుకుల, నయగారమునం జెలంగినయాగార [illegible] పారం. ౧. ౧౩౫.

సీ. చెలిమాటనయగారములఁ జెన్నికొనియెడి జేగాణిఁ గాఁ జేల తపస్విక్షులపతంస. చంద్రా. ౩. ౧౦౩.

౨. విలాసము.

సీ. పలుకుఁ డీయములకు వెలిగొందుగులు గాదె నయగారములలోనినగవుపసలు. రామా. ౨. ౩౮. (మృదువచనము అని శ. ర.)

౩. ప్రియవాక్యము.

ఆ. నక్కవినయములును నయగారములుఁ బల్కి, తుడుచ కెల్లధనము కూడఁబెట్టు. వేమన. ౧. ౪౮.

సీ. నర్మగర్భోక్తులు నక్కటక్కులు వింతనయగారములు బహునాటకములు. పాండు. ౩. ౪౩.

౪. అలంకారము.

చ... అన్నపాలునిం గలయఁ దలంచి మేన నయగారము గీల్కొనఁ జేసి చేరె నిర్దలగుణశాలి యైనశుకమండలమాలిసమీపభూమికిన్. శుక. ౧. ౨౫౪.

విశే. కపట మైనది.

క. ఈకేయి నన్ను నిలువునఁ నీరుగఁ గరఁగింపవలయు నేఁ డున్నవి నీ నేరుపు లన్నియు ననినయగారపువగలాడి యనుపఁగా నతఁ డరిగెన్. శుక. ౨. ౧౭౬.

ఉ. ఈనయగారపుం బ్రియము లీపస లీ మొగమిచ్చుమాటలేలా... పారి. ౧. ౧౨౫.

క. నయగారపుఁదమిఁ గపట్యప్రియముల మెఱమెచ్చుఁబల్కరింతను మిథ్యాచయములను బైపచారపు నయమున మునిఁ గూడి కొన్నినాళ్లు రమింపన్. విప్ర. ౪. ౧౩.

నయగారి. విశే. (నయగారము + ఇ[3].) మనోహరము, ప్రియము.

ద్వి. నయగారిమాటల నటనచూపులను ... ములనయముల జెల్లించి పొంచి. ఆ. మ. క. ౩. ౧౭౮ పొ. ౧౯ పం.

నయగారితనము. వి. (నయగారి + తనము.) మృదువాచాలత, మనోహరముగ మాటలాడుట.

సీ. నయగారితనమున నాథుఁ డాశ్లేషింప లోఁగక యెదురొత్తి కౌఁగిలించు. చంద్రా. ౬. ౧౫౦.

నయచక్షువు. సం. వి. స్. పుం - నీతిశాస్త్రమే కన్నుగా - ప్రమాణముగా - కలవాఁడు - రాజనీతినిపుణుఁడు.

నయజ్ఞుఁడు. సం= నయకోవిదుఁడు.

నయత్. సం. (శతృ.) ౧. కొనిపోవుచున్న. ౨. నడపించుచున్న. ౩. పొందించుచున్న.

నయనగోచరము. సం. విశే. (అ. ఆ. అ.) కంటికి కనఁబడునది, చూపు మేరలోనిది.

నయనచ్ఛదము. సం. వి. అ. పుం- నేత్రగోళమును కప్పునది- కంటిరెప్ప.

నయనజలము. సం. వి. అ. న. బాష్పజలము, కన్నీరు.

ఇట్టే : నయనసలిలము మొ.

నయనపా(పు పా)రువ. వి. మల్లబంధవిశేషము.

వ. ... అవ్వీరుండు ... దండనిల్కడ కదలు నయనపారువ ... కరలాఘవంబు లాది యాషోడశోపవీతంబులరీతులు నేర్చి... హంస. ౧. ౨౦౬.

వ. ...హస్తపుపారువ దేహపుపారువ నయనపుపారువ ... మొదలగువితంబు లెఱిఁగి ... ప్రబంధ. ౩౮.

నయనపుటము. సం. వి. అ. న. ౧. పుటమువంటి కనుటాలు. ౨. కను రెప్ప.

నయనము. సం. వి. అ. న. ౧. కొనిపోవుట, తోడ్కొనిపోవుట. ౨. యాపనము, జరపుట, పుచ్చుట. (కాలము కడపుట.) ౩. ప్రాపణము, పొందించుట. ౪. ఏలుట, పాలించుట. ౫ - బుద్ధి విషయమును పొందునట్లు చేయునది- కన్ను.

నయని. సం. వి. ఈ. స్త్రీ. కంటినల్లగ్రుడ్డు.

నయనీయము. సం= నేతవ్యము.

నయనోత్సవము. సం. విణ. (అ.ఆ.అ.) నేత్రములకు ఉత్సవము కలిగించునది. వి.అ.పుం.౧. నేత్రోత్సవము, కన్నులపండువు. ౨. దీపము.

నయనోపాంతము. సం. వి. అ. పుం. అపాంగము, కడకన్ను.

నయనౌషధము. సం. వి. అ. న. పుష్పకాసీసము, కొంచెము తెలుపువన్నె కలపచ్చనిఅన్నభేది.

నయపీఠి. సం. వి. ఈ. స్త్రీ. నెత్తపలక, జూదమాడుపలక.

నయమానము. సం. విణ. (ఆ.ఆ.అ.) పొందించుచున్నది.

నయము=నయ. వి. ౧. మనోహరత్వము, పొలుపు, అందము.

మ. మును సౌరభ్యము నివ్వటిల్లఁగ మనోమో
దంబునం దేఁటు ల్లల్లన యోలిన్ వెడలంగ
శేఫలు సముల్లాసంబునన్ బింక మెక్క న
యం బెక్కుచు గద్దెపొం దెడలి వీఁకం గేస
రంబుల్ గడ్డల్కొనఁ దోడ్తో మధు వుచ్చి
పేరెలమిఁ బొల్పొం జెందె నంభోజముల్.
- భార. ఉద్యో. ౨. ౧౧౦. (నునుపు అని శ.ర.)

గీ. పొలపు వలపును గొలుపునిచ్చలపుఁ దెలుపు,
నగవు మల్లెల కొకవింతనయము దెలుప.
యయా. ౧. ౭౪.

గీ. ఈడవిడిచిన మేఁదీఁగ యింతనయము, గలిగి
యున్నది. ... కు.స. ...

ఉ. తమ్మి నయమ్ము దప్పఁ గుముదమ్ము ముద
మ్మున నొప్పఁ జక్రవాకమ్ములు శోకమొప్ప
... భాస్కరుఁడు, దమ్మియు నస్తమించె...
కవిరా. ౫. ౧౬౩.

౨. రీతి, విధము.

సీ. అలపాలవెల్లి జాబిలిరేక యుదయించి నా
నాఁటు రహిఁగుల్కు నయము గాంచి. ఇందు.
౨. ౧౩౭.

గీ. ... శిబిసంగతి మాంధాతనయమునను మ్య
యాతికరణి జిలిపునియట్లు... హంస. ౧. ౪౨.

క. ఈనయమునఁ గడు నెయ్యము, నా నమునఁగ
విశ్వసించె ఖచరాధీశుఁడు. దశా. ౨. ౧౩౦.
మనుచ. ౨. ౧౦.

౩. నేర్పు.

క. విను మధిప యిట్లు గొనిపోయి నయంబున
నొక్కనావ యెక్కించె... కళా. ౬. ౧౦౦.

చ. అరవిరి వెండిచెంబుల నయంబునఁ దేనియపా
నకంబు లేఁబరువగు గుజ్జుమావిచలిపందిరు
లన్ లతకూన లియ్యఁగా. శుక. ౩. ౧౨౨.

చ. తనమృదుగీతికాపరిణతధ్వని వైఖరిఁ బల్కు
మంచు మింపొచినరహిఁ జేతివీణియకుఁ జెక్కు
లు గీటుచు నేర్పుచున్నదో, యన నఖరాం
కురంబుల నయమ్మునఁ దంత్రులు మీటి గాన
మింపొనరఁగఁ జేయువాణి... పారి. పీఠి. ౫.

౪. ఆసక్తి.

చ... ముగ్ధ యొక్కతె వికాసినియై నవకంపు
దీఁగెఁ బ్రాఁకినయెలగొమ్మకు తీసవి చేరి న
యంబునఁ బట్టి కోయఁ జూచిన ... నిర్వ.
౭. ౩౬.

గీ. నయము మీఱంగఁ బెనుప నానాఁటఁ బెరిఁ
గి. మనుచ. ౬. ౪౧.

మ. నిను ము న్నెంతయు నమ్మి పాండవులయు
న్మేమంబు నేఁ జేరిచి, గాన నీపోరాడుచంత
ముల్ దెలియఁ జెప్ప బ్బాచితిం జే చే,

రినయం బిచ్చు మనొంప నూల్కొనకె వారిం
బట్టి పాలార్చెను... భాగ.శీష్మ.౩.౧౭౦.
౫. లాభము.
గీ. నయము పేదకు నరిఁ గోయనను నొసంగి,
ప్రబలఁజేసిన నక్షధర్మములు పెరుఁగు.ఆము.
౪. ౨౩౬.
౬. స్వాస్థ్యము.
గీ. నయ మొకించుకయైనఁ గానంగ రాదు,
చలువమందుల శైత్యంబు సంఘటిలకె, నినుఁ
డు గుడిచిన నీ రయ్యె నింతి మేన,సంతకంత
కు సంతాప మగ్గలించె. పి. శకుం. ౩.౪౪.
విణ. ౧. రమ్యము, అందమైనది.
క. ప్రియ మై రమణీయమణీ, మయ మై య
తిచిత్రభి త్తిమంజిమనయ మై, నయ మైన
చిలుకపలుకుల,నయగారమునం జెలంగినయ
గారమునన్. సారంగ. ౧. ౧౩౫. (అతి
చిత్రమంజుమంజీరములన్ అని శ.ర. పా.)
మధురగతిరగడ. నవరత్నంబుల నయ మగు మే
డలు కవగూడిన పటికంబులగోడలు. కుచేల.
౧. ౨౩.
క. మానిత మగుగుడరసమున, నూనినతుండీర
ఫల మొ యొగిఁ దేనెకల,న్నాని మృదు వైన
పవడ మొ, వా నద్రిజతొప్పమోవి నయమై
యొప్పున్. కు. సం. ౩. ౩౦౫.
౨. సుకుమారము, మృదువు.
చ...చెక్కులం, దొఁటఁగెడుఘర్మముల్ దనదు
దుప్పటిచేఁ దుడిచెన్ నయంబుగన్. దశా.
౨. ౩౧౬.
౩. వాక. (శ. ర.) ౪. మసమైనది, నున్ననిది.
(శ. ర.) ౫. మేలైనది.
ద్వి. కల్తిబోటియాట నయం బయి ...వి. పు.
౨. ఆ. (శ. ర.)
వ...కథిజకారనిర్ణయమ్ములకు నయమ్మును యమ
కమ్ములకు గమకమ్మును...ప్రబంధ. ౬.౨.
నయముచూపు=వృద్ధిపొందు.
సీ. శివపూజనాస క్తిఁ జిన్నిచన్నుల పెక్కు వయము
బ్రత్యహంబును నయముచూప. కాశీ. ౪.
౨౩.
నయ మెక్కు=వృద్ధిపొందు.
ద్వి. గుముగులు నయ మెక్కి క్రొమ్మోసు లొ
దవి, కొమరారె...నవనాథ. ౧. ౧౧ పా.
౧౦.పం.
జః నయగారము, నయగారి, నయగారితనము.
నయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నడపు
నది. ౨. కొనిపోవునది. ౩. పొందించునది.
౪. న్యాయ్యము, న్యాయమునుండి తప్పనిది.
వి. అ. పుం. ౧. కొనిపోవుట. ౨. నడపుట.
౩. పొందించుట. ౪. నీతి. ౫. న్యాయము,
ధర్మము, పాడి.౬.(న్యాయవైశేషికసాంఖ్యాది)
దర్శనము; శాస్త్రము. ౭. ద్యూతవిశేషము;
జూదమాడుట కుపయోగించుపాచిక. న. అను
నయము, సాంత్వనము.
క. నయమునఁ బాలుం ద్రావను, భయమునను
విషమ్ము నైన భక్షింతురు గా, నయ మెంత
దోసకారియొ, భయమే చూపంగవలయు
బాగుగ సుమతీ. సు. శ. ౬౩.
క. నయ మన్నఁ బాలు ద్రావరు, భయ మన్న
నమేధ్య మైన భక్షింతురు నా, నయము
భయంబులలోపల, భయమే నయ మండ్రు
బుధులు బద్దెనకేంద్రా. బద్దెన నీతిశాస్త్రము
క్తావళి. ౧౧౨.
సా. నయము నష్టము, భయము భాగ్యము.
నయవాది. సం. వి. న్. పుం. రాజనీతి చెప్పు
వాఁడు, నీతిశాస్త్రవేత్త.
నయవిదుఁడు సం. వి. ద్. పుం. నీతిశాస్త్ర
జ్ఞుఁడు.
నయశాలి. సం. విణ. (న్. నీ. న్.) నీతిచే
ఒప్పువాఁడు, న్యాయశీలుఁడు.

నయశాస్త్రము. సం. వి. అ. న. నీతిశాస్త్రము.

నయించు. సం. స. క్రి. ౧. ప్రవర్తిల్లఁజేయు, నడుపు.

చ...ఋత్విజుల్, సవనము లుక్తమార్గము ప్రశంసకు నెక్కనయించి వేదవాక్యైకహిత వృత్తిమె నభినవాభ్యుదయం బొనరించిరి... భార. అశ్వ. ౪. ౧౩౪.

వ...అద్దండదేవుని నతులధర్మంబున నయించు భూపాలుం డైహికాముష్మికసిద్ధులం బొందు. భార. శాం. ౩. ౧౨౦.

సీ. దక్షుఁడై భూపతి దండనీతి నయింప కున్న సన్న్యాసులు నుత్పథప్రవర్తను లగుదురు ...భార. శాం. ౧. ౧౦౯.

౨. పొందించు. (శ. ర.)

నర=నరపు. వి. (√నరయు. క. నరె.త.నరై.)౧. పలితము, ముదిమిచే వెండ్రుకలు తెల్లనగుట.

ఉ. చన్నులనిక్కు దప్పెఁ గచసంతతిపై నర నూపెఁ జెక్కులం, జెన్ను దొలంగె ... జాహ్నవీ. ౪. ౫౫. (నెర. అపముద్రి.)

సీ. స్నేహార్ద్రుఁడగుచు నశేషంబుఁ బోషించి నర వర్ణములతప్పు సరణు లుడిపి. గీ...ఎసఁగవలయు...నృపతి...ఆము. ౪. ౨౬౦.

౨. ముదిమిచే తెల్లఁబాఱిన వెండ్రుక.

క. నరలు గలకాముఁడైనను, దరుణులు రోయుదురు...భార. ఆది. ౩. ౧౯౪.

ఆ. కలయ నరలు వచ్చి తల తెల్ల నైనంతఁ, జేసి రొట్టు నీకుఁ జేరు నెఱుక. భార. అర. ౪. ౨౦౧.

సీ. దేవి నాలీలఁ బ్రార్థించుచుండఁగ వచ్చె నరలు నా కప్పుడె నాథుసేవ, యెక్కడిది... కళా. ౪. ౧౪౨. పేం. పంచ. ౪. ౩౩౯.

నరవెండ్రు =పలితకేశము, నరసినవెండ్రుక.

ఉ. వేసవి పాటుపాటు నరవెండ్రుకతోఁ ...

దండలాన్వయశ్రీ నట్టియింప...పెకమంజుల భాషిణివచ్చె వీక్షకిఁ. కాశీ. ౭. ౧౫౯.

సీ. పసిమి పో నెండినకసవుబుట్టయుఁ బోలె నరవెండ్రుకలు పఱ్ఱవికరముపలన. కళా. ౩. ౯౩.

సీ. నరవెండ్రు కన రాదు నాఁ డెల్ల జయించు వాటుఁగా లన రాదు చేటుఁ దెచ్చు. గీ... అయ్యొద్దమొద్దు. శుక. ౩. ౨౧.

నరంగము. సం. వి. అ. న. ౧. మగగుటి. ౨. మొగమున లేచుబొటిమ. (వాచ.)

నరకఁడు. వి. ౧. మోటువాఁడు, మొద్దు.

గీ. కటకట్టా పద్దగర్భఁ డెక్కడిరసజ్ఞుఁడింత నరకుని కిటువంటిఠేండ్రవయస్కు టోఅచూపు లనెఱపొంతకారిఁ దెచ్చి యాలుగాఁ గూర్చి పాపాత్ముఁ డాయె నహహ. పురా. ౫౯.

గీ. నరకఁడదె వచ్చె ననుచు నొండొరులతోడ, గుసగుసలువోయి రాతనిపూర్తిసతులు. శుక. ౨. ౩౪౯.

౨. క్రూరుఁడు, దుష్టుఁడు.

క. మరుకేళిఁ గవయ కవ్వలి, కరుగవె చీ ఱంకులాడి యని నను నిచ్చల్, నిరసింతువు యోగివి గన, నరకా నీవాకె తాఁకె నాకుం జూడఁ. హంస. ౩. ౨౩౪.

ద్వి. చుట్టంబువలెనె కృష్ణుని నలయింపఁగట్టిఁడి నరకఁ డెక్కడ మండి వచ్చె. అ.మ.క.౧౨౯ పొ. ౧౦౪౦.

నరకకుండము. సం. వి. అ. న. నరకమందలి యాతనాస్థానవిశేషము. (ఈకుండములు ౮౬.)

నరకము. సం. వి. అ. పుం. న. నిరయము, పాపఫలము లనుభవించులోకము.

(నరకములు ౨౧. తామిస్రము, లోహశంకువు, మహానిరయము, శాల్మలి, రౌరవము, కుంభలము,

ఘాతిమృత్తికము, కాలసూత్రము, సంఘాతము, లోహితోదము, సవిషము, సంప్రపాతనము, మహానరకము, కాకోలము, సంజీవనము, మహాపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, అసిపత్త్రవనము, తాపనము.)

నరకాంతకుఁడు. సం.వి.అ. పుం. శ్రీకృష్ణుఁడు.

నరకీలకుఁడు. సం. వి. అ. పుం - మనుష్యులలో మేకువంటివాఁడు - హింసకుఁడు-గురుఘ్నుఁడు, గురువును చంపినవాఁడు.

నరకుఁడు. సం. వి. అ. పుం. ఒకయసురుఁడు. (ప్రాగ్జ్యోతిషపురరాజు, శ్రీకృష్ణునిచే హతుఁడయినవాఁడు.)

నరకేసరి. సం. వి. న్. పుం. ౧. నరసింహుఁడు, విష్ణునినాల్గవయవతారము. ౨. మనుష్యులలో శ్రేష్ఠుఁడు.

నరగ=నరగజము. వి. (హిం. నగారా.) వాద్యవిశేషము, భేరి. (శ. ర.)

నరగజము=నరగ.

గీ. తుడు మనంగను దముకు సాగిడియ యనఁగ, నరగజం బనఁ దద్భేద నామము లగు. ఆం. భా. ౧. ౧౨౩.

ద్వి. మురువుతో ఘోటకములమీఁద వచ్చు నరగజంబులు మీఱ నన్నూఱుకోట్లు. రం. రా. యు. (చి. ని.)

నరద. వి. పగులు, బీఁట.

(వ్యవ.) ఈయెండలకు నేల నరదలు తీసినది.

నరదము. సం. వి. అ. న. నళదము, వట్టివేరు.

నరద్విష్టుఁడు. సం. వి. ష్. పుం. రాక్షసుఁడు.

నరనారాయణులు. సం.వి.అ. పుం. ద్వి. ధర్మునిపుత్త్రు లగునిద్దఱుఋషులు. (వీరిలో నరుఁడర్జునుఁడుగాను నారాయణుఁడు శ్రీకృష్ణుఁడుగాను అవతరించి రని పురాణప్రసిద్ధి.)

నరపు=నర, నరువు. వి. (క. నెరహు.) పలితము.

ఆ. అవనిరాజ్యసుఖము లనుభవించుచుఁ బెద్ద, కాల మున్నఁ జెంపకడలనుండి, కలయ నరపు వచ్చి గడ్డంబు మీసలు, గప్పఁగోరు బాగు కానవచ్చె. కకు. ౪. ౨౪.

సీ. నర పన నర యనఁ బరఁగును బలితము... ఆం. భా. ౨. ౧౧౫.

నరపమీసము=నరపు కలమీసము.

ఆ. గూనివీపు లదుర గొణఁగి తిట్టుచు నేకుఁ, గఱచినట్టికుక్కగం డ్లనంగ, మూతినరపమీసములబోయముమసళ్లు, పందివలలు మోచి పఱచి రపుడు. మను చ. ౪. ౩౬.

ఇట్లే: నరపవెండ్రుకలు.

సీ. అపగతకేశోత్తమాంగంబు కెలఁకులం దూఁగాడునరపవెండ్రుకలతోడ. విక్ర. ౨. ౧౧౩.

నరపుంగవుఁడు. సం. వి. అ. పుం. మనుష్య శ్రేష్ఠుఁడు.

నరప్రియము. సం. విణ. (అ. ఆ. అ.) మనుజులకిష్టమైనది. వి. అ. పుం. నీలి, నీలవృక్షము.

నరబలి. సం. వి. ఇ. పుం. దేవతలకు వేయుమనుష్యరూప మగుబలి.

నరభుజుఁడు. సం. వి. జ్. పుం - మనుష్యభక్షకుఁడు- రాక్షసుఁడు.

నరమానిక. సం. వి. ఆ. స్త్రీ = నరమానిని.

నరమానిని. సం. వి. ఈ. స్త్రీ- తన్ను పురుషునిగా తలఁచుకొనుస్త్రీ, మగవానివలె మొగమున మీసలు గడ్డము లోనగునవి కలస్త్రీ-పోటు, మాచకమ్మ.

నరమాలిని. సం. వి. ఈ. స్త్రీ. - మగవానివలె ముఖమున రోమమాల కలది-పోటు, మాచకమ్మ.

నరము. వి. (సం. నాలమ్. ప్రా. నాలమ్. త. మ. నరమ్పు. క. నర.) నాడి.

(శల్యభీమసేనులు.) క. ఇరువురును సందు సూడక, వెర వెడలిన యాగ్రహముల ద్రే సినగదలొం, డొరుల మెడలకెలంకుల బ్రల్ల రములు వాఁకుటయు వారిలం బడి రథిపా. భార. శల్య. ౧. ౧౮౦.

శ్లో. భృశం మర్మస్వభిహతావుభావాస్తాంసువిహ్వలౌ. సం. భార. శల్య. ౧౧. ౨౫.

ఉ. అంపిలు గట్టి చేత నొకయష్టి ధరింపుచు నెత్తి వెంట్రుకల్, చెంపల వ్రేలఁగా ముదిమిఁ జిక్కి నరంబులె తక్కి స్రుక్కి...యుందు విప్రునిన్. ద్వా. ౧౦. ౩౦.

గీ...నర మన నాడి నివ్వటిల్లు. ఆం. భా. ౨. ౧౩౨. ఉ. రా. ౨. ౭౧.

బీఱునరము = ౧. పెద్దనరము.

ఉ. ఊసరవెల్లిచందమున నొక్కటి బీఱునరాలు దేరఁగా...దూది రాశిగాఁ, జేసినరీతి నున్న యొకజీర్ణమునిం గని కౌతుకంబునన్. మనుచ. ౪. ౩౯.

౨. శీతనాడి.

గీ...బీఱునరము నాఁగను దగుఁ శీతనాడి... ఆం. భా. ౨. ౧౩౨.

నరపవాఱు=నరములతో ఏర్పఱిచినత్రాడు, నరపుఁబటుకా.

సీ. మెులఁగాసెఁ బోసినమురికిపాఁతయు నందు నడుము బిగించిననరపవాఱు. హరిశ్చ. ౪. ౨౧౩.

నరము. సం. వి. అ. పుం- బరువుమొ. తీసికొనిపోవునది-గుఱ్ఱము. స. ౧. రామకర్పూర మను తృణము¶. ౨. నరయంత్రము. (మే. ని.) ౩. ఉదకము, నీరు. (కే. ని.)

నరమేధము. సం. వి.అ. పుం. మనుష్యుని యజ్ఞపశువుగా చేసి జరుపుయాగవిశేషము.

నరయంత్రము. సం. వి. అ. న. సూర్యునిచేత కాలమును తెలియుటకై ఉపయోగించుస్వాదశాంగుళపరిమాణము కలశంకుయంత్రము.

నరయు=నరియు. అ. క్రి. ముదిమిచే వెంట్రుకలు తెలుపగు.

ద్వి. నరసినబొమలును నరసినశిరము, గర మొప్పఁ బెద్దయు గౌరవం బొప్ప. రం. రా. యు. ౭౯౨ పా. ౩౦ పం.

చ. నరసినవెంట్రుకల్ జనపనారతెఱంగున విప్రహాళికిన్. శేష. ౧. ౭౭. (శ. ర.)

గీ. నరసి వ్రాలినబొమ లెత్తి పరమవృద్ధు, శివుని కారుణ్య మనుచు నాశీర్వదించె. హర. ౨. ౪౮. వరాహ. ౬. ౨౩.

జః నర, నరపు.

నరవ. వి. కొండత్రోవ.

వ...మురువులై సింగపుజంగిలికిరవులై పిరువులగునరవలం గరువలిమెపుడుదొరపడగలకంగులు తొంగలించి మీఁదికిం బచరించె నమించుతలిరుమ్రాఁకులును...యయా.౨.౪౦.

సీ...గిర్వ్యయన మొప్ప నరవ నా...ఆం. భా. ౨. ౯.

నరవండు. వి. ఓషధివిశేషము¶.

సీ. కుప్పి సూర్యక్రాంత ముప్పును నరవండు గాడిదగడపర కన్నెకొమర. హంస. ౪. ౧౦. (నరవంజి అని ప్రా.)

నరవాహనుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

నరవిష్వణుఁడు. సం. వి. అ. పుం. ౧. మనుష్యభక్షకుఁడు, రాక్షసుఁడు. ౨. నరహింసకుఁడు. (వాచ, కల్ప.)

నరశార్దూలుఁడు. సం. వి. అ. పుం. మనుష్యశ్రేష్ఠుఁడు.

నరసింగము. మి. వి. మల్లవిద్యావిశేషము, ముష్టిరెండువిన్నాణముఁలలో నొకటి.

సీ...నరసింగము సరి బిత్తరము కిల్లి...గీ...నాఁ గఁ జెన్నలరుచుండు, ముప్పదియురెండువి న్నాణములకుఁ జేళ్లు. ఆం. భా. ౨.౨౦౯.

నరసింహుఁడు. సం. వి. అ. పుం. ౧. నరసింహ మూర్తి యగువిష్ణువు. ౨. నరశ్రేష్ఠుఁడు.

నరహరి. సం. వి. ఇ. పుం = నరసింహుఁడు.

నరాంగము. సం = నరంగము.

నరాజి(జీ)=నారాజి. వి. కత్తి, ఖడ్గము.

సీ ... తరవలి నరాజి పిరంగి యడిద, మన ఖడ్గనామ మై యలరుచు నుండును...ఆం.భా. ౨.౨౧౪.

చ. కలువకటారి యీ చెలువ గా దలసంపఁగి తూపు గాదుగా, తళుకులబిత్తరంపుఁదమిఁ దమ్మిమెఱుంగులనేజ కాదు క్రొం,దలిరునరాజి కాదు జిగిఁ దార్కొను గేదఁగిచిక్కటారు కా, దలరులవింటివానికిఁ బ్రియంబగుమోహనబాణ మెన్నఁగన్. ఘటికా. ౨. ౭౭.

సీ. ఒకొక్కకెందలి రుదయించెఁ దరురాజిఁ దోర్గమై తనరెఁ గంతునినరాజి. కృష్ణ. ౪. ౪౨.

సీ. తననరాజీచిల్వకును మార్తురాలెండ్లయును రుగాడుపు లింపు లొసఁగుచుండ. యయా. ౧. ౫౬. (పరంజీ అని అపముద్రి.)

నరాధిపుఁడు. సం. వి. అ. పుం. రాజు.

ఇట్లే: నరేశుఁడు,నరేశ్వరుఁడు,నరదేవుఁడు మొ.

నరాశంస. సం.వి.అ.పుం.౧. యజ్ఞము. ౨.అగ్ని.

నరాశుఁడు. సం. వి. అ. పుం.–మనుష్యులను తిను వాఁడు – రాక్షసుఁడు.

నరి. వి. మర్యాద, హద్దు.

ద్వి. పెరిమెఁ బోని మ్మని ప్రియము గావింప,నరి మీఱి పల్కెదు నత్తు చందమున ద్వి.పరమ. ౩. ౧౧౨ పా. ౬ పం.

ద్వి. పరమబాంధవుఁ డైనపంకజోదరుని, నరి మీఱి యేము నిందనుక దూఱితిమి. ద్వి. పరమ. ౩. ౧౫౬ పా. ౧౦ పం.

నరి. సం. వి. ఈ. స్త్రీ. నరునిభార్య.

నరిడి. వి. పశువులకు వచ్చుగుండెయుబ్బురపురోగ విశేషము.

ఆ. నరిడి పుప్పి కప్పనావురు కడుపూఁద, యదురు డ్రిక్క యనఁగ నడరి మఱియుఁ, దెవుళు లెన్నియేని... హరి. పూ. ౬. ౪౫.

నరియఁడు=నరియకొక్కు. వి.సర్పవిశేషము.

సీ. నరియఁడు దెరు వాఁగె గరుడియుఁ బాలయు నెడమనుండియు వచ్చి కుడిని నిలిచె. ఉ. రా. ౬. ౨౩౫. (నక్క అని శ. ర.)

నరియకొక్కు=నరియఁడు. వి. సర్పవిశేషము.

గీ. కలవు తక్కినజెఱ్ఱిపోతులును దుంప,నాగులును గొంటిగాఁడులు నరియకొక్కులు... ద్వా. ౭. ౯౭.

నరియు=నరయు.

క. సురకుంజరములకొమ్ములు, మురిసెన్ దొండములు విరిసె మోములు నరిసెన్. నృసింహ. ౪. ౪౭. (శ.ర.పా. విరిసెన్. ముద్రి.పా.)

జః నరుపు.

నరుఁడు. సం. వి. అ. పుం. ౧. మనుష్యుఁడు. ౨. మగవాఁడు. ౩. అర్జునుఁడు. ౪.ఒకఋషి. (నరనారాయణ ఋషులలో మొదటివాఁడు.) ౫. బ్రహ్మదేవుఁడు. (త్రి. ని, మే. ని.) ౬. పదాతులు, కాల్బలము.

మ. కరులం గూల్చుచుఁ దేరులన్ నఱకుచున్ గరిజ్ఞ ఘోటమ్ములన్, నరులన్ నెత్తుటఁ దేల్చుచున్ దొరల నానారూపఖండంబులై, ... సేయుచు...భార.ద్రో.౫.౩౦౩.

నరుదకన్ను. వి.(పశువుల) నేత్రరోగవిశేషము.
ద్వి. నరుదకన్నును నీరు వాలుక చేర్లు, గురుసు దెవులు... నవనాథ. ౧. ఆ. ౪౧పా. ౨౫పం.

నరుపు=నరవు. (శ. ర. √నరియు.)

నరేంద్రమార్గము. సం. వి. అ. పుం. రాజవీథి, పెద్దవీథి.

నరేంద్రము. సం. వి. అ. పుం. వృత్తభేదము. (వాచ.)

నరేంద్రాభము. సం. వి. అ. పుం. పచ్చరంగు కల అగురువు.

నరేంద్రుఁడు. సం. వి. అ. పుం. ౧. నరశ్రేష్ఠుఁడు, ౨. రాజు. ౩. విషవైద్యుఁడు, పాములవాఁడు. ౪. భూతవైద్యుఁడు, పిశాచములను పోఁగొట్టువాఁడు. (వాచ.)

నరోత్తముఁడు. సం. వి. అ. పుం. ౧. నరశ్రేష్ఠుఁడు. ౨. పురుషోత్తముఁడు, నారాయణుఁడు. ౩. బుద్ధుఁడు.

నర్మిలి=అర్మిలి.
సీ. దేహంబు నివురు మోదించుఁ గౌఁగిటఁ జేర్చు నర్మిలితో నిట్లు నన్ను మనుప. భాగ. ౧. ౧౧౬. (చి. ని, ప్రాఁత ప్రతుల, పా.)
ఉ... నీసుతఁ బెండ్లియాడఁగా, నాయము నాకు మారునకు నర్మిలి హత్తఁగ ... విజ. వి. ౩. ౧౨౬.

నరుకు=నఱకు, నఱుకు. స. క్రి. ౧. ఖండించు.
ద్వి. ఏఁగుదెంచిన కాళ్ల నిల నర్కి వైచి, కాఁగిలింపఁగఁ గోరుకరములు దునిమి. పండితా. పురా. ౧౪౪ పా. ౧౦ పం.
౨. చంపు, సంహరించు.
ఉ. జోడనలుక్ రవల్ మలుకుజుట్టును దాడులు నాగబంధముల్, వేడెము లాది యోగతుల వేమఱు వాజుల 
మల్లుపు. ౨. ౩౧.

నర్కుటకము. సం. వి. అ. న. ముక్కు. (వాచ.)

నర్తకము. సం. వి. అ. పుం. ౧. ఏనుఁగు. ౨. నలతృణము, కిక్కసకసవు. ౩. మయూరము, నెమిలి.

నర్తకి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆటకత్తె. ౨. ఆఁడేనుఁగు. ౩. నళి అను గంధద్రవ్యము, గువ్వగుత్తిక. ౪. ఆఁడునెమిలి.

నర్తకుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నాట్యమాడువాఁడు. ౨. ఆలోచించునప్పుడు సందేహాదులచే ప్రేక్షుతల మొ. ఆడించువాఁడు. వి. అ. పుం. ౧. నటుఁడు. ౨. (రంజకునికి - రంగులువేయువానికి - వేశ్యయందు పుట్టిన) సంకీర్ణజాతివాఁడు. ౩. చారణుఁడు, కీర్తిసంచారకుఁ డగునటుఁడు. ౪. కేలకుఁడు, కత్తివాదర మున్నగు వానిపై నాట్యము చేయువాఁడు. ౫. శివుఁడు. ౬. నృపుఁడు, రాజు.

నర్తనప్రియము. సం. వి. అ. పుం. నట్టువపులుఁగు, నెమిలి. (వై. ని.)

నర్తనప్రియుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నాట్యమందు ఇష్టము కలవాఁడు. వి. అ. పుం. శివుఁడు.

నర్తనము. సం. వి. అ. న. ౧. నృత్యము. ౨. ఆలోచనాదులయందు సందేహాదులచే ప్రేక్షుతల మున్నగునవి ఆడించుట.

నర్తనశాల. సం. వి. ఆ. స్త్రీ. నర్తనము చేయు సాల, నాట్యశాల.

నర్తనశాలము. సం. వి. అ. న = నర్తనశాల.

నర్తనుఁడు. సం. వి. అ. పుం = నర్తకుఁడు.

నర్తము. సం. విణ. (అ. ఆ. అ.) నర్తించునది, [illegible] అ. పుం. నృత్యము, ఆట.

నర్తయిత. సం. విశ. (ఋ. త్రీ. ఋ.) నర్తింపఁ జేయువాఁడు, ఆడించువాఁడు. వి. ఋ. పుం. నాట్యము నేర్పువాఁడు, నట్టువయోజ్జ.

నర్తించు=నర్తిలు. సం. అ. క్రి. ౧. నర్తిల్లు, నర్తనముచేయు. (శ. ర.) ౨. ఎగురు.

మ. నలువంకన్ మలయానిలాంచలముచే నర్తించుభ్రూఘూళితో...సుఖకరంబుల్ కేలికాంతారముల్.వరాహ. ౪. ౧౧౩.

నర్తితము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. ఆడింపఁబడినది, నృత్యము చేయింపఁబడినది. ౨. నర్తించునది, ఆడునది.

నర్తిలు(ల్లు)=నర్తించు. సం. అ. క్రి. (నర్తనముచేయు, నటించు.)

ఉ. అంగదముల్ వెలుంగ మణిహారము లక్కున నర్తిలంగ మేల్పొంగరురావిశేక నోసలన్ మసలంగ...సారసలోచన క్రీడ సేయుచున్. రుక్మి. ౧. ౨౫.

(శ్రీకృష్ణుఁడు.) మ...వక్షస్స్థలిన్, నవలీలన్ వనమాల యుజ్జ్వలరుచిన్ నర్తిల్ల ... హరి. పూ. ౮. ౧౧౨.

నర్తువు. సం. వి. ఊ. స్త్రీ. నటి. (త్రి. ని.)

నర్దనము. సం. విశ. (అ. ఆ.అ.) ధ్వనిచేయునది, అఱచునది. వి. అ. న. ౧. అర్చుట, బొబ్బరించుట. ౨. శబ్దము, రవళి, కూఁత.

నర్దము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. శబ్దించునది, మ్రోఁగునది. ౨. అర్చునది, బొబ్బరించునది.

నర్దితము. సం. విశ. (అ.ఆ.అ.) ఘోషించినది. మ్రోఁగినది. వి. అ. పుం. పాచికలు వేయువిధములలో నొకటి.

శ్లో. నర్దితదర్శితమార్గః...మృచ్ఛ. ౨. ౮. న. ౧. శబ్దము, మ్రోఁత. ౨. అర్పు,బొబ్బ.

నర్మకీలుఁడు. సం. వి. అ. పుం. [illegible] బంధనస్థానము- భర్త, మగఁడు. (త్రి. ని.)

నర్మగర్భము. సం. విశ. (అ. ఆ. అ.) పరిహాసము లోపల కలది. (పాట మె.)

నర్మఠము. సం. వి. అ. పుం. ౧. చిబుకము, గడ్డము. ౨. చూచుకము, చనుమొన.

నర్మఠుఁడు. సం. వి. అ.పుం. ౧. పరిహాసకుఁడు, మేలమాడువాఁడు. ౨. కాముకుఁడు. (కల్ప.)

నర్మద. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఒకనది. (వింధ్యపర్వతమున పుట్టి పశ్చిమ - అరేబియా - సముద్రములో పడుచున్నది.) ౨. పురుకుత్సునిభార్య. ౩. పృక్క- అనుగంధద్రవ్యము*.

నర్మదుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ౧. పరిహాసము చేయువాఁడు. ౨. వినోదము నిచ్చువాఁడు. వి.అ.పుం. నర్మసఖుఁడు, కేళీసఖుఁడు.

నర్మము. సం. వి. న్. న. ౧. వినోదము, క్రీడ. ౨. పరియాచకము, మేలము; స్త్రీపురుషులపరస్పరపరిహాసము.

నర్మర. సం. వి. ఆ. స్త్రీ. ౧. దరి,గుహ. ౨. భస్త్ర్త్ర, కొలిమితిత్తి. ౩. సరళి, తెల్లతెగడ*.౪. నిష్కళి, ముట్లుడిగిన ఆఁడుది.

నర్మవంతము. సం. విశ. (త్. వతీ. త్.) ౧. వినోదము కలది. ౨. నవ్వుటాలతో కూడినది.

నర్మసచివుఁడు. సం. వి.అ.పుం. ఆటచెలికాఁడు, కేళీసఖుఁడు.

నర్మసుహృత్తు. సం. వి. ద్. పుం = నర్మసచివుఁడు.

నర్యము. సం. విశ. (అ. ఆ. అ.) నరునకు హితమైనది.

నలకించు. స. క్రి. (√నలకు.) నలకఁజేయు, తెగఁగొట్టించు.

 ... భూపాలుండు యదువీరనగరంబు

కలుకోటు వికటంబుగా వలుఁదటుంకెంబుల నఱకించియు...ఉ. హరి. ౩. ౩౬. (బ్రద్ద లుకొట్టించి అని భావము.)

నఱకు = నఱ్కు, నఱుకు. స. క్రి. (త.నఱుంకు.క. నరకు.) ౧. ఖండించు, తెగఁగొట్టు.

గీ. అతివ యతఁ డొంటుకోదండ మందికొన్న, నఱకె వేఱె వి ల్లెత్తిన విఱుగ నేసె. ఉ. హరి. ౧. ౧౬౫.

మ. మఱియుం గోటులసంఖ్య లై ధవళసద్మం బుల్ విచిత్రంబుగా, నెఱి చూపె న్నరు దంబువహ్నివియదన్వీతంబు లాయిండ్లలో, మెఱుఁగుంబోడి వసించె నోర్తు బహుశుంభీ బింబితార్కాకృతిన్, నఱకెం దద్గృహమ స్తకంబులు మహీనాథుండు శీఘ్రంబునన్. వరాహ. ౯. ౧౪.

(రావణుఁడు.) మ. ప్రహతిన్ సేనలఁ జెక్కుచున్ నఱకుచున్ భంజించుచున్ ద్రుంచుచున్ ... మ్రగ్గంజేసె నొక్కుమ్మడిన్. ఉ. రా. ౩. ౨౩౪. వి క్ర. ౬. ౪౯.

౨. చంపు,సంహరించు.

క. పెఱవారి నెల్లఁ దరమిడి, నఱకుమఁ బాండు క్షితీశనందనులను రూపఱ నేయం జేయా డదు ...భార. ఉద్యో. ౪. ౧౫౦.

క. పఱపి రథికులను సూతుల, నఱకిన మ్రోడు వడి యుండె నానారథముల్. భార. భీష్మ. ౨. ౩౯.

౩. తొలఁగించు, పోఁగొట్టు.

మ...దైత్యాంతకుం డుద్ధతిన్, నఱకెం దత్తి మిరంబు...ఉ. హరి. ౨. ౪౯.

౪. క్షతము, కత్తిదెబ్బ. (చూ. నఱకువడు.)

జః నఱకించు, నఱకుడువడు, నఱుకువడు.

నఱకుడువడు=నఱకువడు, నఱుకుడువడు. అ. క్రి. (√నఱకు.) ఖండితమగు, తెగు; భిన్నమగు.

ద్వి. నరనాథ మొదలంటు నఱకుడువడిన, తరు వున క్రొవ్వసివదశకంబుఁ జూచి. రం. రా. ఉ. ౧౪ పా. ౧౫ పం.

నఱకువడు=నఱకుడువడు, నఱుకుడువడు.

గీ...ఫలకాలంబె నఱకువడుట, పరసులగువాని లెక్కించు కెఱుఁగలేక. సురా. ౩౨.

గీ. సాగరమునీరు పేరుట శైలకులము, తెఱపి యిచ్చుట చీకటి నఱకువడుట, దివ్యతేజంబు దోఁచు టద్దిపి నీవు, సొచ్చుట కుమారులం గొనివచ్చు టేమి. ఉ. హరి. ౨. ౫౬.

నఱవు. విశ. కృత్రిమమైన, కపటముగల.

గీ. ఇంక నెన్నండు దయఁ బరమేశ్వరుండు, గన్ను దెఱచునో యని తన కున్నచూపు, నెఱయఁ జెప్పిన విని కేలు చఱచికొనుచు, నఱవపాఱుండు ప్రక్కలు విఱుగ నగుచు. కు. సం. ౮. ౭౫౦.

నఱిముఱి. వి. విలాసము.

ద్వి. నందనవనతరుల్ నఱిముఱి విఱిచి, తం దండ బాధించి తఖిలసంయముల. రం. రా. ఉ. ౩౦౦ పా. ౨౬ పం.

నఱుకాడు=నఱుకులాడు. స. క్రి. (√నఱుకు.) (శత్రువులను) సంహరించు.

సీ. రాజుల మంచు బొజ్జలు తివిరినఁ గాద యి ని మొనలో నఱుకాడవలయు. వేణు. ౫౮.

నఱుకులాడు=నఱుకాడు. స. క్రి. ఒకరి నొకరు నఱుకుకొను. (శ.ర.)

నఱుకు=నఱ్కు, నఱకు స. క్రి. (త. నఱుక్కు.) (ఖండించు.)

(దేవాసురులు.) వ...వాజుల కుఱికియు వాలం బుల నఱికియుఁ దొడలు తుండించియుఁ దొండంబులు ఖండించియు ... అతిఘోర భంగిం బెనంగిరప్పుడు. భాగ. ౬. ౩౮౦.

(ఇంద్రుఁడు.) క... పార్శ్వస్థ్రాణంబుల నెల్ల నఱికి కష్టముచేసెన్. దశా. ౨. ౧౮౨.

(చంపు, సంహరించు.)

క. ఎఱిఁగినఁ జేరఁడు చేరుట, యెఱుఁకి మెయిన్ మనకు దైవ మిచ్చినసిరి యిట్లఱిమిన యీ లోఁ గ్రుక్కున, నఱుకు మితఁడు దెగిన మనమనఃపీడ తెగున్. భార. ద్రో. ౩. ౧౮౪.

(చి. ని, కరాల ప్రతుల. పా.)

వి. (కత్తిదెబ్బ.)

సీ. కొంగవాల్ నఱుకు లంగుళులఁ బట్టుక జబ్బ లంటఁ గుట్టిన వెజ్జు నరయువారు. ఆము. ౬. ౮౫.

(శస్త్రవిద్యావిశేషము.)

వ...గజ్జదుముకు నఱుకు లనునఱుకులును... మల్లుపు. ౩. ౬౯.

(సాదన.) గీ. నఱుకు పఱువడి గాయమానంబు విసరు,మొన లనంగను...చెలంగు.ఆం.భా. ౨. ౨౦౫.

వ...లోవెలి గజ్జదుముకు చూరణ నఱుకు మొద లగునఱుకులఁ దగులుం గనుంగొని... హంస. ౧. ౨౦౭.

జః నఱ్ఱు, నఱుకాడు, నఱుకుడువడు, నఱుకు బియ్యము, నఱుకులాడు.

నఱుకుడువడు=నఱకుడువడు, నఱకువడు.అ.క్రి. (√నఱుకు.) ఖండితమగు, కోఁతపడు.

క. పడుతలలు తఱుచు నఱుకుడ్వడుచేతులు జడిసి బెండువడుచుండెలు చ్ఛేద్యడు మేనులు గడుఁ ద్రొక్కుడు, వడునడుగులు పంక్తిముఖునిభటులకుఁ గలిగెన్. ఉ.రా.౪. ౨౯౨.

నఱుకుబియ్యము. వి. (√నఱుకు.) ననుఁబ్రాలు, ఉడికియు నుడుకనిబియ్యము. (శ. ర.)

నఱుకుల్కు. వి. గుండె యదరుట కనుకరణము. (దిగులుపడుటయం దగునసుకరణము అని శ.ర.)

క. అప్పుడు సురనాయకుఁడు క్రకుప్పతియుతుఁ డగుచు హరుని గొలువఁగఁ జనుచున్, ముప్పిరిగొనియెడువగతో, నప్పాలునిఁ జూచె గుండియ నఱుక్కనఁగన్. చంద్రా. ౩. ౨౫.

నఱుజే. విణ. అణువు, చిన్నది.

క. నఱుజుమెయి పూని యాదబ్బఱపాలఁ తుకలోనఁ దూఱి పఱువడి వెలికిన్, బఱచి తటాలున దానిం,బఱియలు గావించి యెలమి పరఁగం జనియెన్. అచ్చ. రా. కిష్కిం.౧౦౪.

వి. అల్పత్వము.

క. ఉల్లమున నఱుజుఁ జూపని,తల్లడమున నడుగుఁదోయి తడఁబడ విల్లున్, బల్లెపుఁగోలలు గైకొని, యల్లనఁ బఱతెంచె నన్న యరిగిన త్రోవన్. అచ్చ. రా. ఆర. ౫౧.

నఱుమాడు=నుఱుమాడు. స. క్రి. (నఱుము+ ఆడు.)

(పొడిచేయు.)

క. వెఱవార లధికభీతిన్, విఱిగి చనిరి భీష్ముఁ డేచి వీరరథిక లం, దఱఁ జూచి రాచకొడుకుల, నఱుమాడెను భీముఁ డిట్లు నడుఁకం దగునే. భార. భీష్మ. ౨. ౨౩౭.

నఱుము=నుఱుము. స.క్రి. పీడించు, బాధించు.

కళిక. మఱియుఁ బెఱయ నెఱయ నుఱియుమధునిఁ గూల్చినట్టిహరికి, నఱిమి తఱిమి చఱిమి నుఱుమునకు గెల్చినవితకరికి.అవ్వ.౪.౩.౨౭

వి. నలి; పొడి.

చ. అఱిముఱిఁ ద్రెళ్ళెఁ దేరులు గజావళి గూలెఁ దురంగమాంగముల్, గిఱికొనియెన్ మహీన్ భటులు లెక్కకు మిక్కిలి సేన పాడుగా, నఱు మయి రక్షకృష్ణుఁడు నినాదము భూగగనాంతరంబునన్, దఱచుగ నొత్తె సిర్తథిత దానవసైన్యముఁ బాంచజన్యమున్. భార. ద్రో. ౩. ౨౧౦.

మ... ప్రతాపోదగ్రోజ్జ్వలసంయద్రథసంబు రద్రుమఖసంచారక్రియన్ మీఱఁగా, నలఁగించెం బ్రతిపీనం...రాఘవ. ౪. ౫౧౯.

సీ. విమలసంధ్యారాగసముదితనవచంద్రు నలఁగించురాహుమండల మనంగ. భాను. ౩.౭.

నలఁగు=అల్లఁగు, నలుఁగు. అ.క్రి. (త. నలంకు.)

౧. నలియగు, ముక్కలగు.

ఉ. అవనజాక్షి కాకఁ బొరలాడ నలంగిన సొమ్ముఁ జీరలున్, వేవిన నూడ్చి యూడ్చి... ఆము. ౫. ౧౫౫.

౨. పీడితమగు, పీడనొందు, మృదితమగు.

చ. పొదివి నభోవిహారమునఁ బువ్వను బోలె నలంగకుండ నృముదనసమానుఁ బట్టికొని... ఉ. హరి. ౫. ౧౯౦.

సీ. బలుకట్లబద్ధ లేర్పడుభుజార్గలలతో నలఁగినచలువదువ్వలువతోడ. ఉ. రా.౫.౨౦.

౩. నశించు; చెడు, పాడగు.

సీ. ధూమంబు వొదివినఁ దుఱఁగలి మెఱుఁగులు నలఁగి మాసినదీపకళికపగిది...భార. విరా. ౧. ౫౯౪.

సీ. రూపు గంటఁ జెలంగఁ జూపుమంటు నలంగఁ బంచబాణుఁడు వీరిపాలఁ గనియె. ఉ.హరి. ౨. ౧౯౧.

సీ...మావసియించుదేశ మవగ్రహమున, నలఁగిన నాహారములు లేక యిందఱుఁ బండిన భూముల కొండుకడకు, నరిగెదము...కే యూర. ౩. ౭౭.

౪. శ్రమపడు; బాధపడు.

గీ. శీతవాతోష్ణబాధలచేత నరులు, నలఁగకుండంగ మపకరణములు దగినభంగి సృజియించి భూవసనాంబరవిలేప,నాదులెల్లను గల్పించె నవ్విధాత. వి. పు. ౧. ౧౧౧.

క. తలపోయుచుఁ దనతలఁ ప్రాయొలనాగం బాయ కుదికి నితరవిచారంబులు విడిచి తాపమునఁ గడు, నలఁగుచు నేకాంతగృహమునన్ వర్తిలుచున్. కళా. ౭.౪.

గీ. పొందుపట్టుల నప్పులు పొడిచి పొడిచి, దొరతనంబునఁ జుట్టాలఁ దిరిసి తిరిసి, నలఁగి శిక్షోదరపరాయణత్వమున్నకుఁ, బార మెఱుఁగక తిరుగు నాబ్రాహ్మణుండు. పాండు. ౩. ౭౫. రాఘవ. ౪. ౧౪౭.

జ: నలఁక, నలఁకన, నలఁకువ, నలఁగించు, నలఁగుడు, నలఁగుడువడు, నలఁగుడుపెట్టు, నలఁచు, నలఁపు, నలఁతి, నలవడు.

నలఁగుడు= నలఁకువ. వి. (√నలఁగు.) బాధ, కష్టము.

వ...గంతు లిడుగబ్బిదెబ్బలులనలఁగుడుల... మనుచ. ౪. ౩౭.

నలఁగుడువ(ప)డు=నలుఁగుడుపడు.అ.క్రి. (√నలఁగుడు.) శ్రమపడు; బాధపడు.

క. అయిందుముఖులచేఁ బడి, రాయిడిఁ బడి నలఁగుడువడి రావణుఁడు వడిన్,గాయము నొచ్చినఁ దొలఁగును,పాయము మతి లేక యొకతెపాణిఁ గఱచినన్. ఉ. రా. ౫. ౨౭౧.

(వ్యవ.) ఈపిల్లపెండ్లిలో మావాఁడు చాల నలఁగుడుపడినాఁడు.

నలఁగుడువె(పె)ట్టు. స. క్రి. (√నలఁగుడు.) శ్రమపెట్టు, బాధపెట్టు.

చ. అలయక యిట్లు ద్రిమ్మరుచు నద్దళకంధరుఁ డూర్ధ్వలోకముల్, నలఁగుడువెట్ట నెంచి... ఉ. రా. ౫. ౫౭౩. (శ.ర. పా. నలఁకువఁ బెట్టు. ముద్రి.)

నలఁచు=అలఁచు,నలఁగించు.స.క్రి. (√నలఁగు.)

౧. మృదితము చేయు, నలఁపు.

ఆ. మందు నలఁచి కన్నులం దిడి ముక్కునఁ, బిడిచి చెవులఁ బోసి...దశకు. ౫. ౯౯.

౨. శ్రమపెట్టు; బాధించు, పీడించు.

మ. గెలిచెం బూర్వనరేంద్రులం బఱపె నాగ్నే యావనీనాథులన్, నలఁచెన్ దక్షిణరాజపంక్తి ...ఉ. హరి. ౫. ౧౩.

౩. మెదుపు, కలియఁగలుపు.

గీ. అనుచుఁ దనపాదమున నున్నయట్టిమన్ను, నలఁచి యుండఁగఁజేసి...పరమ. ౧.౧౮౯.

౪. నశింపఁజేయు,చంపు.

ఉ. ఓడక వచ్చి నాయెదుర నూరక ప్రేలెడు దీని మత్క్రుధా,బాడబకీలలన్ నలఁచి పా ఱఁగఁజైచెద నంచు నుగ్రుఁడై. రాజ. చ. ౩. ౫౩.

నలఁత=అలఁత. విణ. (√నలఁగు.) అల్పరోగము కలవాఁడు.

(వ్యవ.) ఈవేళ నేను కొంచెము నలఁతగా నున్నాను.

వి. ౧. పురాణించినరోగము. (బ్రా.)

౨. అల్పరోగము.

(వ్యవ.) ఈపాటినలఁతకు పెద్దవైద్యము అనవసరము.

నలఁపు=నలఁగించు, నలఁచు, నలుపు. (మృదితముచేయు.)

గీ. అలిగి పూవైన నలఁప లేదబల దాను. కు. సం. ౫. ౫౭౯.

గీ. నలఁపఁ దీపు వలచి పరిమళము కాంతి,భరితములు నగుపువ్వులు నరులమెచ్చు. భార. అను. ౪. ౧.

శ్లో. మనోహృదయనందిన్యో విమర్దే మధురాశ్చ యాః, చారురూపా స్సుమనసో మానుషాణాం స్మృతా విభో.సం. భార. అను. ౧౧౫. ౩౨.

(బాధించు, పీడించు.)

ఉత్సాహము. ఎన్న నే వరించువరపమి నహోవ నంబులో, నన్న గారిఁ గినిసి నవ్వ ఘూర్ణితం డకాండవృష్టి న్నలంప వచ్చు జగదజేయదండ నందమూ, యన్న బ్రాహ్మణునకు విరచితాంజలి యగు భక్తితోన్. రాఘవ. ౨. ౧౦౫.

గీ. నన్ను నదవద వణఁకించి నలఁప వలసి, వర్ష మిదె యీఁదయును దాను వచ్చె ననుచు. విప్ర. ౩. ౫౩.

నలకము. సం.వి. అ. న. ౧. కాఁకాలియెముక.

౨. ధనుస్సు మొదలగువానికవచము. (వై. ని.)

నలకిని. సం. వి. ఈ. స్త్రీ. జంఘ, పిక్క.

నలకీలము. సం. వి. అ. పుం. కాఁకాలు.

నలకూబరుఁడు. సం. వి. అ. పుం. కుబేరుని కొడుకు.

నలదము. సం. వి. అ. న. ౧. ఉశీరమువట్టివేరు. ౨. మకరందము, పూఁదేనె. ౩. జటామాంసి కి. (మే. ని.)

నలపట్టిక. సం. వి. అ. స్త్రీ. కిక్కిసకసపుతో అల్లినచాప.

నలమీనము. సం. = నడమీనము.

నలము. సం.వి.అ.పుం.నడము, కిక్కిసకసవు కి.

న. తామరపువ్వు, పద్మము.

నలవడు. అ. క్రి. (నలఁగు + పడు.) నలఁగుటను పొందు.

చ. మలహార నేఁడు దక్షుఁడు రమావరదిగ్వరవాగ్వరాదులం, బిలిచి హిమాద్రిపై మనలఁ బిల్వక యాగముఁ జేయుచున్నవాఁ, డలవున మీరు వేగఁ జని యచ్చటి కూరుల వానితోఁడుతన్,నలవడఁ జెండి క్రతువు లణంచి నసుం బ్రమదాత్ముఁ జేయరే. వీర. ౪.౪౧.

నలి. వి. (త. నలి. √నలియు.) ౧. బాధ.(చూ. నలిపెట్టు. రోగము అని కే. ర.)

౨. పొడి, తుమురు.

ద్వి. నలి యైనమాంసఖండములు మెండెములు, గలిగి లోకైకభీకర మయ్యె రణము. రం. రా. ఆర. ౧౬౩ పా. ౧౩ పం.

సీ. మఱి కొండవీ డెక్కి మార్కొన నలి యైన యలకసవాపాత్రు నంటి శాఁజె. ఆము. ౧. ౩౬. బస. పు. ౩. ౫౩౨ పం.

౩. ఎండుగడ్డి, శుష్కతృణము.

సీ...నలి యన నలు పన నలరు శుష్క. గీ. తృణము ...ఆం. భా. ౨. ౭౬.

౪. ఇంచిమంచి, చిఱుదిండి.

సీ...నలితిండి యొప్పును నలి యనఁ దగు... ఆం. భా. ౩. ౪౫.

౫. ఒప్పు, అందము. ఆం. భా. ౩. ౪౫.

౬. ప్రేమము, అనురాగము.

సీ. మావిమ్రోఁకల నెలదీవలఁ జెన్నొందుతోఁట లకడ నలితోడఁ జెంది. గీ... కేలిసలిపెడు నీదగులీల మఱవ, నావశంబె ... భార. శాం. ౩. ౩౩౨. నిర్వ. ౮. ౭౩.

గీ...పురుషులుఁ గాంతలుఁగామహర్ష,లీల లెసఁగఁ గ్రోధాదులు లేక రుజయు,జరయు నెఱుఁగక నలిఁ జరింతురు దివంబు,నందు సంతత నిర్భరానంద మొంద. భార. అను. ౫. ౨౧౭. (యోగ్యముగా అని శ. ర.)

౭. ఉత్సాహము.

మ. వినుమ నేఁ డర్జునుఁ డన్యసైన్యముల నుర్విం గూల్చుచున్ బ్రేతభూ,తనికాయంబులు మాంసభక్షణము రక్తస్వైరపానంబుఁ జేసి నలిం గ్రాలఁగఁ గ్రీడ సల్పు...భార.ద్రో.౩.౧౫.

చ. నలిఁ గమలావనన్ మృదునినాదములన్ వెడదొక్కుఁ బల్కులన్, సొలవక చిల్కలన్ వెడలఁ జొఁపు వెలుంగులు దప్పు డాయరాఁ, బిలుచుట గాఁగ...కు. సం. ౭. ౯౨౮.

౮. లాఘవము; శక్తి, సామర్థ్యము.

క. ఉరగాంగన నలిఁ బట్టెడు, గరుడుని క్రియ శక్తి వట్టి క్రమ్మఱ వైచెన్, నరసుతుఁడు శల్యసూతుని...భార. ద్రో. ౧. ౧౭౬.

శ్లో. వైనతేయో యథా కార్ష్ణిః పతంతమురగోత్తమమ్,తస్య లాఘవ మాజ్ఞాయ సత్త్వం చామిత తేజసః, సహితాస్సర్వరాజానస్సింహనాదమథానదన్. సం. భార. ద్రో. ౧౪. ౭౯. ౮౦.

ద్వి. నా కేల రాముఁడు నా కేల సంధి, నా కేమిటికి వేఁడ నలి దూలి యొకని. రం. రా. కిష్కిం. ౨౧౦ పా. ౨౭ పం.

విణ. సన్ననిది.

గీ. వళులలావున నలికొను బలిమి నిలుపఁ, జూచువారిచూడ్కికి నొప్పు చూఱలిడుచు,లీలఁ బాడుచుఁ దీఁగయుయ్యాల నెక్కి, పోయి యూపఁగ నొప్పారెఁ బోలఁతి యొత్తు. నృసిం. ౨. ౮౫.

కవిరాజవిరాజితము. కరములఁ గంకణముల్ మొరయన్ నలికా నసియాడ...భాగ.౧౦. ఉ. ౪౮౮.

(దీనియామ్రేడితరూపము 'నలినలి')

ఆ. నలినలీలసంచు నలినలి గావించు, నించుమించు లాడు నించుమించు, లేమనగవుఁ జూపు లేమన నగు...విజ. వి. ౧. ౩౬.

చ. పులిపులి యయ్యె నంగలత పొక్కె సుధాధరబింబ మింతికిన్, నలినలి యయ్యెఁ గొను జఘనస్థల మెల్లను నజ్జునజ్జునై,...కొం, దలి రుకటారివాని బెడిదంపుదురంబు విభుం డొనర్చెన్. శుక. ౧. ౨౧౫.

క్రి. విణ. ద్రు. ౧. క్రమముగా; అత్యంతము.

(సంశ్లిష్టములు.) క. సరి నైదై దేయఁగ నన్నతుఁ డందఱ రెంటరెంట నలి నొప్పించెన్. భార. ద్రో. ౧. ౨౪౧.

ద్వి. సిద్ధవీరవ్రతశీలాన్వితుండు, నలిఁ బాల్కు రికిసోమనాథుఁ డనంగ, వెలయువాఁడను ...పండితా. దీక్షా. ౫ పా.

సీ. వలఁదళూలముతోడ నలి నుబ్బు నలమబ్బు వెలి ద్రొబ్బుగరళభృద్గళముతోడ. ఉ. రా. ౧. ౨౩౦.

౨. అర్హముగా, తగునట్లుగా.

ఆ. నాదుప్రశ్నములకు నలి నుత్తరము లిచ్చి, వారిఁ గొనుము నీవు వలసినట్లు. భార. ఆర. ౪. ౩౯౩.

౩. నిశ్చలముగా.

ద్వి. నదులు వేగము మాని నలి పట్టె నిలిచెఁ, గదల వీవక సదాగతి దిమ్మపడియె. సిం. భాగ. ౨. ౨౯.

నలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మణిసిల. ౨. సు గంధద్రవ్యభేదము, గువ్వగుత్తిక.

నలిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నలి యనుసుగంధి ద్రవ్యము, గువ్వగుత్తిక. ౨. సాలెవానిజికా నొకకొలముట్టు. ౩. ఆకొలముట్టువంటిఅస్త్రము.

నలికండ్లపాము. వి.(నలి+కండ్లు+పాము.)రక్త పుచ్ఛిక, నలికీఁచు. (చి. ని, శ. ర, బ్రౌ.)

నలికము. వి. (√నలియు.) సన్నఁదనము, తను త్వము.

ద్వి. పొడ వైనయట్టిమూఁపులును జానువులు, గడచుచేతులు నలికము కలనడుము. నవనా థ. ౨. ౧౦౩ పా. ౩ పం.

విణ. సన్ననిది; చిన్నది.

క. మారుమఖవేదిమధ్యం బెయ్యారతియద్దంబు పిడియొ యన నెంతయుఁ బ్రొల్పారఁ గడు నలిక మై సుకు, మారికి మధ్యంబు సింహమ ధ్యమునోలెక. కు. సం. ౩. ౭౪.

ద్వి. నలికంపుఁబూప లై నలి నొగ లెక్క, కా య లై పులుగునఁ గలి ... క ఫలము లై ... నవనాథ. ౧. ౧౧ పా. ౧౪ పం.

నలికము. సం. వి. అ. న. ధనుస్సు మొ. వాని కవచము.

నలికిరి. వి.(√నలి.)నలికండ్లపాము. (చి.ని,శ.ర.)

నలికీఁచు. వి. (√నలి.) నలికండ్లపాము. (శ.ర.)

నలిగులి. విణ. (√నలి.) ౧. మిక్కిలి నలఁగినది, అత్యంతమృదితము.

సీ. తోరంపుగొరిజలత్రొక్కున నొడ లెల్ల నలి గులి యై సర్పనాథుఁ డొదుగ. హరి.పూ. ౪. ౧౩.

౨. బద్దలైనది, బీటలువాఱినది.

క. నిలిచి మహాస్త్రం బెఱమంటలు గ్రమ్మఁగఁ బెలుచ నేయుటయు నడుమన చెక్కలుగాఁగ నేసి దిక్కులు, నలిగులి గా నతఁడు సింహనాదము సేసెన్. భార. భీష్మ. ౩. ౧౧౭.

౩. క్షీణించినది, తఱిగిపోయినది.

క. కలియుగమున ధర్మంబును, నలిగులి యగు నని సుధీజనంబులవాక్యంబుల విందుఁ దత్ప్రకారం, బలఘువచోవిభవ నాకు నానతి యీవే. హరి. ఉ. ౯. ౩౧.

నలిగొట్టు. విణ. (√నలి.) సన్న మైనది, హీనస్వర మైనది.

ద్వి. అడవికి నీ వేగునపుడు గన్నీరు, వడవెడు నీవాలువెడఁదకన్నులను, విన్న నై పెదవు లు విఱిచి దైన్యమున, సన్న రమ్మనిపిల్చు నలిగొట్టుపలుకు.ద్వి.హరిశ్చ.ఉ.౧౯౪౩.పం.

నలిగొను. అ. క్రి.(నలి+కొను.) ఉత్సాహపడు.

ద్వి. వలపటిదెస మహావరభక్తరాజి, నలిగొన సింహాసనములఁ జేసి. పండితా. వాద. ౧౩౬ పా.

నలితిండి. వి.(√నలి.) చిఱుదిండి, నలి.(చూ. నలితిండికాఁడు.)

నలితిండికాఁడు. విణ. (నలితిండి+కాఁడు.) సోమరి.

సీ... సోమరి నలితిండికాఁడు, దుండుబలి యనంగఁ దోఁచుఁ బ్రాల్మాలినవానిపేరై... ఆం. భా. ౩. ౬.

నలి(ళి)నము. సం. వి. అ.పుం. ౧. సారసపక్షి. ౨. కృష్ణపాకఫలము, కలివె*. న. ౧. పద్మము, తామరపువ్వు. ౨. నీరు. ౩. నీలిక, నీలిచెట్టు.

నలి(ళి)ని. సం. వి. ఈ. స్త్రీ. ౧. పద్మిని, తామరతీఁగ. ౨. తామరకొలను. ౩. పద్మసమూహము, తామరతంపర. ౪. నది. ౫. కొబ్బెర*. ౬. నలిక, నలి అనుగంధద్రవ్యము*. ౭. పాదమునకు పదునైదుఅక్షరములు కలవృత్తభేదము.

నలి(ళి)నీరుహము. సం. వి. అ.న. మృణాళము, తామరతూఁడు.

నలిపెట్టు. స.క్రి. (నలి+పెట్టు.) బాధపెట్టు,బాధించు.

సీ...పుష్పోద్భవధనము లెల్లఁ, గొని వాని నలిపెట్టి...దశకు. ౪. ౭౨.

క. భూపాల యిపుడు రొక్కము, చేపడినధనంబు విడిచి సీమాంతరముల్, నీపజ్జఁ దిరుగుచుండఁగ, నాపాపమె యింత యేల నలిపెట్టంగన్. హరిశ్చ. ౪. ౧౯౭.

నలిబిలి. విణ. (√నలి.) కొఱుకఁబడినది.

సీ.ఈమోవి యింకమీఁద నామోము మునిపంటి ఘాతచే నలిబిలి గాక యున్నె. కువల. ౩. ౫౪.

నలియు= నులియు. అ. క్రి. ౧. నలఁగు, పొడియగు.

ఉ. కొన్నిటఁ బార్శ్వముల్ నలియఁ గొన్నిటి వీపులు పిండుపీఁచు గా, [illegible] ద్భుతగదాహతి సైనికవేట లాడఁగన్. భార. భీష్మ. ౨. ౨౧౧.

క. తోరుఁగుచుఁ దునియుచు నలియుచు, ధరణీభాగమునఁ బడిరి తల చైయుండన్. దశకు. ౨. ౧౩.

ఉ. ... కార్ముకముక్తబాణముల్, పైఁ దొరఁగించి కూల్చుచును బాదహతిన్ నలియంగఁ ద్రొక్కుచున్. హరి. ఉ. ౧. ౧౦౧.

౨. ముక్కలగు, విఱుగు.

వ. ... ఎముకలు నలియఁ బొడిచియు ... ఉ. హరి. ౩. ౮౦.

సీ. ఆపాపజాతి మాసోపవాసినినీడ లంఘింపఁ బోయి కాల్నలియఁ గూలు. నైష. ౮. ౧౩౦.

౩. మృదితమగు.

క. వలుఁదకుచంబుల నఖములు, నలియఁగ ననుఁ గౌఁగిలించి నాతొడమీఁదన్, జెలువా కూర్చుండుము ... ప్రబోధ. ౨. ౮౨.
(నఖములు=నఖక్షతములు అని భావము.)

మ... శిరోజాతముల్, బలిమిం బట్టి వెసం బడం దిగిచి లీలన్ వక్షమున్ మస్తమున్, నలియం బెట్టుఁగఁ గుప్పిగంతుగొని విన్నాణంబు గావించినన్. వి. పు. ౮. ౪౧౪.

౪. చచ్చు. (చూ. నలిసిపోవు.)

౫. చిదుకు.

సీ. క్రతురక్షకులఁ దాఁకి ...బలిమి సదస్యుల నలియ మోఁది. కు. సం. ౨. ౨౦౦.

జ: నలి, నలికండ్లపాము, నలికము, నలికిరి, నలికీఁచు, నలిగులి, నలిగొట్టు, నలిగొను, నలితిండి, నలితిండికాఁడు, ~~నలిబిలి~~, నలిపెట్టు మొ.

నలిరేఁగు. అ. క్రి. (నలి+రేఁగు.) విజృంభించు.

క... కాంపిల్యనగరమున జను లెల్లన్, నలిరేఁగి యార్చి కౌరవ, బలసుభటులఁ బొడిచి రాజి [illegible]న్. భార. ఆది. ౬. ౮౧.

గీ. అట్టియెడ వేల్పు వచ్చినయట్లు మేను,వొంగ
నలిరేఁగి పాండవపుంగవుండు, మత్స్యనృప
నందనునిబలుమాటతోడి,యేపుసెవికినిఁ జూ
డ్కికి నింపు నొసఁగ. భార. విరా. ౫.
౪౦. ద్వి. సారంగ. ౨. ౪౩౪.

నలివాహుఁడు. సం. వి. అ. న. గుఱ్ఱమునకు గడ్డి తీసికొనివచ్చువాఁడు. (వై. ని.)

నలిసిపోవు. అ. క్రి. (√నలియు.) చనిపోవు, చచ్చు.

సీ. ఈఁగలు వడి మూఁగు నీడేఱ వెంతైన నల్లు
లు జనియించి నలిసిపోవు. నీతిసీ. ౫౭.

నలుఁగిడు. అ. క్రి. (నలుఁగు+ఇడు.) ఉద్వర్తనముచేయు,మఱికి పోవుటకై దేహమున పిండి రాచి నలుచు.

సీ. చెలి యోర్తు కుంకుమ నలుఁగిడె భసితావలి
ప్తదేహము హైమదీప్తి మెఱయ.దశా. ౬.
౨౩.

క. పసుపుల నలుఁగిడి రైదువ,బిసరుహాలోచన
లు పెండ్లిపెద్దలయాజ్ఞన్. మను చ. ౫.౫౬.

నలుఁగు= నలఁగు. అ. క్రి. (త. నలుంకు.) నలియగు; కృశించు, తగ్గు.

క. అని తలఁచి కదలి కతిపయ,దినముల నను
జపురి చేరు తెరువున దస్సెన్, దనువు మును
పేద యై నలిఁ,గినమానముకంటె మిగులఁ
గృశమై యుండన్. కేయూర. ౩. ౩౧౧.

వి. ౧. (తలంటుకొనునప్పుడు నూనె మెం. పోవుటకు దేహమునకు రాచు) పిండి.

సీ. అలఁదు నలుంగు దేహమున వేణ్ణి శ్యార్చుఁ
దడియొత్తు మె తనిభవళవస్త్రమున... కాళ.
౪. ౧౧.

౨. ఉద్వర్తనము, తలంటుకొనునప్పుడు నూనె మెం. పోవుటకు పిండి రాచుకొనుసంస్కారవిశేషము.

సీ. కమనీయులో ధ్రకల్కంబునలుఁగున నశ్వం
గతైలంబు నపనయించి. హర. ౪. ౩౭.

సీ. నలుఁగన నుద్వర్తనంబు రాజిలు...ఆం.
భా. ౨. ౧౬౦.

ద్వి. నలుగురి కొక్కట నలుఁగులు పెట్టి, కల
మృదుధ్వమలఁ గంకణములు మెఱయ.రం.
రా. బాల. ౩౪ పా. ౨౬ పం.

౩. మైపూఁత కుపయోగించుకుంకుమ చందనము మొదలైనవి.

ఉ. కుంకుమపంక మిచ్చునలుఁగుల్ మణుఁ
గుల్ నునుఁగీలుగంటులుం, బొంకముఁజూపఁ
దాపసునిపత్త్రిక లుజ్జ్వలహేమపాత్త్రికల్,
కంకణనిక్వణాంకకరకంజములన్ ధరియించి
రత్నతాటంకరుచుల్ దటిల్లతల దాపఁగ
బంతులవెంబడిన్ వడిన్. రా. వి. ౨.౯౯.

జః నలుఁగిడు, నలుఁగుడు,నలుగుఁడుపడు, నలుఁగువెట్టు.

నలుఁగు(ల్గు)డు=నలఁకువ. వి. (√నలుఁగు.) క్రమము; బాధ, కష్టము.

(వ్యవ.) ఈ నలుఁగుడు నే పడలేను.

ఆ. తా వసించుచోటఁ దగ నల్గు డాయెనా,
సౌఖ్యభూమి కపుడు జరుగవలయు, కొలఁకు
లింక నేని కొంగ లందుండునా ... వేమన.
౧. ౬౩.

నలుఁగుడుపడు=నలఁగుడువడు. అ. క్రి. (√నలుఁగుడు.) బాధపడు.

క. నీమగని నంపుఁ జేసెద,నామాటన్ వినుము
తండు నలుఁగుడుపడరా, దోమగువ యరతి
కన్నము, ప్రేమంబునఁ గంచ మరపి పెట్టు
ము దినమున్. శుక. ౩. ౩౬౩.

నలుఁగు(ల్గు)వె(పె)ట్టు. స. క్రి. (√నలుఁగు.) నలుచు, (కుంకుమ పసుపు మొ.వానితో) ఉద్వర్తనముచేయు.

సీ. పసుపుతోఁ గూడఁ గ్రము చాల మేదిం
చి నలుఁగువెట్టెను గూర్కి మెలఁత యోర్తు.
యయా. ౪. ౭౭.

గీ. కలపములతోడిసవయతుకర్దమమున, నలుఁగు
వెట్టించుకొని రాజనందనుండు, మహితమృ
గనాభిపంకంబు మూళిఁ దాల్చి, జలజలోచన
లార్వంగ జలకమాడె. నైష. ౭. ౯౬.

శా. హారిద్రద్యుతిభాసితాంగి యగునయ్యబ్జాక్షి
నెమ్మేనఁ గర్పూరంబుఁ మదకుంకుమంబు
నెద నేర్పల్ మీఱఁగా నల్గువెట్టారూ
ఢిఁ దలయంటె నొక్కచెలి నృత్యత్కంక
ణారావముల్, మీఱఁ సంపఁగితావినూని
యల...ఇందు. ౫. ౩౩.

(వ్యవ.) ఆమె బిడ్డకు నలుఁగుపెట్టినది.

నలుఁడు. సం. వి. అ. పుం. ౧. షట్చక్రవర్తు
లలో నొకఁడు. (నిషధదేశాధీశుఁడు.) ౨. ఒక
వానరుఁడు. (విశ్వకర్మకొడుకు, సముద్రమున
కు సేతువు కట్టినవాఁడు.)

నలుకా(గా)లు. వి. (నాలుగు+కాలు.) నాల్గు
కాళ్లు, పాదచతుష్టయము.

క...ధర్మము పొదలి చరించుఁ గాత మహి న
లుకాలన్. హరి. పూ. ౪. ౧౭౫.

వ...ధర్మంబును బ్రబలంబై నలుకాళ్లను మో
పి నడచె...హరి. పూ. ౪. ౧౩౫.

క. ధరణివరాహం బగుపతి, ధరణి వరాహంబ
పోలెఁ దాల్చిన నేఁడా, తురచరణ మైనధర్మ
ము, కరిగతి నలుగాల నిలిచెఁ గలియుగవే
ళన్. కావ్యా. ౫. ౩౦.

నలుగాలియది=నాలుగుకాళ్లు కలజంతువు.

గీ. అవిన నలుగాలివాన గోవును నశేష,శబ్దముల
మంత్రమును లోకాళిఁ గాంచ,నమును
మనుజాల విప్రుండు సమధికత్వ, భాజనము
లండ్రు వేదప్రపంచవిదులు. భార. శాం. ౧. ౨౧.

శ్లో. చతుష్పదాం గౌః ప్రవరా లోహానాం
కాంచనం వరం, శబ్దానాం ప్రవరో మంత్రో
బ్రాహ్మణో ద్విపదాం వరః. సం. భార. శాం.
౧౧. ౧౧.

క. నలుగాలివానిఁ బక్షుల, జలచరముల విధియు
తముగ సంయోజింపం, బొలిచెన్ బశువులు
మున్నూ,ఱలఘుయశోమహిత యమ్మహాయ
జనమునన్. భార. అశ్వ. ౪. ౧౭౧.

నలుకు. వి. (√నలియు.) ముక్క.

గీ. లలిత మగునొక్కవిజనస్థలంబునందు, నెల్ల
మనుజులు దుష్కరం బిది యటంచుఁ, బలు
కఁ గలబందనలుకులభక్షణమునఁ, బ్రాణము
లు నిల్పికొనుచుఁ దపంబుఁ జేసె. పీఠం. ౧.
౨౨.

నలుగంబాలాట=నాల్గుగంబాలాట. వి. (√నా
లుగు.) నాలుగు స్తంభములఆట, బాలికాక్రీడా
విశేషము.

మ...బొమ్మపెండ్లిండ్లు గుజ్జెనగూండ్లచ్చనగండ్లు
పింపిళులు కుచ్చి ల్గీరసంగింజ లోమనగుం
టల్ కనుమూసిగంత నలుగంబాలాటలోనైన
నఖేలనముల్ మీఱఁగ బోట్లతో నలరు బా
లారత్న మెల్లప్పుడున్. కళా. ౬. ౨౦౨.

నలుగడ(లు). వి. (నాలుగు+కడలు.) నాలుగు
దిక్కులు.

క. ఛటఛటఁ బేలుచు నలుగడఁ, బటుతరశిఖిశి
ఖలు నెగయ...కు. సం. ౬. ౭౦౦.

గీ. బలము లిది యేమి నలుగడఁ బాఱఁ జొచ్చె.
భార. ద్రో. ౫. ౩౭౮.

క. పవిపాష్ఠ యొండకొనలును, మసమసకని యి
రులు కలిసి మన మలరించెన్, దెసల నలుగ
డల గుంజా, విసరంబులసరులు శ్రీలక్షిడిచిన
భంగిన్. నైష. ౭. ౧౨.

విణ. నల్లనిది, కృష్ణము.

గీ. జ్యోత్స్న నాఁగఁ దమిస్ర నా నుభయభార్య, లుడుపతికి నందు నొకతె దెల్పొర్తు నలుప్పు, తాను వారికి మెచ్చుగాఁ దాల్పఁ బోలుఁ, దెలుపు నలుపును నగుమేను నెలఁతె యితఁడు. శైవ. ౮. ౧౭౪.

గీ. ఆనతిమ్ము మహాదేవ యభవ నీదు,కంఠమూలంబు నలుపైనకారణంబు. హర. ౨. ౨.

చ. మృగమదపంకిలాంగు లొకమే నొకమే ఘనసారచందనస్థగితలు నైనకామినులు సాటిగ నొండొరుఁ జల్లి యాడుచో, నగమున నల్పు దెల్పు లగుచాయలు నెందఁ గళిందకన్యకాగగననదీసమాగమముకై వడిఁ బద్దిని యొప్పె నత్తఱిన్. విక్ర. ౫. ౪౭.

జః నలుపెక్కు.

నలుపెక్కు. అ. క్రి. (నలుపు² + ఎక్కు.) నల్లవాఱు, నల్లపడు.

గీ. రోమరాజి తమాలవల్లిమతల్లి,పగిది నలుపెక్కె మెఱసె నా పడఁతినడుమ, నింద్రసామ్రాజ్యహానికి హేతువైన,ధూమకేతువు నభమునఁ దోఁచె ననఁగ. వరాహ. ౩. ౩.

క. అలివేణికిఁ జనుముక్కులు, నలుపెక్కె విలాసవతికి నవనవలవలీ,దళములగతిఁ బాండురరుచి, నలరెం జెలు వమరుచెక్కుటద్దములంతన్. జాహ్నవీ. ౧. ౭౭.

నలుమడి. వి. (√నాలుగు.) నాలుగురెట్లు. (చూ. నలుమడించు.)

నలుమడించు. అ. క్రి. (√నాలుగు.) నాలుగంత లగు, నాలుగురెట్లధిక మగు.

ఆ. ప్రీతి నలుమడింప భీమునిఁ గవల నాలింగనంబు చేసి... భార. విరా. ౫. ౩౪౧.

వ...అని యాదేశింపం బ్రహోదంబు నలుమడింపఁ జతుర్ముఖుండును...కవిక. పీఠి. ౩౯.

స. క్రి. చతుర్గుణించు, నాలుగు రెట్లు చేయు, (చూ. నలుమడించుకొను.)

నలుమడించుకొను. స. క్రి. (నలుమడించు + కొను. స్వార్థమున.) నాలుగురెట్లు చేయు.

ఆ. అస్థి గలిగి హీన మగుజంతువైనఁ ద,ద్ద్విగుణవృత్తి వలయుఁ బ్రగుణజంతు,వునకు నలుమడించుకొనునది...సరమాత్ర, హింస యష్టగుణకృతిహఁ బాయు. భార. అను. ౩. ౨౯౭.

నలుమాఱు. వి. (నాలుగు + మాఱులు.) నాలుగుపర్యాయములు.

క. కలయఁగ సంబుద్ధ్యంతర,ముల నునుపఁగ నలయు నందముగ జయజీవో,జ్జ్వలదేవాదిపదంబులు, నలి నిడుచతురుత్తరంబు నలుమాఱైనన్. కావ్యా. ౪. ౩౭.

నలుమొ(మ్మొ)గంబులప్రోడ. వి. (√నాలుగు.) చతుర్ముఖుఁడు, బ్రహ్మ.

క...తద్దయుఁ బొగడెద వేలుపు, బెద్ద యనన్ జగము లెల్ల బెంచుచుఁ బల్కు, న్మద్దియతో నెఱతామర, గద్దియఁ గొలువుండునల్మొగంబులప్రోడన్. నీలా. ౧. ౧౫.

ఇల్లే: నలుమొగంబులయన్న, నలుమొగంబుల వేల్పు.

వ... కాంచనగిరిశిఖరంబుపై నిండోలగం బున్న యన్నలుమొగంబులయన్న విన్నాణంబు వహించి... ఉ. రా. ౫. ౨౪౭.

సీ. పెనఁటాఁగ యై మ్రోగుచును పొసలకు నేఁగునలుమొగంబులవేల్పుచెలువ దొరయు. నీలా. ౧. ౫౨.

నలుమోమయ్య. వి. (√నాలుగు.) చతుర్ముఖుఁడు, బ్రహ్మ.

మ. ఎలమిం బంగరుటెక్కపక్కెరహుమాయీ తేజి న్నాటించుచున్, నలుమోమయ్య

హుటాహుటిం గదలె...దశా. ౨. ౬౬.

నలువ=నల్వ. వి. (నాలుగు+వా.) చతుర్ముఖుఁడు, బ్రహ్మ.

సీ. నలువనెమ్మోముఁదమ్ములు కేళిగృహములు తళుకుటద్దంబు సత్కవుల మనసు. గీ. ఎప్పుడు నేదేవి కాదేవి...మామకస్వాంతవీథి, నిండు వేడుక విహరించుచుండుఁగాత. నైష. ౧. ౫.

ద్వి. నలువచే వరము లున్నతిఁ గాంచినాఁడు, చెలఁగి దిగ్విజయంబు చేసినవాఁడు. రం. రా. అర. ౧౯౨ పొ. ౨ పం. కాశీ. ౨. ౧౨౩.

ఆ. పలుకువెలఁదిమగఁడు బంగారుకడుపువాఁ, డంచతేజి నెక్కునట్టిరాజు, బమ్మ తాత నలువ తమ్మిచూలి దుగినుఁ, డనఁగ బ్రహ్మపేరు లబ్బమాశి. ఆం. భా. ౧. ౩౯.

నలువచూలి = నారదుఁడు.

క. శుక్రాంతేవాసివసి, శుక్రుఁడు శక్రుండు నలువచూలికి నవియొకఁ. దశా. ౪. ౬౦.

నలువతమ్ముఁడు=మన్మథుఁడు.

గీ. నలువతమ్ముఁడు ముక్కంటి గెలువ నెంచి. ప్రబంధ. ౪౭౩.

నలువతూపు=బ్రహ్మాస్త్రము.

(రామతమ్మఁడు.) సీ. నలువతూ పరివోసి బలిమిసె నద్దోసకారిరక్కసుమేలి గానిమీఁద, నేసిన...అచ్చ. రా. యు. ౨౬౪.

నలువతేజి = హంస, అంచ.

సీ. పాలతో నునుమగతాలతో నలువతేజులతో వేడిసమీలతోడ. అచ్చ. రా. అర. ౨౬.

నలువపట్టి = నారదుఁడు.

గీ...అని వేడుకొనిన నన్నలువపట్టి, చిలువపట్టునఁ బుట్టినబలియుఁ గాంచి. అచ్చ. రా. బాల. ౭౮.

వ...రావణునకు రసాతలజయోద్యోగంబునందు బుద్ధి పుట్టించి యన్నలువపట్టి యంత నిలువక ...ఉ. రా. ౩. ౩౦౬.

నలువపొగాఁ=హంససమూహము.

(కుమారస్వామివర్ణన.) సీ. నలువపొగాబోట యలవరించిన మేటి రాకాసిముక్కాఁక డాకవాని. చం. రా. ౩. ౮.

నలువప్రోలు=సత్యలోకము.

గీ. లలి నిరాబాధనే యుండునలువప్రోలు, బలసి విసదారు లుండు వెంజెలువప్రోలు,...అమ్మేటి వీటి కెనయె. అచ్చ. రా. బాల. ౩౧.

నలువబాబా=హంస.

సీ. పాలసంద్రము లయ్యె నోలి నేర్లన్నియుఁ నలువబాబా లయ్యెఁ బులుఁగు ల్లెల్ల. అచ్చ. రా. అయో. ౨౦.

సీ. నలువబాబాపిండునలివు లెంతయు హెచ్చెఁ బొలముపొంతల నెల్ల పూయఁ బొచ్చె. అచ్చ. రా. కిష్కి. ౬౯.

నలువరాణి=సరస్వతి, వాణి.

గీ. నలువరాణి మదాత్మలో వెలయుఁగాత. మనుచ. ౧. ౫.

క. నీకొలఁది నలువరాణికిఁ, గా కొరులకు నెట్లు తెలియఁగా వలయు వనజ, లోకమున నెవ్వరైనను, నీకు నసాధ్యములు గలవె నిర్మలహృదయా. రాజ. చ. ౩. ౯౨.

నలువ(ల్వ)ంక. వి. (నాలుగు+వంకలు.) నాలుగుదిక్కులు.

మ. నలువంకన్ మలయానిలాంచలముచే నర్తించుపుప్పొడులతోఁ, గోఁడుల్ మీఱు ఫలావళుల్ మెసఁగుచున్ గ్రొమ్మావులం బల్కు చిల్కలతో... వరాహ. ౪. ౧౧౬.

వనమయూరము ...ఉద్యత్స్వలజహితాయత సబాంధవరుచుల్ నల్వంక వెదచల్లు కమలావిభుఁడు దోఁచెన్. వరాహ. ౧౦. ౨౨.

సీ. అదరింప నల్వంక బెదరు పేనలతోడ నరిగె

వివ్వక్సేనుఁ డదటు నూని. దశా. ౪. ౧౦౧.

నలువండ్రు. స. బ.(√నాలుగు-నలువదికి మహా న్మహాత్వర్థకరూపము.) నలువదిమంది.
వ... కేశిదుర్జయాదు లైనదానవులు నలువండ్రు వుట్టిరి... భార. ఆది. ౩. ౬౩.

నలువందు=నలువమరు. అ. క్రి. (√నలువు.) ఒప్పు.
సీ. నాలుగువాకిళ్ల నలువంద వేడుకల్ సవరించుముత్యాలచవిక యైన. రామా. ౬. ౧౨౮.

నలువ(ల్వ)ది. స. జ్ఞా. (నాలుగు + పది.) నాలుగుపదులు.
(రావణుఁడు.) సీ. వెసఁ బేర్చి నలువదివేలయక్షౌహిణుల్ నడచు వేగంబునఁ బుడమి వడఁక. గీ... మధునిపట్టణముమీఁద విడిసె... ఉ. రా. ౪. ౧౩౩.
మ... సారథిశిరఃపాతంబురథ్యధ్వజచ్ఛిదనుఙ్ నల్వదిసాయకంబుల నొనర్చెన్ వేల్పులు ప్పొంగఁగన్. ఉ. రా. ౪. ౩౦౭.

నలువదుగురు. వి. (√నాలుగు.) నలువదిమంది, నలువండ్రు. (నలువదికిమహా న్మహాత్వర్థకరూపము.
సీ... భద్రమతి యనువిప్రోత్తముఁ డొకండు... ఆతనికిభార్య లాఱ్వురు నందను లిన్నూట నలువదుగురు, గలరు... దశా. ౫. ౧౦౪.

నలువమరు=నలువొందు. (√నలువు.)
సీ... గాయక సంగీతగాంధర్వగానముల్ ద్విజవరాశీర్వాద వేదఘోష. గీ. నలువమర వజ్రసింహాసనప్రదీప్త శారదాసక్తుఁడై ... ఉ. హరిశ్చ. ౧. ౬౦.

నలువా(ల్వా)రు. అ. క్రి. (√నలువు.) ఒప్పు.
సీ. వరియించు కెన్నఁడో వరమనోమోదంబు నలువార రాజకన్యాలలామ. చంద్రి. ౪. ౩.
క. కనమే భిరాన నల్వా, రినసన్నిభమొదలు శే

గురించివజడలుఙ్, బెనువంక మీఁదలు గలయ, మునిజడులఙ్ సొంపు వెడలు ముల్లోకములఙ్. వాల్మీకి. ౩. ౧౨౦.

నలువు(ల్వు). విణ. (క. నలువు.) ౧. చక్కనిది; ఒప్పుకలది.
సీ. నల్లలనైనను నలు వైనవెలివున పుట్టె యంటఁగఁ బట్టికట్టి విడువ. గీ... నేర్తు... భార. విరా. ౧. ౧౦౧.
ఉ. కొండలు తమ్మిపువ్వనఁగ... కోమలసారథముల్ మనోద్భవగ్రా,నందకళాస్థితుల్ బెరయన ల్వగుతళ్కులు గుల్కనట్టియా, చందనగంధిముద్దనగు చక్కనివామ చెలంగు భూవరా. ఇందు. ౨. ౧౬౨.
౨. సమర్థము, శక్తికలది.
చ. ... నరపాల నిజంబు సమిత్రియుండ వై, నలువుగ నర్జునచ్ఛిద యొనర్పఁగ వచ్చితి నంచు రాముఁడుఙ్. దశా. ౬. ౧౧౯.
వి. సౌందర్యము, అందము.
గీ. చిఱుతవవ్వవ నిండారుజిగి యుదార,లలితనేత్రాంచలంబులనలువు లెడల, వెన్నుఁ డఖిలైకమూర్తి దా వేణు నాద,ఘనసుధాంభోధి యొండొండఁ గడలుకొలిపె. హరి. పూ. ౮. ౩.
సీ. ఎలతుమ్మెదలదిమ్ము వెలిఁ జిమ్ము చెలువము గలవేణి కొకవింతనలువు మీఱె. పారి. ౧. ౫౬.
ద్వి. చెన్నును నన్నును చెలువును నలువు, నున్నతి సన్నుతి యొప్పును మెప్పు. పండితా. దీక్షా. ౬౦ పా.
౨. ప్రేమము, అనురాగము.
సీ. చూర్ణాలకంబుల సుప్రక్కఁ జక్కఁగఁ దీర్చి నలువు నెమ్మనములో మొలవఁ బెట్టు. వైజ. ౩. ౧౩౨.
... సామర్థ్యము.

గీ. నలువు మెఱయంగఁ బెద్దలసాఁటునుండి, ము న్న దమయింట డాఁకొనియున్న విన్న, మూలదేవరవి లెత్తఁ జాలుమేటి, కిత్తుఁ దన కన్న నంచు నొ ట్టిడుక యతఁడు. అచ్చ. రా. బాల. ౧౭౫.

ద్వి. నిలువుము నీ వన్న నిలువక త్రోన, నలు వున నమ్మేఘనాదుండు నడువ. రం. రా. ఉ. ౩౭ పు. ౨౩ పం. మార్క. ౨.౧౨.

౪. రీతి, విధము.

చ. నలువమెుగంబు లెట్లు సృజనప్రథమాహ మునం దలిర్చు నన్నలువున సిద్ధసాధ్యనర నాగమరుద్వరయోగిమండలీ,కలకలగుంఫితం బు లయి కాంచనచారువు లైననాల్గువా,కిళు లమెలుంగునున్న తనికేతనరాజమునం బ్రసన్నుఁ డై. పాండు. ౨. ౩౭.

వ... నలువనలుమోములందు వెడలునలుతోలుఁ బలుకులనలువున...దశా.౫. ౧౧౫.

జ: నలువందు, నలువమరు, నలువారు, నలువు మిగులు, నలువొందు.

నలువుమిగులు. అ. క్రి. (√నలువు.) ఒప్పు.

గీ. బ్రహ్మసంవేద్య మాదిగాఁ బట్టిసాంత, మతివ గోదావరీనదీహారమునకు, నడుమ నాయక రత్న మై నలువుమిగులుఁ, బంచలింగాశ్ర యము వీరభద్రశిఖరి. కాశీ. ౩. ౩౪.

నలువు(ల్వు)రు= నలుగురు.స.బ. (√నాలుగు. త. నాల్వర్. నాలుగుశబ్దముయొక్క మహన్మ హాత్యర్థకరూపము.) ౧. నాలుగుమంది.

చ. అనుజులు నల్వురుం దనకు నత్యనురాగము నఁ విధేయులై, తనరుచు నుండ... భార. ఆది. ౭. ౭౧.

ఉ. అంబరవర్తి యైనఁ గని యతనిచే నగపడ్డ వీరిప్రాణంబులు మున్న ని న్నడిగి నల్వుర కుఁ నయవిక్రమప్రభావంబుల నేడికొ న్న నతిశక్తులఖ్యాతము బొంది యూదరా, ర్ద్రిఁజగచూడ్కితోఁ బ్రియహితక్షేరభావ ల మాఱడింపజే. భార. విరా. ౧. ౧౭౩.

గీ. అసపడి వీరినలువురయందు నొకని, శ్లేష మా మాచెదము నీవిచేకిళ కి.సెవ.౪.౭౫.

౨. అందఱు.

చ. చెలువముఁ దాల్చి దక్షవయఁ జేరెఁదానిని రావణస్వసక్, నలువురు నవ్వ నత్తెఱఁ గొన ర్పక యేలిన విద్యుమై యతం, డలుగఁడే... ఆము. ౫. ౪౯.

నలువొందు. అ. క్రి. (√నలువు.) ఒప్పారు, శో భిల్లు.

తోటకము. ఇలపై లవణాసురుఁ డిట్లా ఘలక్ కలకాలము వానియసారమునక్, వలనొప్పె దుముమెునవాల్ శివుచే, నలువొందెనుఘూ లమునక్ గలసెక్. ఉ. రా. ౭. ౧౪౩.

పీ. నలువదినంబుల నలువొందుశివుఁ డెందుఁ గలిగె నంచు విరించిఁ గనిరి మునులు. దశా. ౧. ౨౨. ఉ. రా. ౧. ౨.

నలుసాల. వి. (√నాలుగు.) చతుశ్శాల, చుట్టు కొల్లారు, నాలుగిండ్లబవంతి.

సీ... చుట్టుకొల్లారు నలుసాల యనఁ జతుశ్శాల మా... ఆం. భా. ౨. ౧౪.

నలుసు=నలి.వి.(√నలుఁగు.) ౧.శుష్కతృణము.

పీ... నలి యన నలు సన నలరు శుష్క. గీ. తృణము...ఆం. భా. ౨. ౭౬.

౨. తృణము మున్నగువానిలేశము; రేణువు.

ఆ. సంతసగ వియోగిసంతతిపై నలు, సంతయు దయ లేక సంతసమున, సంతపింపఁ జేయు ...రసిక. ౬.౬౬.

(రావణుఁడు). చ. పురలకు గుండెతల్లడము కూపులడెందమున లోనికొట్టు ఫే,చరతతికం టిలో నలుసు...భా. రా. యు. ౨౪౧.

నగ్లడ(లు)=నలుగడ.

మ...వారిద,ప్రతతుల్ సాల్పడి నగ్లడం జెద రఁగా బాలికా మనోవేగుఁడై, పతగేం ద్రుం డమృతాంతికంబునకుఁ దత్పాలు ర్భ యం బందఁగన్. భార. ఆది. ౨. ౯౧.

ఉ. వేటొకచాప మెత్తి యదువీరుఁడు డెబ్బది రెండుబాణముల్, మీఱినపౌండ్రభూవిభుని మేను కలంతటు నాఁటి నగ్లడం, బాఱఁగ వేసి ...ఉ. హరి. ౩. ౫౮.

గీ...నగ్లడలఁ దిరుగుఁ, గుంభకర్ణుండు నడయాడు కొండకరణి. ఉ. రా. ౨. ౧౪౮.

ద్వి. గగన మొక్కింతయుఁ గాన రాకుండ, మొ గులు గాగ్క్రమ్ముచు ముంచె నగ్లడల. ద్వి. పరమ. ౪. ౨౯౦ పా.

నగ్దెస= నలుదెస. వి. (√నాలు|గు.) నలుగడ.

ఉ. క్రన్నన నేవ యన్నియును గైకొని యే లెద నీసహాయులై, చెన్నెసలారువీరు గతచేష్టత నగ్దెసఁ దూలి పాఱఁగన్. హరి. ఉ. ౨. ౧౨౮.

నల్పు(లుపు)దేఱు. అ.క్రి. (నలుపు+తేఱు.) నల్లనగు.

(చెంచుదొరలు.) ఉ. మిక్కిలి నల్పుదేఱుబలు మేనులుఁ జుంజుఱుగడ్డముల్ ... వన్నెలు చూప నెంతయుఁన్. ఇందు. ౨. ౪౭.

నల్ల[1]. వి. ౧. నెత్తురు, రక్తము.

ఆ. నల్లఁ గ్రోల నిచ్చి మెల్లనె చివ్వంగి,నోరి జింకఁ దివియు నేరు పొదవ,వేఁటకాఁడు వో లె...ఆము. ౪. ౧౯౩.

సీ. బలుపచ్చిపొలనుండి నెలవుల దిగజాఱునల్ల వాలుక సాఁచి నాకికొనుచు. ఉ. రా. ౭. ౧౨౦.

౨. రక్తవిశేషము, గట్టిపడిననెత్తురు.

సీ. రక్తవిశేషంబు రాజిల్లు 

భా. ౨. ౧౩౨.

జః నల్లద్రావరి, నల్లద్రావుడు, నల్లాసకప్పెర, నల్లి, నల్లిక, నల్లిపాడ.

నల్ల[2]=నల. వి. (సం. నైల్యం. ప్రా. నేల్లం. త. నల్లం.) ౧. నలుపు.

గీ. అమృతాశ్వంబుధవళదేహంబునందు, నల్ల గలి గిన నీ విప్డు నాకు దాసి, వగుము మఱి యందు నల్ల లేదయ్యెనేని, నీకు నే దాసి నగుదుఁ బన్నిదము సఖియు. భార. ఆది. ౨. ౩౨.

చ. కొడుకులఁ బంచి తెల్పెసఁగుగుఱ్ఱమువాల మునందు నల్ల గ,ల్గెడు క్రియఁ దీర్చి...భార. అను. ౧. ౨౭౭.

౨. కళంకము.

వ. కని కద్రువ వినతం జూచి చూడవె యల్ల యతిధవళం బైనయశ్వంబునందుఁ బూర్ణ చంద్రునందు నల్లయుం బోలె వాలప్రదేశం బునందు నల్ల యై యున్నది...భార. ఆది. ౨. ౩౧.

౩. తప్పు.

గీ. అహాహా యలచంద్రుఁ డనువాఁ డహంకరించి, రోహిణీదేవి నొల్లక రోసి యుండఁ, బాపి నతని క్షయవ్యాధిబాధితునిగఁ, గినిసి శపి యింపనే నల్లఁ గనిన నోర్వ. కాశీ. ౭.౫౧.

౪. బొగ్గు.

సీ. అళిసమూహంబు నల్లలు మందపవనుఁడు చ ర్మభస్త్రిక మావిచయము తలిరు, టాకుజొం పములు తీవ్రానలజ్వాలలు ... ప్రబంధ.౪౪.

గీ...బొగ్గు, న ల్లనంగను గాళికానామము లగు. ఆం. భా. ౨. ౨౪౨.

౫౭. నల్లనిది. (దీనికి వృత్తియందు వికల్పముగా నిగామము.)

సీ. ... రగోత్తమ వాలంబు నల్ల సేసితి

రేని నాకు దాసి, యగు మన వినత...భార. ఆది. ౨. ౩౪.

సీ. పాలసినగబ్బుకంపులు సోకుముట్టైకసీనల్ల తిరునామ మెచటు దొరకె.జై.భా.౩.౭౪.

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపా రసంబుఁ బైఁ, జల్లెడువాఁడు...మల్లియలార మీపొదలమాటున లేఁడుగదమ్మ చెప్పరే. భాగ. ౧౦ పూ. ౧౦౨౦.

జ: నలుపు, నలుపెక్కు,నల్పదేఱు, నల్లఁబాఱు, నల్లకచోరము, నల్లకలువ, నల్లకాఁచి మొ.

నల్లఁబాఱు=నల్లవడు. అ. క్రి. (నల్ల² + పాఱు.) నల్లనగు.

గీ. భావిపురుహూతకుంభికుంభములు మీఁద, న ల్లఁబాఱునిజాత్తజభల్లహతుల, నని యొఱంగిం చువిధమున నామరాళీ,గమనపాలిండ్లకొనలు నీలిమ వహించె. వరాహ. ౩. ౪.

గీ. చన్నుగుబ్బలపోరాటఁ జక్కఁబెట్టఁ, బోయి మధ్యస్థభావంబు పొందలేని,కతన లజ్జించె ననఁగ మొగాలు నల్లఁబాఱుగురువిందపూ సలపేరు వైచు. వరాహ. ౨. ౧౧౫.

నల్లకచోరము. వి.(√నల్ల².) చోరము†.(శ.ర.)

నల్లకాఁచి. వి. (√నల్ల².) ఒకదినుసు మొక్క.

సీ. కామజీలుగు మెట్టదామర వెత్తిసెనగ జంబి రముకాఁచి నల్లకాఁచి. హంస. ౪. ౧౦.

నల్లగగ్గెర. వి. (√నల్ల².) కతింజరము†. (శ. ర.)

నల్లగఱిక. వి.(√నల్ల².) బాలతృణము†. (శ.ర.)

నల్లగల్వ(లువ). వి. (√నల్ల².) ఇందీవరము, నీలోత్పలము.

చ. అవనిజచూపులుఁ రవికులాగ్రణి మైజిగి నల్ల గల్వలుఁ, గువలయనేత్రనవ్వులు రఘుప్ర భుచూపులుఁ దెల్లగల్వ లెక్కువ యయి నిం డె నీటు మును గోసినపువ్వులకంటె రెట్టిగా. ఉ. రా. ౫. ౧౧౦.

గీ...నల్లగల్వపూవంపుటేఁ కేఁ బూని కక్త్రిచెలఁగ. దశా. ౨. ౨౬౧.

సీ. నల్లగల్వ యనంగఁ దెల్లు నీలోత్పలంబు... ఆం. భా. ౧. ౧౬౫.

నల్లగింజెన. వి. (√నల్ల².) నీలపుష్పి†.

సీ. నల్లగింజెన పూరి తెల్లగింజెన యుత్తరేణు గుబ్బిరి సంబరేణు... హంస. ౪. ౧౦. (శ. ర. పా.)

నల్లగినియ. వి. (√నల్ల².) గినియ†. (శ. ర.)

నల్లగిసియ. వి. (√నల్ల²) అతసి†. (శ. ర.)

నల్లగురిగింజె. వి. (√నల్ల².) కృష్ణపాకి†. (శ.ర.)

నల్లగురిజె. వి. (√నల్ల².) కృష్ణగుంజ†. (శ. ర.)

నల్లగూబ. వి.(√నల్ల².)కృతమాలకము†. (శ.ర.)

నల్లగెనుసు. వి. (√నల్ల².) కృష్ణాలువు, ఒకజాతి గెనుసు†. (శ. ర.)

నల్లగొలిమిడి. వి. (√నల్ల².)నీలమూర్వ†.(శ.ర.)

నల్లగోరఁట. వి. (√నల్ల².) ఆర్తగళము†.(శ.ర.)

నల్లగ్రుడ్డు. వి. (√నల్ల².) కనీనిక, కంటిలోని గ్రుడ్డులోనినల్లనిభాగము. (శ. ర.)

నల్లచీమ. వి. (√నల్ల².) మర్కటపిపీలిక.(శ.ర.)

నల్లచెన్నఁగులు. వి. బ. (√నల్ల².) ధాన్యవిశే షము.

గీ. జిలితొగలరాజనములు నలవరులును, దొల్ల నల్లచెన్నంగులు దీవసరులు,నాది యగుపేరు గలవడ్లు...హంస. ౪. ౧౨౫.

నల్లచెఱకు. వి. (√నల్ల².) అనికువు, నిజమయిన చెఱకుగాక దానివలె మధురరసము కలఒకజాతి ఱెల్లు†. (శ.ర.)

నల్లచేమ. వి. (√నల్ల².) కృష్ణాలుకము, ఒకజాతి చేమ†. (శ. ర.)

నల్లచ్చి కాఁడు. వి.(నల్ల² + లచ్చనము + కాఁడు.)

పక్షివిశేషము. (భరద్వాజము అని శ. ర.)

సీ...నల్లచ్చికాఁడును జల్లపిట్ట. గీ. యనఁగ నిట్లని పక్షిభేదాఖ్య లలరు. ఆం. భా. ౨. ౯౭.

నల్లజీలకఱ(ఱ్ఱ). వి. (√నల్ల².) సుషవిక, జీలకఱ్ఱలో నొకభేదము.

సీ. నల్లజీలకఱ నాఁ జెల్లును సుషవిక...ఆం. భా. ౨. ౨౪౯.

నల్లతీఁగె(గ). వి. (√నల్ల².) సర్పాక్షి.

గీ...సర్పాక్షి ప్రబలు నల్ల, తీఁగె నా|...ఆం. భా. ౨. ౫౯.

సీ...చల్ల, పిల్లిమాడఁపు చారపిల్లడు చిత్రమూలము నల్లతీఁగె కోలాకుపొన్న. గీ... మొదలు, గాఁ గలుగు నట్టిచిఱుచెట్లఁ గాంచి యంత. హంస. ౪. ౧౦.

గీ. నల్లతీఁగ గోడుముల్లంగి వెలఁగాకు, చిత్తివేళ్లరసము సేవసేయ, నొడల నలఁద రససముద్భూతవేదనల్, నిలుచు వంగపండ్లనీళ్లు గనిన. (చి.కి. చి.ని.)

నల్లతుమికి. వి. (√నల్ల².) కాకతిందుకము, ఒకజాతితింథుకము. (శ. ర.)

ఘురు వినుమూఁదుఁగ్రోవి, తోలునిచ్చెన మొదలు ముందుగ ధరించి. ప్రబంధ. ౭౫౯.

నల్లదాసరిగాఁడు. వి. (√నల్ల² + దాసరి + కాఁడు.) తాఁబేలు. (నల్లనితాఁబేలు అని బ్రా.)

సీ. తామే లనంగను దాఁబే లనఁగ నల్లదాసరిగాఁడనఁదగుఁగమఠము. ఆం. భా. ౧. ౧౬౧.

గీ. తాను సురమహానిన్నపతినుల్ దాల్చి యకట, కామినీతతి నుడికించుకంటె నట్టె, గండెయును నల్లదాసరిగాఁడు కిరియు, హరియునై పోవుటయమంచి దనుయుగంబు. ఆము. ౫. ౪౧.

నల్లదేవర. వి. (√నల్ల².) కటివేల్పు, విష్ణువు.

సీ. ఇటు నల్లదేవరయింట నంటిననీళ్లజోటిఁ బాయనికొండేఁ జూచినాఁడ. నరస. ౫. ౨౨.
(తెల్లజోటివాయన ముద్రి. పా.)

క. అటు పసిఁడిసరులయమ్మల, దిటు మగుపక్కిదొర నల్లదేవర పోలెన్. అచ్చ. భా. ౨. 50
~~అ. ౧౫. ష.~~

నల్లద్రావరి=నల్లద్రావుడు. (√నల్ల¹.)

శా...వ్రేపల్లెలోఁ, గాలం గోడియనల్లద్రావరి నడంగం జేయుమేల్త్రేటరీ. అచ్చ. భా. 3.

నల్లన. వి. (√నల్ల[3].) కృష్ణవర్ణము.
సీ...నల్లన నల్పు కప్పు కం దనఁగను నొప్పఁ గృష్ణవర్ణంబు...ఆం. భా. ౧. ౧౦౮.
విణ. నల్లనిది.
గీ...శ్రీహరి తద్విభవంబు, ధీరుఁడై యారగించిన దేహ మెల్ల, నల్ల నయ్యెను వ్యాపించి నాఁటునుండి. దశా. ౨. ౨౨౦.
సీ. మేరుశృంగములపై మేఘముల్ దిగురీతి నాతిచూచుకములు నల్ల నయ్యె. ఉ. రా. ౨. ౧౩౪.

నల్లనయ్య. వి. (√నల్ల[3].) కఱివేల్పు, కృష్ణుఁడు, విష్ణుమూర్తి.
(మన్మథోపాలంభనము.) సీ. మాయచే నిన్నుఁ గ్రమ్మఱ నుండఁ జేసెనో నలువొందుమీ యయ్య నల్లనయ్య. ఇందు. ౪. ౪౭.

నల్లనాగు. వి. (√నల్ల[3].) కృష్ణసర్పము, నల్లత్రాఁచు.
సీ. కన్నులు మిణుఁగుఱుల్ గ్రమ్మఁగా బ్రాఁగుచు బు స్సనుచో వేఁడిపొగలు నిగుడఁ, బ్రల్లదంబునఁ ద్రుళ్లునల్లనాగులు నాగవెంజెరలు న బోట్టువెంజెరలును. ద్వా. ౭. ౧౦౦.

నల్లపజే=నల్లప్రజ. వి. (√నల్ల[2].) ౧. కిరాతసంఘము, ఆటవికసంఘము. ౨. కోకిలమూఁక.
చ. కలరవ మూన్చ నల్లపజ కప్పుక రా జెను వెంట రాజమండలి నడతేరఁ జైత్రబలనాథునిఁ గూడి...చంద్రి. ౪. ౭౫. (ఉభయార్థములకు నిదియే యుదాహరణము.)

నల్లపాము. వి. (√నల్ల[3].) నల్లత్రాఁచు.
సీ. హరినీలసోపానసరణి కాఁబోలును బగటుచున్నది నల్లపాఁపపేరు. ప్రభా. ౧. ౬౩.

నల్లపూస. వి. (√నల్ల[3].) నల్లని గాజుపూస. (వివాహములో నాగవల్లిసమయమున వరుఁడు వధువు మెడలో సౌభాగ్యమునకై ఈ నల్లపూసలపేరు కట్టును. దీనినే నాగవల్లికుత్తుకంటు అందురు.)
గీ. నేఁటి కీపాటి నీవు నాత్రాటిమహిమ, నింటికే తేరఁ జల్లగాఁ గంటి నింక, నిదియ పదివేలు వైభవం బెల్లనాఁడు, నల్లపూసలు చెవియాకు నాకుఁ జాలు. శుక. ౨. ౭౪.
గీ. తమ్మివిందు కరగ్రహణ మ్మొనర్పఁ, బొలుచు పద్దినికిని నల్లపూసదండ, గట్టినాఁ డవ నెలడేఁటిగములు పొదలె. రాజ. చ. ౨. ౬౯.

నల్లపేటితాటికాయ=నల్లపేటిపండు. వి. (√నల్ల[3]) నల్లని పేడు- చర్మము- కలతాటికాయ.
గీ. హస్తిపురరాజశరశతహతిని ద్రెళ్లి, రాముడైయుండె సంగ్రామరంగమునను, నరిది ప్రోవులు కేసినల్లపేటి, తాటికాయలగతి దైత్యతతులతలలు. పి. శకుం. ౩. ౧౨౯.

నల్లపేటిపండు=నల్లపేటితాటికాయ. (√నల్ల[3].)
సీ. తాళీవనము మించుఁ దఱచు నున్నతమునై పెరిఁగి యందలినల్లపేటిపండ్లు, కస్తూరికాలి ప్తఖచరాంగనాఘన స్తనకుంభసఖ్యంబు సల్పు చెపుఁడు. వరాహ. ౧౦. ౧౨౭.

నల్లప్రజ=నల్లపజే. మి. వి. (√నల్ల[3].) కిరాతసంఘము, ఆటవికజనము.
వ. ఇట్లు వెడలి విండ్లు వంచుకొని మునుచుకొను నన్నల్లప్రజం జూచి... ఆము. ౬. ౪౬.
క. వీలలఁ గాడుచుఁ దగ విల్కుగోలలఁ గొని నల్లప్రజలు గుములై నడువన్, నీలాంబరుఁడై విభుఁ డుద్వేలాళుకళావిరాజితేజి నెక్కెన్. వేం. పంచ. ౨. ౧౭౫.

నల్లబలుసు. వి. (√నల్ల[3].) వృక్షవిశేషము.
సీ. బండచింతయు నల్లబలుసు సురభి చీకిరేను కూఁకుడు నెమ్మి ప్రేంకణమ్ము. హంస. ౪. ౧౧.

నల్లబల్లెడ. వి. (√నల్ల[3].) వృక్షవిశేషము.
రగడ. నల్లబల్లెడలతో నడగారడవిభంగి...పి. శకుం. ౩. ౨౭౫.

నల్లమందు. వి. (√నల్ల[3].) అభిని.

గీ. నల్లమందును గంజాయిం గల్లుం బోతుం, బిచ్చు
కల మెక్కి... చంద్ర. వి. ౨. ౬౩.

నల్లమడుంగు. వి. (√నల్ల².) మిక్కిలిలోంతైన మడుంగు. (శ. ర.)

నల్లమొసురు. వి. (√నల్ల².) మేఘములచే చీకటియైననాంటిమొసురు.

ద్వి. మొగులు గార్క్రమ్ముచు ముంచె నల్గడల, ముంచి నల్గడ నల్లమొసురుగాం బట్టి. ద్వి. పరమ. ౪. ౨౯౦ పు.

నల్లమేంకతప్పు. వి. (√నల్ల³.) జారత్వము.

సీ. బలభేది గౌతముభార్య నహల్యం గామించి చేయండె నల్లమేంకతప్పు. ప్రబోధ. ౧. ౫౦.

(నల్లమేంక=చింబోతు. దీనికి కామమెక్కువ.)

నల్లలుదీయు. అ. క్రి. (నల్ల⁴లు+తీయు.) బొగ్గులు మొ. దిగందుడుచు.

ఉ. పట్టెపుజుట్టు నిక్కుమెడ బాగుగం జివ్వినయారెపాంక ముక్కొరెట్టలబలిమిమెమిం బురణించినయాంకలజోకులుక్కదగల్, గొట్టకయుండమేపుపలుకోయపుమందులు గల్గుపుంజుం జే, పట్టి గ్రహించు వెన్కం గనుపట్టంగ నల్లలు దీసి యంతటన్. కువల. ౪. ౨౧౩.

నల్లవ(ంబ, ప)డు. అ. క్రి. (నల్ల²+పడు.) నల్లనగు.

(వరూథినికి.) క... చను మొనలు నల్లవడియెన్ ...మను చ. ౩. ౧౧౯.

సీ. తులుకుమించులయంచు గులుకుమించులసంచు బెడంగు పెన్మెం నల్లంబడంగ పేలె. చంద్రా. ౪. ౧౫౯.

(వ్యవ.) మీవాం డీనడుమ చాలా నల్లపడిపోయినాండు.

నల్లవలువదాల్పు. వి. (√నల్ల².) నీలాంబరధరుండు, బలరాముండు.

సీ. నల్లవలువదాల్పుం దెల్లనిబలుదీవిం గన్నులు చెవులుగాం గలుగుతేని. రాఘ. ౨౧౩.

నల్లవేల్పు. వి. (√నల్ల².) కఱివేల్పు, కృష్ణుండు, విష్ణువు.

చ. పొలుపుగ నల్లవేల్పునుం బొక్కిటితామరపువ్వుముద్దుంగోడలి చెలువంబుం జూచి పొగడన్ ముఖపంకజ మొక్కటెట్లు నా, కలవడు నంచు మోములు రయంబున నాలుగు దాల్చి మెచ్చునా, నలినజుం డిచ్చుగాంత... చిరాయురున్నతిన్. చిత్రభా. ౧. ౪.

నల్లవో(వో). అవ్య. (త. నల్ల=మంచిది, పో=లే) ప్రశంసనార్థకము. (ఔర అని శ. ర, చి. ని. అయ్యో అని బ్రౌ.)

ఉ. నల్లవో నిక్క మాడె నృపనందనుముందట ద్రోణుండొక్కండున్. భార. విరా. ౩. ౯౯.

గీ. ఇంతప్రొద్దు కిరీటికెట్టెదుర నిలువ, వెఱవకున్నప్డు ద్రోణుండ వింటివాండు, నల్లవో తన యున్న సేనకు నొకండ, బలిమిం దలమిాఱునేయిట్లు నిలువవలదె. భార. విరా. ౫. ౧౩౬.

ద్వి. నల్లవో పండిత నతపండితౌఘ, నల్లవో పండిత నందితకీర్తి. పండితా. దీక్షా. ౭౦ పు.

ద్వి. అల్లమప్రభురాయ యస్తత్సహాయ, నల్లవో యల్లమ ననుం గన్నతండ్రి. ప్రభులిం. ౨. (చి. ని.)

నల్లసేనము. వి. (√నల్ల².) ఒకజాతిజొన్న.

గీ. నల్లసేనపుగుండులు నడచినట్లు, మంపుగొనిమేయెఱుంగక మలసిమలసి, ... మన్నుంగ, బోతు లెడచొచ్చె... ఉ. హరి. ౪. ౨౬.

ద్వి. నలుపారునల్లసేనపుజంగజాల, నలఘువైభవమున నటు రెండుసాల, ములును... ద్వి. పరమ. ౭. ౫౧౪ పు.

నల్లి. వి. (నల్లు¹+ఇ³.) మత్కుణము.

సీ. తేనె తెట్టెకుఁ జుట్టు రానీఁగ లున్నట్లు పట్టె కంకటి నల్లి పట్టినట్లు. వైజ. ౩. ౧౨౫.

సీ... నల్లినాఁ,గాను మత్కుణ మొప్పు ... ఆం. భా. ౨. ౪౪.

నల్లింద. వి. వృక్షవిశేషము, ఒకానొక చెట్టు.

వ...మఱియునుం బెదపిచ్చి పిసపిచ్చి నల్లింద నుల్లింద యిప్ప కప్పుర మద్ది...మొదలగు పెక్కు తెఱంగుల మ్రాకులు...పి. శకుం. ౨. ౧౮.

నల్లిక. వి. (√నల్లు².) రక్తపుచ్చిక,నలికండ్లపాము,

సీ...నల్లికం చన నలికిరి యన మిండ యం చనఁగ ను మీఱు రక్త, పుచ్ఛి...ఆం.భా.౨.౪౬.

నల్లిపొడ. వి. (√నల్లు².) పికిలిపిట్టలశరీరమందలి వన్నె, మచ్చ.

సీ. మెడతెరువులు నల్లిపొడలు కాలీఁకలు సోఁగ లాగులునిక్కు రాగికాళ్ళు. ప్రబంధ. ౧౩౦.

నల్లిల్లు. వి.(నల్ల+ఇల్లు. శ. ర. త.నల్లార్=పవిత్రమైన.) హోమధూమముచే పవిత్రమైనగృహములు కలది, అగ్రహారము.

ఆ. నందనుండు వనము నల్లిల్లు నిధి సుర, గృహము చెఱువు మేలుకృతి యనంగ, జగతి వెలయు సప్తసంతానములు... కేయూర. ౧.౪.

క. జనులు కవితైవవిద్యా, యని చదువుటఁ గావ్య మధిక మదియును నల్లిల్లును గుడియుఁ జెఱువు నిధియును, వనము సుతుఁడు సంతతము భవస్థితిగతికిఁ. ద్వా. ౧. ౨౮. (చి. ని. పా.)

సీ. అనఘుఁ డై యెనుబదియెనిమిదివేవురు బ్రాహ్మణప్రవరుల బ్రహ్మవిదుల, వెలయంగ నల్లిండ్ల నిలిపి ప్రత్యేకంబ ముప్పండ్రుదానుల నొప్ప నిచ్చి. భార. సభా.౨.౧౨౧.

సీ.కొమరార చెఱువులు గుళ్లు ప్రతిష్ఠించి లోక సంభావ్యంబులుగ నొనర్చి, నిధులు నల్లిండ్లును నిలిపె...హరి. పూ. ౧. ౧౯. కేయూర. ౧. ౪౨.

నల్లె(ల్లియ). వి. చతురంగుళపరిమాణము.

క. నేలకు నల్లెఁడుపొడవుగఁ, గ్రాలుచు మును మెఱయుగురునికరథచక్రము లక్కాలంబున సమరజయ, శ్రీలోపము దెలియ నంటుసిలఁ బడియె నృపా. భార. ద్రో. ౫. ౩౧౬.

శ్లో. తస్య పూర్వం రథః పృథ్వ్యా శ్చతురంగుళ ముచ్ఛ్రితః, బభూ వైవంచ తేనో క్తే తస్య వాహాః స్పృశ న్మహీమ్. సం. భార. ద్రో. ౧౯౧. ౫౫.

ద్వి. నల్లెంట నొక్కొక్క నవలత గలదు. పండితా. పర్వ. ౩౪౮ పు.

క. వ్రేలెఁడు నల్లెఁడు జుత్తెఁడు, నేల లెడ గ్రాఁగ నిలిచి నిర్జరమనుజ, వ్యాళవరులు...కకు.౫. ౪౧. హరి. ఉ. ౬. ౧౧౨.

నల్లెరు= నల్లేరు. (చి.ని,శ.ర.)

నల్లేరు. వి. వజ్రవల్లీ.

సీ. వజ్రవల్ల్యాఖ్య యై వఱలు నల్లే రన ... ఆం. భా. ౨. ౬౦.

గీ. ... నల్లేరు నులిజెము డాకుజెముడు,వేలశీఁట కసిందెయుఁ గోలజెముడు ... మొదల్గు, గాఁగలుగునటిచిఱుచెట్లు...హంస.౪.౧౦.

నల్లేరుపైబండివలె=నిరాతంకముగా.

(వ్యవ.) వీఁడు వానిమీఁదికి నల్లేరుపై బండివలె పోవుచున్నాఁడు.

నల్వ=నలువ.

చ. అమలమరాళయానచతురానన భావమువర్ణదేహవిభ్రమముల నిద్దఱుం దొరపి బ్రహ్మయు శక్తియు నైనతా రభేదమున నటించు లీల విశదంబుగఁ దెల్పుచు నల్వయుఁ జవ్వ్రోరమణియు నిత్తు రీప్సితవరంబులు... ప్రబోధ. ౧. ౫.

ఉ. వేలుపుఱేఁడు నల్వయును వెన్నుఁడుఁ గొ ల్వఁగ మంచుఁగొండరా,చూలిని గూడి వేడు కలఁ జొక్కుడురే నెలతాల్పుఁ గొల్చెదన్. శిలా. ౧. ౧.

నల్వకొమరుఁడు=జాంబవంతుఁడు.

సీ...గాలి,కొడు కంగదుఁడు నల్వకొమరుఁడు మొదలగుదొరలును దమ్ముఁడు జెరసి కొల్వ. అచ్చ. రా. యు. ౫౭౫.

నల్వగుడ్డు=బ్రహ్మాండము.

చ. పగ లిరు లెల్లెడన్ గలియఁ బర్వవె సంద్ర ము లింకఁ బాఱవే, రగులదె నల్వగుడ్డుగమి రాముని కించుక కీడు గల్గినన్. అచ్చ. రా. ఆర. ౪౭.

నల్వము. సం. వి. అ. పుం. నాలుగువందలమూ రలపరిమాణము.

నవ. వి. (√నవయు. క. నవె.) దురద, కండూతి.

గీ. దూల జిల నవ నస గాఁడు దురద యనఁగఁ, బరఁగుఁ గండూతి...ఆం. భా. ౨. ౧౭౯.

నవ. సం. వి. ఆ. స్త్రీ. ప్రత్తిచెట్టు. (కే.ని.)విణ. ౙ. (న్.) తొమ్మిది. (తెలుఁగున సమాసపూర్వ పదముగా నే యుండును. ఉదా:- నవగ్రహము లు, నవధాన్యములు మొ.)

నవత. వి. (√నవయు.) కష్టము, శ్రమ. (దుఃఖ ము అని శ. ర.)

ద్వి. పట్టంబు నామీఁదిభక్తికై మాని,నారచీర లు జడల్ నవఁత మైఁ దాల్చి,నాకొఱకఁ గోరు చున్న మహామహుండు. రం.రా. అర.౧౫౩ పొ. ౨౩ పం.

ద్వి. తెవులు నొప్పులు లేవు తిరిపెంబు లేదు, నవఁతఁ బొందుట లేదు నరకంబు లేదు. రం. రా. ఉ. ౧౩౩ పొ. ౨౪ పం.

౨. క్షయరోగము.

సీ...క్షయము నవఁత నాఁగ విలసిల్లు...ఆం. భా. ౨. ౧౨౪.

నవకము. వి.౧.అత్యంతమార్దవము; మృదుత్వము.

సీ. నవకంబు మీఱుక్రొన్ననదండ సవరించి వలి చన్నుఁగవఁ జెన్నొలయఁ జేసి. హరి. ఉ. ౪. ౨౫౦.

గీ. నవశిరీషసుమంబుల నవకమునకు, నన్నదమ్ము లు వోనినీయడుగుఁదమ్ము,లెంతదూరము నడి పింప నిచ్చగించె,నొక్కొ నిర్దయు మైననీ యుల్లమిపుడు. నైష. ౪. ౭.

౨. అందము, ఒప్పు.

సీ. అళికులంబులకప్పు గలయంతయును బుచ్చి నాఱుపోసినభంగి నవక మెక్కి. భార. విరా. ౨. ౫౨.

సీ. నవ లంకురము నొంది నవకంబుతోఁగూడ బలసి లేఁదావులకలిక లయ్యె. పి. శకుం. ౨. ౧౨౬.

విణ. ౧. మృదులము, కోమలము.

క. ముల్లు తలకొననినవకపుఁ,బల్లవములతోడ... పువు,లుల్లసిలు నలర్కుశాక మొదుగఁగఁ గొ నుచున్. ఆము. ౪. ౧౯౫.

గీ. శ్యామలోపరినిబిడపత్త్రాభ్రములకుఁ, గాండ మండంబు దిగువాన కాల్లు కాఁగఁ, బంకరు హానేత్ర వర్షరుశంక నొసఁగు,పోఁకబోది యనవకంపుమోకఁ గంటె. మను చ.౩.౭౯.

సీ.నడపాడ నేర్చినవకంపులత లనఁ బొలు పొం దువెన్నెలబొమ్మ లనఁగ. ధనా. ౨. ౨౩.

౨. అందమైనది.

చ.నవకపుమావిమోకలఁ బెనంగినతీవలు వేడ్కఁ బెంపఁ బల్లవములసైఁ జుల్లముల లజ్జ లడం పఁగ...నిర్వ ర. ౩౨.

క. వాడక వాలక తెవుళులఁ,గూడక తగ నల్ల గారలుగొని నవకము లై,చూడఁగ భద్రము లగుచున్న, వీడెన్ సస్యంబు లిడుమ వీడెం

 ... భాగ. ౧౦. పూ. ౭౫౭.

సీ. ధవళతరచ్ఛాయ నవకంబు లై నపచ్చసరా
లు విపులవక్షమున నైచి. వరాహ. ౬. ౪౦.

నవకము. సం. వి. అ. న. తొమ్మిదింటిసమూహము, తొమ్మిది.

నవకారిక. సం. వి. అ. స్త్రీ. ౧. నవోఢ, క్రొత్త పెండ్లికూఁతురు. ౨. నూతన మగు కారిక. ౩. నూతన మగుకృత్యము.

నవగోజె. వి. గొప్పగుడారము.

సీ...నవగోజ యనఁగను గొప్పగుడార మై యొప్పు చుండు. ఆం. భా. ౨. ౧౪౯.

నవగ్రహములు. సం. వి. అ. పుం. బ. సూర్య చంద్రాంగారకబుధబృహస్పతిశుక్రశనిరాహుకేతువు లనుతొమ్మిదిగ్రహములు.

నవచత్వారింశత్తమము= సం. నవచత్వాశింశము.

నవచత్వారింశత్తు. సం. విణ. (త్) స్త్రీ. నలువదితొమ్మిదింటియం దుండుసంఖ్య కలది. వి.త్. స్త్రీ. నలువది తొమ్మిదింటియం దుండుసంఖ్య. (వాచ.)

నవచత్వారింశము. సం. విణ. (అ. ఈ. అ.) నలువదితొమ్మిదవది.

నవతము. సం. విణ. (అ. ఈ. అ.) తొంబదియవది. వి. అ. పుం. ౧. కుథము, ఏనుఁగుపైని పఱచుకంబళి. ౨. కంబళము.

నవతి. సం. విణ. (ఇ) స్త్రీ. తొంబదింటియం దుండుసంఖ్య కలది. వి. ఇ. స్త్రీ. తొంబదింటనుండుసంఖ్య.

నవతిక. సం. వి.ఆ.స్త్రీ. ౧=నవతి. ౨-తొంబది వెండ్రుకలు కలది - క్రొత్తదిగా చేయునది - ముచ్చివానికుంచె, వాగఱ.

నవతితమము. సం=నవతము.

నవత్రింశత్తమము. సం = నవత్రింశము.

నవత్రింశత్తు. సం. విణ. త్. స్త్రీ. ముప్పదితొమ్మిదింటియం దుండుసంఖ్య కలది. వి. త్. స్త్రీ. ముప్పదితొమ్మిదింట నుండుసంఖ్య.

నవత్రింశము. సం. విణ. (అ. ఈ. అ.) ముప్పదితొమ్మిదవది.

నవత్వము. సం. వి. అ. న. ౧. క్రొత్తదనము. ౨. తొమ్మిదింటిధర్మము, నవత్వసంఖ్య.

నవదశ. సం. వి. న్, న. బ. ఏకోనవింశతి, పందొమ్మిది.

నవదశము. సం. విణ. (అ. ఈ. అ.) పందొమ్మిదవది, ఏకోనవింశము.

నవదీధితి. సం. విణ. (ఇ) ౧. క్రొత్తకాంతి కలవాఁడు. ౨. తొమ్మిదికిరణములు కలవాఁడు. వి. ఇ. స్త్రీ. ౧. క్రొత్తకాంతి. ౨. క్రొత్తకిరణము. ఇ. పుం. అంగారకుఁడు.

నవదుర్గలు. సం. వి. ఆ. స్త్రీ. బ. తొమ్మిదిమూర్తులుగ కూడినదుర్గలు.

శ్లో. ప్రథమం శైలపుత్రీచ ద్వితీయం బ్రహ్మచారిణీ, తృతీయం చంద్రఘంటేతి కూశ్మాండీతి చతుర్థకం, పంచమం స్కందమాతేతి షష్ఠం కాత్యాయనీతిచ, సప్తమం కాళరాత్రిశ్చ మహాగౌరీతి చాష్టమం, నవమం సిద్ధిదా ప్రోక్తా నవదుర్గాః ప్రకీర్తితాః. బ్రహ్మకైవర్తపురాణము.

(కుమారిక, త్రిమూర్తి, కళ్యాణి,రోహిణి,కాళి, చండిక, శాంభవి, దుర్గ, భద్ర అని కొందఱు.)

నవద్వారము. సం. విణ. (అ. ఆ. అ.) తొమ్మిది ద్వారములు కలది. వి. అ. న. దేహము.

ఇశ్లో: నవరంధ్రము, నవచ్ఛిద్రము.

నవధాతువ్రల్లు. సం. వి. ఉ. పుం. బ. తొమ్మిది

విధము లగుధాతువులు.

శ్లో. హేమతారారనాగాశ్చ తామ్రరంగేచ తీక్ష్ణకం, కాంస్యకం కాంతలోహంచ ధాతవో నవకీర్తితాః. (బంగారు, వెండి, ఇత్తడి, సీసము, రాగి, తగరము, ఇనుము. కంచు, కాంతలోహము.)

నవధాన్యములు. సం. వి. అ. న. బ. తొమ్మిది విధము లగుధాన్యములు. (గోదుమలు, యవలు, కందులు, పెసలు, సెనగలు, బొబ్బరలు, నువ్వులు, మినుములు, ఉలవలు.)

నవనము. సం. వి. అ. న. స్తోత్రము చేయుట.

నవనవతము. సం. విణ. (అ. ఈ. అ.) తొంబది తొమ్మిదవది.

నవనవతితమము=సం. నవనవతము.

నవనవమను=నవనవలాడు. అ. క్రి. (నవనవ+అను.) మృదువగు, కోమలమగు.

క. నవనవమను నెమ్మేనులు, రివరివమను మధ్యములు ద్విరేఫశ్రేణుల్, జవజవమను వేణికి మది,రవరవమను మరుఁడువారిరంగులు గనినన్. చమ. ౩. ౧౦౮.

నవనవలాడు=నవనవమను.

(పార్వతి)ద్వి. మాటలు తేటల మహిఁ జేసుకొన్న, విద్దెల బుద్ధుల వెల లేనిపనుల, ముద్దులముద్దులమురి పెంపుగతుల, మేటియై నూటియై మించినలీల, నాఁటికి నాఁటికి నవనవలాడు, తనువున కొకవింత తళుకుప్పతిల్ల, వనిత కంతంత జవ్వనమంకురించె. మృ. వి. ౧. ౮.

(వ్యవ.) ఈనీటివంకాయలు నవనవలాడుచున్నవి.

నవని. సం. వి. ఈ. స్త్రీ - క్రొత్తగా తీయఁబడినది- నవనీతము, వెన్న.

నవనిధులు. సం. వి. ఇ. పుం. బ. కుబేరునితొమ్మిదినిధులు. (మహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, ఖర్వము. వరము అని కొందఱు.)

నవనీతంపుఘుటికలు. వి. బ. భక్ష్యవిశేషము.

వ... తిరువీసంబు పరమాన్నం బానవాలు జున్నులు మీఁగడ తెరలు నవనీతంపుఘుటికలు... ప్రబంధ. ౧౧౨.

నవనీతకము. సం. వి. అ. న. ౧. నెయ్యి. ౨. వెన్న. (వాచ.)

నవనీతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్రొత్తగా పొందింపఁబడినది. ౨. క్రొత్తఁగా తీయఁబడినది. వి. అ. న. వెన్న.

నవనీయము=నోతవ్యము. సం. విణ. (అ.ఆ.అ.) నుతింపఁదగినది.

నవపంచాశత్తమము. సం=నవపంచాశము.

నవపంచాశత్తు. సం. విణ. త్. స్త్రీ. ఏఁబదితొమ్మిదింటి నుండుసంఖ్య కలది. వి. త్. స్త్రీ. ఏఁబదితొమ్మిదెంటి నుండుసంఖ్య.

నవపంచాశము. సం. విణ. (అ. ఈ. అ.) ఏఁబదితొమ్మిదవది.

నవపాణిగ్రహణ. సం=నవోఢ.

నవప్రసూత. సం. వి. ఆ. స్త్రీ. క్రొత్తగా ప్రసవించినస్త్రీ. పురుటాలు.

నవప్రసూతి. సం. వి. ఇ. స్త్రీ. క్రొత్తగా ప్రసవించినయాఁడుది, పురుటాలు.

నవఫలిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. క్రొత్తగా రజస్వల యైనపడుచు. ౨. నవోఢ, క్రొత్తగా పెండ్లియైనబాలిక. (విల్యమ్సు.)

నవమము. సం. విణ. (అ.ఈ.అ.) తొమ్మిదవది.

నవమల్లిక. సం. వి. ఆ. స్త్రీ. విరజాజి.

నవమాలిక. సం=నవమల్లిక.

నవమి. సం. వి. ఈ. స్త్రీ. పక్షమునందు తొమ్మిదవతిథి.

నవము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. క్రొత్తది, లేఁతది. ౨. ఆధునికము, ఇప్పటిది. వి.అ.పుం. ౧. స్తోత్రము. ౨. ఎఱ్ఱగలిజేరు, రక్తపునర్నవ.

నవయించు=నవయఁజేయు. స.క్రి.(√నవయు.) కష్టపెట్టు, బాధపెట్టు.

చ. ఎలప్రాయపోని మేని నవయించియు ...తుదిఁ దపంబున నయ్యెడి దేమి సెప్పుమా. కు.సం. ౭. ౮౭౨.

నవయు. అ.క్రి. (క. నవె.) ౧.(రోగాదులచే) కృశించు, చిక్కు, ఎండిపోవు.

క. నాగాయుతసత్త్వుఁడు దివ్యజ్ఞానాయతహస్తుఁ డనిలనందనుఁడు మహోద్వేగాత్తుఁ డగుచు డస్సిన, నాగముక్రియ నుండకున్నె నవసి వనమునన్. భార. అర. ౫. ౩౩౦.

గీ. పవనపర్ణాంబుభక్షులై నవసి యినుపకచ్చడాల్ గట్టుకొనుమునిమ్రుచ్చు లెల్లఁ, దామరసనేత్ర లిండ్ల బందాలు గారె. మనుచ. ౨. ౭౩.

గీ. సవనకృత్యంబు లడఁగిన నవసినవసి, వాసవాదిసుపర్వులు వసుగులైరి. వరాహ. ౭. ౫౨.

౨. క్షీణించు, తగ్గు.

క. మండలము నవయ నరిక్రొవ్వి, గుండినసింహాసనంబు లుర్విన్ వినమే. ఆము. ౪. ౨౧౬.

౩. శ్రమపడు, కష్టపడు.

సీ. వసుమతీరాజ్యంబువలన నిరస్తులై మునివృత్తి నత్యుగ్రవనములోన, నవయుచుఁ బాండుభూనాథనందను లున్నవా రని విని ...భార. అర. ౧. ౧౨౨.

శ్లో...శ్రుత్వా ...పాండవాన్ దుఃఖసంతప్తాన్ సమాజగ్ము ర్మహావనే. సం.భార. [illegible]

ఆ. అలుఁబిడ్డ లాఁకటులై లేమిఁ గుందుచుఁ, దెవులుచేతఁ బడుచు నవయుజనులు, మున్ను క్రోధలోభముల నాస్తికతఁ బడ్డ, పీడనంబు సేసి పేర్చినారు. భార. అను. ౫. ౯౫.

ఆ. మునివరేణ్యుశాపమునఁ జేసి యిట్లు నవయుచున్నవాఁడ నాఁటఁగోలె. భార. అర. ౪. ౧౧౯.

శ్లో. సోఽహం శాపా దగస్త్యస్య బ్రాహ్మణా నవమత్య చ, ఇమా మవస్థా మాపన్నః పశ్య దైవ మిదం మమ. సం. భార. వన. ౧౮౧.౧౪.

జః నవ, నవఁత, నవయించు.

నవరత్నములు. సం.వి.అ.న. బ.౧. మౌక్తికము, మాణిక్యము, వైడూర్యము, గోమేదకము, వజ్రము, విద్రుమము, పుష్యరాగము, మరకతము, నీలము అను తొమ్మిదివిధముల రత్నములు. ౨. ధన్వంతరి, క్షపణకుఁడు, అమరసింహుఁడు, శంకువు, బేతాళభట్టు, ఘటకర్పరుఁడు, కాళిదాసుఁడు, వరాహమిహిరుఁడు, వరరుచి అను విక్రమాదిత్యుని యాస్థానపండితులు. (వాచ.)

నవరసములు. సం. వి. అ. పుం. బ. (అలం.) శృంగారవీరకరుణాద్భుతహాస్యభయానకబీభత్సరౌద్రశాంతములు అనుతొమ్మిదిరసములు.

నవరసు=నవరను. వి. ఒకవిధ మగు బంగారునాణెము, కాసు.

క. కేళికి కన్యలె నవరసా, యాలేమం బిలువ మనిన యధికార్యర్థో, త్తాలబిలోవవ నరసో, న్మీలఝుళంఝుళితకింకిణీనిక్వణ యై. బహు. ౫. ౬౨. (నవరసు=శ్రేష్ఠురాలుఅనిభావము.)

నవరాత్రములు. సం. వి. అ. న. బ. తొమ్మిది రాత్రులు. (౧.వసంతనవరాత్రములు. చైత్రశుద్ధప్రతిపత్తు మొదలు తొమ్మిదిరాత్రులు. ౨. గణపతినవరాత్రములు. భాద్రపద శుద్ధ చతుర్థి మొదలు తొమ్మిదిరాత్రులు. ౩. దేవీనవరాత్రములు.

ఆశ్వయుజశుద్ధప్రతిపత్తు మొదలు తొమ్మిదిరాత్రులు.)

నవరు = నగరు. వి. రాజగృహము. బ. నవళ్లులు నవళ్లు.

క. వివిధోత్సవంబులకుఁ, నవళులలోఁ దోఁచు కీడునకుఁ దోడ్తోఁ గాం, తివిధానంబున నిరసన్యమవును బురోహితునిచేతననవద్యముగఁ. భార. శాం. ౨. ౩౦౮.

నవశతము. సం. వి. అ. న. నవోత్తరశతము, నూటతొమ్మిది.

నవశాయకుఁడు. సం. వి. అ. పుం. ఆయాయి నిమ్నజాతివాఁడు. (వీరు తొమ్మండ్రు.)

శ్లో. గోపో మాలీ తథా తైలీ తంత్రీ మోదక వారుజీ, కులాలః కర్మకారశ్చ నాపితో నవ శాయకాః. పరా. (వాచ.)

నవశ్రాద్ధము. సం. వి. అ. న. మరణదినము మొదలుకొని బేసిదినములందు చేయఁదగినశ్రాద్ధభేదము.

నవషష్టము. సం. విశ. (అ. ఈ. అ.) అఱువది తొమ్మిదవది.

నవషష్టి. సం. విశ. ఇ. స్త్రీ. అఱువదితొమ్మిదింటియం దుండుసంఖ్య కలది. వి.ఇ. స్త్రీ. అఱువదితొమ్మిదింట నుండుసంఖ్య.

నవషష్టితమము. సం=నవషష్టము.

నవసప్తతము. సం. విశ. (అ. ఈ. అ.) డెబ్బది తొమ్మిదవది.

నవసప్తతి. సం. విశ. ఇ. స్త్రీ. డెబ్బది తొమ్మిదింట నుండుసంఖ్య కలది. వి.ఇ. స్త్రీ. డెబ్బది తొమ్మిదింట నుండుసంఖ్య.

నవసప్తతితమము. సం=నవసప్తతము.

నవాతు. వి. (ఉ. నవాత్.) శర్కరాభేదము.

సీ. శర్కరాభేదసంజ్ఞలు నవా... కండ మనఁగను బొలుపు గాంచు. ఆం. భా. ౨. ౨౫౧.

సీ. పూతనచనుఁబాలఁ బొడముచేఁ దడఁగనో త్రేఁతవా తెలుమేల్నవాతు గొనుట. బళిర కలిపేల్పుశతకము. ౭. ప. (చిం.ని.)

క. కొమ్మపయి పతుపాతము, నెమ్మెయి నెలపుదువి దేల యోఁచెద వకట్యాకమ్మఁగ నవాతుచక్కెర, క్రమ్మఁగ మాటాడు దవర కలకంఠవరా. విజ. వి. ౩. ౫౭.

నవారు. వి. (హిం. నవార్.) చిత్రాలపట్టిక, పట్టెడ, పట్టెమంచమునకు నేసెడుపట్టెడ.

సీ. చిత్రాలపట్టిక చెలఁగు నవారన... ఆం. భా. ౨. ౧౬౪.

సీ. తగటిరుమ్మితాపుతానవారు కసీదుసిస్తుబందరుచీటిల సరీలు. హంస. ౫. ౩౫౦.

నవాశీతము. సం. విశ. (అ. ఈ. అ.) ఎనుబది తొమ్మిదవది.

నవాశీతి. సం. విశ. ఇ. స్త్రీ. ఎనుబదితొమ్మిదింటియందుండుసంఖ్య కలది. వి. ఇ. స్త్రీ. ఎనుబదితొమ్మిదింటియం దుండుసంఖ్య.

నవాశీతితమము. సం=నవాశీతము.

నవాసారము. (సం. నవక్షారః.) ఒకదినుసు ఉప్పు. (శ. ర. నవాసాగర మని వ్యవహారము.)

(వ్యవ.) గిన్నెలు కళాయి చేయుటకు నవాసారముపయోగించును.

నవి. వి. ౧. కరగోడ పెట్టుటకు నిడుపున త్రవ్వియెత్తిన మట్టిపల్లము. (శ.ర.) ౨. తోఁట మొ. వానికట్టునకు పెట్టుచిన్నగోడకై దానిప్రక్కనే త్రవ్వినకాలువ.

శాసనము... దూర్పున నాగుమరితోట్ల నవియును... దా. శా. ౧౦౧౭.

నవిత. సం.విణ. (ఋ. త్రీ.ఋ.) నుతించువాఁడు.

నవితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁ దగినది.

నవిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) నవతమము, మిక్కిలి క్రొత్తది, పెక్కింటిలోఁ క్రొత్తది.

నవీనము. సం. విణ. (అ. ఆ. అ.) క్రొత్తది, ఆధునికము, ఇప్పటిది.

నవీయము. సం. విణ. (స్. యసీ. స్.) నవతరము, రెండింటిలోఁ క్రొత్తది.

నవుకు=నాకు. విణ. (√నవి.) పల్లము, నిమ్నము.

సీ...పల్లము నవుకుఁ బల్లనఁగ నిమ్నంబు దనరు. ఆం. భా. ౧. ౧౫౯.

వి. మొట్టి. (చూ. నాకు.)

నవుడుకొట్టు=నాడుకొట్టు. అ. క్రి. మిణకరించు.

ద్వి. అని యిట్లు దేవేంద్రుఁ డాడినమాట,విని యును వినకట్లు విస్మయం బంది, వ్యకనుఁ డూరకయుండె భాగ్యవుండు, నవుడుకొట్టెను నీళ్లునమలెఁ గళ్యపుఁడు.ద్వి.హరిశ్చ.పూ. ౨౧౮ పం.

నవుబత్తు=నౌబత్తు. వి. చర్మవాద్యవిశేషము.

సీ...రాజాబహాదరు, మొదలైనబిరుదులు ముఖ్యమౌ తెల్లజెండా నవుబత్తును ఢక్క యాది, గలిగినరాజచిహ్నలాసంగఁబడె...రంగా. ౧. ౧౧౭.

నవురు=నౌరు. విణ. (క. నవుర.) మృదువు, మెత్తనిది. (శ. ర.)

నవోఢ. సం. వి. ఆ. స్త్రీ. క్రొత్తగా పెండ్లియైనది,నూతనవివాహిత.

నవోద్ధృతము. సం.విణ. (అ.ఆ.అ.) క్రొత్తగా ఎత్తఁబడినది. వి. అ. న. నవనీతము, వెన్న. (వాచ.)

నవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్రొత్తది, ఆధునికము, ఇప్పటిది. ౨. నుతింపఁదగినది. వి. అ. న. స్తుతి. పుం.క క్రతుప్రసన్నన్య...జేసక్.

నవ్వ. వి. బాలకుఁడు.

సీ...బాలకసంజ్ఞ నవ్వ నవ్వ, పోఁప పోఁపఁడు... ఆం.భా. ౨. ౧౧౯. (ప్రాఁతప్రాఁత ప్రతులు, బ్రౌ. పా.)

నవ్వాడు. అ. క్రి. (నవ్వు+ఆడు[1].) నవ్వుతో నొప్పు.

ఉ. జాబిలిమ్రానటతోఁ గులుకుచక్కవకుబ్బలతో మిటారినవ్వాలికడువెన్నెముతో నిలుకుటందెలతో నసియాడుకానుతో, సారసగంధి...ఒయ్యారము మీఱ వచ్చునోకో... దశా. ౨. ౩౫౦.

నవ్వించు=నగించు. స. క్రి. (√నవ్వు.) నవ్వఁజేయు, హాసింపఁజేయు.

గీ. విభుఁడు పరిహాస మాడి నవ్వించుఁగాని,పడయలేఁడయ్యె నెన్నియుపాయములను,రాజబింబాస్యతాంబూలరాగసుభగ, దంతరుచిబిందమాలికాదర్శనంబు. వైవ. ౭. ౧౭౩.

క. కదు నవ్వించుచుఁ జెలఁగులు,ముడివెట్టుక పేర్కొండు ముదిత కసుబోమల్, ముడివెట్టె నాలి సిగ్గున,ముడివెట్టెక నారి చెఱకువిలుసన మనుఁడుక్. మను౮. ౫. ౯౪.

సీ. అతివపదాహతి కనువయ్యెఁ గంకేళి పడఁతి నవ్వింపఁ బొల్పడియెఁ బొన్న. చం. రా. ౬. ౧. ఉ. రా. ౩. ౨౧౫.

నవ్వ(వు)=నగు,నౌ. స. క్రి. ౧. అపహసించు, గేలిసేయు.

గీ. మిగుల నామనిఁ బచ్చచాంపేయకముల,నమ్మి కడపల్లెఁ దము వైచినాఁడు మగుడ, నాసపడువారి నవ్విన ట్లులవిచ్చెఁ, గలయమూతులకేతకీప్రసవతతులు. ఆము. ౪. ౯౪.

సీ. ఇంకఁ దాఁ గాక న న్నెవ్వరు నవ్వెద రా హవంబున నోడి యరుగుచుండ. దశా. ౨. ౪౧౩.

చ. వనిత యొకర్తు ... హరిఁ జూచెఁ గేకిసలు కొట్టుచు బోటులుఁ దాని నవ్వఁగన్. పారి. ౩. ౧౨. విక్ర. ౧. ౪౯.

౨. పోలు.

సీ... సెలతాల్పుబలువేల్పుచెలువు నవ్వి.గీ... వెలుఁగొందు నారాచవేల్పు ఱేఁడు. నీలా. ౧. ౪౫.

గీ. విద్యుత్కైవడి ముక్తికి విడిది యగుచు, నాత్త విధమున నానంద మైనయిచట, నున్నసర్వేశునాదలపిన్నచంద్రు, నవ్వుచున్నది గంగ ఫేనములచేత. ప్రబోధ. ౪. ౪౫.

శా. ఆదివ్యాపధరాజిచేఁ దమమహావ్యాధివ్యథల్ దీఱినన్, మోదం బంది లతాంగు లంబుజములంబున్ నవ్వకందోయితో...చెలంగి సురనారీనూనుఁ గీర్తించుచున్. మనుచ. ౬. ౧౪. కళా. పీఠి. ౭౬.

అ. క్రి. ౧. హసించు, హాసముచేయు.

చ. అనవుడు బ్రాహ్మణప్రవరుఁ డల్లన నవ్వుచు నిన్ను జారయన్, మనమున వేడ్క పుట్టి నరనాయక వచ్చితి నేను ధర్మజుడన్.భార. అశ్వ. ౨. ౯౫.

శ్లో. తతః ప్రహస్య జనకం బ్రాహ్మణః పునర బ్రవీత్. సం. భార. అశ్వ. ౩౩. ౨౫.

చ...నిమురమాని నవ్వ సురపాన్న ముఖాంబుజ మెత్తఁ జంపకం,బు...పూచు...పారి. ౪. ౧౦.

గీ. పౌర మధుమద మమరఁ బుష్పాసవంబుఁ గ్రోలిన సుమాళ మపుడు తత్కేళికలకుఁ, జాతపున్నాగకురవకాశోకతరులు, నవ్వె నవ్వులు తవ్వునై నివ్వటిల్ల. రామా. ౨. ౧౦౦.

౨. ఆనందించు, సంతోషించు.

క. అని కుంభజుఁ డెఱిఁగించిన, విని నవ్వుచు రాముఁ డవల వింశతిభుజుఁడున్, ధనవిభుఁడును బోరినవిధ, మనఘా వినవలతుఁ దెల్పుమని యడుగుటయున్. ఉ. రా. ౨. ౩౩౨.

౩. అపహసించు, మేలమాడు.

ఉ. నామది నొంను లేదు విను నవ్వితి సీతని తోడ...భార. ఆశ్ర. ౧. ౧౭౦.

ఉ.ఇవ్విధి మున్న యే సెఱిఁగి యెంతయుఁ జెప్ప ననాదరంబుతో, నవ్వితిగాని పట్టదు మనంబున మీఁదటిహాని ధీనిధీ. నా. పంచ. ౧. ౪౬౧.

వి. ౧. హాసము, నగవు.

క. నగవు నగు నవ్వు నవు హ్నా,నగు నాఖ్యలు హాసమునకు నగజాధీశా. ఆం. సం.మాన.౩౪.

చ. సరసులనర్త మింపుల నొసంగఁ గదంబపు దండఁ గట్టుచోఁ, గరఁగుటఁ దెల్పుదృక్తరళకాంతులు నుత్తర మిచ్చునంతరాం,తరముల నవ్వులున్ గలువతండము మొల్లలు నంచు మిన్నుగ్రుచ్చి రహిని రిత్తనూ లొసఁగి సిగ్గు వహింతురు పువ్వులావికల్. ఆము. ౨. ౨౦. విక్ర. ౧.౧౧౯.

౨. పరిహాసము.

క. అనృతము పాతక మగు నైనను వనితలయెడను బెండ్లి నవ్వున మృతి వచ్చిన సర్వధనముఁ జెడుచో, విను మది పాపంబు గాదు విమలచరిత్రా. భార. శాం. ౩. ౪౩౭.

ఉ...ఎల్లురు దెంచితివయ్య నీవు నే, నవ్వులు గావు సీతలఁపునం గలమే లొనరింతు ధీమణీ. భాగ. ౧౦ పూ. ౧౪౦౦.

౩. వింత, ఆశ్చర్యము.

క. ఒకటి గలదు వత్తురు వ్యైహోకగర్భంబునను

వృతులు నక్కవ మానక్కరు నేటి బుద్ధి పీనుఁగునరు బ్రదు కఁటె గలుగు నిట్టినవ్వులు గలవే. భార. శాం. ౩. ౩౪౭.

నవ్వు దేలు=నవ్వు తేటపడు.

క. నావుడు జాహ్నవిఁ బేర్కొని, నీ వద్భుతభవ్యభావనిరుపమ వంటే, నావాక్యమున కుఁ గృప వద్దేవియుఁ బొడనూపె నవ్వు దేఱుచూడ్కిన్. హరి. ఉ. ౫. ౨౨. (ప్రసన్న మగు అని భావము.)

నవ్వులఁబెట్టు=పరిహసించు.

ఉ. ఇవ్విధ మెల్ల నెచ్చెలుల కేర్పడఁ జెప్పిన దిట్టకూళ వై, నవ్వులఁబెట్టి యందఱు వినంగడు నాముసఁ ద్రుళ్లుకొంచుఁ దా,రవ్వల అవ్వలం బఱపి యంకిలి సేయక మానసేర్తురే. రసిక. ౪. ౧౧.

సా: నవ్వినయూళ్లే పట్టనము లగును:-ఒకప్పుడు హీనస్థితియం దున్నవారే కాలాంతరమున నున్నతస్థితియం దుందురు.

జ: నవ్వారు, నవ్వించు, నవ్వుఁబాటు, నవ్వుకొను, నవ్వుచేయు, నవ్వుటాల, నవ్వుదేలు, నవ్వుపడు, నవ్వుపఱుచు, నవ్వులబండి, నవ్వులాట.

నవ్వుఁబాటు=నగుఁబాటు. వి. (√నవ్వు.) అపహాస్యత, దూఱు.

గీ. నాకతంబున వచ్చిననవ్వుఁబాటు, మాటువడఁజేసి నీకూర్తిమగనిఁ దెత్తు. ఉ. హరి. ౫. ౧౪౧.

గీ...గతజలసేతుబంధ,వంబు చేసిన రాదటె నవ్వుఁబాటు. ఉ. హరి. ౧. ౧౮౪.

విణ. అపహాస్యము, నవ్వఁదగినది.

గీ. వాఁడు గోమంతనగమున నన్ను నాఁడె, గదిసి చూచినవాఁడవు గావె నీవు, నాఁటివాఁడన నేనును నవ్వుఁబాటు,గాదె యిట్లంట యీవితర్కంబు వలదు. హరి.

నవ్వుకొను. అ. క్రి. (నవ్వు+కొను. స్వార్థమున.) నవ్వు.

చ...మాటమాటు జగడంబులు చూపి యతండు పోయినన్,గలకల నవ్వుకొంద్రు తమకాలమాతఁ దెఱంగలేమికిన్. శుక. ౨. ౩౩౪.

నవ్వుచేయు. స. క్రి. (√నవ్వు.) చిన్నఁబుచ్చు.

ద్వి. సురియచాడయగారిఁ జొక్కవెట్టితివొ, నాచిదేవయగారి నవ్వుచేసితివొ. పండితా. మహిమ. ౩౦౭ పు.

నవ్వు(వు)టాల=నవ్వులాట. వి. (√నవ్వు. ఇట వర్ణవ్యత్యయము.) ౧. పరిహాసము,పరియాచకము.

ఉ. నావుడు నవ్వుటాల కనినన్ బవనాత్మజ యింత యేటికిన్. భార. ఉద్యో. ౩. ౭౧.

గీ...వరశక్తికలన రాజు,శిల్పముల నవ్వుటాలకుఁ జేయుచుండఁ, దరుణి కుతుకత్రపాద్భుతాతంకభార, సంకటస్థాయి యై సారిణాంక యయ్యె. నైష. ౪. ౧౬౯.

సీ. తపము సేయుచు నున్న ధనుద్యుఁ గఱువి గాంచి యక్కుమారులు నవ్వుటాల కందు, సాంబుని స్త్రీరూపసంపన్నుఁ గావించి... పద్మ. ౧౦. ౨౬౯.

చ. ననలు జనించె నిందు నదనంబుగఁ గామిను లెవ్వ రేనియున్, గనఁగలరే యటంచు లోకకంజవిలోచన నవ్వుటాలకై, యనఁగ ... సీమం. ౪. ౧౪. (నవ్వుతాలకై. అపము ద్రి.)

క. ఈలాగువానితో నవ్వుటాలకుఁ బన్నిద మిడి సాగటా లాడఁగ నోటా లగు నీ కర్థం దున్నిటాలా యని దక్కఁగొను కటా లలితాంగీ. ప్రబంధ. ౭౩౭.

౨. లీల, అలవోక.

మ...రామస్వామి తా నవ్వుటాలటు లొక్కమున తత్కరద్వయము వ్రయ్యం జేసె...

ఆధ్యా. ౪౪. ౧౨౪. (నవ్వుటాలటు=నవ్వుటాలవలె అని భావము.)

నవ్వుపఱుచు. స. క్రి. (√నవ్వు.) నవ్వుఁబాటు కలుగఁజేయు.

ఉ... అయుక్తదర్శమ్మున నిప్డు నవ్వుపఱుపక సమకొట్టె నితండు విప్రవంశమ్మున వారినెల్ల... భార. ఆది. ౩. ౧౩౯.

నవ్వులబండి. విణ. (√నవ్వు.) నవ్వెడుస్వభావము కలది. (చి. ని, శ. ర.)

నవ్వులాట=నవ్వుటాల.

(పరిహాసము, పరియాచకము.)

మ. తనకుం గూర్చువధూమణుల్ చనవుచేతన్ మందెమేలంబువంకను వేసారియు నవ్వులాటలకుఁ బల్కం బల్కువాక్యంబు లెల్లను నిక్కంబులుగాఁ దలంచి తగ దగ్గన్... విప్ర. ౪. ౩౧.

నవ్వులుపడు. అ. క్రి. (√నవ్వు.) అపహాసమునందు, నవ్వులపాలగు.

సీ. దీని దగ్గఱ నేల దీని కోడఁగ నేల పరులచే నవ్వులుపడఁగ నేల. మొ. రా. బాల. ౩౫.

నశము. సం. విణ. (అ. ఆ. అ.) నశించునది.

నశి(యి)ంచు. సం. అ. క్రి. నాశమొందు.

దండకము ...లోకముల్ లోకబీజంబులున్ నిత్యసందోహమై నీమహాదేహమం దుల్లసించుచున్ వసించున్ నశించున్... భాగ. ౧౦. పూ. ౧౨౩౩.

వ... అష్టైశ్వర్యహీనుండు మంత్రిరహితుండు విగతపరివారుండునై నశించు... మార్క. ౧. ౭౯.

వ... కర్మనాశనంబునం ద్రివిష్టపవాసులకుం బుష్టిహీనతయు దాన ననావృష్టియు నగు ననావృష్టిదోషంబున జగంబు నశియించు... మార్క. ౨. ౧౭౬.

నశికుఁడు. సం. వి. అ. పుం. సోదరీభర్త. (వై. ని.)

నశిత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) నశించువాఁడు.

నశ్యత్. సం. (శత్రు.) నశించుచున్న.

నశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నాశార్హము, నశింపఁదగినది. (ఉదా: యజ్జన్యం తన్నశ్యమ్.)

నశ్వరము. సం. విణ. (అ. ఈ. అ.) నశించునది. నాశశీలము, నశించుస్వభావము కలది; శాశ్వతము కానిది.

నష్ట. సం. వి. ఆ. స్త్రీ. సంస్పృష్టమైథున యగు స్త్రీ. (వై. ని.)

నష్టచేతనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తెలివి తప్పినవాఁడు, మూర్ఛిల్లినవాఁడు.

ఇట్లే: నష్టచేష్టుఁడు, నష్టసంజ్ఞుఁడు మొ.

నష్టజాతకము. సం. వి. అ. న. జన్మకాలము తెలియనపుడు ప్రశ్నలగ్నాదులచే జన్మకాలమును తెలిసికొని గణింపఁబడుజాతకము.

నష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నశించినది. ౨. తిరోహితము, మఱుఁగుపడినది. ౩. దూషితము, చెడినది. వి. అ. న. ౧. నాశము. ౨. అదర్శనము, మఱుఁగుపడుట. ౩. చెడుట.

నష్టస్మృతి. సం. విణ. (ఇ) చెడినస్మృతి కలది, మఱపు కలది. వి. ఇ. స్త్రీ. నష్టమగుస్మృతి, మఱపు.

నష్టాప్తిసూత్రము. సం. వి. అ. న.- పోయిన ద్రవ్యమును పొందుటకు సాధనమైనది - లోత్రికదేశము, దొంగిలించినసొమ్ములో కొంత భాగము. (వాచ.)

నష్టి. సం. వి. ఇ. స్త్రీ. ౧. నాశము. ౨. కనఁబడకపోవుట. ౩. చెడుట, దూషిత మగుట.

౪. నష్టము, లోటు.

ఉ. ఆయతికాని కీడు మమరాలయముఖ్యము లాతఁ డర్థతృష్ణాయుతుఁడై నిజోర్వి నగు నష్టికిఁ దధనముం దొరల్చి రాజ్యాయతనం బుఁ జేర్చు...ఆము. ౪. ౭౧.

నస. వి. (క. నస.) ౧. దురద, కండూతి.

సీ...తీంట్రము కపి తీఁట తీవరము. గీ. దూల జిల నవ నస గాఁడు దురద యనఁగఁ, బరఁ గుఁ గండూతి...ఆం. భా. ౨. ౧౭.

౨. కామము.

గీ. అనుచు విప్రుండు తమకించి యంటుకొనియె, సమ్మతించియ యుండె నాచంద్రవదన, శూక లాశ్వంబు నస రేపఁ జొచ్చినప్పు, డనుమ తింపదె యత్తళు వైనబడబ. శివరా. ౩. ౬౯.

వ...మెడసాఁచి కూలితదృక్కోణంబులతోడ వదనంబు గదియించి నస చేసిన బిసరుహా ప్తునిగా నెఱింగి...వరాహ. ౫. ౯౪.

౩. (త. నసల్.) ఉపద్రవము.

ఉదా: ప్రొద్దున లేచిన నీనస నాకుఁ బెద్దదిగా నున్నది. (శ. ర.)

జ: నసకించు, నసగూఁటి, నసగూఁటితనము, నసగూఁడు, నసగొంటు, నసగొట్టు.

నస. సం. వి. ఆ. స్త్రీ. నాసిక, ముక్కు.

నసకించు. స. క్రి. (√నస.) మోహింపఁజేయు.

ద్వి. మనిమనినగవులు మురిపెంపునడలు, నస కించు నేర్పులు నాగరకములు, కల్లమోహం బులు కపటకృత్యములు. ప్రభులిం. ౪. ౧౪౩ పా. ౨౪ పం.

నసగూఁటి. విణ. (నసగూఁడు+ఇ³.) కామో ద్రేకము కలవాఁడు; కామోద్రేకము కలది.

సీ. పిసవెత్తి కసరెత్తి రిమెసరేఁగునసగూఁటిపూఁ బోండ్లు తమయిండ్లపగాంళ్ల...

౧౩౪.

ఉ. కైక్కొనఁ బ్రాంతపక్కణకుటీశిఖరంబుల నె క్కలావక్కమునఁ, గుక్కుటకోటి మ్రోసె నస గూఁటిమిటారులపుట్టిల్లు గ్రక్కికక్కనమబ్బు కెలగుహ కీఁచెనికల్ కెలఁగొంచె ... వేం. పంచ. ౩.౧౦౨. (చి. ని. పా. నెసగూయ. అపముద్రి.)

నసగూఁటితనము. వి. (√నసగూఁటి.) కామో ద్రేకము.

ఉ...నా,కూరిమిపట్టి నిట్టినసగూఁటితనంబున జేలువెట్టి తా, రాక గణింప నన్ను విరవా మతి యిప్పరిలోనితక్కరిక్. విప్ర. ౪. ౨౪.

నసగూఁడు. వి. పు. (√నస.) కామోద్రేకము.

ఉ. ఓరి దురాత్మ నీవును బ్రియుండవె నాప్పొ దయేశుకాలిత్రైగోరును బోల వీవు నస గూఁటఁ గఱుక్ జపలస్వభావ రై నారులు రూపయావనమునక్ నిలుపోపక యివ్వలవ్వ లక్, జారహితంబు సేయ విభుచక్కటి మోహముమాన నేర్తుశే. నా.పంచ. ౩.౨౩౭.

నసగొంటు=నసగొట్టు.వి.(√నస.)కామోద్రిక్తుఁ డు; విటుఁడు.

గీ. కుచ్చితం బింత యెఱుఁగ దమ్మచ్చెకంటి, కంటి విఖ్యాతి నాతిఁ గైకొంటి వనుచు, నచటిజాటలు నసగొంటు లతని వేఁడి, వేఁడి మీఁదనె దోఁచిరి వెత్తి రేఁచి.బహు. ౫. ౧౦౭.

నసగొట్టు=నసగొంటు. విణ. (నస+కొట్టు.) కామోద్రేకము కలవాఁడు; విటుఁడు.

క. నసగొట్టుబాపన య్యా,పిసవెత్తికిఁ దగులు వడి తపింపఁగ నేల్లా,బసవెద్దు గదలకుండె డు, వసతికి రమ్మచటి కేసు వచ్చెదఁ బొమ్మా. శుక. ౨. ౪౭౯.

నసనస. వి. (రక్తముమున్నగువానితో) తడిసినచర్మముమొ. వానిధ్వని కనుకరణము.

క. విసమును మెసవుచు వినుతక, నసనస యను కళవసంబునం దాలుచు నృమ్మసనంపురుద్రు తోడుత, వసియించఁగ నీమెన్నెత్తివ్రాఁత బోటీ. పార్వ. ౪. ౯౫.

నసిమిరి=నస. వి. ౧. దురద, కండూతి. (శ.ర.)

౨. జలజంతువిశేషము.

సీ. గులకరింతయు నీరుగుట్టు శంఖనఖంబు ఫ్రులు తాసి నసిమిరి బుంగపురువు. హంస. ౪. ౧౮౫.

నసుకు. వి. అసత్యము.

ఆ. జల్లి బురుడ బొంకు పొల్లు దబ్బఱ కల్ల..., తనుకు నసుకు...నా నసత్య మభవ. ఆం. భా. ౧. ౧౧౯.

విణ. అసత్యమైనది. (శ. ర.)

నసుగు. అ. క్రి. స. క్రి. అస్పష్టముగా చెప్పు.

(వ్యవ.) ఏమాట చెప్పినను వానికి నసుగుటం అలవా టైనది.

వి. అస్పష్టముగా చెప్పెడిమాట.

(వ్యవ.) నీనసుగులు మాని నీయుద్దేశము తెలుపుము.

నసెము. వి. (సం. నస్యమ్.) ముక్కులో వేయు రసాదులు మొదలయినది.(చూ. నసెము చేయు.) జః నసెముచేయు.

నసెముచేయు. అ. క్రి. (√నసెము. రోగనివృత్తికై ముక్కురంధ్రములలో రసాదుల నుంచు.

గీ. పరంగ నాముదంబుపలుకులు పొంటిచెయ్యి, గోరిమక్కుణముల గుంటగలగ, రాకురసము చేత రాచి నాసికయందు, నసెముచేయ వెట్టిపస యడంగు. (చింతామణి. చి.ని.)

నస్త. సం. వి. ఆ. స్త్రీ. ౧. వృష భాదుల

కుట్టినముక్కురంధ్రము. ౨. ఆభరణాదు లుంచుటకు కుట్టిననాసికాచ్ఛిద్రము.

నస్తము. సం. వి. అ. పుం. నాసము, ముక్కు. న. నస్యము, ముక్కుపొడి.

నస్తితము. సం. వి. అ. పుం. ముకుద్రాళ్లు పోయుటకై ముక్కు కుట్టినయెద్దు.

నస్తోతము. సం. వి. అ. పుం. – కుట్టఁబడిన ముక్కు కలది.– ౧. ముకుద్రాళ్లతో నడుపఁబడెడియెద్దు; ముకుద్రాళ్లు పోసినయెద్దు.

నస్యా. సం. వి. ఆ. స్త్రీ. ౧. ముక్కు. ౨. పశ్వాదులముకుద్రాడు. (విల్యమ్సు.)

నస్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నాసికకు హిత మైనది. ౨. నాసికయందు పుట్టినది. ౩. నాసికయం దున్నది. వి. అ. న. ౧. ముక్కునందలివెండ్రుక. ౨. ముక్కుపొడి, ముక్కుపొడుము. (విల్యమ్సు.)

నస్యోతము. సం. విణ. (అ. ఆ. అ.)=నస్తోతము.

నస్రము. సం. వి. అ. పుం. నాసాపుటము. (కే.ని.)

నహి. సం. అవ్య. (అభావము తెలుపును.) లేదు, లేవు, లేదు, లేరు.

క. వలపు సట వావులా నహి, యల సత్యము సున్న తలఁపు లభ్రచ్ఛాయల్, తలఁ దడవి బాస చేసిన, జలజాక్షుల నమ్మరాదు సారంగ ధరా. సారంగ. ౨. ౭.

ఉ. ఓచతురాగ్రగణ్య భువి నున్న నరేంద్రులలో భవన్నిభుం, డీచతురబ్ధివేష్టితమహి న్నహి యంచు జనుల్ నుతింప...శుక. ౧. ౨౪౫.

నహుషుఁడు. సం. వి. అ. పుం. ౧. చంద్రవంశపురాజులలోనొకఁడు, యయాతితండ్రి. (ఇతఁడు స్వర్గరాజ్యమును పాలించి అగస్త్యమహాముని శాపమున సర్పజన్మ మెత్తి యుధిష్ఠిరునివలన శాపవిముక్తి నొందినాఁడు.) ౨. మనుష్యుఁడు.

# నా.

నా[1]. స. అస్మదర్థకము. (దీనికి ప్రథమాదివిభక్త్యేకవచనముల 'నేను, నేన్, నన్ను, నను, నన్, నాచేత,' మొ. రూపములును, బహువచనమున 'మేము, నేము, ఏము, మమ్ము, మము, మాచేత, మొ. రూపములును అగును.)

- వ. నావిన్నవింపం బూనునాముక్తమాల్యదామహాప్రబంధమునకుం గథాక్రమం బెట్టిదనిన. ఆము. ౧. ౫౦.
- చ...సర్వమునను నేన నిల్తు సుఖవాసత నన్ దగం జెంది నిల్చు సర్వము... భార. అశ్వ. ౩. ౩౭.
- క. నానీసంవాదము... భార. అను. ౫. ౩౦౭.
- క. క్రతుపరులు నన్ను తగ సంస్తుతించి ఫలమందం గంద్రు... భార. అశ్వ. ౩. ౪౦.
- క. ననుబోటిజోదునుం గాదని పలుకంగ నేర్చు నీకు నంత గలదె య ట్లును గాక వినుము కర్ణుం, డినుమా శోకళరము దొడుగు నే పరులు నగన్. భార. కర్ణ. ౩. ౩౧౭.
- మ...వారు నన్ బ్రహ్మప్రాప్తులవరిష్ఠావ్యయసౌఖ్యమొందు మని లీలం జెప్పినన్ వచ్చితిన్. భార. అను. ౪. ౭౩.
- వ...త్రివేదమయురావించినయీయపరాధంబు నాకు సహింపవలయు. భార. ఆది. ౫. ౨౧.
- ఉ. నేను భవన్నియోగసరణిం జరియించుచు నొక్కకూద్రు న్నుద్దామని... శ్రీరం. ౩. ౫౯౧.
- గీ. కృతి విని ర్మింపు మిటక మాకుం బ్రియము కాంగ. ఆము. ౧. ౧౩.

జ: నాయన.

నా[2]=అన[3]. అవ్య. ద్రు. "అను" ధాతువునకు తుమున్నాన్యర్థకము.

- శా. త్రిలోకులను కడాలు...టనికి రాజీవాక్షి నూరాంబ నాన్యా శీలం జ్జెప్పియించె... శా. ప. మ. ౧౪. ౧.
- ఉ. మేరుకుణాకతాయం దగుమేనకికిం గలుహారన్ని అంభోరుహనేత్రి; అన్వయసఫూపణి నాం దగుమేనమాంబకునుం... శా. ప. మ. ౧౫. ౩.
- సీ. దక్షిణగంగ నాం దద్దయు నొప్పినగోదావరియు జగదాది యైనఖ్యాతిమేక్వరంబును... భార. ఆది. ౬. ౧౩౯.
- మ...సౌభాగ్యశ్రీప్రభానిత్యలక్ష్మికి సంకేతనివాసమై మదనత్రింశంబు నా ఖ్యాతియున్నక నాంగా దమయంతి నాం బరంగు... నైష. ౩. ౧౭, ౬. ౧౭౪.

నాంచారు=నాంచారు. (త. నాచ్చియార్.)

౧. దేవత, అమ్మవారు.

- గీ. తోడు శ్రీరంగనాంచారుతోడం గూర్చి లీల నొరయూరునాంచారు నేలెసరణి. శ్రీరం. మా. ౧౦. ౧౧౬.
- సీ. నెచ్చెలుల్ గొల్వంగా నిచ్చి నాంచారు దేవిని గనుంగొని... ప్రబంధ. ౨౭౫.

౨. స్త్రీ, ఆడుది.

- గీ. పాలు పోయించుకొని యాక్కపాలు మూర్తి, శాలినాంచారుపాలిండ్లచూచుకములు, పాలచేంపున గిలిగింత వారుటయును. హర. ౨. ౯౫. (నాంచారి. ముద్రి.)

సా: నాంచారమ్మవంటు నక్షత్రదర్శనము ఒక మాటె.

నాంతము: సం. విణ. (అ.ఆ.అ.) ౧. అనంతము, అంతము లేనిది. ౨. నకారము అంతమందు కలది. (శబ్దము.) వి. అ. న. ౧. కొమ్మ. ౨. కైచిత్రము. (శే. వి.)

నాంతరీయకము. సం. విణ. (అ. ఆ. అ.) అవినాభూతము, వేఱుపడియుండనిది, ఏవనిసంబంధము కలది.

నాంత్రము. సం. వి. అ. న. స్తోత్రము.

నాంది. సం. వి. ఈ. స్త్రీ. (దీనివలన దేవత లానందింతురు.) ౧. ఆనందము, సంతోషము. ౨. సమృద్ధి, పెంపు. ౩. కర్మారంభమందు చేయుదేవతాస్తోత్రము; నాటకముతొలుత మంగళార్థము పఠింపఁబడుపద్యాది. ౪. దేవతలు బ్రాహ్మణులు లోనగువారు చేయునట్టియాశీర్వాదము. ౫. భేరి. (శ. ర.)

నాందీకము. సం. వి. అ. పుం. ౧. తోరణస్తంభము, మంగళార్థము తోరణములు కట్టుటకు పాఁతిన స్తంభము. ౨. నాందీముఖశ్రాద్ధము, వివాహాదిశుభకర్మములందు కర్మారంభమున పితృదేవతాతృప్తికై చేయుశ్రాద్ధము.

నాందీకరుఁడు. సం. వి. అ. పుం. ౧. నాందీశ్లోకాదులను పఠించువాఁడు, సూత్రధారుఁడు. ౨. నాందీవాది, భేరిమొదలగువానిని మంగళార్థము వాయించువాఁడు.

నాందీపటము సం. వి. అ. పుం. కూపముఖబంధనము, నూతిమైకప్పు.

నాందీముఖము. సం. వి. అ. న. వివాహాదులకు పూర్వము పిత్రాదులను గూర్చి చేయఁబడువృద్ధిశ్రాద్ధము.

నాందీముఖుఁడు. సం. విణ. (అ.ఈ.అ.) నాందీముఖశ్రాద్ధమును అనుభవించువాఁడు. (పితృమాత్రాది.)

నాందీవాది. సం. వి. న్. పుం= నాందీకరుఁడు.

నాందీశ్రాద్ధము. సం= నాందీముఖము.

నాఁగటిచాలుకూర. వి. (√నాఁగలి)తతిగొబ్బి, లాంగలికి. (శ. ర.)

నాఁగటిచాలుపేరియతివ. వి.(√నాఁగలి)సీత, జానకి.

క. కన్నియతలమానిక మగు, నన్నాఁగటిచాలుపేరియతివను సిరికిం, బెన్నుద్ది నెత్తుకొని చని, యన్నిచుఁడు రథముమీఁద నపు డిడుకొనియెన్. రామా. ౫. ౧౯౯.

నాఁగటిచిప్ప. వి. (నాఁగలి+చిప్ప.) నాఁగటిపణత, నాఁగటిగొడగ. (శ. ర.)

నాఁగటిజోదు. వి. (నాఁగలి+జోదు.) హలాయుధుఁడు, బలరాముఁడు.

ఉ. లాలసరిగజాంకుశుఁడు లావున నాఁగటిజోదునైనఁ గెం, గేలనె గీటడంచి బలుగెల్పుఁ బయిండి నెలంత నేలుకోఁ, జాలినవాఁడు... యయా. ౧. ౪౯.

నాఁగటిదుంప. వి. (నాఁగలి+దుంప.) నాఁగటిచిప్ప. (శ. ర.)

నాఁగలి= నాఁగెలు. వి. ఈ. (సం. లాంగలః. ప్రా. ణాంగలో. క. నేగిల్, నేగిలు.) హలము, దున్నెడుసాధనము.

ఉ...రోఁకట, న్నోఁదుచు నాఁగటం దిగిచి నొంచుచుఁ గార్ముకముక్తబాణముల్, పైఁ దొరగించి కూల్చుచును...హరి. ఉ. ౧. ౧౦౧.

గీ. అతఁడు నాఁగట నెత్తినయంతనుండి, యేటిదిక్కున కంతయు నెగసి యుండు, హస్తినాపురి...ఉ. హరి. ౧. ౧౦.

సీ. తొడరి రావణుతలద్రుంచినయలతరామయమున నాఁగట గ్రుచ్చినట్టి యలతో. పరమ. ౨. ౧౦౪.

జ: నాఁగటిచాలుకూర, నాఁగటిచాలుపేరియతివ, నాఁగటిచిప్ప, నాఁగటిజోదు, నాఁగటిదుంప.

నాఁగు. వి. ధాన్యమునకు వడ్డిగా నిచ్చుధాన్యము.
[illegible] నాఁగు మాళ్ళ నలహాలాయుధపాణి

నాఁగున కడుగు ధాన్యంబు కొంత. పాంచా. ౧. ౩౯.

**నాఁగురు**=నావురు. (చి. ని.) ఆం. భా. ౨.౬౨.

**నాఁగె(గే)లు**=నాఁగలి. వి. ఔ.

గీ. అన్యముల డించి ముఖవర్ణ మఖిలపింఛి, కూడె నాఁగెలు సంపంగి కోమలాంగి, నాస యనమించెఁ గాకున్న నాతిముక్కు, వానివలె నున్న దన నెట్లు వాసికెక్కు. చంద్రా. ౪. ౧౧౯.

క. ఆయనయాజ్ఞానుస్మృతిన్, డాయుచు నాగరమణుల్ జడతఁ దొలఁగంగా, నాయతనవసుధ నాఁగెటి, చాయను బుమభమ్ము లమర నవరించుతటిన్. అచలా. ౨. ౫.

సీ...ఓపి దున్న, నాఁగేటి మొనఁ జచ్చునానావిధప్రాణు లన్నరుఁ బొందునే యఘము... భార. అను. ౫. ౫౮.

ద్వి. ఏల యీనాఁగేలు హృదయంబు చీర, నేల యీగుద్దలి యిటఁ బాఱవైచి, రమ్ము ... రం. రా. అయో. ౧౦౪ పా. ౨౩ పం.

సీ...నాఁగేలు నాఁగలి యనఁగాను లాంగలసమాఖ్య, పరఁగు...ఆం. భా. ౨. ౨౩౨.

**నాఁచారు**=నాంచారు.

(స్త్రీ, ఆఁడుది.)

క. ఆచూతము చెంగటఁ గని, నాఁచారును దొడుక చెలులు నయమార్గాతి, ప్రాచుర్యప్రౌఢోక్తి, శ్రీచాతురి మనముఁ బొదలఁ జేయుచు డాయన్. ప్రబంధ. ౨౪౮.

**నాఁచికొను**=నాఁచు[1], ఆఁచికొను. స. క్రి. (నాఁచు[1]+కొను. స్వార్థమున.) ౧. అపహరించు; లాగుకొను.

గీ. నాకుమారుని దైవంబు నాఁచికొనక, యున్నవీనిప్రాయంబున నుండకున్నె. వి. పు. ౮. ౪౧.

క. కొమరారునీకుమారుకు,

దు గురుదైర్యము శౌర్యమును బరాక్రమమును నొక్కొ మొగి నామనసు నాఁచికొనియెం దంక్రీ. మార్క. ౭. ౧౨౯.

శా...మరా, హారాగ్రసరుఁ డాథరాసురుఁడు కాంక్ష న్లల్లపూసాడిగా, నారామామణిసమ్ము నాఁచికొని వేశ్యావాటిఁ జేరెన్ నృపా. నిరం. ౨. ౧౦౬. భార. విరా. ౨. ౮౩.

చ. ప్రకటబలాఢ్యు లొక్కటఁ దిరం బయిపల్వురు వీరె భూమిపాలకునకు సద్దమైనఁ దవులంబడి హుమ్మని నొక్కకండ నాఁచికొనిన మ్రోఁగు జెబ్బులివిశేషము దోఁపఁగ ... భార. ద్రో. ౨. ౨౫.

క. పతిమనసు నాఁచికొనియెదు, చతురోపాయంబు నీకుఁ జపలాక్షి సునిశ్చితమతిఁ జెప్పెద విను...భార. అర. ౫. ౩౧౩.

శ్లో: ఇమం తు తే మార్గ మపేతమోహం, వక్ష్యామి చిత్తగ్రహణాయ భర్తుః. సం. భార. ౨౩౩. ౧.

౨. వశపఱుచుకొను; ఆక్రమించుకొను.

ఉ. రంగదుదారకీర్తి యగురక్కసగంగనఁ జెంజలంబుమై, భంగ మొనర్చి మత్స్యజనపాలుఁడు బల్విడి నాఁచికొన్న రాజ్యాంగము లెల్ల నిచ్చి తనయాశ్రితవత్సలవృత్తి యేర్పడన్, గంగ యసాహిణిం బదము గైకొనఁ బంచెఁ బరాక్రమోన్నతిన్. విర్వ. ౧. ౪౧.

క. ము న్నేను మేన నలఁదిన, ప్రస్ననిభసితంబు నణఁచి శ్రమవారి కడున్, జె న్నెసఁగ మంచుమలసంచు నాఁచికొని ప్రవహించుసురనదిపగిదిన్. పాండు. ౫. ౧౩౧.

**నాఁచికోలు.** వి. (√నాఁచికొను.) అపహరించుట.

ఉ...ఫల్గునుఁ డేఁదఱ మీఱి సైంధవ, ప్రాణము నాఁచికోలు నరపాల తలంపఁగ మర్త్యకృత్యమే. భార. శల్య. ౧. ౪౯.

నాఁచు[1] = నాఁచికొను. స. క్రి. అపహరించు; లాగుకొను.

సగడ. కోరకోరసిజ రతి నది నేఁ గోర గోరఁటు లజ్జ నాఁచెను. చంద్రి. ౪. ౬౩.

సీ. ద్విరసనాళికి వేల్పువెను సూఁడి సుధ నాఁచి జెల్లులో నటు పాఱఁజల్లినాఁడు. రా. వి. ౧. ౮.

సీ. పినుఁ గీక పెనఁగినఁ బెద్ద నొంపక యొజ్జఁబాఱించి చేఁగలపాటి నాఁచి. ఆము. ౬. ౩౮.

ఉ... శూలము పూని జక్కి యాపక్కిని వ్రక్కలింపఁ గని పక్కన శూలము నాఁచి త్రుంచె నా, చక్కనికాల నేమితల... దశా. ౨. ౪౦౧.

వి. దొంగ.

సీ... నాఁచు నా దొంగయుఁ బ్రాఁచి దనరు. ఆం. భా. ౩. ౪౫.

జః నాఁచికొను, నాఁచికోలు.

నాఁచు[2]. వి. శైవాలము, నీటిలో పుట్టెడితీఁగ, ప్రాఁచి.

సీ... నాఁ చన శైవాల నామ మెసఁగు. ఆం. భా. ౧. ౧౬౫, ౩. ౪౫.

సీ. నాడెంపుజడ పెంపు నాఁచుతీవలగుంపు కలికి కనవడాలు గండుమీలు. నీలా. ౧. ౫౬.

గీ... మనోహరవాసనల్ గలయునాఁచు, నాఁచుజలదంతికరములయతిశయమున, యమునరహిఁ గాంచునత్తోయజాకరమునఁ, గరము నయ మొప్పఁ దీర్చితిఁ గాల్యవిధులు. ఉ. రా. ౩. ౭౩, ౨. ౫౩.

సా: మాటకు మాట తెగులు నీటికి నాఁచు తెగులు.

జః నాఁచుఁదీఁగ, నాఁచుఁద్రాఁచు, నాఁచుడు, నాఁచువన్నె.

నాఁచుఁదీఁగ(ె). వి. (√నాఁచు[2].) శైవాలలత.

సీ. సడలిననిడుద కెంజడలును ముదురఁ బండిన నాచుఁదీఁగలు బెనఁగొనంగ. హరి. ఉ. ౩. ౩౪.

(హంసము.) గీ. ప్రమదమున నాఁచుఁదీఁగెజొంపములఁ దూఱు. నైష. ౨. ౫.

నాఁచుఁద్రాఁచు. వి. (√నాఁచు[2].) నాఁచులో నుండుసర్పవిశేషము.

వ... సరీసృపనారీవారంబులతో మసకముల దనివిసనక సంచరించు నాఁచుఁద్రాఁచులఁ గాంచి మేను లుప్పొంగ ... ప్రబంధ. ౧౮౬.

నాఁచుడు. వి. (√నాఁచు[2].) క్షుద్రజలజంతువిశేషము, నీటిలోనుండుఒకానొకచిన్నజంతువు.

సీ... నత్తగుల్ల చుట్టుముగుల్ల కురుమింద నాఁచుడు... హంస. ౪. ౧౮౯.

నాఁచువన్నె. వి. (√నాఁచు[2].) నాఁచురంగు కల వస్త్రవిశేషము.

సీ. ముత్తెలపందిళ్లు నుత్తరగోగ్రహణంబులు కరకంచు నాఁచువన్నె, నిండువన్నెలు... గీ. మొదలుగా వల్వలుధరించి ముదిత లపుడు. ప్రబంధ. ౨౩౨.

నాఁటించు=నాఁటు. స. క్రి. (√నాఁటు.)

(గ్రుచ్చు.)

క. ఆందఱమేనుల గంగా,నందనుఁడు శరత్రయములు నాఁటించెను శల్యుం దాఁకె నుత్తరుఁడు... భార. భీష్మ. ౧. ౭౧౧.

క. వడి నొక్క పెట్ట లక్ష్మణుఁ, డడరించె నిశాతశరము లారక్కసుపైఁ, గడఁగి యతఁడు నాతనిపై, నెడపక నాఁటించెఁ గలయ నానిమిదియమ్ముల్. భార. ఆర. ౩. ౧౩౨.

(పాఁతించు.)

(పారిజాతమును.) గీ. పెరటిచెట్టుగ నాఁటింతుఁ బెంపు గనుము. పారి. ౧. ౧౩౬.

గీ. మఱియుఁ గలదివ్యసరసులు నెఱయఁ జెఱచి, తనదు కేళిదీర్ఘికలందుఁ గనకనలినజాతులెల్ల నాఁటించినాఁ డాతఁ డింద్రు, యటు చనక మేఁత నడుమనే హంసములకు. ప్రభా. ౧. ౧౨౦.

నాఁటు=నాఁటించు. స. క్రి. (ఇది నిర్బిందుకము అని చి. ని, శ. ర. కాని యీక్రిందినిర్ధారకప్రయోగములఁబట్టి సబిందుకముగా గ్రహింపఁబడినది.) ౧. గ్రుచ్చు.

సీ...ఆతఁ డతని, ఘనశరాసనముఁ ద్రిఖండంబుగాఁ జేసి నారాచ మొక్కటి నాఁటె మేన. భార. భీష్మ. ౧. ౨౫౬.

ఆ. సత్యజిత్తు మేన సాయకదశకంబు, నాఁటి కుంభజుండు నగుచు విల్లు,దునుమ... భార. ద్రో. ౧. ౨౮౮. నీలా. ౨. ౨౩.

౨. (భూమిలో మొక్కలు మొ.) పాఁతు.

గీ. నాఁటె మందారతరువులు తోఁటలందు... ఇంద్రుఁడు దక్షిణకాశియందు. భీమ. ౫. ౮౯.

గీ. కొమ్మ నాఁటంగఁ దగినచోఁ గొమ్మ నాఁటు ...పెంచు, పాళితోడను శాలినఁ దవిరతంబు. కళా. ౪. ౯౮. వసు. ౫. ౬౪.

౩. పాఁతుకొనఁజేయు.

ఉ...అనంతకేవలానందము దానియందు మది నాఁటుము మానుము నీచభోగముల్. భర్తృ. ౩. ౪౦.

గీ. వెలఁది నామీఁదఁ గడుఁ గృపావిలసనంబు, నాఁటి చూచినచూపుమన్ననయ చాలు. నైష. ౪. ౬౩.

౪. భేదించు, చీల్చు.

సీ. ఇరుమెయిఁ దొలిచి పెట్టిలఁ దూఱునవియును నలువుర వేవ్వుర నాఁటునవియు. భార. విరా. ౩. ౧౬౧.

గీ. అత్రిశూలాయుధంబు తీవ్రాంకుశకోటి, శాశ్చటాభాసురము గుంఫపదము నాఁటి, రక్తధారలతోడ యాతాక్షసేంద్రు, కలువములు గార్చియే తెం చెఁగ్రమ్మఱఁగ. కాశీ. ౬. ౧౭౧.

౫. కలిగించు. చంద్రా. ౧. ౯౯.

అ. క్రి. (=నాఁటు.) ౧. గ్రుచ్చుకొను.

ఉ. దాఁటక మాన రెక్కడలి దాశరథుల్ తమ దండిమూఁకతో, దాఁటెఁదాఁకఁ జూడక కదా కని కావు మటంటివేని న్యాపూఁటయ కాచుఁ గాంచుటకుఁ బో మిది మంచిది పో నినాఁటికిన్, నాఁటక పోవు నీయురమునన్ రఘువీరకఠోరబాణముల్. రామా. ౯. ౯౬.

ఆ. వాఁడితూపు లొడల వడి నాఁటుటయు నొచ్చి, శోవ కలువరోమ ధూమకేతుఁ, డతిశయిల్ల... భార. ఆర. ౭. ౧౩౩. కళా. ౫. ౧౬.

౨. పాదుకొను, స్థిరపడు.

క. మనమున నాఁటినమాటలు, విను మెన్నియు పాయములను వెడలునె యధిపా. భార. ఉద్యో. ౨. ౬౨.

క. నీనగవులు నీచూడ్కులు, నీనానావిహరణములు నీధ్యానంబుల్, నీనర్మాలాపంబులు, మానసముల నాఁటి నేఁడు మగుడవు కృష్ణా. భాగ. ౧౦ పూ. ౧౦౪౫.

గీ. నామనసు వానిమీఁదనె నాఁటె నమ్మ. కువల. ౩. ౧౧౧. ఆము. ౪. ౨౫.

౩. అంటు, తగులు.

ఉ...వాని కన్నిజన్మంబుల నైనఁ బాపములు నాఁటవు పుణ్యపరుండు గావునన్. వి. పు. ౩. ౧౩౮.

ఉ...పార్థివకదంబముఁ గూల్చినమేటి రామ [illegible] నాఁటి రాఁగదవె దాశరథీ కరు

శాపమోనిధీ. దా. శ. ౩౩.

సీ. అనుమాట చెవి నాట నాగ్రహావ్యగ్రుఁడై యసురనాయకుఁడు శక్రాత్మజాలను, గనుఁ గొని...దశా. ౪. ౧౫౯.

౪. కలుగు, పుట్టు.

చ...వెక్కస మగుసెవ్వగల్ వొడమెఁ గంపము పుట్టెఁ జెమర్చె మేను మ్రానసమున విన్నఁబాఁ టొదవె నాఁటెఁ గడుం బరితాపవేదనల్. పారి. ౧. ౧౦౦.

క. విను మట్లాడఁగఁ జెద్దలు, నను గని పనిసేయు మనుచు నాఁటినకోపంబున నేవ లాడ వినతేకను దేశభ్రమణవృత్తిఁ గైకొని మఱియుక్. హంస. ౩. ౧౪౭.

వి. ౧. తూటి, దెబ్బ; రంధ్రము, గండి.

సీ. పలుమొనసాఁటు లేర్పడినకమ్మావితోఁ జిఱుచెమ టంటుముంగురులతోడ. మ్పా. వి. ౩. ౯౧.

చ. కడలి మునుంగ నప్పుడమి గ్రక్కునఁ గొమ్మున నెత్త నందు మ్మొన్నడినయపార్శ్వకూటములు నాఁటిననాఁటులవెంబడిం బడిం,బడిఁ బడునీరధారలు సుపర్వులు నించినపువ్వువృష్టికై,వడి వెలయించుదంభకిటివర్య నిను న్మది నాశ్రయించెదక్. చంద్రా. ౧. ౭౭.

౨. కుదురు,భూమిలో దిగినపర్వతము మొదలగువానియడుగుభాగము.

గీ. నడుమ చతురశ్రవృత్తమా నాఁటు గలిగి, ధగధగాయితకనకరత్నప్రతాన,కిరణములు నాలుకలు గ్రోయుకీలములుగ, సురనగంబు విధూమాగ్నికరణి మెఱయు.వరాహ.౧౦. ౧౦౭.

౩. నాట్లు, మొక్కలు మొదలగునవి పాఁతుట.

(వ్యవ.) ఆచేనియందు నాఁటు ముగిసినదా.

నోనాఁటు = నొచ్చునట్లుగా నాఁటు.

క. ఒకమొగి నటువదియమ్ములఁ, బ్రకటబలుం డైనపరశురాముఁడు నాయం,గకములు దాఁకఁగ నక్కు,ప్రకరము నోనాఁట నూతుఁ బైఁబడ నేసెక్. భార. ఉద్యో. ౪. ౩౧౭.

సీ. బ్రహ్మదండంబులపాటియై మర్మంబు లిట్టి నోనాఁటు నే యితనిచేత. భార. భీష్మ. ౩. ౪౦౫.

వాడుకలోని ప్రయోగవిశేషములు:—

౧. వాని కింకను సంసారము నాఁటలేదు.

౨. వానికి నీవు చెప్పినమాట నాఁటలేదు.

౩. ఎవరికైనను కష్టసుఖములు నాఁటినఁగాని మంచియుద్దేశములు కలుగవు.

జ: నాఁటించు, నాఁటుకొను, నాఁటుకొలుపు, నాఁటుధీఱు, నాఁటువడు.

నాఁటుకొను. అ. క్రి. (నాఁటు + కొను.)

౧. పాదుకొను, స్థిరపడు.

సీ. పాపంబు లోకభంగిఁ బ్రకుయం బొందిన నామీఁద దృఢభక్తి నాఁటుకొనును, నామీఁద దృఢభక్తి నాఁటుకొన్నప్పుడు ధర్మంబు వర్తించుఁ దరతరంబు. భీమ. ౫. ౧౫౭.

గీ. నాఁటనుండియుఁ గంసుండు నాఁటుకొన్న, దిగులు పెంపున వసుదేవదేవకులను. వి. పు. ౭. ౩౪. ఆము. ౫. ౫౫.

౨. కలుగు, సంభవించు.

గీ. నాకవల్లభ నీమీఁద నాఁటుకొన్న,మానికొ పాగ్ని దివిజసంపదలమీఁదఁ, బోయె నంతియ చాలు నీపుణ్యమునను, వేయు నేటికిఁ బులి నాకి విడిచినట్లు. వి. పు. ౧. ౧౫౬.

గీ...ఈక్షణంబున నాఁటుకొనిన,పాటు మదిఁ జితగింపవే పార్థివేంద్ర. వసు. ౨. ౧౪౫.

౩. పాఁతుకొను, వేళ్లుపాఱు.

(వ్యవ.) మొన్నపాఁతినవంగ మొక్క నాఁటుకొన్నది.

నాఁటుకొలుపు(ల్పు)= నాఁటించు. స. క్రి. (√నాఁటుకొను.) ౧. గ్రుచ్చు, గ్రుచ్చుకొనఁ జేయు.

వ...నూటిఁగ నీఁటియలు నాఁటుకొల్పి యసుర లెడల మీఁటుచు...అచ్చ. రా. యు. ౩౬౪.

౨. అతుకుకొనఁజేయు, అతికించు.

గీ. తెగువ దక్షునికంఠంబుఁ ద్రెవ్వఁజేసి, వ్రేల్చెఁ దల నధ్వరాగ్నిని వీరభద్రుఁ, డా ప్రజాపతి మెడపైని నాఱణంబ, నగుచుఁ బొట్టేలితలఁ దెచ్చి నాఁటుకొలిపె. భీమ. ౬. ౫౯.

౩. పుట్టించు, కలిగించు.

సీ. అయ్యింతికడ నిల్చి యనుపునఁ గాంతకు నకు మది రాగంబు నాఁటుకొలిపి. దశకు. ౬. ౧౨౧.

నాఁటుదీఱు. అ. క్రి. (నాఁటు+తీఱు[1].) మొక్కమొ. పాఁతుకొని చక్కఁగా వ్యాపించు.

చ. కరిశిర మాడ వృష్ణుఖుఁడు గైఁపున వ్రేయుడుఁ గుంభమౌక్తికౌ,త్కర మసిధారఁ బొల్పెసఁగెఁ దారకుభంగము నూచి నవ్వసం, గరజయకాంత కాంతరద కాంతియొకా దని నాఁటుదీఱి వి,స్ఫురదవదాతఖడ్గలత పూచెనొ నా జయచైత్రసంపదన్. కు. సం. ౧౨. ౯౬౧.

నాఁటువడు. అ. క్రి. (√నాఁటు.) నఱుకుడుపడు, తెగు.

చ. చిరముగ నొల్వ్యవడ్డవరసింహునికంటెను బెద్దవే శిరం, బురలఁగ నాఁటువడ్డజలజోద్భవుకంటెను బెద్దవే...కు. సం. ౪. ౪౩౨.

నాఁడిక=నాఁడు. వి. (నాఁడు+ఇక. స్వార్థమున.) కేశము.

క. అన్నాతియు నొడయఁడు నటు, లన్నారని నీవ్ర కొన కరుణించినచో, నన్నా యన్నాఁడిక యన్నన్నా యూఁకుకొనఁ జాలనటే చెప్పుమా. అచ్చ. రా. ఉత్త. ౧౧౦.

నాఁడు. వి. పొ. (బ. నాళులు, నాళ్లు.) ౧. దినము, దివసము. (ఈపదము ఈక్రిందినిర్ధారక ప్రయోగముల ననుసరించియు చి. ని. ననుసరించియు కాలవాచకమగునప్పుడు సబిందుకమను టనిర్వివాదాంశము. ఇఁక దేశవాచకమైనప్పుడుసైతము ముద్రితప్రతులందు సబిందుకమే యయి యుండుటచేతను దేశకాలార్థములకున్న సన్నిహితసంబంధ ముండుటవలనను నిర్బిందుకమునకు నిర్ధారకప్రయోగములు లేకపోవుటచేతను శాసనముల ననుసరించియు నీరూపమే యెల్లెడల గ్రాహ్యమనుట యుక్తము.)

క. మీఁటు గలరాజరక్షకుల, నాఁటికి వేవ్రర వధింతు నమశరములు నో,నాఁటి పడవైచు నంతకు, వేఁగాడెదఁ బ్రతిబలంబుపీనుల వెల్లన్. భార. ఉద్యో. ౪. ౪౦౮.

క. పూఁట నగుకార్యగతు లొక, నాఁటన్ మతి నాఁటఁ గవెకునయకార్యము లొ,క్కొఁటం జేయుట మే లగు...రా. వి. ౨. ౩౬.

గీ. ఉత్తమక్షత్త్రియుల వెల్ల నుగ్రవృత్తి, నేఁడు పదినాళులేని నానిశితశరచ,యములఁ గూల్చితి వేసరినట్టు లయ్యె. భార. భీష్మ. ౩. ౩౬౪. (పదినాళులేని=పదిదినములును.)

క. బలవిక్రమములు వినుతం,బులు గా మన మొనలఁ బాండుపుత్త్రానీకం,బులు రెండు నాళ్లు వోవుట, దెలియంగాఁ జూచి వచ్చితిం గురునాథా. భార. కర్ణ. ౧. ౩.

౨. ఆదినము.

గీ. నాఁడు సభ నాడినంతయు నేఁడు చేయు, నట్టు లున్నాఁడు మొనకల ననిలసుతుఁడు. భార. భీష్మ. ౩. ౭౪.

ఉ. నేఁడిన వేఁడిమాట నృపపీఠుఁడు నైనపక
కర్ణరంధ్రముల్, నూఁడినభంగిఁ దాఁకుటు
యు గ్రుక్కి మనంబున నొచ్చి నిన్నునే,
నాఁడు నృపాలపుత్త్రి వని నమ్మి వరించితిఁ
గాక యిమ్మెయిన్, నేఁ డొకకాలసర్పమయి
నీ విటు సేయుట నాకుఁ దోఁచెనే. భా. రా.
అయో. ౧౯.

౨. నాఁడు మొదలుకొని యాపూఁ,బోఁడి య
నారతముఁ దెచ్చి భోజన మిడఁగా, నేఁ
డొక్కటి చనునంతకు, నాఁ డక్కడ నుం
డు నుచితవర్తనలమెయిన్. భోజరా. ౨.
౧౮౭. కాళ. ౪. ౯౯.

౩. సమయము, కాలము.

ఉ. నేఁ డలతోఁటలో నప్పుడు నిబ్బరమైన
మదీయభాగ్యమున్, బోఁడిమి యేమిపాక
మునఁ బొందెనో మీకృప యట్లు గాంచి
పె,న్వాఁడి దనర్చునాచనవునన్ మిము నె
మ్మెయి నంటిఁ గాని యే,నాఁడును బుణ్య
సాధ్వికి గుణం బిది గా దని నే నెఱుంగు
దున్. కళా. ౪. ౧౧౩.

ఉ. సత్యవతీవధూటి మును శంతనుపెండ్లము
కానివాఁడు సాం,గత్యమునం బరాశరుఁడు
గర్భము చేసిన... భాగ. ౯. ౬౬౯. కాశీ.
౧. ౮.

౪. ఆకాలము, ఆసమయము.

గీ. పార్థ్వి మెయ్యది జలజాక్ష శక్తి మెఱసి,
నాఁడె స్వర్గంబు సైకొనినాఁడు బలియె.
దశా. ౨. ౮౭.

ఉ...పరమేశ్వర యావరణాంబురాశి త్రే,కుం
డిన నాఁడె పొక్కివడకుండునె పద్మభ
వాండభాండముల్. కాశీ. ౧. ౧౨౩.

ఉ. నాఁటికి నేటికిన్ వధుటునంబుననో నిను నొల్ల
కెంతయుం, గాటపుఁగోపమున్ బెనుపఁగాఁ
దను నెమ్మెయి నంటిఁ గాక

జీతగాండ్రు మనతొల్లిటివారలు లేరె నీవి
ధుం, డేఁటికిఁ బోవఁగా వలయు నీ వటు
పోవఁగ నేల కూఁతురా. కళా. ౪. ౧౩౨.
హర. ౬. ౪౭.

౫. పక్షమున, ఎడల.

గీ. అఖిలలావణ్యపుంజంబు నబ్జభవుఁడు, మెలఁ
తగా దీనియందు నిల్పించె నొక్కొ, కాని
నాఁ డిట్టికాంతి యేకాంతలందు,నేల లే దని
సామర్ష హృదయ లయిరి. భార. సభా. ౨.
౧౬౦.

క. తారకు నోర్వఁగ వేఱ కు,మారకుఁ బడయం
గ సంగమము సేయను మున్, వారలపైఁ
బంపని నాఁ, డారిపుపైఁ బంపు మాతఁ డధి
కుఁడై నాకున్. కు. సం. ౪. ౪౦౭.

క. ధనధాన్యపశుసమగ్రుం, డనఁ బరఁగెడునట్టి
వైశ్యుఁ డధ్వరముం జే,యని నాఁడు బ్రాహ్మ
ణాధ్వర,మునకు నతనిసొమ్ము రాజు పుచ్చి
యుడఁ దగున్. భార. శాం. ౩. ౪౩౧.
నైష. ౫. ౯౧.

౬. (క. త. నాడు)=నాఁడిక, దేశము; ప్రదేశము.

చ. అరినరపాలమౌళిదళితాంఘ్రియుగుం డయి
పాఁకనాఁటియుం, దిరువదియొక్క వేయిటి క
ధీశుఁడు నాఁ జనుచోడబల్లికిన్. కు. సం.
౧. ౫౩.

సీ. మూఁడుగ్రామగ్రాసములతోడఁ గూడంగ
మోపూరు పాలించె ముల్కినాఁటు. క్రీడా.
౨౨.

ద్వి. నాఁ డెల్ల నేలెడునాఁడు నాపిన్న, నాఁడొ
క్కనాఁ డేను నడురేయిఁ బోయి. రం. రా.
అయో. ౧౨౩ పొ. ౧ పం.

ద్వి. పురములు దేశముల్ పుణ్యతీర్థములు,నరను
తం బగునూళ్లు నాళ్లను గడచి. ద్వి. హ
౨౨౧౬ పం.

సీ. దినకరకులుం డైన త్రిభువనమల్లుండు క్రమనాం
డును గుండికణ్ణు మొట్ట,వాడియుం జేకొని
రూఢిగా నేలంగ...శా. ప. మ.౧.౩౦.
చ. ఇల వెలనాంటి చోడినృపునిచ్చినదత్తము...
శా. ప. మ. ౧. ౪౨. సైమ. ౧. ౧౦.
౩. జనపదము, గ్రామము, పల్లె.
వ...ఇవ్విశ్వంభర నెవ్వీపంబున నేదేశంబున
నేనాఁట నేవీట నేత్రోవ నేక్రేవ నేవేళ
నెవ్వండేమి సేయఁ దలంచె...ఆము. ౪.
౨౧౫. (శ. ర. పా.)
సీ. నాఁడు నా జనపదనామధేయం బగు...
ఆం. భా. ౨. ౩.
ఆనాఁడున్కి = ఆనాఁడు మొదలుకొని, అప్పటి నుండి.
సీ...నాఁడు మొదలు నాఁటఁబట్టి యానాఁడున్కి
యది మొదల్ నాఁటఁగోలె, యనఁగఁ దదా
రభ్య యనుట...సాం. ని. మాన. ౩౩.
తలనాఁడు=నాఁటఁగోలె.
సాం. ని. మాన. ౩౩.
నాఁటఁ(టం)గో(గొ)లె=ఆసమయము మొదలు.
మత్తకోకిల. నాఁటఁగోలెను నామనంబున నాఁ
టుకో వెఱ నాకు నిం,కేఁటిజీవన మంచు నీ
తప మిట్లు వన్నితి...భా. రా. ఆర.౨.౮.
సాం. ని. మాన. ౩౩.
(అయ్యుఱగులు.) వ...నాలుకలు రెండుగా ప్ర
య్యుటంజేసి నాఁటంగోలె ద్విజిహ్వులు నాఁ
బరఁగిరి... భార. ఆది. ౨. ౧౨౨.
శా. ఆగంధర్వుఁడు వచ్చి నాఁటఁగోలె సత్యా
నందసంయుక్తుఁ డై,రాగప్రౌఢిమ మీఱ గీత
ములు నేర్పన్...చంద్ర. ౨. ౧౩౫.
నాఁటఁబట్టి=నాఁటఁగోలె.
గీ. నాఁటిసుత నాఁటినుండియు నాఁటఁగోలె,
నాఁటఁబట్టి నాఁడు మొదలు నాఁగ నాహ్వ,
యమ్ము లయ్యెఁ దదారభ్య యనుట కవని

ఆం. సం. మాన. ౪౭.
నాఁటిసుత=నాఁటఁగోలె.
గీ. నాఁటిసుత నాఁటినుండియు నాఁటఁగోలె.
ఆం. సం. మాన. ౪౭.
నానాఁడు=౧. క్రమక్రమముగా,కాలక్రమమున.
గీ...నానాఁటి కీర్తి నాఁటికిఁ బ్రియము, చవుల
యొనట్టి యిచ్చ యిఁ జనము నిలుప.ఆము.౫.౩.
గీ...పసపుకప్పు, పూఁటపూఁటకు నెక్కుఁ గప్పు
నపుఁ దగిన,మెఱుఁగు నానాఁటికిని మీఁద
గిఁజిక్కొనఁగ. మను. ౬. ౭౩.
శా. ఖద్యోతద్యుతి వృద్ధిఁ బొందెఁ దిక్చక్రం
జేసి నానాఁటికిన్. ఉ. రా. ౧. ౨౫౨.
౨. దినదినము, ప్రతిదినము.
శా. ఈయైశ్వర్యము జూచెఁబోలుఁ దన నే
నెప్పాట నానాఁటికిన్. కాశీ. ౧. ౧౧౫.
క. భూనాయక యీదివ్యవిమానం బసమాన
దివ్యమణికలశలో,కానీకని త్రితం బిడి, నా
నాఁటి కనంతకాంచనంబులు గురియున్.
వసు. ౩. ౧౨. విక్ర. ౧. ౫౫.
నాఁడునాఁడు = ౧. క్రమక్రమముగా, కాల
క్రమమున.
ఉ...అ త్తురగంబుల కెల్లను వన్నె యెక్కఁగా,
నత్తరిలి నిల్చి యీఁగియుఁ బ్రియంబును
నాయెడ నాఁడునాఁటికిం, బెత్తి వహించు
చుండ నడపెం దనతమ్ములలోనివానిఁగాన్.
భార. విరా. ౧. ౨౬౩.
గీ. ఉత్తరోత్తర మభివృద్ధి నొందుచుండుఁ,గాశి
ధరార్థకామమోక్షములు నాల్గు, చంద్రకళ
యట్లు శుక్లపక్షంబు రేలు, నాఁడు నాఁటికి నభి
వర్ధనంబు నొందు. కాశీ. ౨. ౫౨.
౨. ప్రతిదినము, దినదినము.
చ. అలయక నాఁడునాఁటికి లతాంగి యపూ
ర్వము లైనభోజనంబులు గడుభక్తిఁ బెట్టు
...భార. ఆది. ౮. ౧౮౩.

వ...నాఁడు నాఁటికిఁ జాటించి వేఁటకాం డ్రద నెఱింగి మేఁపుమేపులచమత్కారంబుల ని రాకరించి పిసునఁ డిరిగి తిరిగి యాఁక పీ ర్చుకొనునవియును...మనుచ. ౪. ౨౭.

పిన్న(టి)నాఁడు=చిన్నతనము,బాల్యము.

ద్వి. నాఁ డెల్ల నేలెడునాఁడు నాపిన్న,నాఁ డొక్కనాఁ డేను నడుచేయిఁ బోయి,యరు దైనవేఁటల నాసక్తిఁ బొందిరి. రం. రా. అయో. ౧౨౩ పొ. ౧౫౦.

ఉ. పిన్నటినాఁడు సత్కరుణఁ బిల్లలమఱ్ఱిమహా ప్రధాని పెద్దన్న గురూత్తముండు తగ నక్ష రశిక్షయు దైవమార్గసంపన్నతయు న్వివేక పరిపాటియును గృపసేసె...హర. పీఠి. ౧౨౮.

జః నాఁడిక.

నాఁపచేను. వి. దే. (నాము[1] + చేను.) నాము కలపొలము.

వ...నాఁపచేనికిం దలపడునాఁబసరంబులపస మూరుకొని మెక్కి యా మెక్కిన లెక్కిం చి మిక్కిలిం జొక్కిపసుజక్కవపడంతులు ను...బహు. ౩. ౬౦.

నాఁపతాయి. వి. (నాము[2] + తాయి.) నాము వలె నున్నగ నుండుతాయి. (విమశిల. దీనినిత్రొ క్కినను ఆపోటు నొప్పి కలుగును అని శ. ర.) (వ్యవ.)మాయరుఁగుమీఁద నాఁపతాయి పఱచి నాము.

నాక. స. క్రి. (√అను. అనుధాతువుయొక్క వ్య తిరేకక్త్వార్థకరూపము.) అనక.

చ. కొలఁది యెఱుంగ కిట్టిపలుకుల్ వలుకం దగు నాక...భార. ఆది. ౫. ౨౦౩.

గీ...నలువపట్టి, యొండ నాక యెక్కింత నే పూరకుండి. కాశీ. ౧. ౧౦౧.

నాకబలి. సం. వి. ఇ. పుం. నాగవల్లి, వివాహాం గముగ అయిదవనాఁడు చేయుపూజ...నది శే షము.(నాగబలి=నాగపూజ. వివాహసంస్కా రవిశేషము. ఆపస్తంబ. గృహ్య. ౨. ౧౫ సూ. అని విల్యమ్సు.)

సీ. పొలుపు మీఱఁగ నాకబలికృత్యములు సల్పి ...కళా. ౭. ౭౩.

నాకము. సం. వి. అ. పుం. ౧. - అకము-దుః ఖము-లేనిది - స్వర్గము. ౨. ఆకాశము.

నాకవనిత. సం. వి. ఆ. స్త్రీ. దేవతాస్త్రీ; అప్స రస, అచ్చర.

నాకసదుఁడు. సం. వి. ద్. పుం. - స్వర్గము నివా సముగా కలవాఁడు - వేలుపు.

నాకి. సం. వి. న్. పుం. - స్వర్గము నివాసముగా కలవాఁడు - దేవత, వేలుపు.

నాకిని. సం. వి. ఈ. స్త్రీ. దేవతాస్త్రీ.

నాకు. స. క్రి. (త. నక్కు.) ౧. లేహనముచేయు, నాలుకతో రాఁచి లోఁగొను.

సీ.సనకాదిదివిజమస్కరిఫాలగోపిచందనపుండ్ర వల్లికల్ నాకి నాకి. ఆము. ౧. ౪౧.

వ...బోరనఁ గాఱుధారారాశిరుధిరాసారపూ రంబు నాకి నాకి...మనుచ. ౪. ౬౦. వే మన. ౨. ౨౯౧.

౨. స్పృశించు, తాఁకు.

క...ధగధగ లర్చి, స్తంభగత నింగులు నాకెడు, నింగలములు నాల్గుదెసల నిడుకొని కడఁకన్. మనుచ. ౬. ౨౧.

సీ. అరుణచోదితరథం బటిటుగాఁ బట్టి నలినా ప్తుబింబంబు నాకి విడుచు.ఉ.రా.౨.౧౪౯.

సాః పులినాకి విడిచినట్లు.

గీ. నాకవల్లభ నీమీఁద నాఁటుకొన్న, మౌని కోపాగ్ని దివిజసంపదలమీఁదఁ, బోఁయె నంతియ చాలు నీపుణ్యమునను, వేయు కోటికిఁ బులినాకి విడిచినట్లు.వి.పు.౧.౧౫౬. (కోపమాపద తప్పినది అని భావము.)

(కాలకౌశికుఁడు.) ద్వి. వెడగొడ్డుఁ బులి నాకి వి డిచిన ట్లయిన, జడిసి తొల్లిటితనజంజాట మె ల్ల, నుడిగి...ద్వి. హరిశ్చ. ఉ. ౯౩౪ పం. సా: అఱచేతిలో తేనె వేసికొని మోఁచేతిదాఁక నాకించినట్లు.

నాకుఁడు. సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు. ౨. కొడుకు, పుత్రుఁడు. (కే. ని.)

నాకుము. స. క్రి. (√అను. అనుధాతువుయొ క్క వ్యతిరేకప్రార్థనాన్యర్థకమధ్యమపురుషైకవ చనరూపము.) అనకుము.

చ. అనుటయుఁ గంకుఁ డిట్లనియె నక్కడ వచ్చి సుశర్మ యోడెఁ గావున నిటు వీరికి జయ మవుఁ జెఱ పేటికి నీకు నుత్తరుం,డని నొకరుండ నాకుము బృహన్నల సారథి గాన గెల్చె నయ్యనిమిమకోటినైన నతఁ డద్భుతవిక్రమజృంభణంబునన్. భార. విరా. ౫. ౨౩౫.

నాకులము. సం. విణ. (అ. ఈ. అ.) నకుల సంబంధమైనది.

నాకులి. సం. వి. ఈ. స్త్రీ. ౧. సురస, సర్పా క్షి. ౨. యవతిక్త. ౩. శ్వేతకంటకారి, తెల్ల వాఁకుడు.

నాకువు. సం. వి. ఉ. పుం. ౧. వల్మీకము, పుట్ట. ౨. పర్వతము, కొండ. ౩. వనస్పతి. (కే. ని.)

నాకేశుఁడు. సం. వి. అ. పుం. స్వర్గాధిపతి, ఇంద్రుఁడు. (ఇష్టే: నాకేశ్వరుఁడు మొ.)

నాకౌకసుఁడు. సం. వి. స్. పుం - స్వర్గము నివా సముగా కలవాఁడు - దేవత, వేలుపు.

నాక్రము. సం. విణ. (అ.ఈ.అ.) నక్రసంబంధ మునది. వి. అ. పుం. మొసలిమూతినక్క.

నాక్షత్రము. సం. విణ. (అ. ఈ. అ.) నక్షత్ర కార్యకర్తమైనది. వి. అ. న. ౧. నక్షత్ర మాన మున అఱువదిగడియలకహోరాత్రము. ౨. అట్టి అహోరాత్రములు ముప్పది కలమాసము.

నాక్షత్రికము. సం. విణ. (అ. ఈ. అ.) నక్ష త్రమువలన కలిగినది; నక్షత్రము నిమిత్తముగా కలది. వి. అ. పుం. చంద్రుఁ డశ్విన్యాద్యుడులఁ జరించునిరువదియేడుదినములమాసభేదము.

నాగ. విణ. (సం. నాగః.) ౧. పూజ్యము. (చూ. నాగబెత్తము.) ౨. పెద్దది. (శ. ర.)

జ: నాగన్నెరు, నాగకెంపు, మొ.

నాగఁడు. వి. (సం. నాగః.) శేషుఁడు. (శ. ర.) మొ.

నాగకందము. సం. వి.అ. పుం. హస్తికందము.

నాగకన్యక. సం. వి. ఆ. స్త్రీ. నాగజాతికన్య; సర్పజాతిస్త్రీ, భోగిని.

నాగకర్ణము. సం. వి. అ. పుం-ఏనుఁగుచెవివంటి ఆకులు కలది - ౧. ఏరండము, ఆముదపుచెట్టు. ౨. ఏనుఁగుచెవి.

నాగకింజల్కము. సం. వి. అ. పుం. నాగకేసరము.

నాగకుమారిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. గుడూ చి, తిప్పతీఁగ. ౨. మంజిష్ఠ, మంజిడి.

నాగకేసరము. సం.వి. అ. పుం. పుష్పప్రధాన మైనఒకమొక్క.

నాగకేసరులు. వి. బ. (సం. నాగకేసరాః.) ధా న్యవిశేషము.

సీ. నాగకేసరులు చెన్నంగులు కురువులు భోజ నప్రియములు రాజనములు...శాలి. గీ. ధా న్య మెసఁగును...సాం. ని. మాన. ౫౨.

నాగగంధ. సం. వి. ఆ. స్త్రీ. సర్పాక్షి.

నాగగన్నెరు. వి. (√నాగ.) పెద్దగన్నెరు, ఒక జాతిగన్నెరు.

సీ...నాగగన్నెరులు మానాళ్లసొబగు. భల్లా. ౩. ౭౫. (శ. ర.)

నాగగర్భము. సం. వి. అ. న - సీసము గర్భమందు కలది - సిందూరము.

నాగచూడుఁడు. సం. వి. అ. పుం-పాములు తలయందు భూషణములుగా కలవాఁడు-శివుఁడు.

నాగచ్ఛత్త్రి. సం. వి. ఆ. స్త్రీ. గురుగు, శ్రీహస్తిని!.

నాగజము. సం. వి. అ. న - సీసమునుండి పుట్టునది - ౧. సిందూరము. ౨. వంగము, తగరము.

నాగజిహ్వ. సం. వి. ఆ. స్త్రీ - పామునాలుకవలె ఉండునది - శారిబ, మామెన!.

నాగజిహ్వక. సం. వి. ఆ. స్త్రీ - ఏనుఁగునాలుకవలె ఎఱ్ఱగా ఉండునది - మణిసిల.

నాగజీవనము. సం. వి. అ. న. వంగము, తగరము.

నాగజెముడు. వి. (√నాగ.) బొమ్మజెముడు, ఒకజాతినుండ్లచెట్టు.

నాగతుంబి. సం. వి. ఈ. స్త్రీ. భూతుంబి, సేలానుగు!.

నాగదంతము. సం. వి. అ. పుం. ౧. ఏనుఁగుదంతము. ౨. బట్టలు మున్నగునవి తగులుచుకొనుటకై ఏనుఁగుదంతమువలెగోడకు అమర్చెడి కొయ్య, చిలుకకొయ్య.

నాగదంతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. శ్రీహస్తిని, గురుగు!. ౨. కుంభము, ఏనుఁగుతుమ్మి!.

నాగదంతిక. సం. వి. ఆ. స్త్రీ. వృశ్చికాలి, తేలుమణి!.

నాగదమని. సం. వి. ఈ. స్త్రీ - సర్పములను అణఁచునది - ౧. ఈశ్వరి!. ౨. గొడ్డుటఁగాఁకర!.

నాగదాళి. వి. (క. నాగదాళి.) ఒకజాతిముండ్లచెట్టు. (శ. ర.)

నాగద్రువు. సం. వి. ఉ. పుం. స్నుహి, జెముడు!.

నాగనక్షత్రము. సం. వి. అ. న - సర్పదేవతాకనక్షత్రము - ఆశ్లేషానక్షత్రము.

నాగనామము. సం. వి. న్. పుం. తులసి!.

నాగనాస. సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగుతొండము.

నాగనిర్వ్యూహము. సం. వి. అ. పుం. నాగదంతము, ఏనుఁగుదంతమువలె గోడకు అమర్చిన కొయ్య; చిలుకకొయ్య.

నాగనేరెడు. వి. (√నాగ.) పెద్దనేరెడు, ఒకజాతినేరేడు!. (శ. ర.)

నాగప=నాగప్ప, నాప. వి. నాగవల్లి. (చూ. నాగపసాని.)

జ: నాగపసాని.

నాగపంచమి సం. వి. ఈ. స్త్రీ. ౧. శ్రావణశుక్లపంచమి. ౨. (దేవీపురాణానుసారముగ) ఆషాఢకృష్ణపంచమి.

నాగపడగలదండ. వి. (నాగ + పడగలు + దండ.) స్త్రీకంఠభూషావిశేషము.

ద్వి. భాసురం బగునాగపడగలదండ, యాసలఁ జేర నయ్యతివ నీదండ. ద్వి. భాగ. ౧౦. (శ. ర.)

నాగపడగలు=నాగుపడిగప్రోగులు, నాగులపడగలు. వి. బ. (నాగ + పడగలు.) పాముపడగలవలె నుండుకర్ణభూషావిశేషము. (శ. ర.)

నాగపడిగకోల=నాగబెత్తము. వి. (నాగ + పడిగ + కోల.) పాముపడగవంటిపడగకలబెత్తము.

సీ. ఎడమచేఁ బ్లిక నిడినబండా రన్యపాణిఁ బట్టిననాగపడిగకోల. శుక. ౨. ౪౨౫.

నాగపత్త్రి సం. వి. ఆ. స్త్రీ. నాగదమని, ఈశ్వరి!.

నాగపదము. సం. వి. అ. పుం. ౧. ర[illegible]. [illegible]శేషము. ౨. (నాగముయొక్క పాదము.)

నాగపసాని= నాగమసాని. (√నాగప. శ. ర.)

నాగపాశకము. సం. వి. అ. పుం. రతిబంధవిశేషము.

నాగపాశము. సం. వి. అ. పుం. ౧. పామువలె చుట్టుకొనెడిఅస్త్రవిశేషము. ౨. పాశము, వరుణుని ప్రధానాస్త్రము.

నాగపురము. సం. వి. అ. న. ౧.(కౌరవనివాసమగు) హస్తిపురము. ౨. పాతాళము. ౩. భరతఖండమున మధ్యరాష్ట్రమం దున్నయొక ప్రసిద్ధపట్టనము.

నాగపుష్పము. సం. వి. అ. పుం - ఏనుఁగుమదమువంటివాసన కలపువ్వులు కలది-౧. పున్నాగము, పొన్న. ౨. చంపకము, సంపెఁగ. ౩. నాగకేసరము.

నాగపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. నాగదమని, ఈశ్వరి.

నాగపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. స్వర్ణయూథిక, పచ్చపూలగోరఁట.

నాగపెంజెర. వి. (నాగ + పెంజెర.) ఒకజాతిపెంజెర, సర్పజాతివిశేషము.

సీ. ప్రల్లదంబునఁ దుర్లలనల్లనాగులు నాగపెంజెరలును బొట్టపెంజెరలును. ద్వా. ౧. ౧౦౦.

నాగప్ప= నాగప, నాప. (చూ. నాగప్పసాని.)

జః నాగప్పసాని.

నాగప్పసాని= నాగమసాని. వి. (నాగప్ప + సాని. క. నాగమసాని.) నాకబలిచిరంటి, నాగవల్లి నడపెడుముత్తెదువ.

పీ. నాగప్పసాని నా నాపసాని యనంగ నాకబలిచిరంటినామ మెసఁగు. ఆం. భా. ౨. ౧౦౧.

నాగఫలము. సం. వి. అ. పుం - పాములవంటి కాయలు కలది - పటోలము, పొట్ల.

నాగబంధము. సం. వి. అ. పుం. ౧. అశ్వినయహస్తవిశేషము. ౨. చిత్రకవిత్వమందలి సర్పాకారబంధము. ౩. మల్లబంధవిశేషము.

వ... రామబాణంబును నాగబంధంబును తొలకరిమెఱుపును...మల్లుపు. ౩. ౯౯.

౪. వస్త్రవిశేషము.

వ...నాగబంధంబులు బూజాబంధంబులును...అనుపేళ్లుగలపుట్టంబులు గట్టుకొని...ద్వా. ౩. ౨౦౬.

నాగబంధువు. సం. వి. ఉ. పుం - ఏనుఁగులు రావిరొట్టను సంతోషముతో తినును గాన ఏనుఁగులకు ఇది బంధువువంటిది- రావిచెట్టు.

నాగబల. సం. వి. ఆ. స్త్రీ. బీఱ.

నాగబలాకార. సం=నాగబల.

నాగబెత్తము= నాగపడిగకోల. వి. (నాగ + బెత్తము.)యోగవేత్రము, పొన్నవేసినమంత్రపూత మైనచిన్నపేము.

క. జననాథ యేమి చెప్పుదుఁ, గనలుచు నవ్వఁగుఁదపసి కటము లదరఁగాఁ, దనచేతినాగబెత్తముఁ, గొని పసరముఁ గొట్టినట్టు గొట్టె నదయుఁడై. మను. ౪. ౬౫.

గీ. భసితభస్త్రిక పులితోలుపచ్చడంబు, నాగబెత్తము దండపుయోగవాగ, లమరఁ జెట్టున డిగినటు లవనినాథుఁ, జేర వచ్చెంచె నొకమహాసిద్ధుఁ డపుడు. వేం. పంచ. ౪. ౧౧౧. కళా. ౨. ౪౮.

నాగభగిని. సం. వి. ఈ. స్త్రీ. వాసుకిభగిని, జరత్కారువు.

నాగభూషణుఁడు. సం. వి. అ. పుం - సర్పములు అలంకారముగా కలవాఁడు-శివుఁడు.

నాగమండలికుఁడు. సం. వి. అ. పుం. పాము [illegible]

నాగమల్లము. సం. వి. అ. పుం - ఏనుఁగులలో మల్లునివంటిది-ఐరావతము.

నాగమల్లె. వి. (క. నాగమల్లిగె.) ఒకజాతిమల్లె, అష్టపత్త్రికః.

సీ. నాగమల్లె యనంగ నాగమల్లిక మీఱు ... ఆం. భా. ౨. ౫౨.

(బ.) ధాన్యవిశేషము.

సీ. మందిగండ్రలు నాగమల్లెలు తీఁగెమల్లెలు కృష్ణనీలాలు వెలువడాలు. గీ. అది యగు పేర్లు గలుగువ డ్లతనియింట, నుండు శతకోటిపుట్లు లోకొ్కక్కదినుసు. హంస. ౪. ౧౨౭.

వ... సీతాభోగాలు గౌరీకుంకుమలు నాగమల్లెలు... ప్రబంధ. ౧౧౨.

నాగమసాని= నాగపసాని; నాగప్పసాని. వి. (నాగమ + సాని.) నాకబలిచిరంటి.

మ. నరలం గూర్చినకొప్పుతోఁ, బసుపుమిన్నల్ డేఱు నెమ్మోముతో, గరిమక్క నాగమసాని ప్రోలు దిరుగంగా అంతులై తూర్యముల్, మొరయంగాఁ గడు నొప్పె నాకబలి ... వేం. పంచ. ౪. ౩౭౦.

నాగమాత. సం. వి. ఋ. స్త్రీ. ౧. సర్పమాత, కద్రువ. ౨ - ఏనుఁగులను తల్లివలె అలంకరించునది - మణిశిల.

నాగమారము. సం. వి. అ. పుం- ఏనుఁగులను చంపునది - భృంగరాజము, గుంటకలగరః.

నాగము. సం. విణ (అ. ఈ. అ.) ౧. కొండలకు సంబంధించినది. ౨. క్రూరమైనది. ౩. (సమాసమం దుత్తరపద మైనపుడు) శ్రేష్ఠుఁడు. (ఉదా: పున్నాగము,పున్నాగుఁడు మొ.) ౪.ఏనుఁగువలె స్థూల మైనది. (అ. ఆ. అ.) పామువలె పొడుగైనది. వి. అ. పుం. _అగము-పోవనిది-కానిది-౧. పాము, త్రాఁచు. ౨. పాతాళమున వసించునది. సర్పజాతివిశేషము. (అష్టనాగములు:-అనంతుఁడు, వాసుకి,తక్షకుఁడు, శంఖపాలుఁడు, కుళికుఁడు, పద్ముఁడు, మహాపద్ముఁడు, కర్కోటకుఁడు.) ౩.గజము, ఏనుఁగు.౪. కొండ. ౫. మేఘము. ౬.నాగదంతము,చిలుకకొయ్య. ౭. తములపాకు తీఁగ,తాంబూలిః. ౮. దేహమందలిఉపవాయువులలో వాగ్వ్యారమం దుండుఉపవాయువు. ౯. గ్రహము. ౧౦. నాగకేసరముః. ౧౧. పున్నాగము, పొన్నః. ౧౨. ముస్తెః. ౧౩. దేశభేదము. ౧౪. జలజంతువిశేషము. (వై. ని.) న. ౧. తగరము. ౨. సీసము. ౩. (జ్యోతి.)ఒకానొకకరణము. (దీనికి నాగవ మని వాడుక.) ౪. ఆశ్లేషానక్షత్రము.

నాగముస్తె. వి. భద్రముస్తకముః. (శ.ర.)

నాగయష్టి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ఉలిమిరిలో నగుకఱ్ఱలతో చేసి తటాకాదులయందు అనంత వాసుక్యాదినాగులలో నొకనికి అధిష్ఠానముగా నాఁటిన స్తంభవిశేషము. ౨. క్రొత్తగా త్రవ్విన చెఱువు లోనగువానియందు నీటిలోఁతు తెలియుటకై నాఁటినకొలత స్తంభము. ౩. నేలతో లఁచుకఱ్ఱ.

నాగరంగము. సం. వి. అ. పుం. నారంగము, నారింజః.

నాగరకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) ౧. నగరమందు పుట్టినవాఁడు. ౨. ప్రవీణుఁడు, నేర్పరి. ౩.నగరదురభ్యాసములు అలవడ్డవాఁడు. ౪. దొంగ. ౫. శిల్పి.

నాగరక్తము. సం. వి. అ. న. సిందూరము.

నాగరఘనము. సం. వి. అ. పుం. నాగముస్తెః.

నాగరము. వి. (క. నాగరు.) స్త్రీశిరోభూషావిశేషము.

(శుక.) తాశిల్లకు నాగరము చేయించితిని.

నాగరము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నగరమున పుట్టినది. ౨. నగరమున ఉన్నది. ౩. నగరమునకు సంబంధించినది. వి. అ. పుం. ౧. (జ్యోతి.) పౌరము అను గ్రహయుద్ధవిశేషము. ౨. నారింజ చెట్టు. ౩. కపటము, మోసము. ౪. దేశభేదము. ౫. గోరంట. న. ౧. సొంటి. ౨. ఒకజాతిముస్తె. ౩. ఒకానొకలిపి. ౪. రతిబంధవిశేషము.

నాగరముస్త. సం. వి. ఆ. స్త్రీ. నాగముస్తె.

నాగరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. లిపివిశేషము, దేవనాగరి. ౨. పట్టనవాసపుస్త్రీ. ౩. స్నుహి, జెముడు.

నాగరికము. సం. వి. అ. న. నగరమునుండి వచ్చు సుంకము.

నాగరికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నగరరక్షణమందు నియుక్తుఁడు. ౨. నగరము రక్షించువాఁడు.

నాగరుఁడు. సం. వి. అ. పుం. ౧. నగరవాసి, పౌరుఁడు. ౨. దేవరుఁడు, మగనిసోదరుఁడు. (వాచ.)

నాగరుకము. సం. వి. అ. పుం. నాగరంగము, నారింజ.

నాగరేణువు. సం. వి. ఉ. పుం. సిందూరము.

నాగరేయకము. సం. విణ. (అ. ఈ. అ.) నగరియందు పుట్టినది. ౨. నగరియందున్నది.

నాగరోత్థ. సం. వి. ఆ. స్త్రీ. నాగముస్తె.

నాగర్యము. సం. వి. అ. న. నాగరకత, వైదగ్ధ్యము. (వాచ.)

నాగలత. సం.వి.ఆ.స్త్రీ. ౧.మగగుఱి.(త్రి.ని.) ౨. తమలపాకుతీఁగ, నాగవల్లి. (వాచ.)

నాగలోకము. సం. వి. అ. పుం. పాతాళము.

నాగవ(ప)డిగెలు= నాగపడగలు. వి. బ. కన్నె భూషావిశేషము.

సీ. మొంకపాటియుత్తె ముంచిన నాగపడిగెలు బిగు కొప్పుఁ గొడిగెఁ బిళ్లచెప్పు. హ. ఖాండ... రా. వి. ౨. ౪౪.

నాగవల్లరి. సం=నాగవల్లి.

నాగవల్లి(లి)= నాగవేలిమి. వి. (సం. నాకబలిః. ప్రా. నాగవెల్లి. క. నాగవలి.) పెండ్లిలో కడపటి నాఁడు చేయుసంస్కారవిశేషము.(దీనిని కొందఱు పెండ్లినాలవనాఁడును కొందఱు ఆయిదవనాఁడును జరిగింతురు.)

గీ. అట్లు వైవాహికార్యకృత్యములు వెలసి, నాలుగవనాఁడు సకలబాంధవులుఁ జెలఁగ, నరవరాగ్రణి లోచనానంద మొదవ, నాగవల్లి యొనర్చుటకై గుఱింప. రాజ. చ. ౩. ౧౭౪.

క. తగఁ బ్రాకెనయును దీర్చి, నగవులపను లైన వెనుక నాలవనా డొప్పఁగ నాగవల్లి సేయుఁగఁ, బగడపుటుప్పరిగెలోనఁ బడఁకటుక జెల్లఁగా. యయా. ౪. ౧౧౪. రా. వి.౫.౯౦.

ఆ. అటుల దినచతుష్టయం బైన యంత నా, గవలియును నొనర్చి సాఁపయంతు. ఇఁదు. ఉ. ౬౬.

క. విలసితబహువైభవముల, నలయుచు నాగవలిఁ జేసి యఖిలారిజనంబులకు వరహాలు మాళ్వి,చ్చలవిడి పచ్చడము లిచ్చె జనవరుఁ డంతట. కృష్ణ. ౪. ౧౨౩.

సీ. వడుగు పెండ్లిండ్లలోపలఁ ద్వితీయదినంబు ప్రాకెన్న యనఁగను బరఁగుచుండు, నాలుగింటికిని శేషె యగుచు నంత్యదినంబు అపుడుగం బవళి నాగవలి యనఁగ. ఆం. భా.౨.౧౩౮.

నాగవలిలోపలనిష్ఠురము = పెండ్లి యంతియు నైనపిమ్మట నాగవల్లినాఁడు పెండ్లివారు రెండువరుల నోఁకఱించునట్టి మాటలాడుట. (పని జెఱుపేత్తిన

తర్వాత బంధువులు కలహించుటవలన మన
స్సులు చెడుటయే కాని కలసివచ్చునది లేదు
అని భావము.)

ఉ. మాలిమి లేదు గాన ననుమానము నామదిఁ
దోఁచె నప్పుడే, బాలిక సేవసేయఁ బనుపన్
వల దంటిని గాదె దాని కేమియాలుపు కల్గు మేన
మఱఁ దింతయు యాతఁడు నైన దైన దేల్లోలత
నింక నాగవలిలోపల నిష్ఠుర మేల పల్కఁగన్.
విజ. వి. 3. ౧౪౦.

ఇట్టే: నాగవల్లినిష్ఠురము.

(వ్యవ.) ఎంతజాగ్రత్తగా నున్నను మాయింట
పెండ్లిలో నాగవల్లినిష్ఠురము తప్పినదికాదు.

నాగవల్లి. సం. వి. ఈ. స్త్రీ. తాంబూలి, తమలపాకుతీఁగ.

నాగవారికము. సం. వి. అ. పుం. ౧ - ఏనుఁగులను వారించునది - రాజకుంజరము, పట్టపుటేనుఁగు. ౨. ఏనుఁగుగుంపులో పెద్దయేనుఁగు. 3-పాములను వారించునది-నెమిలి.

నాగవారికుఁడు. సం. వి. అ. పుం. ౧ - ఏనుఁగులను వారించువాఁడు- హస్తిపాలకుఁడు, మావటీవాఁడు. ౨- పాములను వారించువాఁడు-గరుడుఁడు. 3.గణస్థుఁడు, ముఖ్యసభ్యుఁడు.(వై.ని.)

నాగవాసమ(పుట)లరుఁబోఁడి. వి. (నాగవాసము² + అలరుఁబోఁడి.) వారాంగన, వేశ్య.

ఆ. కలితభోగవతులు ఘనభుజంగాన్విత,రతులు
కంచుకాభిరామ్యయుతలు, నగుట నాగవా
సమలరుఁబోఁడులు నాగ,వాసయువతులట్ల
వఱలి రచట. ఇందు. ౧. ౧౫౫.

(అయోధ్యాపురము.)వ...రత్నస్యందనద్వారం
బుల నమరాంగంబోవరం గూర్చుండి లీలార్థం
బుగ నాగవాసపుటలరుఁ బోఁడు లమరాగం
బులు చిగిరించినతదీయ స్తంభములఁ గలచిగు
రుటాకు లన ... ఒప్పుచుండు. ఇందు. ౧.
౧౫౪.

నాగవాసము¹. వి. ౧. ఘంటాప్రతీకము, గంటలోనిచీల.

సీ. నాగవాస మన ఘంటా ప్రతీకమునకు వేశ్య
లకును బేరు విశ్వనాథ.ఆం.సం.నా.నా. ౨౮.

౨. గొండ్లెము మొ. వానిని తగిలించుటకు ద్వారబంధము మొ. వానికి రెండుకొనలు వంచి బిగించినయినుపకమ్మి.

చ. కులుకుమెఱుంగుఁ గెంపుతతిగోళ్ల నమర్చిన
నాగవాసపుం,గొలుకుల జాళువాగొలుసుగో
ళ్లఁ దగులొత్తని వ్రేలుపచ్చతా,చిలుకల
తూఁగుమంచమున శ్రీరమణుండు వసించున
త్తఱిన్. చంద్ర. ౧. ౯౧.

(వ్యవ.) ద్వారబంధమునకు నాగవాసము విఱిగి
పోయినది.

నాగవాసము². వి. ౧. వేశ్యాసమూహము.

సీ. ననుపుకాఁడై వేల్పునాగవాసముఁ గూడి
మహిమ గోల్పడియె నే మాండకర్ణి.మనుచ.
౨. ౭3. ఆం. సం. నానా. ౨౮.

౨. భోగముమేళము.

క. ... పురము కైసేసి ప్రజల్,తో నరుగ నా
గవాసము,తో నెదురుగ నేఁగి రంత తూ
ర్యము లులియఁగన్. ఆము. ౪. 3౪.

ఆ. నాగవాస మనఁగ నామ మహా వేశ్యాజ,నంబు
మేళమునకు నంబికేళ. ఆం. సం. మాన. ౯.
ఆం. భా.౧.౧3౦. హంస. ౧. ౬౪.

జ: నాగవాసమలరుఁబోఁడి.

నాగవాసము. సం. వి. అ. పుం. నాగలోకము.

నాగవీథి. సం. వి. ఈ. స్త్రీ. ఆకాశమండలమందు ఉత్తరదిక్కున అశ్విని భరణి కృత్తిక యను మూఁడునక్షత్రములు కలఆకాశవీథీభాగము.
(చూ, ఐరావతము.)

నాగవ్రేలిమి= నాగవల్లి.

... వి ప్రజ్ఞానాలు విధానాలు

భోజనాలును మేలిక్, వ్రేలిమి గలుగఁగ ముదముల, వ్రేలి మిగుల నవల నాగవ్రేలి మొనర్పక్. ముకుంద. 3. ౨౯౩.

నాగశుండి. సం. వి. ఈ. స్త్రీ. కోలదోసక్.

నాగసంభవము. సం. వి. అ. న – సీసమువలన కలిగినది– సిందూరము.

ఇట్లే: నాగసంభూతము.

నాగసరము. వి. (సం. నాగస్వరః. ప్రా. నాగసరో.) ౧. పాములవాఁడూఁదెడిబుఱ్ఱ.

గీ. నాగసింధు ప్రభేదనానావరాట, రాగగంధర్వ లహరికారంభణముల, మిహిపదంబుగఁ బాములమెంగఁ దూఁదె, భోగిరాజులు స ర్తింప నాగసరము. క్రీడా. ౨౨౪.

౨. పాములకుఆనందము కలిగించుస్వరవిశేషము.

గీ... ఆలకించి చనియె, నాగసరములమ్రోఁత యన్నాగరికుఁడు. క్రీడా. ౨౯౧.

సీ... నాగస్వరం బగు నాగసర మన... ఆం. భా. ౧. ౧౨౯.

3. సన్నాయి.

క. సంగీతపు మేళపుజత, సంగతితాళములు నాగసరములు ఢక్కీల్, చెంగులు ముఖవీణియలు న్, పాంగము తప్పెటలు గజ్జె లందుక చేరక్. ప్రబంధ. ౯3.

క. అంతట నాగసరంబుల, నింతులు తానములు మిగుల హెచ్చించుచు సామంతముపరవక్ బువులు వసంతము లోనుగనుఁ గొనుచుఁ జనుదే మతియుక్. యయా. ౪. ౧౫౦.

నాగసాహ్వయము. సం. వి. అ. న – ఏనుఁగుతో సమాన మగుపేరు కలది– కౌరవవాసస్థాన మగుహస్తిపురము. (వాచ.)

నాగసుగంధ. సం. వి. ఆ. స్త్రీ. నాకులి, సర్పాక్షీక్.

నాగస్తోకము. సం. వి. అ. న – సర్పవిషలేశము కలది – వత్సనాభము, వసనాభి.

నాగస్ఫోత. సం. వి. ఆ. స్త్రీ. నేపాళము, దంతిక్.

నాగస్వరము. సం. వి. అ. పుం. ౧. పాములకు ఆనందమును కలుగఁజేయుగానవిశేషము. ౨. పాములవాఁ డూఁదెడిబుఱ్ఱ.

క. నాగస్వరసుషిరసర, న్నాగవరాళ్యాదివివిధ నానారాగ, ప్రాగల్భ్య ప్రకటఫణా, భోగములై యాడఁజొచ్చె భోగీంద్రంబుల్. క్రీడా. ౨౨౦.

నాగహంత్రి. సం. వి. ఈ. స్త్రీ – సర్పవిషమును పోఁగొట్టునది – వంధ్యాకర్కోటకి, గొడ్డు ఆఁగాకర్.

నాగహనువు. సం. వి. ఉ. పుం. నఖ మనుగంధద్రవ్యముక్.

నాగాంచల. సం. వి. ఆ. స్త్రీ=నాగయష్టి.

నాగాంజన. సం. వి. ఆ. స్త్రీ. ౧=నాగయష్టి. ౨. హస్తిని, ఆఁడేనుఁగు.

నాగాంతకము. సం. వి. అ. పుం. – పాములను చంపునది – ౧. గరుడపక్షి. ౨. నెమిలి. 3 – ఏనుఁగులను చంపునది – సింహము.

నాగాఖ్యము. సం. వి. అ. పుం. నాగకేసరముక్. (త్రి. ని.)

నాగారి. సం. వి. ఇ. పుం – పాములకు శత్రువు– ౧. గరుడపక్షి. ౨. నెమిలి. 3 – ఏనుఁగులకు శత్రువు– సింహము. (ఇట్లే: నాగారాతి మొ.)

నాగాశనము. సం. వి. అ. పుం – పాములను తినునది – ౧. గరుడపక్షి. ౨. నెమిలి.

నాగి. సం. విశ. (న్. నీ. న్.) పాములు కలది. (ప్రట్టు. మొ.) వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుపాము. ౨. ఆఁడేనుఁగు. 3. పాతాళలోకము. (వై. ని.) న్. పుం. పాములుఆభరణముగా కలవాఁడు, శివుఁడు.

నాగిలి. వి. (సం. నాకిలీ.) లోకాంతరగత దైవ

దేవత యైనముత్తైదువ. (శ. ర.)

నాగిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. గొల్లజిడ్డు.
గీ... నాగినియగు, గొల్లజిడ్డు... ఆం. భా. ౨. ౬౬.
౨. నాఁగుఱు, నావురు.
గీ... నాగిని నావురు నాఁగు రనఁగ. ఆం. భా. ౨. ౬౨. (ఈపదము సం. ని. లలో కన్పడలేదు.)

నాగు(వు). వి. (సం. నాగ.) పాము.
గీ. నాగముల పేరు వెలయును నాగు లనఁగ. ఆం. భా. ౧. ౧౪౬.
ఆ. నంది యెక్కి గిత్త నాగులు సొమ్ములు, చేఁదు మెడను బునుకచేరు బూది, నుదుట సరలు గొన్నరుదురాక లెదఁ గల్గు, నయ్యయొరపు దెలుప నలవి యగునె. చెన్న. ౩. ౩౯.
చ. తలఁ బ్రతిబింబభానుమణిఁ దాల్చి విహార వనాంతరంబునన్, మలఁగి మలంగి పెంజి లుము నాగువుభంగి... నైష. ౪. ౧౫౪.
గీ. కుబుస మూడ్చెడిమేటినాగువునుబోలె. భీమ. ౫. ౪౦.
జః నాగుఁబాము, నాగుపడిగెప్రోగులు, నాగులచవుతి, నాగులపడగలు.

నాగుఁబాము. వి. (నాగు+పాము.) నాగము, త్రాఁచు.
గీ. కినుక నిగుడంగ నోడుపు దప్పినపిసాళి, నాగుఁబామును బోలుచు నవుడుగఱచి. అచ్చ. రా. సుం. ౫౫.
క... నాగుఁబా మనఁ ద్రాఁచన ఫణి దనర్చు. ఆం. భా. ౧. ౧౪౪.

నాగుపడిగెప్రోగులు=నాగపడగలు. వి. బ. (√నాగు.) పాముపడగపోలికి కలకర్ణాభరణ విశేషము.
గీ ... చెవులనాగు, పడిగెప్రోగులు మెలిగొన్న పచ్చడములు, నమర గుమిగూడి జాలరు లరుగుదెంచి, రలరు మొగములతోఁ గ్రాటి కలలుగొనుచు. వేం. పంచ.

నాగులచవుతి. వి. (√నాగు.) నాగచతుర్థి.
(వ్యవ.) నాగులచవుతినాఁడు పుట్టలో పాలు పోయుదురు.

నాగులపడగలు=నాగపడగలు.
చ... వెన్నునం, దొలకెడునెత్తిజుట్టు తెలిదుప్పటి వీనుల మానికంపు నా, గులపడగల్ రహింపగ నొకొండగు నొంటరిబోయఁ డుద్ధతిన్. కువల. ౪. ౨౦౨.

నాగేంద్రము. సం. వి. అ. పుం. ౧. సర్పరాజము. ౨. శేషాహి. ౩. గజశ్రేష్ఠము. ౪. ఐరావతము.

నాగోదము. సం. వి. అ. న. ఉదరత్రాణము.

నాగోదరము. సం. వి. అ. న. ౧. ఉదరత్రాణము. ౨. గర్భిణి యొక్క గర్భోపద్రవభేదము,

నాగోదరి. సం. వి. ఈ. స్త్రీ. ఉదరత్రాణము. పొట్టకు తొడుఁగుకొనుకవచము.

నాచి. వి. (త. నాచ్చి.) స్త్రీ.
(ఏకవీర.) గీ. కలికి పల్లిక దేబెలఁ గన్నతల్లి, వాసి కెక్కినయట్టిపోలాసయిల్లు, చక్క మెప్పులమాహురమ్మక్క నాచి. క్రీడా. ౧౨౯.

నాట. సం. వి. అ. పుం. రాగవిశేషము.
శా. వాలారుంగొనగోళ్ల నీ వలసతన్ వాయించుచో నాటయున్, మేళం బైనవిపంచి నిన్న మొదలున్ నీ వంటమిం జేసి యా, యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాత వాతాహతా, లోల తంత్రుల మేళవింపఁగ దవే లోలాక్షి దేశాక్షికిన్. మను. ౩. ౫౪.
సీ... శంక, రాభరణము మేఘరంజి తోడి వరాళి నాదనామక్రియ నాట... హంస. ౫. ౧౨౪.
ఉ... తుంబురుండు తా, గౌళ వరాళి నాటలను గాయనరూఢికి నాఁటి చూపినన్. శ్రీరం. ౧౫౩.

నాటకము. సం. వి. అ. న. ౧. శృంగారవీరరసములలో నొకరసము ప్రధానముగా నుండి ప్రఖ్యాతచరిత్రమును తెలుపుచు అయిదు మొదలు పదివఱకు అంకము లుండుదృశ్యప్రబంధము.

౨. నర్తనము.

దండకము... గోవర్ధనక్షోణిభృత్కందరక్షోణిఁ గ్రీడించువిన్నాణి వెన్నాటకం బైనక్రాల్గన్నులక్ గల్గుపెన్దళ్కులక్ నల్గడక్ జల్కునెమ్మోముజాబిల్లి శోభిల్ల...పాండు.౪.౬౪.

౩. చరిత్రము.

గీ. పుండరీకాక్షునకు శూలి పూజ లిచ్చె,సంయములు చూడ బదరికాశ్రమమునందు,నాఁగవిందు మయ్యైరవపురనాటకంబుఁ, జెప్పి చెవులకుఁ బండువు సేయు మనఘ. ఉ. హరి. ౨. ౬౦.

౪. కపటోపాయము.

ఉ. నా మొఁగమోటకై పలనినాటకముల్ ఘటియించి రుక్మిణీ,కామినిమీఁదటం గలుగు గౌరవముం గృపయుం బ్రియంబుఁ దా, నేమియుఁ గానసీక యిట నిన్నిదినంబులు నన్నుఁ దేల్చె...పారి. ౧. ౮౯.

(వ్యవ.) నీ నాటకములు నాదగ్గఱ సాఁగవు.

నాటకీయము. సం. విణ. (అ. ఆ. అ.) నాటకసంబంధ మైనది.

నాటకుఁడు. సం. విణ. (అ.టికా.అ.) నటుఁడు, ఆటకాఁడు.

నాటనము. సం. వి. అ. న. ౧. నటింపఁజేయుట.

౨. నటనము.

సీ. శ్రీకరోదయవధూలోకాననప్రభా నాటితబహుచంద్రనాటనంబు. గీ. దీపితం బగుశ్రీకాశికాపురంబు. పాండు. ౧. ౧౨౩.

నాటము. సం. వి. అ. పుం. ౧. నృత్యము. ౨. కర్ణాటదేశము. (వాచ.)

నాటామ్రము. సం. వి. అ. పుం. - నటులకు ప్రియమైనరసము కలది - కరబూజా?.

నాటారుఁడు. సం. వి. అ. పుం. నటియొక్క కొడుకు. (కల్ప.)

నాటి. సం. విణ. (న్. నీ. న్.) నటించువాఁడు, నర్తనము చేయువాఁడు.

నాటిక. సం. వి. ఆ. స్త్రీ. ఉపరూపకము లనెడి దృశ్యకావ్యములలో నొకటి. (ఇది నాలు గంకములు కలిగి స్త్రీపాత్రబహుళముగా నుండును. ఇందలికథ కల్పిత మై యుండవలెను. నాయకుఁడు ధీరలలితుఁ డగురాజు. నాయిక అంతఃపురసంబంధగాని సంగీతవ్యాపృతగాని అయి నవానురాగ యగురాజకన్యక. ప్రౌఢయు నృపవంశమందు పుట్టినదియు నగుపెద్దభార్య యుండవలెను. ఇందు వృత్తి కైశికి.)

నాటితము. సం. విణ. (అ. ఆ. అ.) కృతాభినయము, అభినయింపఁబడినది; అనుకరింపఁబడినది.

నాటేయుఁడు. సం.=నాటారుఁడు.

నాట్య(ము.) వి. మల్లవిద్యాసంబంధ మగుపదునాల్గువిసరులలో నొకటి.

వ...దథ ధారు ధాణు అంత్రటీక టీక ఉద్దడ నాట్య దారుధాణు దారుకపాలు... మల్లపు. ౩. ౬౯.

వ...అంత్రటీక టీక నాట్యము... మొదలగు పదునాలుగువిసరులు... ప్రబంధ. ౪వ.

నాట్యధర్మిక. సం. వి. ఆ. స్త్రీ. నాట్యవిధులు తెలుపువిద్య.

నాట్యప్రమ్రకము. సం. వి. అ. న. తూఁడు

పాల్లు కుంకుమపువ్వు కలపినగంధపొడి, ఒకది నుసుబుక్కా.

నాట్యభాష. సం. వి. ఆ. స్త్రీ. నాట్యమందా యాపాత్రములకు తగునట్లు ప్రయోగించుభాష.

నాట్యము. సం. వి. అ. న. -నటునికృత్యము - ౧ నృత్తము. ౨. నృత్తగీతవాద్యాత్మక మగులాస్యము, తౌర్యత్రికము. ౩. నాటకాదిదశరూపకాభినయము.

నాట్యరాసకము. సం. వి. అ. న. రూపకభేదము, దృశ్యకావ్యవిశేషము.(దీనికి అంక మొక్కటియే. నాయకుఁడు ధీరోదాత్తుఁడు. పీఠమర్దుఁడుపనాయకుఁడు. హాస్యరసము అంగి. శృంగారము అంగము. నాయిక వాసకసజ్జిక. వాచ.)

నాట్యాంగము. సం. వి. అ. న. నాట్యముయొక్క అంగము. (ఇది "గేయపదము, స్థితపాద్యము, ఆసీనము, పుష్పగండిక, ప్రచ్ఛేదనము, త్రిగూఢము, సైంధవము, ద్విగూఢకము, ఉత్తమోత్తమకము, ఉక్తప్రత్యుక్తము" అని పదివిధములు.)

నాట్యాలంకారము. సం. వి. అ. పుం. ౧. నాట్యమునకు అలంకారము, ఆశీస్సు ఆక్రందము కపటము క్షమ గర్వము ఉద్యమము పశ్చాత్తాపము మొద లగుముప్పదియాఱింటిలో నొకటి.

నాట్యోక్తి. సం. వి. ఇ. స్త్రీ. నాట్యమందలి పరిభాష, నాటకపరిభాష.

నాడము. సం=నాళము.

నాడా. వి. (హిం. నాడా.)నూలు మొదలగువానితో నేసినపట్టె.

వ...అల్లనఁ గనుపట్టుపెనుపట్టునాడాలబిగిని దగినవిగవిగనిజిగి... మల్లుపు. ౪. ౬౭.

నాడి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. నాళము, కాఁడ. ౨. బోలుగా నుండుకాఁడ. (తామరలోనగువాని) కాఁడ. ౩. (ఆకులోనగువాని)ఈనె. ౪. శరీరమందలిబోలునరము, రక్తనాళము. ౫. క్రోవి, గొట్టము. ౬. నారికుఱుపు. ౭. గడియకాలము. ౮. గండదూర్వ, ఒకజాతిగఱిక. ౯. కుహకచర్య, మోసకానినడక, మాయ. ౧౦. వాతపిత్తశ్లేష్మనాడులలో నొకటి.౧౧.(జ్యోతి.) వధూవరులపొంతనములు చూచుటకై నక్షత్రవిశేషములతో నాడ్యాకారముగా గీసినరేఖ. ౧౨. (యోగ.) ఇడ, పింగళ, సుషుమ్న అను మూఁడునాడులలో నొకటి.

నాడింధమము. సం. విణ. (అ. ఆ. అ.) నాడులను చలింపఁజేయునది; శ్వాసమును అధికముగా కలిగించునది. (భయాది.)

నాడింధముఁడు. సం. వి. అ. పుం- గొట్టము ఊఁదువాఁడు - స్వర్ణకారుఁడు, కంసాలి.

నాడింధయుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) గొట్టముతో పాలు లోనగునవి త్రాగువాఁడు.

నాడికేలము. సం=నారికేళము. (వాచ.)

నాడిచీరము. సం. వి. అ. పుం. ౧. నలి యను గంధద్రవ్యము, గువ్వగుత్తిక. ౨. సూత్రవేష్టనవలిక, నూలు చుట్టెడుచిన్నక్రోవి, సాలెవానియొకానొకపనిముట్టు.

నాడిపత్త్రము. సం. వి. అ. న. నాడీచము అనుశాకము.

నాడీకము. సం. వి. అ. పుం. కాఁడలు ప్రధానముగా కలయొకదినుసుశాకము.

నాడీకలాపకము. సం. వి. అ. పుం. సర్పాక్షి.

నాడీకూటము. సం.వి.అ. న. (జ్యోతి.) వివాహమున వధూవరులపొంతనములు చూచుటకై నాడీరూపముగా గీసినరేఖలయందు జ్యోతిశ్శాస్త్రకారముచే ఏర్పఱచినన నక్షత్రసముదాయము.

నాడీచక్రము. సం. వి. అ. న. ౧. నాభిస్థానమందు నాడు లుండుచక్రవిశేషము. (దీనినుండి నాడులు వెలువడును.) ౨. (జ్యోతి.) నాడీకూటము లిఖించుటకై గీసినరేఖలు.

నాడీచము. సం. వి. అ. పుం. శాకవృక్షవిశేషము, ఒకదినుసుకూరాకు ¶.

నాడీచరణము. సం. వి. అ. పుం. - కాఁడవంటి కాళ్లు కలది - పక్షి. (త్రి. ని.)

నాడీజంఘము. సం. వి. అ. పుం. - కాఁడవంటి పిక్కలు కలది - కాకి. (వై. ని.)

నాడీజంఘుఁడు. సం. వి. అ. పుం. రాజధర్ముఁడనునామాంతరము కలయొకబకము. (చూ. భార. శాం. ౩. ౪౭౭.)

నాడీతరంగము. సం. వి. అ. పుం. కాకోలము. (మే. ని.)

నాడీతరంగుఁడు. సం. వి. అ. పుం. రతహిండకుఁడు, వ్యభిచరించువాఁడు. (కల్ప.)

నాడీతిక్తము. సం. వి. అ. పుం. నేపాళనింబము, నేపాళదేశపువేము ¶.

నాడీదేహుఁడు. సం. వి. అ. పుం - రక్తమాంసములు లేక నాడులు మాత్రము కలదేహము కలవాఁడు, శుష్కించినవాఁడు - భృంగి. (శివుని ద్వారపాలకులలో నొకఁడు.)

నాడీనక్షత్రము. సం. వి. అ. న. ౧. జన్మనక్షత్రము. ౨.జన్మనక్షత్రమునకు పది, పదియాఱు, పదునెనిమిది, యిరువదిమూఁడు, యిరువదియేడు అగునక్షత్రములలో నొకటి. ౩. (జ్యోతి.) నాడీరేఖలయందలి నక్షత్రము. (చూ. నాడీ కూటము.)

నాడీపరీక్ష. సం. వి. ఆ. స్త్రీ. హస్తాదులందలి వాతాదినాడులను పరీక్షించుట.

నాడీయంత్రము. సం. వి. అ. న. (వైద్య.) శల్యమునుతీయుటకైనయంత్రవిశేషము. (ఇది ఇరువదివిధములు కలది.)

నాడీవలయము. సం. వి. అ. న. నాడులను -గడియలను- తెలుపువలయాకారము కలయంత్రవిశేషము, గడియారము. (వాచ.)

నాడీవిగ్రహుఁడు. సం=నాడీదేహుఁడు.

నాడీవ్రణము. సం. వి. అ. పుం. నారికుఱుపు, సెల వేయుకుఱుపు.

నాడీహింగువు. సం. వి. ఉ. పుం. ఒకవిధమైన ఇంగువు.

నాడు=నాఁటు. అ. క్రి. నాఁటు, గ్రుచ్చుకొను; ఖండిత మగు.

గీ. కాఁడె గ్రుచ్చెను దొలిచెను నాడె ననఁగ, నాఁటె ననుమాట కర్థమా నాగభూష. ఆం. భా. ౩. ౧౨౨.

చ. జనపతివేఁడితూపుల భుజంబులు వ్రచ్చి యురంబు లుచ్చి యా, వనములు వాఁడి చాపములు నాడి శతాంగము లాడి యుగ్రకే, తనములు నూడినన్...కవి. ౨. ౧౦౦.

స. క్రి. బాధించు, పీడించు.

చ. అనలునిఁ గాఁడుచుం జముని నాడుచు రాక్షసు నాడుచుం గపర్దినొసలు చూఁడుచుం ధనదుప్రేవులు దోఁడుచు...కవి. ౫. ౧౨౩.

మ. తననీటుల్ మెఱయించు జేనబోడవుందాట్రింటియందంపుఁగుం, దనపుందల్కులు గ్రుమరించుచిఱుపొనాకత్తి చిమ్మన్...వీనులబులు దిద్ది నాడికొను జగ్గుల్ మీఱ జాపీథులన్. కువల. ౫. ౪. (ఇట మెలివెట్టు అని భావము.)



నాడించు ... మూలకంఁడె నించి వేసెదు

సాలెవానిసాధనము, తురి.

సీ. పరిపరి యచ్చులు చరిగుండ యూడిత చీడు దబ్బలు దండె నాడె క్రోవి. హంస. ౨. ౧౧.

నాడెకత్తె=నాణెకత్తె. విణ. (నాడెము+కత్తె.) నాడెము కలది. (శ.ర.)

నాడెకాఁడు=నాణెకాఁడు. విణ. (నాడెము+కాఁడు.) నాడెము కలవాఁడు. (శ. ర.)

వి. కోమటి, వైశ్యుఁడు.

గీ. మూఁడవకోలంబకేఁడు నాడెకాఁడు...కోమటి నాఁదనర్చు. సాం. ని. మాన. ౨.

నాడెము=నాణెము.(ఇది సబిందుకము అని శ.ర.) విణ. (మేలైనది, శ్రేష్ఠము.)

చ. నిగనిగలాడు కుందనపు నిద్దపుగోడల నాడెమైనము, త్రిగరతనంపు జిల్గుపనితిన్నియలుఁ ...కడు నైజయుఁ జెన్ను దలిర్పఁగఁ బ్రోల నెల్లెడన్. నీలా. ౧. ౩౦.

గీ. అఖిలవాంఛాప్రదంబు నైనట్టిపుణ్యతీర్థ మెయ్యది నాడెంపుదేశ మెద్ది. రసిక. ౬.౧౪౧.

సీ. జడదారిరాయ యిజ్జగమున నాడెంపుగొనము వాఁడియుఁ గనికరమును. గీ. కలుగు మానిసి యెవ్వఁడు ... అచ్చ. రా. బాల. ౨౮. ప్రబంధ. ౩౩.

జూ: నాడెకత్తె, నాడెకాఁడు.

నాణకము. సం. వి. అ. న. రూపాయ లోనగు నాణెము.

నాణెకత్తె=నాడెకత్తె. విణ. (నాణెము+కత్తె.) నాణెముకలది. (శ. ర.)

నాణెకా(గా)ఁడు=నాడెకాఁడు. విణ.(నాణెము+కాఁడు.) నాణ్ణము కలవాఁడు.

సీ. చేరెఁడుబియ్యాలయోరెముల్ దినువానిఁ గోణంగి సేవలనాణెగాని. ఘటికా. ౨. ౧౪౬.

నాణెము=నాడెము,నాణ్యము. వి. (సం. నాణకము.

క. నాణ్య. త. నాణయం. మ. నాణియమ్.)

౧. శుద్ధదీనారము. (ముద్రింపఁబడినరాగి వెండి బంగారములబిల్ల అని శ.ర.)

గీ. నాణె మనఁగను శుద్ధదీనార మొప్పు. ఆం. భా. ౨. ౨౪౩.

ఉ. ...నా,నానగరోద్భవంబు లగునాణెము లుండెడుసంచిఁ గొంచు బేరానకు వచ్చువన్నయధురంధరుఁ డంగడికిం గణింపఁగన్. శుక. ౧. ౪౨౧. కృష్ణ. ౩. ౬.

౨. శ్రేష్ఠత్వము; మంజులత, మనోహరత్వము.

చ. అడలుచుఁ దాళరానివిరహార్తి మెయిం దుర పిల్లు దాని ... అంచరా,నడుపులు దానిమోవిరుచినాణెము దానిమెఱుంగు దానిను, స్వేదఁగును...చూడమిన్. శుక. ౧. ౧౧౧.

౩. (వస్తువుల) మంచిచెడ్డలు.

క...నాణె మెఱుఁగ బచ్చు గాఁగ నరపతికిఁ దగున్. ఆము. ౪. ౨౬౯.

౪. ద్రవ్యము, ధనము.

చ. నడవడి గల్గువాఁడు కడునాణెము చేఁ గలవాఁడు...చెడుగుల బ్రహ్మదీనిని నిసీ మగవాలుఁగఁ జేసె నంచు లో,మిడుకుచు దానియింటికడ మీసలు దీడుచు నుందు రెప్పుడున్. హంస. ౫. ౨౧౬.

౫.ఇచ్చిపుచ్చుకొనుటయందలియోగ్యత.(శ.ర.)

౬. నాగరకత. (శ. ర.)

విణ. ౧. మంజులము, మనోహరము.

సీ ... నాణెము చొక. గీ. గొనబు తియ్యంబు జాను తిన్ననిది బాగు, చొక్కటంబన వెలయు మంజులసమాఖ్య. ఆం. భా. ౩. ౧౪.

౨. శ్రేష్ఠము.

గీ. కంచిలో వేదువాడలఁ గలిగినట్టి, నాణెపుం గోమటులతోడ నంబిసెట్టి, భాసురస్ఫూర్తిఁ గాఁ గైలాసమునకు. హర. ౨. ౧౪౧.

... నాణె మైనచెడిపె నయ ఘుటింగి తిరుంగు.

వేమన. ౩. ౨౫౦.

జః నాణెకత్తె, నాణెకాఁడు.

**నాణ్య(ణీయ)ము**=నాణెము. (చి.ని. బ్రౌ.వా.)

**నాతము.** వి. బత్తెము.

ఉ...కొల్చినవేదపాదలన్, దప్పనిజీతనాతము లఁ దన్పుట భూషణ మయ్యెఁ బుత్రకా. శా. వి. ౨. ౩౪.

**నాతి**=నాతుక. వి. (క. నాతి. త. నాటి.) స్త్రీ, ఆఁడుది.

క. ఇమ్ముగఁ దద్గూమాఘ్రాణమున గర్భములు దాల్చి నాతులు నవమాసములు నిండుడుఁ గనిరి మ్ముదమ్మున జంతుప్రముఖనుతప్రకర మ్ముల్. భార. అర. ౩. ౨౧౬.

క. జ్ఞాతుఁ బోరితమును గోవ్రాతమునాక్రమము విప్రవర్గముచనవున్, నాతులకారించుటయును, బ్రీతిం జననిచ్చునతనిపెం పొప్పు నృపా. భార. ఉద్యో. ౨. ౮౬.

శ్లో. బ్రాహ్మణేషు చ యే శూరా స్త్రీషు జ్ఞాతిషు గోషు చ, వృంతాదివ ఫలం పక్వం ధృతరాష్ట్ర పతంతి తే. సం.భార.ఉద్యో. ౩౬. ౬౧.

క. ఆతనువుల లేరు గదా, నాతులు మతికాక కలిగినన్ వగఁ దిర్యగ్జాతికి నీజాతికిఁ గల, యాతీవ్రత గలదె యెఱుఁగ కిట్లే లంటిన్. ఆము. ౫. ౪౨.

జః నాతుక.

**నాతికఠినము.** సం. విణ. (అ. ఆ. అ.) అనతి కఠినము, మిక్కిలి గట్టిది కానిది.

**నాతిచిరము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. అనతి చిరము, అతిచిరము కానిది. ౨. దీర్ఘకాలపుది కానిది, స్వల్పకాలపుది.

**నాతిదూరము.** సం.విణ. (అ. ఆ. అ.) మిక్కిలిదూరము కానిది, ఇంచుకదూర మైనది. వి. అ. న. అనతిదూరము, కొంచెముదూరము.

**నాతివాదము.** సం. విణ. (అ. ఆ. అ.) పరుష భాషణము లేనిది. వి. అ. పుం. పరుషభాషణ ములేమి.

**నాతుక**=నాతి. వి. (నాతి+ఉక. స్వార్థము న.)

ఉ. జాతర పేరు చెప్పి రథసంబుఁ దల్లియుఁ దానుగూడి యా,నాతుక త్రోవ చూపఁగ వ సంబునకుం జని...అవకీక్కృతమానసమై వడం కుచున్. భోజరా. ౫. ౨౭౭, ౨. ౬౩.

క. వినలే నిట్టివి మానుఁడు, నను మన్నఁజేసి యనుచు నాతుక మ్రొక్కెన్. కళా. ౧. ౬౧.

సీ. నవలా మగువ నాతి నాతుక యాఁడుది లేమ గోల యువిద చామ చాన. ఆం.భా. ౨. ౧౦౪.

**నాథము.** సం. వి. అ. పుం. (ఎద్దు మొదలగువాని) ముకుఁద్రాడు.

**నాథవంతుఁడు.** సం. విణ. (త్. వతీ. త్.) ౧. నాథుఁడు కలవాఁడు. ౨. పరాధీనుఁడు.

**నాథహారి.** సం. వి. ఇ. పుం. ముకుఁద్రాడు పోసిన పశువు; పశువు.

**నాథాతము.** సం.వి.అ.పుం. ఆహారము. (కే.ని.)

**నాథాతుఁడు** సం.వి.అ.పుం. ప్రజాపతి, బ్రహ్మ. (కే. ని.)

**నాథుఁడు.** సం. వి. అ. పుం. ౧. స్వామి, యజమానుఁడు. ౨. పెనిమిటి, భర్త. ౩. ఏలిక, ప్రభువు. ౪. ఇంద్రుఁడు. (కే. ని.)

**నాదనామక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. (సంగీ.) ఒకానొకరాగము.

సీ...శంకరాభరణము మేఘరంజి తోడి వరాళి నాదనామక్రియ నాట ..హంస. ౫. ౧౨౪.

ఇక్లో: నీర మ్ముంపుము పాల ముంపుము.

శా. నీరమ్ముంపుము పాల ముంపు మిఁక నిన్నే నమ్మినాఁడం జుమీ. కాళ. శ. ౧౯.

నీళ్లుద్రాగినట్లగు= సులభమగు, వశమగు.

ఆ. వీరభద్ర మన్న వీరభద్రమె తెచ్చు,శరభ మన్న నదియె సంగ్రహించు, మనుజనాథ కడమమంత్రంబు లా బ్రహ్మ, రాతసునను నీళ్లుద్రాగినట్లు నిరం. ౪. ౩౨.

నీళ్లునమలు=సందేహించు, సంశయించు.

ద్వి. అని యట్లు దేవేంద్రుఁ డాడినమాట,విని యును వినసట్లు విస్మయం బంది,దుర్యవనుఁ డూరకయుండె శాగ్రగవుండు,నవుడుకోట్లెను నీళ్లునమలెఁ గశ్యపుఁడు. ద్వి. హరిశ్చ. పూ. ౨౧౬.

క. నీ వాపురికిని మొదలం, బోవం బని యేమి చెప్పుము యథార్థముగా,నావుడును నీళ్లు నమలుచు, నావిహాగము చెప్పఁ గొంక నంచయు దానికా. ప్రభా. ౪. ౮.

క. ధనవంతు నట్లు యడుగఁగ, దన కది తెలియ మికి నీళ్లు దాన మలిన నా,తని పెదల నడచి ప్రమదం,బున నాదంపతులఁ గూర్చి పొమ్మని యనిచెకా. శుక. ౨. ౮౨.

పాలెడునీళ్లకుఁ గట్టువేయుట = అసాధ్యమగు పనిచేయఁబూనుట.

ఉ. భూపతి మందరాద్రిఁ బువుఁబోఁడి వరించి పట తేకముస్న్నె య్యేరూపునఁ బల్కునం దగు చరుండు ప్రియాంగనఁ బెండ్లియాడి క్కామోపనవీనభోగములఁ బొందెదవో సతులార మీర లీపాపపుమాట లాడుదురె పాలెడు నీళ్లకుఁ గట్టవేతురే. రుక్మా. ౪. ౨౪.

జ: నీటఁగలయు,నీటికానుపు, నీటిచూలి, నీటితాత, నీటిదయ్యాము, నీటిదారి, నీటిపుట్టుగు,నీటిపుట్టుగుపట్టి,నీటిమానికము, నీటియెక్క, నీటియెకిమీఁడు, నీటిరాయఁడు, నీటిరిక్క, నీరుకడిమి, నీరుకాకి, నీరుకాయ మొం.

నీరుకందువ. వి. (√నీరు.) జలాశయము.

ద్వి. నీరుకందువ నుండునీ కుమారకుఁడు, నీరు ముంపఁగఁ గుంభనివద మాలించి. రం. రా. అయో. ౧౨౫ పొ. ౧౭ పం.

నీరుకట్టు. వి. (నీరు + కట్టు.) మూత్రబంధరోగము, మూత్రకృచ్ఛ్రము.

గీ ... అదరు నీరుకట్టునఁగ మూత్రకృచ్ఛ్రం బు ... అం. భా. ౨. ౧౨౩.

నీరుకట్టె. వి. (√నీరు.) నీరుపాము, అలగర్దము.

క. వరుజుబడి రొంపిఁ ద్రొక్కం,జరణంబులఁ బెనఁగి పసిఁడిచాయకడుపులం, బొరి నీరుకట్టె లమరెను, బిరుదులు పాలికులు దున్నఁ బెట్టిరో యనఁగాకా. ఆము. ౪. ౧౨౫.

సీ. నీరుపా మనఁగను నీరుకట్టె యనంగ జలభుజంగము పేరు చెలఁగు...అం.భా.౧.౧౪౩.

నీరుకడిమి. వి. (నీరు + కడిమి.)ధారాకదంబము. (శ.ర.)

నీరుకాకి. వి.(√నీరు-క. నీరుకాగి.)జలకాకము.

సీ... నీరుకాకి నా జలకాకనామ మై చెలఁగుచుండు. అం. భా. ౨. ౯౩.

సీ. కొఁజు బెగ్గురు నీరుకాకి కంకణమును గొంగ డాబయు గువ్వ వంగపండు. యయా. ౨. ౨౪. హంస. ౩. ౧౨.

నీరుకాకి సెపము= లేని నేరము.

శా...అన్సోకప్రార్థిని నీరుకాకి సెపము ల్గోడించి పల్యా అయో, పాకీము ల్దము రిట్లు పల్కుటకు నర్హంబే...రంగా. ౨. ౨౧౮.

నీరుకాయ. వి. (√నీరు.) బుద్బుదము,నీటిబుగ్గ. (శ. ర, బ్రౌ.)

నీరుకాయవాఁడు. వి. (√నీరు.) నీటిమనుష్యుఁడు. (శ. ర.)

నీరుకారు. వి. (√నీరు.) లేఁతయెఱుపు. (చి.ని.)

నీరుకాఱు. వి.(√నీరు.) కమసాలెవాని యొకవిధ మగుకొఱముట్టు.

చ. కమటము కట్లసంచి యొరగల్లును గత్తెర సుత్తె చీర్ణముల్, ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెడ నీరుకాఱు కా, ణము పటుకాఱు మూస బలునాణెపరీక్షలకుచ్చులాదిగా, నమరఁగ భద్రకారకసమాహ్వయుఁ డొండొకఁ డుండు నప్పురిన్. హంస. ౨. ౧౧౧.

నీరుకాళ్లు. వి. బ. (√నీరు.) ౧. శోణహారితవర్ణములై సంధ్యాకాలములందు కానవచ్చు సూర్యకిరణములు.

సీ. ఈఁగ మిక్కుటమయ్యె నెఱ నింగిఁ గడు మించె నిడుద లై తిలకించె నీరుకాళ్లు.హరి. పూ. ౪. ౧౬౦.

౨. వర్ష ధారలు. (చి. ని.)

నీరుకా(ర్కా)వి. వి. (నీరు + కావి.) కొంచెమెఱుపు, లేఁతకావి.

ఆ. పరఁగ జలకమాడి పట్టెనామము దీర్చి,నీరుకావిపంచె నెరయఁ గట్టి.వేమన. ౩.౭౩౨.

సీ. కటిమధ్యమున నీరుకావిదోవతిపంచె భ్రూమధ్యమున నూర్ధ్వపుండ్రకంబు. జై. భా. ౪. ౧౯౪. (చి. ని.పా. 'కటిఁ బ్రాఁతమడుకనీర్కావిదోవతి', ముద్రి.పా.)

సీ. గన్నేరుపూఁజాయ కర మొప్ప నీర్కావిమడుఁగుదోవతి పింజె విడిచి కట్టి. క్రీడా. ౮౩.

సీ. నిద్దమైనమడుంగునీర్కావిదోవతి కనకమేఖలతోడఁ గటి ఘటించి. కాశీ. ౧. ౩౯.

నీరుకావులు. వి. బ. (√నీరు.) ధాన్యవిశేషము.

సీ. నివ్వరు ల్తెబ్బస ల్నీరుకావులు రాజుకప్పెరల్కూరువడాల్కుంటుసరులు.హంస.౪.౧౨౧.

వ ... పసుపుగన్నేర్లు గు తిబలుగుళులు ...

పూరాజనాలు పొన్నశ్రీరాజనాలు నివ్వరులు నీరుకావులు... ప్రబంధ. ౧౧౨.

నీరుకాసు. వి. (నీరు + కాసు.) స్నానముచేయునప్పుడు నీటియొద్దనమంత్రముచెప్పిన బ్రాహ్మణులకిచ్చెడుడబ్బు.

సీ. తిలలు దర్భలు పూని తీర్థసన్నిధి మంత్రములు సెప్పి నీరుకాసులు గడించి. హంస. ౨. ౧౫౨.

నీరుకుక్క. వి.(√నీరు.)జలశునకము. (శ.ర.)

నీరు(టి)కుప్ప. వి.(√నీరు.) జలరాశి, సముద్రము.

ఆ. ఓరి కోఁతిమూకి యొక్కింతయును మదిఁ, గొంకు లేక నీరుకుప్ప దాఁటి,గడుసుపాలసుదిండిగము లుండునిద్దీవి,కెట్లు చేరినాఁడ వెఱుక మాలి. అచ్చ. రా. సుం. ౧౩౮.

సీ. తనకుందనపుఁజాయ పెనునీటికుప్పకప్పిన సినపసఁ బస రెక్కె సనఁగ. వసు. ౫.౩౬.

గీ...ఏనుఁగులు... నీటికుప్ప,నుండునడగొండలకు సాటి నొంది డిగ్గె. అచ్చ. భా. ౩.౩౧పా.

నీరుకుమ్మరపురుగు. వి. (√నీరు.) నీటిలోనుండెడుకుమరపురువు.

సీ. నీరుకుమరపురువ్వ నీరిఁగ తలకప్పు... హంస. ౪. ౧౧౬.

నీరుకోఁతి. వి. (నీరు + కోఁతి.) జలమర్కటము, శింశుమారము. (శ. ర.)

నీరుకోడి.వి.(√నీరు.) పరిప్లవము,జలకుక్కుటము.

చ. అలరుఁ బురంబునం దొగల నంతరదామరఁబ్రాఁచిఁ గ్రప్పుకొ,వలపులు మీఱ లో వలుఁదవాలుగ మొత్తమువోర నీరుకోళ్,ళ్కొలకొల మంచుఁ గ్రుంకు మెడగుంపులవంపులు దోఁప మావితోఁ,పులవిరుల న్బయిన్న డువఁబోల్చుఁ బురాతనతీర్థకుండముల్.ఆము. ౧. ౪౧.

గీ. సలిలకుక్కుటనామంబు వెలయు నీరుకోడి యన...ఆం. భా. ౨. ౯౨.

నీరుచు... సం. విశే. ౧=నీరుచము. (చ్) కాంతి

లేనిది. ౨.=నీరుజము. (జ్)రోగము లేనిది.

నీరుగండి. వి. (నీరు+గండి.) తూముకాలువ,వా హసము. (శ.ర.)

నీరుగన్నేరు. వి. (√నీరు.) హిజ్జలము. (శ.ర.)

నీరు(ళ్లు)గారు. అ.క్రి. (√నీరు.) ఉత్సాహము లేకుండు.

సీ. ఇంతికన్నులతోడ నీ దన వచ్చునే గండు మీ లవి నీళుగారుచుండు. తపతీ. ౨.౧౪.

(వ్యవ.) వానిపని నీళ్లుగారుచున్నది.

నీరుగుట్టు. వి. (√నీరు.) జలజంతువిశేషము.

సీ. గులకరింతయు నీరుగుట్టు శంఖనఖంబు పులు కాసి నసిమిరి బుంగపురువు. హంస. ౪.౧౭౬.

నీరుగో(గ్గో)బ్బి. వి. (√నీరు.) నీరుగొలిమిడి.

ఆ. నీరుగొబ్బివేళ్లు నీరుల్లిగడ్డలు, నేకనూతి యై నయెనుపకన్న, నేకముగ నొనర్చి యేనహం బులు గొన్న,నిష్ఠురంపు మేహానివహ మడఁగు. (చికి. చి. ని.)

గీ. వెలఁగ వాఁకుడు పల్లేరు ములక వేము,నగిర నీర్గొబ్బి మొదలుగా జగతిఁ గల్గు,కంప లన్ని యు వేవేఁ గడచి కడచి. హంస. ౪. ౬.

నీరుచము. సం. విణ. (అ.అ. అ.) కాంతి లేనిది.

నీరుచల్ల. వి. (నీరు+చల్ల.) మజ్జిగతేట, నీటివలె తేటినమజ్జిగ.

చ...ఫలం, బులును సుగంధిశీతజలము ల్వడపిం డెలు నీరుచల్లయుణ్, వెలయఁగఁ బెట్టు భోజనము వేసవిఁ జందనచర్చ మున్నగణ్. ఆము. ౧.౭౧.

గీ...నీరుచల్ల నీరు,మజ్జిగయు జలతక్రనామము లు...సాం. ని. స్థా. ౬౭.

ఇట్లే: నీరుమజ్జిగ.

సాం. ని. స్థా. ౬౭.

నీరుచించలము. వి. (√నీరు.) ఒకజాతి పక్షి. (జలచుక్రికశ్. అని చి. ని.)

సీ. నిమ కంఠకాలామ్లవేతసంబును నీరుచించలం బును బులిచించలంబు. హంస. ౨. ౨౭.

నీరుచి(ర్చి)చ్చు. వి. (నీరు+చిచ్చు.) ౧. బడబాగ్ని, ఔర్వము.

గీ...నీరుచిచ్చునంగఁ బోలుచు బడబాగ్ని... అం. భా. ౧. ౪౭.

౨. నీరు ఎక్కువగుటచే వృక్షములకుఁ గలుగు రోగవిశేషము.

వ...సుధాకరుండు చెంగలువకేదారంబులకుఁ దీర్చిన తేటపన్నీటి కాలువలజాలువలె ధళధళనివెలివెలుంగు చలువల జలజలనఁ దొలఁగు సలిలములు దొట్టి నీరుచిచ్చుఁ గొని యంచుల సంచరించు రాయంచబోదలు వాసుగా మక్కువం బక్కుపక్కునఁ బొడువ నొక్కించుక విచ్చు మెట్టని తమ్మిమొగ్గల వెడలుకట్టావి వెట్టిగిలి... చంద్రా. ౫. ౬౩.

(జలరూప మగునగ్ని. ఈయగ్ని యడవుల యందు నేలలో వ్యాపించుటవలన నడివిచెట్లెల్ల మడియును అని చి. ని.)

నీరుచిట్టి. వి.(నీరు+చిట్టి.) అప్పండులీయము.

సీ. అగు నీరుచిట్టి నా నప్పండులీయంబు... అం. భా. ౨. ౬౪.

నీరుచుఱుకు. వి. (√నీరు.) మూత్రము విడుచు నపుడు మంట కలిగెడురోగవిశేషము. (శ.ర.)

నీరుచెంచలి. వి.(√నీరు.)వితున్నము. (శ.ర.)

నీరుజము. సం. విణ. (అ. అ. అ.) రోగము లేనిది. వి. అ. స. చెంగల్వకోష్టు.

నీరుటెంకి. వి. (నీరు+టెంకి.) జలాశయము.

సీ. నీరుటెంకి యనంగ మీఱు జలాశయంబు... అం.భా. ౧. ౧౬౨.

నీరుసి[1]. వి.(√నీరు.)౧.మూత్రము.(చి. ని. ప్రా.)

౨. అతిమాత్రము.

శా. పంచద్రవ్యతమాలతాళిసములన్ బానీయ యుగ్గంబులన్, మించ న్నొక్కపలంబు కల్కముగ సమ్మేళించితైలంబు రా,ణించన్ రీతి యెఱింగి వండి యది దా నిత్యంబు సేవింపఁగాఁ, గంచిన్ వేగఁగఁ బాటిపోవు బహుళోగ్రాకారమా నీరుడుల్. (చికి. చి. ని.)

నీరుడి². వి. ఒకానొకచెట్టు. (చి. ని.)

నీరుడుము. వి. (√నీరు.) నీటియుడుము, జలగోధిక. (శ. ర.)

నీరుతిట్ట. వి. (√నీరు.) జలరాశి, సముద్రము.

సీ. అత్తఱిఁ గైక క్రచ్చఱ నీరుతిట్టబత్తిరికవజీరుబల్వేలుదునిమిన, వెరవరినోసలబంగరు రేకుగట్టుతెఱంగు మంధర యనుజాఁగపోలఁతి, వలన నెఱింగి...అచ్చ. రా. అయో. ౨౧. (నీరుతిట్టబత్తిరికవజీరు అనఁగా జలధితూణీరుఁడు, శివుఁడు.)

నీరుతిత్తి. వి. (√నీరు.) నీటితిత్తి.

వ...పన్నీరు నించినయన్నీరుతిత్తు లాత్త వియత్తలంబునం బాటి కయివ్రాలుధారల వాద్యంబులు దడిసిన...ఆము. ४. ३౫.

నీరుతుట్ర. వి. (నీరు + తుట్ర.) నీరుకట్టె, అలగర్దము. (శ. ర.)

నీరు(ఱు)దాలుపు(ల్పు). వి. (√నీరు.) జలధర మ్మా మేఘము.

శా. ఏఁడీ రక్కసినీరుదాలుపులగా డ్వేఁడీ జగంబేలు తేఁ,డు...అచ్చ. రా. అయో. ౭౭.

క. సిరి రాచకేల్పు కడు నీ,వరితనమున నీటిదాల్పు కలమురినుడివా ల్దారవంటియొప్పు గలదేవర ...యయా. ౫. ౧.

నీరుదొత్తి. వి. (√నీరు.) నీరుకట్టె, అలగర్దము.

గీ. నిక్క మొకయాఁడుదియ... యొక్కగాడిద యొకకోడె యొక్కగుత్తమని తలంపకు నను విలుప్రారిగంధుఁ,డగు జరాసంధుఁడుగ నింక నరసికొనుము. హరి. ఉ. ౧. ౧౦.

నీరుదోమ. వి. (√నీరు.) జలమశకము. (శ. ర.)

నీరుద్రిమ్మరి. వి. (నీరు + త్రిమ్మరి.) జలచరము, జలజంతువు.

గీ. నీరుద్రిమ్మరిపదువులు నెఱయ బెరయఁ, బొనరుమన్నీరు సేరి యబ్బురము మీఱ. అచ్చ. రా. యు. ३.

నీరునే(ర్నే)ల. వి. (నీరు + నేల.) నీరు పాఱెడు నేల, ఊడుపునేల.

వ. కల్యాణకేశవ దేవర అర్చ (న. అ) మడుపడులకు ఖ ३ ఎఱ్ఱంజెఱువువెనక నీరునేలమ అంతురుల ४...ద. శా. ४. ३०४.

వ...బొంపిచెఱ్ల శ్రీ అనంత గోపినాథదేవరకు అమావాస్యకొలుపులకు బొంపిచెఱ్ల అంనద చెఱువు వెనకను నీర్నేలమత్తురు ౧. గు. జి. బొంపిచెఱ్లశాసనము. ౧౨४౨. దుర్గిశాసనము. ౧౧३ ३.

నీరుపంది. వి. (నీరు + పంది.) జలసూకరము. (శ. ర.)

నీరుపట్టు. అ. క్రి. (√నీరు.) ఉబ్బు.

(వ్యవ.) వానికడలు నీరుపట్టినది.

నీరుపదను. వి. (√నీరు.) కొంచెపుఁబదను.

సీ. ఘుమఘుమాధికరుతాకుంఠితాంభోరాశి నిజ సాయకమునకు నీరుపదను. చంద్రా. ౧. ౭౧.

నీరుపాఁపర. వి. (√నీరు.) మత్స్యవిశేషము, ఒకవిధమైనచేఁప.

సీ. పక్కె చిత్తర నీరుపాఁపర మలుఁగుమీనరజా నిల్లెపుఁజేఁప యాకుజెల్ల. హంస. ४. ౧౭३. నీరుపావెర. మ్రు్ద్రి.

...ఒకానొకచెట్టు. (శ. ర.)

నీరు(టి)పాప. వి.(√నీరు.)౧.కృపీటయోని,నిప్పు.
ఆ. నీరుపాప గాలినెచ్చెలి యన్నఁటి, తిండి కాఁడు...అగ్గి యనఁగ నొప్పు ననలుఁ డీశ. ఆం. సం. దేవ. ౧౨.
౨. జలజంతువిశేషము.
గీ...నీరు, పాప నీకేన్గు నీర్పిల్లి ప్రాఁచిపురువు, లాదికొఱగానిజంతువు లన్ని విడిచి. హంస.౪. ౧౨౬.
౩. జలమనుష్యుఁడు; జలమనుష్యాంగన.
శా. మారీచక్షణదాచరుం డపుడు రామస్వామితోఁ బోరికై, యారంభించి తదీయమారుతశరవ్యాపారతూలీకృతా,-కారుండై స్మృతి దప్పి యుప్పుకడలిం గాఁ బయ్యె వార్ధిశ కాం; తారత్నంబులు నీటిపాప యనుచుం దన్పట్టి యాడింపఁగన్. చం. రా. ౨. ౯౧.
శ్లో.పేమం పుపోవ జలమానుషనిర్విశేషం.సం. చం. రా. బాల. ౫౦.
(దివిజభామలవర్ణనము.) సీ. కొలఁకులోపలనుండి కెలఁకుల విహరింప బయటు నిల్చిననీరుపాప లొక్కొ. తపతీ. ౪. ౬౪.

నీరుపాము=నీరుకట్టె. వి. (√నీరు.) జలసర్పము.
సీ. నీరుపా మనఁగను నీరుకట్టె యనంగ జలభుజంగము పేరు చెలఁగును...ఆం. భా.౧. ౧౪౬. సాం. ని. తిర్య. ౭౧.

నీరుపాయము. వి. (నీరు+పాయము.) నీటివలె చంచల మగుప్రాయము, యౌవనము. (శ. ర.)

నీరుపిప్పలి. వి. (√నీరు.) పిప్పలివిశేషము,తోయపిప్పలీ.
సీ. నీరుపిప్పలి యం చనిన బొక్కెన యనంగఁ దోయపిప్పలిసంజ్ఞ తోఁచుచుండు.ఆం.భా. ౨. ౫౬.

నీరు(ర్పి)పిల్లి. వి. (నీరు+పిల్లి.) జలమార్జాలము, ఉద్రము. (శ. ర.)
గీ...నీరు, పాప నీకేన్గు నీర్పిల్లి ప్రాఁచిపురువు, లాదికొఱగానిజంతువు లన్ని విడిచి.హంస. ౪. ౧౨౬. ('నీర్చలి' ముద్రి.)

నీరు(టి)పుట్టువు(వ)=నీటిపుట్టుగు. (నీరు+పుట్టువు.).౧. శంఖము.
సీ. నీరుపుట్టువయును నీరుపుట్టువయును బూరయుఁ దొడవునై పొలుపు సెఱప. అచ్చ. రా. బాల. ౩.
౨. కౌస్తుభము. అచ్చ. రా. బాల. ౩.
౩. తామరపువ్వు.
ద్వి. తెలినీటిపుట్టువు తేట రొమ్ము కరుణ, లోలుడు చుండెడు నేత్రయుగళంబువాని. అ. మ. ౪. ౧. ౧౩౭. ౨౩ పం.
(ఇట్లే ఈ పదమునకు చంద్రుఁడు అగ్ని మొద లగునర్థములును గలవు.)

నీరుపోఁత. వి. (నీరు+పోఁత.) జలక్రీడ.
ఆ. ప్రణయభావ మెసఁగఁ బౌరు లుత్సవమునఁ, గూడి నీరుపోఁత లాడి రొప్ప. కు. సం.౭. ౨౫౦.

నీరుపోయు. అ. క్రి. (√నీరు.) ~~నీరుపట్టు~~, క్రొవ్వెక్కు, మదించు.
గీ. ఇవ్విధంబున మెలఁగునయ్యంతి యొంటి, తిండికతమున నినుమడికండ పట్టి, నీరుపోసిన మేనితో నిలుపరాని,మదనుచే బారభోగ మేమఱక తిరుగు. శుక. ౩. ౩౫౧.

నీరుప్పి. వి. (√నీరు.) వృక్షవిశేషము.
సీ. తెల్లకాంచనము తుందిల మెట్టకాంచన ముప్పి తెల్లుప్పి నీరుప్పి యుప్ప. హంస.౪.౧౧.

నీరుప్రబ్బలి. వి. (నీరు+ప్రబ్బ.) జలవేతసము, విదులము. (శ. ర.)

నీరుబచ్చలి. వి.(√నీరు.) ఒకవిధ మగుకూరాకు మొక్క.
సీ.నెమటాయి గొలిమిడి నీరుబచ్చలి ప్రబ్బ... హంస. ౪. ౧౦.

నీరు(టి)బిడ్డఁడు. వి. (√నీరు.) అగ్ని, వహ్ని.
సీ. నీటిబిడ్డఁడు కిత్తు నిప్పు ముట్టఁగరాని బలియుఁడు...అనఁ జెలఁగు వహ్ని. సాం. ని. జేవ. ౧౨.

నీరుబొద్ది. వి. (నీరు + బొద్ది.) వృద్ధదారకవిశేషము. (శ. ర.)

నీరుమట్టము. వి. (√నీరు.) జలవ్యాప్తి కలభూభాగము. (శ. ర.)

నీరుమానిసి. వి. (√నీరు. సం. నీరమానుషః.) నీటిమనుష్యుఁడు.
క. ఏనుంగులాగు పందికి, మానిసిచందంబు నీరుమానిసికి నగుం, గాని గుణంబులు గలుగవు ...ఉ. హరి. ౩. ౧౬.

నీరుముంపు. విశే.(√నీరు.) జలప్రాయము, అనూపము, క్రీ.నీరునేల.
గీ. నీరుముంపనఁ గ్రీనీరునేల యనఁగ, ఖ్యాతిగాంచు ననూపంబు...ఆం. భా. ౨. ౪.

నీరుము(ర్మ్ర)ట్టు. అ. క్రి. (√నీరు.) ౧. మలమూత్రోత్సర్జనముచేయు. (జలస్పర్శమునకు నిమిత్తమగుటచే దీనికీపేరు వచ్చినది.)
గీ. రచ్చఁ దెరువున గృహవాటి మచ్చుమీఁద, నీటిచేరువఁ గొఱగాదు నీరుముట్ట, వసుధమీఁదనుదళముగాఁ గసవుఁ బఱపి, వేగ మూత్రపురీషము ల్విడువవలయు. వి. పు. ర. ౧౭౨.
౨. జలస్పర్శనముచేయు, ఆచమనముచేయు.
గీ. తనదునీడఁ బురీషమూత్రములుతాన్, గనఁ గొనఁగఁబోక నీర్ముట్టఁగావలయును. శివధ. ౭. ౩.

నీరు(టి)మోపరి. వి. (√నీరు.) ౧. కలశము.
సీ. ముదితగుబ్బలు నీరుమోపరుల గణింప వప్పుఁ బుట్టువుఁ గాచు నతివకేలు. హ. న. ర. ర౩.
౨. మేఘము.
సీ...జేజేరేనియందలము నీటిమోపరి మబ్బు మొయి లనఁ బరఁగు ఘనము...

విశే. నీరు మోచునది. (శ. ర.)

నీరుమోయు. అ. క్రి. (√నీరు.) ౧. నీరుపట్టు.
౨. గర్భిణియగు.
క. ఆపన్నసత్త్వ యాపగ, యాపగిది న్నీరు మోసి యధిగతసేవా, వ్యాపారద్విజమహిళ, ల్గాపాడఁగ నొక్కపుణ్యలగ్నమునందున్. వసు. ౩. ౨౧. (రెండర్థములకు నిదియే యుదాహరణము.)

నీరుల్లి. వి. (నీరు + ఉల్లి.) ఎఱ్ఱగడ్డ, పలాండువు.
సీ...ఎఱ్ఱ, యుల్లి యంచనఁగ నీరుల్లి నాఁగఁ బలాండు వొప్పు...ఆం. భా. ౨. ౬౯.
ఆ...నీ,రుల్లిపాయచాయ...చంద్ర. వి. ౨. ౫౪.

నీరువంగ = నీరెత్తువంగ. వి. (√నీరు.) వార్తాకవిశేషము, వృంతాకము.
సీ...నీరెత్తువంగ నా నీరువంగ, యనఁగను వృంతాక మలరు...ఆం. భా. ౨. ౫౯.

నీరువట్టివేరు. వి. (√నీరు.) ఉశీరవిశేషము, లామజ్జకము. (శ. ర.)

నీరువ(ర్వ)ట్టు. అ. క్రి. నీరు + పట్టు.) దప్పిగొను.
ఆ. రాత్రి జాగరణభరశ్రాంతులై వారు, నిద్రఁ బొందియుండ నీరువట్టి, ధారుణీశ్వరుండు తన్నంత్రకలశోద, కంబు లెల్లఁ ద్రావెఁ గడుపు నిండ. భార. అర. ౩. ౨౦౨.
వ...పెచ్చుపెరుఁగు ఖరకరకరనిపాతంబుల నాతప్తంబు లగు నెలవులం దొరఁగి పరఁగు వెలఁది వెన్నెల నీర్వట్టు వెన్నెలపిట్టలు పొట్టలు నిండ నాస్వాదించె. పాండు. ర. ౧౬.
వి. ౧. దప్పి, పిపాస.
వ...ఆకొన్నలనినీళ్ళు ద్రావినవారికి నెన్నండును నాఁకలియును నీరువట్టును లేవు. భార. ఆది. ౬. ౨౧౯.
సీ. ఆఁకలి నీరువట్టులఁత జరారోగములు కాలగుణములు మొదలుగాఁగ, దోషంబు లెవ్వి

యయిఁ దోయజభవులోకమునఁ బ్రభవింపవు ...హరి. పూ. ౨. ౧౪.

క. భూకాంత నీరువట్టుకుఁ, గాక వదన మిలుక రింపఁ గాన్పించినపం, డ్లో కా కన వెలిపుచ్చు లు, లోకములోఁ గాచె నిట్లు లోబఁడె జనముల్. వరాహ. ౧౦. ౩౦.

క. భువనావరణోదకమున, భవు నభిషేకంబు సేయఁ బాసెను లయతాం, డవకేళీసమయ సము, ద్భవ మగునీర్వట్టు కపటపాశుపతు నకున్. కాశీ. ౫. ౧౪౦.

౨. నీటిచాతిక.

మ...ని, ర్మలతోయస్నపనం బొనర్చినశరీరం జే సికి స్నీరువ, ట్టులు గట్టెం భవదాత్మశుద్ధి కిది గూడుం గా మహాశ్రేయముల్. కాశీ. ౩. ౯౭.

నీరువత్తిగలు. వి. (√నీరు.) భక్ష్యవిశేషము.

వ...మణుఁగుఁబువ్వులుం బేణీలు నీరువత్తిగలు మడతలుఁబప్పుబూరెలు...హంస. ౧. ౧౦౫. (శ.ర. పా. 'నీరువత్తిగెలు' ముద్రి.పా.)

నీరువరి. వి. (√నీరు.) నీవారతృణము. (శ. ర.)

నీరువె(పె)ట్టు. అ. క్రి. (నీరు + పెట్టు.) పాల ములోఁ గుహానికి నీరు ప్రవహింపఁజేయు.

చ...అనురఘుస్మరవైరిభుజాంతరాళ జాం, గలమ హీ జాలుపట్టి పయిఁ గ్రమ్మెడుపెత్తురు నీరు పెట్టి యం, దలుకవె కీర్తిపూర్తికలమాంకుర మింద్రరమాఫలార్థివై. పాండు. ౨. ౫౯.

నీరూపము. సం. విణ. (అ. ఆ. అ.) రూపము లేనిది. (కాలము మొ.) వి. అ. పుం. గాలి. వ. ఆకాశము.

నీరెండ=ఈరెండ. వి. (నీరు + ఎండ.) కొంచెపా టియెండ, లేఁతయెండ.

గీ...నీరెండ యీరెండ యనఁగఁ గించి, దాతపం బగు...ఆం. భా. ౧. ౭౨.

గీ. ఎగసె నుదయాద్రియవ్వెలుఁగు నీరెండ దిగంతా సైన. ౮. ౧౧.

నీరెత్తువంగ=నీరువ౦. వి. (√నీరు.) ఆం. భా. ౨. ౫౯.

నీరేనుఁగు(స్గు). వి. (నీరు + ఏనుఁగు.) నీటిగజము.

గీ...నీరు, పాప నీరేన్గు నీర్పిల్లి ప్రాఁచిపుగవు, లాదికొఱ గానిజంతువు లన్ని విడిచి. హంస. ౪. ౧౭౭.

నీరొట్టు. వి. (√నీరు.) భక్ష్యవిశేషము.

గీ. రొట్టె నీరొట్టు నిప్పటి యట్టు దోసె, యిడ్డెన యనంగ నిటు కొన్ని రుసఁగుచుండు, భక్ష్య భేదాహ్వయంబులు...ఆం. భా. ౨. ౨౫౭.

నీరోగము. సం. విణ. (అ.ఆ.అ.) రోగము లేనిది. వి. అవ్య. అ.న. రోగాభావము, రోగము లేమి.

నీర్చిచ్చుకాఁడు. వి. (√నీరు.) ఒకవిధమైనల కుముకిపిట్ట, టిట్టిభభేదము.

సీ...టిట్టిభము లకుముకి యనఁ బరగుఁ దద్భేదంబు నీర్చిచ్చుకాఁ డన నెగడుచుండు. ఆం. భా. ౨. ౯౪.

నీర్వా(టివా)మి. వి. (నీరు + వామి.) జలరాశి, సముద్రము.

గీ. మ్రుచ్చుఁదనమున రాకొమ్మఁ దెచ్చినట్టి, యసురకు్లుఁ డిడె డాఁగి యున్నవాఁడు, రం డనుచుఁ దమ్ము నెలమిఁ జేగంగఁ బిలుచు, కరణిఁ గడు మ్రోయునీర్వామి గాంచి రదుట. అచ్చ. రా. కిష్కిం. ౯౦.

చ... పఱచెఁ దెల్లగ గోఱులు నీటివామికిన్. అచ్చ. రా. కిష్కిం. ౭౪.

నీఱు. వి. (క. త. నీఱు.) భస్మము, బూది.

ఆ. మాఱుకొన్నవారి నీఱు సేయుము ప్రజ, నరసి మనుపు ధరణిసురులఁ బ్రోవు. భాగ. శాం. ౧. ౩౪౦.

ద్వి. ఆనీలకంధరుం డనిరొమ నవ్వుచును, పొదల నీఱు యచ్చుగఁ దోలు గప్పి, పొదివి

నిచ్చలు బహుఘాతముల్ గొలువ. ద్వి. హరిశ్చ. ఉ. ౨౬౨౯ పం.

గీ. ఇట్లు చనుదెంచి మాసైన్య మెల్లఁ గూల్చె, బెక్కుగూపము లై విష్ణుఁ డొక్కరుండ, వట్టిమ్రాఁకుల నొకదవజ్వాల దగిలి, వివిధ ముఖములఁ నీఱు గావించునట్లు. వరాహ. ౪. ౫౬.

నీఱుగవిసిననిప్పు=బూడిదచేఁ గప్పఁబడినవిప్పు. (మఱుఁగు వడినమహిమ కలవాఁడు అని తాత్పర్యము. ఇది ఇతరపదవ్యవధానముతోఁ గూడఁ గన్పట్టుచున్నది.)

చ. సవినయవృత్తిఁ గొల్వ మిటు చన్న దినంబులు మీరు నీఱుపైఁ, గవిసిననిప్పులట్ల యధికం బగు తేజము దోఁపకున్కి ... భార. విరా. ౫. ౩౫౧.

ఆ. మంచు మఱుఁగువడినమార్తాండుఁడునుబోలె, నీఱు గవిసియున్న నిప్పుఁబోలె, వేషధారి యైనవిష్ణుండుఁబోలె నవ్విరటుకొలువు సేరనరుఁడు వచ్చె. భార. విరా. ౧. ౨౭౮.

క...కడిఁదిమూర్ఛ మెయి నిట్లున్నా, రాఱని తేజంబులతో, నీఱు పయింగవిసియున్ననిప్పులుఁబోలెన్. భా. రా. యు. ౫౯౧.

ఇట్లే: నీర్గప్పిననిప్పు.

ఉ. అప్పుడు విప్రసూనుఁడు రయంబునఁ బాను పు డిగ్గి వేడ్కతోఁ, జెప్పరు మింక నొక్కదరిఁ జేరెద నంచుఁ దలంచువేళ లా, గొప్పఁగ ధౌతచేలము సమున్నతలీల ముసుంగు వెట్టి నీర్గప్పిననిప్పు చందమున రాజనిభానన నిద్రవోవఁగన్. నిరం. ౨. ౧౦౫.

నీల. సం. వి. ఆ. స్త్రీ. ౧. నీలిచెట్టు. ౨. నల్లగలిజేరు.

నీలంగువు. సం. వి. ఉ. పుం. ౧. కృమి, పురుగు; కళ్ళులలో నుండుపురుగు. ౨. ఇంద్రనీలమణి. ౩. నక్క. స్త్రీ. ౧. తుమ్మెదలపంక్తి. ౨. ఈఁగ.

నీలఁడు. వి. అశ్వవిశేషము.

క. ఒనరించిననీలని నడ్కని బొల్లనిఁ గత్తలాని గైరని పారంగని జారని జన్నని నిమ్కని మొదలుగఁ దెచ్చి నిలిపె వాహకుఁ డెదురన్. ద్వా. ౩. ౧౪౧.

నీలకంఠము. సం. విణ. (అ. ఆ, ఈ. అ.) నల్లని కంఠము కలది. వి. అ. పుం. ౧. నెమిలి. ౨. గ్రామచటకము, ఊరఁబిచ్చుక. ౩. ఖంజనము, కాటుకపిట్ట. ౪. దాత్యూహము, కూరుగుండఁగి. ౫. బంగారుపిచ్చుక, పీతముండము. ౬. పాము. ౭. తుమ్మెద. ౮. పీతసారము, హరిచందనము. ౯. ముల్లంగి, మూలకము.

నీలకంఠుఁడు. సం. వి. అ. పుం. ౧. కఱకంఠుఁడు, శివుఁడు. ౨. సంస్కృతభారతవ్యాఖ్యాతలలో నొకఁడు.

నీలకందము. సం. వి. అ. పుం. విషకందము, ఒకవిధ మగుకంద.

నీలకమలము. సం. వి. అ. పుం. ౧. నల్లకలువ. ౨. నల్లతామర. ౩. నల్లనీరు.

నీలకము. సం. విణ. (అ. లి. కా. అ.) నల్లనిది. వి. అ. న. ౧. కాచలవణము, గాజుప్పు, నల్లయుప్పు. ౨. వర్తలోహము, నల్లయుక్కు. ౩. మయూరతుత్థము, మైలుతుత్తము. ౪. అసనము, వేఁగిస. పుం. ౧. నల్లగుఱ్ఱము. ౨. తుమ్మెద. ౩. నల్లకోఁతి. ౪. మహాజ్వాల. (వై. ని.)

నీలకురంటకము. సం. వి. అ. పుం. నల్లగోరంట.

నీలకుసుమ. సం. వి. ఆ. స్త్రీ. నీలఝుంటి, నల్లగోరంట.

నీలకేశి. సం. వి. ఈ. స్త్రీ. ౧. నీలిచెట్టు.

నల్లవెండ్రుకలు కలస్త్రీ.

నీలక్రాంత. సం. వి. ఆ. స్త్రీ. కృష్ణాపరాజిత, నల్లవిష్ణుక్రాంత‡.

నీలగంధి. సం. వి. ఇ. పుం. రత్నవిశేషము.
ఆ. నలుపు నెఱ్ఱదనము మిళిత మై నెగడెడు, డాలు గలిగినదియు నీలగంధి. రత్నపరీక్ష. ౧౨. ప.

నీలగ్రీవుఁడు. సం. వి. అ. పుం. నీలకంఠుఁడు, శివుఁడు.

నీలచర్మము. సం. వి. న్. పుం. ౧. నల్లతోలు; నల్లతోక్క. ౨. పరూషకము, ఖర్జూరము‡.

నీలచ్ఛదము. సం. విణ. (అ. ఆ. అ.) నల్లని ఛదములు-ఆకులు-కలది. వి. అ. పుం. పేరీఁత, ఖర్జూరము‡.

నీలజము. సం. వి. అ. న-నీలపర్వతమునందు పుట్టినది-వర్తలోహము, నల్లయుక్కు.

నీలఝింటి. సం. వి. ఈ. స్త్రీ. నల్లగోరంట‡.

నీలతరువు. సం.వి.ఉ.పుం.కొబ్బెరచెట్టు.(వాచ.)

నీలతాలము. సం. వి. అ. పుం. ౧. తమాలము, చీకటిమ్రాను‡. ౨. హింతాలము, గిరకతాడు‡.

నీలదూర్వ. సం.వి.ఆ.స్త్రీ. ౧. నల్లగోలిమిడి‡. ౨. నల్లగఱిక‡.

నీలద్రుమము. సం. వి. అ. పుం. అసనము, నల్లవేఁగిస‡.

నీలధ్వజము. సం. వి. అ. పుం. ౧. తమాలము, చీకటిచెట్టు. ౨. -నల్లనిజండావలె నుండునది- తాటిచెట్టు.

నీలనిర్యాసకము. సం. విణ. (అ. ఇకా. అ.) నల్లనిబంక కలది. వి. అ. పుం. ౧. నీలాసనము, నల్లవేఁగిస‡. ౨. నల్లనిబంక.

నీలపంకము. సం. వి. అ. పుం. న. ౧. చీకటి. ౨. నల్లబురద.

నీలపటలము. సం. వి. అ. న. ౧. నేత్రరోగవిశేషము, కంటిలో బయలుదేఱునల్లనిపొర. ౨. నల్లనియింటికప్పు.

నీలపత్త్రము. సం. విణ. (అ. ఆ. అ.) నల్లని పత్త్రములు కలది. వి. అ. పుం. ౧. దానిమ్మ‡. ౨. గుండ్ర మనుతృణము‡. ౩. అశ్మంతకము‡. ౪. నీలాసనము, నల్లవేఁగిస‡. ౫. నీలపద్మము, నల్లతామర‡. న. ౧. ఇందీవరము, నల్లకలువ‡. ౨. నల్లనిఆకు.

నీలపద్మము. సం. వి. అ. న. నల్లతామర‡.

నీలపుచ్ఛము. సం. వి. అ. పుం. -నల్లనితోఁక కలది- డేగ.

నీలపునర్నవ. సం. వి. ఆ. స్త్రీ. నల్లగలిజేరు‡.

నీలపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. ౧. నీలాపరాజిత, నల్లవిష్ణుక్రాంత‡. ౨. అతసి, అగిసె‡.

నీలపుష్పము. సం.విణ. (అ.ఆ.అ.) నల్లనిపువ్వులు కలది. వి.అ.పుం. నీలభృంగరాజము, నల్లగుంటగలగర‡. న. ౧. గ్రంథిపర్ణము, గంఠిపనము, మాచిపత్తిరి‡. ౨. నల్లనిపువ్వు.

నీలపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. నల్లదింటెన‡.

నీలపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నీలి‡. ౨. అతసి, అగిసె‡. ౩. నల్లదింటెన‡.

నీలపృష్ఠము. సం. వి. అ. పుం. రోహిత మను మత్స్యము, ఎఱ్ఱచేప.

నీలపోరము. సం. వి. అ. పుం. ఇక్షుభేదము, ఒకజాతి చెఱకు‡.

నీలఫల. సం. వి. ఆ. స్త్రీ. జంబువు, నేరేడు‡.

నీలబీజము. సం. విణ. (అ. ఆ. అ.) నల్లనివిత్తులు కలది. వి. అ. పుం. నీలాసనము, నల్లవేఁగిస‡.

నీలభము. సం. విణ. (అ. ఆ. అ.) నల్లని కాంతి కలది. వి. అ. పుం. ౧. తుమ్మెద. ౨. మబ్బు.

నీలభృంగరాజము. సం. వి. అ. పుం. నల్లగుంటకలగరగ్గ.

నీలమణి. సం. వి. ఇ. పుం. ౧. ఇంద్రనీలమణి. ౨. -నీలమణివంటివాఁడు- కృష్ణుఁడు. (వాచ.)

నీలమల్లిక. సం.వి. ఆ. స్త్రీ. మారేడు, బిల్వముగ్గ.

నీలమాషము. సం. వి. అ. పుం. రాజమాషము, బొబ్బరగ్గ.

నీలమీలికము. సం. వి. అ. పుం. -మునుఁచుకొనినపుడు నల్లగా నుండునది- మిణుఁగుఱుఁబుర్వు.

నీలము. సం. విణ. (అ. ఆ. అ. ప్రాణివాచక మగునపుడు స్త్రీలింగమున ఈకారాంత మగును.) కృష్ణము, నల్లనిది. వి.అ. పుం. ౧. కృష్ణవర్ణము, నలుపు. ౨. నీలమణి, నీలపుఱాయి. ౩.వటము, మఱ్ఱిగ్గ. ౪. ఒకానొకకొండ. ౫. కుబేరునినవనిధులలో నొకటి. ౬. కళంకము, మచ్చ. ౭. నల్లనియెద్దు. ౮. పాండురవర్ణము కలముఖపుచ్ఛములును శ్వేతవర్ణము కలడెక్కలు కొమ్ములును కలఎఱ్ఱయెద్దు.

శ్లో. లోహితో యస్తు వర్ణేన ముఖే పుచ్ఛే చ పాండురః, శ్వేతః ఖురవిషాణాభ్యాం స వృషో నీల ఉచ్యతే. (కల్ప.)

న. ౧. కాచలవణము, గాజుప్పు. ౨. తాలీశపత్త్రిము, తాళిసపత్త్రిగ్గ. ౩. విషము. ౪.సౌవీరాంజనము. ౫. మైలుతుత్తము. ౬. నీలిమందు. ౭. చీకటి.

శ్లో. నిశాశ్శశాంకక్షతనీలరాజయః. ఋతుసంహారము. ౧. ౨.

నీలమృత్తిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నల్లమన్ను. ౨. పుష్పకాసీసము, కొంచెము పసుపువన్నె కలఅన్నభేది.

నీలమేహము. సం. వి. అ. పుం. మేహరోగవిశేషము. (ఇది శుక్రమును నలుపువర్ణముగా చేసి స్రవింపఁజేయును.)

నీలలోహము. సం. వి. అ. న. వర్తలోహము.

నీలలోహిత. సం. వి. ఆ. స్త్రీ. ౧. భూమిజంబువు, నేలనేరేడుగ్గ. ౨. పార్వతి. (కల్ప.)

నీలలోహితము. సం. విణ. (అ. ఆ. అ.) నలుపును ఎఱుపును కలది. వి. అ. పుం. నలుపు కలసినయెఱుపు.

నీలలోహితుఁడు. సం. వి. అ. పుం. -కంఠమందు నలుపును కేశములందు ఎఱుపును కలవాఁడు- శివుఁడు.

నీలవర్షాభువు. సం. వి. ఊ. పుం. నల్లకప్ప. స్త్రీ. ౧. నీలపునర్నవ, నల్లగలిజేరుగ్గ. ౨. నల్లచాఁగగ్గ.

నీలవల్లి. సం. వి. ఈ. స్త్రీ. వంద, బదనికగ్గ.

నీలవసనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నల్లనివస్త్రము కలవాఁడు. వి. అ. పుం. ౧. బలరాముఁడు, నీలాంబరుఁడు. ౨. శని. ౩. నిర్ఋతి.

నీలవృన్తా. సం. వి. ఆ. స్త్రీ. అజాంత్రి, నల్లసముద్రపాలగ్గ.(గాడిదగడపరగ్గ. అని కొందఱు.)

నీలవృంతము. సం. వి. అ.న-నల్లనితొడిమకలది- తూలము, ప్రత్తిగ్గ.

నీలవృష. సం. వి ఆ. స్త్రీ. వార్తాకీభేదము పువ్వులును కాయలును ఆకులును నల్లగానుండు వంగచెట్టు.

నీలశీర్షము. సం. వి. అ. పుం. నల్లనిముఖము కలక్రోంచి, కొండమాచ్చు.

నీలసంధ్య. సం. వి. ఆ. స్త్రీ. కృష్ణాపరాజిత,విష్ణుక్రాంతగ్గ.

నీలసారము. సం. విణ. (అ. ఆ. అ.) నల్లనిచేవ కలది. వి. అ. పుం. ౧. తిందుకము, తుమికిగ్గ. ౨. నల్లమద్దిగ్గ. ౩. నల్లవేఁగిసగ్గ.

నీలసుగంధ. సం. వి. ఆ. స్త్రీ. గోకర్ణి, చాఁగగ్గ.

నీలాంగము. సం. విణ. (అ. ఆ, ఈ. అ.) నల్లని శరీరము కలది; నల్లనిఅవయవములు కలది. వి. అ. పుం. సారసపక్షి.

నీలాంజన. సం. వి. ఆ. స్త్రీ. విద్యుత్తు, మెఱపుఁదీఁగ.

నీలాంజనము. సం. వి. అ. న. సౌవీరాంజనము' ఒకవిధ మైనకాటుక.

నీలాంజని. సం. వి. ఈ. స్త్రీ. కాలాంజనీక్షుపము.

నీలాంజస. సం. వి. ఆ. స్త్రీ - నల్లమేఘమును అంటియుండునది- ౧. మెఱపుఁదీఁగ. ౨. ఒకానొకనది. ౩. ఒకానొకఅప్సరస్త్రీ.

నీలాంబరము. సం. వి. అ. పుం. ౧. తాళిసపత్రి. ౨. నల్లనిబట్ట.

నీలాంబరి. సం. వి. ఈ. స్త్రీ. ముప్పదిరెండునపుంసకరాగములలో నొకటి.

గీ. చెంచుమలహారి...నీలాంబరియు ననఁగ. గీ. పొసఁగు ముప్పదిరెండునపుంసకములు. హంస. ౫. ౧౨౪, ౧౨౫.

గీ. రీతిగౌళయు నీలాంబరియును ఘనము,దనరు హంవీర నాటయు నని నపుంస,కములు ముప్పదిరెండురాగములు మఱియు, దేవమలహారి సాహారి రేవగుప్తి. ప్రబంధ. ౯౪.

నీలాంబరుఁడు. సం= నీలవసనుఁడు.

నీలాక్షము. సం. విణ. (అ.ఈ.అ.) నల్లనికన్నులు కలది. వి. అ. పుం. ఖాతు.

నీలామ్ల. సం. వి. ఆ. స్త్రీ. నీలఝుంటి, నల్లగోరంటు.

నీలాలి. వి. ద్విముఖదీపిక.

సీ. ద్విముఖదీపిక గడిదేవు నీలాలి నా... ఆం. భా. ౨. ౧౩౫.

నీలాలువు. సం. వి. ఊ. పుం. నల్లనికంద, ఒకదినుసుదుంపు.

నీలాశ్మము. సం. వి. న్. పుం. ఇంద్రనీలమణి, నీలపుఱాయి.

నీలి[1]. వి. మల్లవిద్యాసాధనవిశేషము.

సీ. మనును జెట్టి యనంగ మల్లాభిధానంబు తద్విద్య సా మనఁ దనరు చుండుఁ, దత్సాధనంబులై తగుఁ గంబము కొణత కటి కన లోడి సంగడము ఖాల. గీ. సంగడము నీలి గోతా మనంగఁ గొన్ని. ఆం. భా. ౨. ౨౦౪.

నీలి[2]. వి.(సం. నీలం.ప్రా. నీలీ.) ౧. నీలవస్త్రము.

సీ... నీలవస్త్రం బగు నీలి యనఁగ. ఆం. భా. ౨. ౧౫౪.

౨. నలుపు, నీలిమ.

గీ...సకలజగద్భవనాయమాన, నీలవర్ణియులను నొక్క-నీలి మ్రింగ, ననుట నిజమై యశేష వర్ణాంతరములఁ, గప్పుకొని యొప్పు చిమ్మచీకటులు సెఱయు. శుక. ౧. ౧౯౪.

గీ. చీర సేతితోఁ గాటుక చిక్క- మెదిచి,నఱయ బ్రహ్మాండపుహారంబు తెఱపిఁ గదియ, వరుసతో ముద్దరువడి వైచి కలయ,నీలిఁ గుడిపిన క్రియఁ జీకువాలు గదిసె. కు. సం. ౧. ౯౯. (నీలిఁగుడిపిన క్రియ=నైల్యమును వ్యాపింపఁజేసినరీతిని.)

౩. నల్లనూలు. (శ. ర.) ౪. ఇంద్రనీలము. (చూ. నీలితిన్న.)

విణ. ౧. నల్లనిది. (ఒకానొకచో దీని యిత్వము నకులోపము కన్పట్టుచున్నది.)

గీ. కొస దిగఁగ నీలిపుట్టంబు ముసుఁగుపెట్టి, గాజు లెగఁద్రోసి చప్పుడు గాకయుండ,వచ్చె నూర్వశి యర్జును వాసమునకు. హర. ౪. ౧౧౯. సుభ. ౪. ౩౩.

సీ. నిండుగాటుపునీలిదిండు గా దని కటిఁ బలు
చనినారచీరలు ధరించె. వా శ్రీ. ౨. ౧౧౬.

మ. తలచుట్టు నడచొల్లియంబులును నీలట్టీలు...
హరిశ్చ. ౨. ౪.

౨. (త. నీలి.) దుష్టురాలు, ధూర్తురాలు.

ఉ. అద్దమరేయిదాఁక పాల మారసి మారశిలీ
ముఖాహతి,న్నిద్దురఁ గాచి యున్నమగనిన్
జగనీలిపిసాళిజంత యమ్మద్దియ సేవచేయదు
...పాండు. ౩. ౮౧.

ఉ. ఏసడిసన్నమానిసివో యేమి యొఱుంగవు
పాఱుపట్టివే, వేసర కెన్ని నేరిచితివే మటు
మాయలనీలికాన యో, మూసినముత్తైమె మె
లఁగుముద్దుఁగుమారునిమీఁద పెట్టుగాఁ, జే
సితి వింతమచ్చరము చెల్లునఁటే మతి యూఁ
డుదానికిన్. సారంగ. ౩. ౫౩.

సా: నీలినీళ్లకు పోయిన బావి లోఁతునకు పో
యినది. (బ్రౌ.)

జః నీలిచీర, నీలితనము, నీలితిన్నె, నీలిదట్టి,
నీలిమందు, నీలిమబ్బు.

నీలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. నీలిచెట్టు. ౨. నల్ల
గలిజేరు. ౩. నల్లగోరంట. ౪. నల్లయీఁగ.
౫. రోగభేదము, చర్మముమీఁద బయలుదేఱు
నల్లమచ్చ.

నీలిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నీలసిందువారము,
నల్లవావిలి. ౨. నీలిచెట్టు. ౩. నేత్రరోగభేద
ము, కంటిలో బయలుదేఱునల్లపొర. ౪. ముఖ
ముమీఁదను దేహముమీఁదను బయలుదేఱునల్ల
మచ్చలు కలక్షుద్రరోగభేదము. ౫. జలమును
చెఱుపుదోషవిశేషము. (భూమికి ఊషరము,
వృక్షమునకు కోటరము, జలమునకు నీలికయును
దోషములు.)

నీలిచీర. వి. (√నీలి².) నల్లనివస్త్రము; చోరసా
ధనవిశేషము.

ఈ. కత్తియు నీలిచీరయును గంకటి రజ్జువు నా
రసంబు...క. మొద లగుసాధనములు గొని
...చెన్న. ౩. ౨౯౪, ౨౯౫.

నీలితనము. వి. (√నీలి².) ౧. దుష్టత్వము.

గీ...నరపాలవరాళి దా నృసత్యభయశీలి గావున
జాలిఁ గొలుపు, నాలినీలితనాన కౌనవఁగఁ
జాలి, సోలి సుతుమాలిమికి నాగయాలిఁ
జూచి. చం. రా. ౪. ౨౨.

౨. మాయవేషము. (గ్రా.)

నీలితిన్నె. వి. (నీలి² + తిన్నె) ఇంద్రనీలవేదిక.

సీ. అచ తెల్లఁ దమచాయ నంటి నట్టుగ నుండఁ
దిరుగులాడెడి నీలితిన్నెలనఁగ. యయా.
౨. ౧౨.

నీలిదట్టి. వి. (√నీలి².) నల్లనికాసెకోక; చోర
సాధనవిశేషము.

క. బలపముఁ గన్నపుకత్తియుఁ, దలముళ్లును జో
క్కు నీలిదట్టి యినుముఁ జీమలకోలు గ్రద్ద
గోరును, ములుబంతియుఁ గత్తెరయును మొ
దలగువానిన్. పరమ. ౪. ౧౦౪.

నీలిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. నీలి. ౨. శ్యామ
త్రిపుట, నల్లతెగడ.

నీలిమ(ము). సం. వి. న. పుం. నలుపు.

నీలిమందు. వి. (√నీలి².) నీలియాకుల నుండి
తీసినరంజకద్రవ్యము.

(వ్యవ.) అబట్టలకు నీలిమందు పెట్టినారు.

నీలిమబ్బు. వి. (√నీలి².) వేఁటసాధనవిశేషము.

ద్వి. జిగురుకోలలు మేటిచిక్కములు ఉరులు, తెగ
నీలిమబ్బులు ద్రిప్పుడుత్రాళ్లు,పిగిలిచెం డ్లమ
రిన పెద్దయీఁటెలును.ద్వి.నల. ౩. ౨౩౪ పం.

నీలీరాగము. సం. వి. అ. పుం. ౧. నీలిమందు
రంగు. ౨. నీలిమందురంగువలె వీడనిసాయిక
సాయకులయనురాగము, (చూ. కుసుంభరాగ
ము.)

నీలుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకవానరుఁడు, సుగ్రీవసేనాధిపతి.

నీలుగు(ల్గు)=ఈలుగు. అ. క్రి. ౧. చచ్చు.

గీ. అట్టు లొక్కొక్కపోటున నాలపోతు, లన్నియును వాత మొక్కనఁ గన్నుఁగవల, నెత్తురులు గాఱ నీలిగి నేలఁ బడిన, నెల్ల వారలు వెఱఁగంది రుల్లములను. నీలా. ౩. ౫౭.

క. మన కేమికారణం బీపనులు విచారింపఁ దగనిపనికిం జనినన్, మనుజుండు నొచ్చు ము న్నొక్కవనచర మొకతఁగనిపని నెపంబున నీల్గెన్. పా. పంచ. ౧. ౮౫.

సీ. సమయుట యీల్గుట... నీల్గుట... నా మీఱుట మరణము... ఆం. భా. ౨. ౨౨౫.

౨. గాత్రవినామము చేయు, ఒడలువిఱుచుకొను; వెనుకకు ఒడలు విఱుచుకొను.

క. అనిలసుతుం డంతన మేల్కని నీల్గుడు నతనివజ్రఘనకాయముఁ బొందినలతికాజాలము లెల్లను త్రెస్సి మృణాలబాలలతికల పోలెన్. భార. ఆది. ౫. ౧౭౨.

సీ. లేచి నీల్గుచు బార సాఁచె నేనియుఁ జక్రవాళాచలేంద్ర మవ్వలికి మీఁగు. ఉ. రా. ౨. ౧౮౯.

ఉ. వెచ్చనియూర్పు నించుచును వేదనఁ బొందుచుఁ గన్ను మోడ్చుచున్, వెచ్చుచు సెజ్జపైఁ దనువు వెమ్మఁగ వేఁచుచు నీల్గి లేచుచున్. కేయూర. ౩. ౩౪౩.

క. వడి నొడుగఱచి వలకేల్, నిడుచన గనయమునఁ బెనఁచి నీల్గి బలం బేర్పడ విల్లు వంప నోపక, యుడిగిరి నృపసుతులు గొంద ఱొయ్యన లజ్జన్. భార. ఆది. ౭. ౧౭౫.

మ. నెతీ నెల్లప్పుడు నిల్చి ప్రాణిచయమున్ నిర్మించి నిర్మించి వీ,పిటి [illegible]

పులించుచు నజుం డేసృష్టియు న్నాని ... భాగ. ౮. ౭౧౩.

౩. ఒడలు నిగుడించు, ఒడలు సాఁచు.

గీ. అవయవంబులు గదలించి యావులించి, నిదురఁ దెప్పిఱి మేల్కాంచి నీల్గి మలఁగి, యొడలు విఱుచుచుఁ గనుఁగవ లుసుముకొనుచు, ధాత గూర్చుండె సృష్టిసంధాత యగుచు. భాగ. ౮. ౭౩౪.

వ... కట్టెదుటివాజిశాలలం గట్టినపొట్టేళ్ళకై యాదిగాని నీల్గి కాలుద్రవ్వి... మనుచ. ౪. ౨౮.

౪. సాఁగు. ౫. గర్వించు.

చ. అతివరుచంబులు న్మెఱుఁగుటారును వేసలి యున్ ధరాధిపోన్నతియు నహీనభూతికలనంబు ఘనాభ్యుదయంబు నిప్పు డొం,దితి మని మాటిమాటికిని నిక్కుడు నీల్గెదు విఱ్ఱవీఁగెదున్, క్షితి నటుగావ రొక్కొకరికి న్నడుమంత్రపుఁగల్మి గల్గినన్. విజ. వి.౧. ౩౪. (పై రెండర్థముల కిదియే యుదాహరణము.)

౬. దేహ ముబ్బించు, ఒడలు పెంచు.

క. బలితపుటురిగ్రామంబున, నిలుచుట యారజ్జుత్రెవ్వ నీలిగి సుమతుల్, వెలువడి చని సుఖు లగుదురు... భార. శాం. ౬. ౨౩౨.

శా. ఆతం డప్పుడు సాత్త్వికత్వవిదుఁడై యుప్పొంగి పచ్చట్ట ల్వ్రీని, ర్ధూతిం బొందఁగ నీల్గి బిట్టు నెగసెం దోయాఘమధ్యంబునన్. హరి. పూ. ౭. ౪౯.

సీ. జమిలిమద్దులతోడ సంరంభమునఁ దగిలించి తాఁ దగులక లీల రంటి. గీ. వడుము గడచి నీల్గుటయును బుడమి పగులఁ, బెల్లగిలి కూలెఁ దరువులు... హరి. పూ. ౫. ౨౪౩.

నీలోత్పలము. సం. వి. అ. న. నల్లకలువ. (ఇది [illegible] బాణములలో నొకటి.)

ఇట్లే: నీలాబ్జము, నీలాంబుజము మొ.

నీలోత్పలము. సం.వి. అ. పుం. ఇంద్రనీలమణి, నీలపుఱాయి.

నీళ్లచివది. వి.(నీళ్లు + చివది.) ఆలంజరము, కాఁగు.
గీ. సెగడు నీరాడనంగను నీళ్లచివది, యన నలంజరనామధేయమ్ము... ఆం. భా. ౨. ౨౪౫.

నీళ్లదొర=నీటికొకిమీఁడు. (వరుణుఁడు.)
చ... నీళ్లదొర గాడుపు జక్కులఱేఁడు చిల్వస్వాములయొకిమీఁడు వాల్గుబుజముల్ గలవేలుపు దమ్మిచూలియుఁ గ్రొ, గొలువంగ వెండికొండపయిఁ గూర్చిఁ జెలంగుఁగడిందిదయ్యమా. అచ్చ. రా. ఆర. ౧౨౭.
ఇట్లే: నీళ్లరాయఁడు, నీళ్లఱేఁడు.
ఆ. మేటినీరుచూలి మెయితాలుపులసామి, వల్లెత్రాడుదాల్పు నీళ్లరాయఁడు... అనంగ నొప్పు కరుణుఁ డీశ. ఆం. సం. దేవ. ౨౧.
సీ. వలఁగొని నీళ్లక్రేవల నుండు నీళ్లఱేఁ డరయ బయల్వట్టి తిరుగు గాడ్పు. అచ్చ. రా. బాల. ౭౮.

నీళ్లవరుగు. వి.(√నీరు.) ఉష్ణలక్షణము. (శ.ర.)

నీళ్లా(ళులా)డు=నీరాడు. అ. క్రి. (నీళ్లు + ఆడు.)
౧. స్నానముచేయు.
సీ. అతఁడు సరస్వతి నవగాహనము సేయుచుండి యాచేరువ నోర్తు తడుపు గట్టుక నీళ్లాడఁగాఁ జూడఁ దనమనుక్రము నిర్గమించిన... భార. శల్య. ౨. ౧౭౦.
క. కుడిచిన నీళ్లాడిన మతి, గుడిలోపల నలుఁగు వెట్టుకొన్న నభీష్టం, బడుగఁగ నవ్విన దుర్గతిఁ, బడుదురు బాధలను నధికపాపాత్ములజా. శివ. సా. ౭౯౨.
ఉ... యశోద వేడుకఁ గ్రొ, గోపసతీసమేతముగఁ గోరి సమీపగ యై తన... లాడఁటకు నై చనియె నంద్వరమాణచిత్తయై. హరి. పూ. ౫. ౧౭౪.
౨. ప్రసవించు.
క. తెలిసి చక్కన వచ్చి దేవకి నీళ్లాడె రమ్మ ర మ్మని భోజరాజుతోడఁ జెప్పిన... భాగ. ౧౦. పూ. ౧౪౭.
గీ... వేల్పుపెద్ద, పాలఁతి కంతటు నీళ్లాడుప్రొద్దు లయ్యె. భాగ. ౭. ౫౦.

నీవరి=నివరి. (శ. ర.)

నీవరుఁడు. సం. వి. అ. పుం. ౧. పరివ్రాట్టు, సన్న్యాసి. ౨. వణిజుఁడు, బేహారి. ౩. వాస్తవ్యుఁడు, నివసించువాఁడు.

నీవాకము. సం. వి. అ. పుం. ౧. అర్ఘోత్కర్షమువలన కలుగుజనాదరము, వెల మిక్కిలి హెచ్చినదానియందు జనుల కుండుమక్కువ. ౨. ధాన్యాదులు నిలువచేయుట.

నీవారము. సం. వి. అ. పుం. సస్యవిశేషము, నివ్వరి.

నీవి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఉచ్చయము, స్త్రీల పోఁకముడి. ౨. మూలధనము, సంచిమొదలు. ౩. పరిపణము, పందెపుసొమ్ము. ౪. బంధనాలయము, చెఱసాల.

నీవు=ఈవు. స. యుష్మదర్థకము. (చూ. నీ.) భార. ఆది. ౨. ౧౪౪.

నీవృతము. సం=నీవృత్తు.

నీవృత్తు. సం. వి. త్. పుం. ౧. దేశము, గ్రామసమూహము. ౨. గ్రామము.

నీవ్రము. సం=నీధ్రము.

నీశారము. సం. వి. అ. పుం. (మంచును గాలిని వారించుటకైన) కప్పెడు దుప్పటి(గొంగడి మొ.); సర్వాంగప్రావరణము, ఒడలెల్లఁ గప్పుదుప్పటి; తెరకాండ పటము.

నీహారము. సం. వి. అ. పుం. ౧. పేరినమంచు, గడ్డమంచు; మంచు. ౨. త్రయోవింశతిరగణాత్మక మగుదండకభేదము.

# ను

ను¹=న్¹. ప్ర. (కొన్నియెడల దీనియుత్వమునకు లోపము కలుగును. చూ. ద్రుతము.) ౧. నాశబ్దమునకును తనశబ్దమునకును వచ్చు ప్రథమైకవచనము. (ఉదా: నేను, తాను.)

చ. ...సర్వమునను నేన నిల్తు సుఖవాసత నన్
దగఁ జెంది నిల్పుస, ర్వము... భార, అశ్వ. ౩. ౩౭.

గీ. ఏను నీయంతియును గాని యెఱుగ
రన్యులు... భార. ఆది. ౪. ౧౦౫.

మ. ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నే మం
చు నూహించునో, మది సాత్రాజితి దా
నికే నిపుడు ప్రేమం బంపినం దీని నొల్లద
మం జేసినజాడ దోఁచునో కో యీ లె మ్మిం
దు నే నన్నిఁ జెల్లదువో యేరికిఁ బంపఁగా
ననుచు... పారి. ౧. ౫౪.

ఉ. శ్రీకమనీయహారమణిఁ జెన్నగఁ దానును
గౌస్తుభంబునం, దాకమలావధూటియు ను
దారతఁ దోఁప... ఆము. ౧. ౧.

గీ. తాను దెగు నేని బాంధవదారపుత్త్రమిత్త్ర
లను సజ్జనంబు లేమిటికి విగతచింతుఁడై
గుహ సొచ్చి యశ్రాంతబుద్ధి, దడవి కానంగ
వలవదె తన్నుఁ దాన. భార. శాం. ౬. ౨౩౩.

౨. ద్వితీయైకవచనము. (పట్టి అనుపద మనుప్రయుక్తమగునపుడు హేత్వర్థమును దెలుపును. చూ. పట్టి².)

క. విషనిధిమధి నసంఖ్యము, నిషాదగణ ముండి ధారుణీప్రజఁ గడఁకన్, విషమము నుజే యుము దాని నిమిషమున భక్షించి చను మ మిత్త్రవిఘాతీ. భార. ఆది...

గీ. సత్త్వవిశ్రేష్ఠుఁ దిక్కయజ్వను భజించి.
కాశీ. ౧. ౧౯.

చ. ...ఈ, చలిమలకల్ల నుల్లసిలుచల్లదనంబును
నూనకుండినన్. మనుచ. ౨. ౧౦.

౩. తద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనము.

క. విను గార్హపత్య మనుప, య్యనలము విహరిం
పఁబడి తదాహవనీయం, బను వెలుఁగు నట్ల
వెలుఁగును, జనకుఁడు దాఁ బుత్త్రుఁడై నిజ
ద్యుతితోడన్. భార. ఆది. ౪. ౭౬.

మ. ...పాంచజన్య మొసఁగున్ గల్యాణసాక
ల్యమున్. ఆము. ౧. ౫.

౪. ఉత్తమపురుషైకవచనము.

ఉదా: వండుచున్నాను, వండఁగలను.

ఉ. ...వేంకటభర్తఁ గొల్చెదన్. ఆము. ౧. ౧.

౫. తుమర్థభావలక్షణాద్యర్థములయందు వచ్చును. (చూ. అ¹.)

ఉదా: వండనుబోయెను. వాఁడు వండ నతిథి వచ్చెను. చూడ వలయు, చూడఁగా వలయు.

ను²=న్². అప. (కొన్నియెడల దీనియుత్వమునకు లోపము కలుగును. చూ. ద్రుతము.) ౧. ప్రథమాంతము లగునట్టి ద్విశేషణములకు ప్రాయికముగా నగునంతాగమము. ఈయాగమము పరమగునపు డుత్వమున కత్వ మగు. (చూ. అ¹.) ఇ ఈ ఐ లపై దీనికి 'ని' వచ్చును. (చూ. ఇ¹.)

ఉదా: నేను ధన్యుఁడను. నేను చిన్నదానను. నేను సుకృతిని. నేను స్త్రీని.

౨. కొన్ని ప్రత్యయములకును కొన్ని అవ్యయములకును అంతాగమముగా వచ్చునది.

ఉదా: రామునిచేతను. వనమందును. వలెను. పోలెను మొ. (౧, ౨ అర్థములలో దీని ఉత్వము వికల్పముగా లోపించును.)

౩. వృత్తియందు కొన్నియెడల ఆగమమై వచ్చునది. (ఇందలి ఉత్వము నిత్యముగా లోపించు...)

ఉదా : తళుకుంజెక్కులు, తెల్లందనము మెం.

౪. కల అనుబంధము పరమగునపుడును పదు అనుబంధము పరమగునపుడును ధాతువునకు వచ్చుఆగమము. (చూ. అ[1].)

ఉదా:-చేయఁగలఁడు. కొట్టఁబడెను.

**నుంకు.** వి. పస్తు, ఉపవాసము.

సీ. ప స్తిల్లి నుంకు నిప్పస్తు ని ట్రనఁగను నుపవాససంజ్ఞ యై యొప్పు చుండు. ఆం. భా. ౨. ౧౪౫.

**నుంజే.** వి. సొగటాలపలక.

సీ. పనిగిండి చిటికెనపావురాల్ సొగటాలు నుంజలు గొరవంకపంజరంబు. ప్రబంధ. ౯౨౩.

**నుంపారు=నునుపారు.** అ. క్రి. (√నుంపు) నున్ననగు, మృదువగు, మెత్తనగు.

ద్వి. నుంపారి సొంపారి కంపు నింపారి, పెంపారి చాల నొప్పెడిబిల్వపత్త్రి. బస. పు. ౩. ౬౯౬ పం. (చి. ని. ప్రాఁత ప్రతిపా. 'ఇంపారి నునుపారి' క్రొత్త ప్రతిపా.)

**నుంపు=నునుపు.** (క. నుణ్పు. చూ. నుంపారు.)

జః నుంపారు.

**నుక్కుటు.** వి. ౧. అసియాడుట, జవ్వాడుట. (చలనము అని శ. ర.)

ద్వి. చెక్కుల సన్నంపుఁజెమ రెక్క నడుము, నుక్కుటు నొక్కింత నూగారు దోఁప, నలరు పయ్యెద జాఱ నలకలు చెదర...ద్వి. వారి శ్చ. ఉ. ౯౧౦ పం.

౨. బాధ.

ఉ. ఘోరతరాననస్ఫురితకోపులు నై యమదూతలానరుం, జేరినఁ గాంచి మై వడకఁ జేష్టలు వైకృత మందఁ బల్గుటు, నొర్వరను గన్నులం దెఱచు నుక్కుటు నై వెగ డగ్గలింపఁ గన్. మార్క. ౨. ౩౯.

**నుగ్గడుచు=నుగ్గాడు.** స. క్రి. (నుగు + అడచు.) నుగ్గుగునట్లు కొట్టు, నలఁగఁగొట్టు.

సీ. ఎక్కుడు వల నైనయెడ లడ్డగించినచఱుల నుగ్గడుపుడు సక్కఁ బ్రాఁక, రానితిప్పలు చొరఁ ద్రవ్వఁ డీఱము లైనమ్రాఁకులఁ బొదలును మ్రగ్గఁ బొడువు, దు...వారి. ఉ.౧. ౯౩.

**నుగ్గాడు=నుగ్గడుచు,** నుగ్గుచేయు,నుర్గాడు.స.క్రి. (నుగ్గు + ఆడు.) ౧. గుండచేయు, పొడిచేయు.

మ. భటులన్ గీటడఁగించి ఘోటకములన్ భజ్జించి భద్రేభరాడ్ఘటలం జెక్కులు సేసి సైనికశతాంగశ్రేణి నుగ్గాడి...రా.వి.౫.౧౪.

౨. పాడుచేయు, ధ్వంసముచేయు.

సీ. వనలులాయము లిక్షువనము నుగ్గాడినపగిదిఁ గాల్వర సేలపాలుచేసి.శు.సం.౧౧.౪౦౪.

మ. పెసరుంగాయను మెత్తకన్నులను నై పేటాడుమన్ గొబ్బిలన్, నుసలం జూచుచు దోసచేల్ చెఱుచాల్ నుగ్గాడుచున్ సజ్జఁ గొఱ్ఱయ సుమాళింపుము... రా. వి. ౨.౬౫.

౩. వధించు.

సీ. నుగ్గాడెఁ బరిమార్చె నులివెను దెగటార్చెఁ జదిపెఁ జంపెను సదమద మొనర్చె. గీ. అడఁచెఁ జెండె ననఁగఁ బొందగు వధించె, ననుటకు సమాఖ్య లై... ఆం. భా. ౩. ౧౨౩.

మ. వసుసన్ యక్షపిశాచరాక్షసచమూవర్గంబు నుగ్గాడెదం, బోరి గంధర్వుల సంహరించెద ... భా. రా. అర. ౨. ౩౩౩.

౪. ఖండించు.

ద్వి. సీతల ల్నుగ్గాడి నిను సంహరించి, సీతఁ దోడ్కొనిపోవు సిద్ధ మీపలుకు. రం. రా. సుం. ౨౬౯ పా. ౪ పం.

అ. క్రి. నుగ్గగు. (చూ. నుర్గాడు. అ. క్రి.)

**నుగ్గించు.** స. క్రి. తిట్టు, శపించు.

మ. తనసింగారపుఁజెక్కుటద్దములమీఁదం జాఱు
కన్నీరు కేలినఖాగ్రంబులఁ బాఱమీఁటు
చును దళ్లి న్నాల్గు నుగ్గించి మో, మునరం
దైన్యము గొంత తెచ్చికొని డంబుల్ నూపి
యవ్విప్ర, నొ,య్యన డాయం జని యిట్లు
పల్కెను రహస్యాలాపరూపంబునన్. విప్ర.
౪. ౩౭.

నుగ్గు=నుగ్గు. అ. క్రి. (క. నుగ్గు.) నలఁగు.

చ...మా, కఱచినకాట్లనన్ శిశువు కాయము
తోలును నుగ్గ డేమియున్. నృసిం. ౪. ౪౩.
(శ. ర. పా. 'సుగ్గదయ్యె'. ముద్రి పా.)

వి. ౧. చూర్ణము, పొడి. (ఇది 'అగు, ఆడు, చే
యు, పాఱు' ధాతువులతో కలసియే తఱు
చుగా ప్రయోగములఁ గానవచ్చుచున్నది.)

ఉ. ఆయతపక్షతుండహతి నఖ్కుల శైలము లెల్ల
నుగ్గుగాఁ, జేయుమహాబలంబును బ్రసిద్ధియు
నుం గలవాడ నీపనిం, బాయక యొమ్మునం
దవడుఁబాముల మోవను వారికిం బనుల్, సే
యను నేమికారణము సెప్పుము దీనిఁ బరో
రుహాననా. భార. ఆది. ౨. ౪౧.

గీ. నురుము నుగ్గు పొడుము పొడి నురుము ను
న్ని, చూ రనంగను విలసిల్లుఁ జూర్ణమభవ.
ఆం. భా. ౨. ౨౨౦.

౨. ముక్క, ఖండము.

చ... తేరప్పై, నొగ నొగ డాకఁగాఁ బఱపి
నుగ్గుగఁ గొరవనూతు నేసి... భార. భీష్మ.
౨. ౩౩౧.

క. నగ్గుపడి విరియఁబాఱిరి, బగ్గనఁ బొరివుచ్చు
వీరభద్రునిధాటికన్, నుగ్గు లయి యవురుసవు
రయి, గగ్గులకాడై వికావిక లయి యమ
రుల్. కాశీ. ౭. ౧౭.

సీ. తనపార్శ్వభాగసంఘర్షణంబున ద్వీపకోటు
లు నుగ్గలై నీటఁగలియ. దశా. ౧. ౧౯౫.

౩. సమూహము, గుంపు.

ఆ. ఉగ్రభానుసుతుఁడు నగ్రభాగంబున, బలిను
ఖాధిపతులు పన్ని నడువ, వెనుకఁ దాను గద
లె వెన్నుజలం బయి, నూఱుకోట్లకపులనుగ్గు
లలము. రామా. ౭. ౨౭౫.

(దీనియామ్రేడితరూపము నుగ్గునుగ్గు.)

చ. ఖురపదఘట్టనం ధరణి గ్రుంగ ఫణీంద్రుఁడు
నుగ్గునుగ్గుగాఁ, బరువడి...మహో, శ్వరుశ్వ
మథంబు హాఱణమ వచ్చె...కు. సం. ౨.
౧౫౭.

బ. పిసుకలు (శ. ర. బ్రౌ.)

సా: ఉగ్గుతో నేర్చినగుణము నుగ్గులతోఁ గాని
పోదు.

జ: నుగ్గడుచు, నుగ్గాడు, నుగ్గించు, నుగ్గుచేయు,
నుగ్గులువాఱు.

నుగ్గు(లు)చే(సే)యు. స. క్రి. (నుగ్గు + చేయు.)

౧. ముక్కలుచేయు; పొడిచేయు.

గీ. యోధసారథియుగ్యసంయుతము గాఁగ,
నూఱురథములు వ్రేల్మిడి నుగ్గుచేసె. భార.
విరా. ౩. ౧౭౨.

సీ. దళనళంబముల దుర్ధరమహీధరకూటకోటి
నుగ్గులు సేయు కుంజరములు. వసు. ౨.
౧౫౨. భార. ద్రో. ౧. ౨౫౧.

౨. వధించు, చంపు.

చ... తేరికి సారథి గమ్ము నాకుఁ జిచ్చుబఱపిడు
గొట్టుల ట్టడరి తూఁరులమొత్తము నుగ్గునేసె
దన్. భార. విరా. ౫. ౧౩.

శా. ఈరీతిం జగదేకవల్లభుఁడు భూమియుక్త ప్రతా
పంబున్ జేఁ, గ్రూరాదిత్యవిరోధివర్గముల నుగ్గు
ల్ సేయు...దశా. ౨. ౪౦౮.

నుగ్గులువాఱు. అ. క్రి. (నుగ్గులు + పాఱు.) పొడి
యగు.

ద్వి. కలయఁ బర్వెడుభవద్దరళకాలాగ్నిఁ, గుల
గిరు లైన నుగ్గులువాఱఁ గాలు. ద్వి. పారిజ్ఞా.
ఉ. ౧౭౩౩. పం. ఇట 'బూది యగు' నని
అర్థము.

నుచ్చిలి. వి. నురుఁగు, ఫేనము.

శా. నోర న్నుచ్చిలి గ్రమ్మ మై వడఁకఁ గన్నుల్తారకాబింబసంచారవ్యాప్తిఁ దఃకరింప హృదయస్థానంబు గంపింప...హర. ౨. ౭౩.

సీ. శ్లేష్మము ద్రేకించి సెలవి రంధ్రము వాయ మెరసి నుచ్చిళ్లు గ్రమ్మింపకుండ. శివరా. ౪. ౪౭.

నుచ్చు¹. స. క్రి. నుచ్చుపాఁతలుచుట్టు. (శ.ర.) వి. గొఱ్ఱెలయొక్కయు మేఁకలయొక్కయు పెంటిక. (మేఁకపెండ్రుక అని బ్రా.)

వ...నెల్లికొయ్యలు ద్రచ్చి నుచ్చు లంటించినం బెచ్చుపెరుఁగుచిచ్చు లాత్రంపులందవిలించి...మనుచ. ౪. ౬౦.

ద్వి. పచ్చవంటకమును బడియించి మేఁకనుచ్చు కరీషంబు నొసల నంటించి. ద్వి. భా. ౧౦. (చి. ని.)

జ: నుచ్చుకోక, నుచ్చుప్రాఁత.

నుచ్చు². వి. ఫేనము, నురుఁగు.

(వ్యవ.) వానినోటినుండినుచ్చులువచ్చుచున్నవి.

,, ఉంతుడుకాయ నుచ్చు వచ్చుటలేదు.

నుచ్చుకోక=నుచ్చుప్రాఁత. వి. (నుచ్చు¹+కోక.) గొఱ్ఱెలయు మేఁకలయు చన్నులకు చుట్టెడుగుడ్డ.

ద్వి. ములుగత్తి నుచ్చుకోకలుఁ జూఁడుఁగోడువు, మొలతిత్తి నిడి దొడ్డమొలకచ్చ గట్టి. బస. పు. ౩. ౧౧౧౭ పం.

నుచ్చుప్రాఁత=నుచ్చుకోక. వి. (నుచ్చు¹+ప్రాఁత) గొఱ్ఱెలయు మేఁకలయు చన్నులకు చుట్టెడు గుడ్డ.

సీ. ఒడిసెల పాలకావడి నుచ్చుప్రాఁతలగుది మూఁపుపై వ్రేలుగోర్పడంబు. వేం. పంచ. ౧. ౫౯౭.

నుజ్జు=నజ్జు. (శ. ర.) విశే. క్షతి నొందినది, నుక్కలి నలఁగినది.

ఉ. అంటినఁ గందునో యనక యంగము నిర్ణయవృత్తి మీఱఁ గౌఁగింటికిఁ దార్చి నుజ్జుగనొ కెంజిగురట్టిది నాక మోవిఁ బల్గంటు లొనర్చి...వ్యాల్గంటి రమించె నాథుఁడు స్వకార్యపరుల్ మగవార లెంచరన్. ఉ. రా. ౮. ౪౮౮.

నుడి=నుడుగు, నొడుగు. వి. (క. నుడి.) మాట, పలుకు; వాక్యము.

చ...వింటు లేదె యింటు గెలిచి రచ్చ గెల్వమను వానుడి నానుడి నానుఁడీ చెవిన్. సారంగ. ౨. ౨౫౯.

సీ. గుడుసు కైదువు జోదు నుడివాన గురియక కడు విరాలపుటగ్గి యడఁగఁ గలదె. నీలా. ౧. ౧౦౩.

క...వల్లకీతతు లొక్కట్లై, మ్రోసినగతి సెలుఁ గడరన్, భూసతికడనుండి యొక్కనుడి వినఁ బడియెన్. ఉ. రా. ౭. ౧౨౬.

జ: నుడికారము, నుడివిల్లు.

నుడికారము. వి. (క. నుడికారు- నుడి+కారము³- స్వార్థము.) ౧. పలుకు, మాట; (మాట పొందగువానియందలి) చమత్కారము, సరసత.

సీ. నుడుగు నుడువు నుడి నుడికారము నొడువు నొడి నొడికారము నొడుగు నాఁగఁ బదము...ఆం. భా. ౧. ౧౧౧.

ఉ. ఎట్టు పురాణము ల్పదియు నెన్నిదిఁ జెప్పితి వెట్టు వేదముల్, గట్టితి వేర్పఱించి నుడికారముసొం పెసలార భారతం, బెట్టు రచించితీవు ఋషి వెట్టయి తొక్కదినంబుమాత్రలోఁ, బొట్టకు లేక తిట్టెదవు పుణ్యగుణం బులరాశిఁ గాశికన్. కాశీ. ౮. ౧౯౨.

గీ. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యండ్రు,

పలుకునుడికారమున నాంధ్రభాష యందు, శర్వ శేమన్న నంధ్రుగా శేల కొఱంతి,నా కవిత్వంబు నిజము కర్ణాటభాష. భీమ. ౧. ౧౫.

౨. పలుకుబడి.

గీ. ఆపురాణంబు గనఁ దెనుఁ గయ్యెనేని,జెప్ప నేర్చినకవియుఁ బ్రసిద్ధుఁడేని, దెనుఁగునుడి కారమున మించు గనియెనేని, గుందనము కమ్మ వలచినచంద మగును. జై. భా. ౧. ౧౯.

విణ. సరసమైనది.

చ...అ,తనిమదికి న్భవద్భలవితానము చీమల చాలుఁబోలె న్నైకనఁబడు నీవు పల్కునుడి కారపుమాటల కెల్ల నాతఁ డా,డును విరసం పుఁబల్కులు గడు న్నతి మోసము వచ్చు న త్తఱిన్. శుక. ౩. ౩౯౦.

నుడివిల్లు. వి. (నుడి+విల్లు.) - మాటవరుసను విల్లు, వింటితో పోల్పఁబడునది - కనుబొమ.

సీ. నుదుట గ్రక్కడరిన నుడివిల్లు గదియించు నుడిసి ముత్తరఁగలు గదలుకొనఁగ. కు.సం. ౫. ౫౭౦. 'నుసువిల్లు' ము ద్రి.

నుడుగు(వు)=నొడుగు.స.క్రి. (క. నుడిసు,)౧. వచించు, చెప్పు.

క. నుడిగి రహస్యోక్తులు దా,నుడిగి ద్భగంచల నిబద్ధయుసమణిమంజ,ర్యుడురాణ్ముఖిగుణ వై ఖరి, పడధిపశేఖరునితోఁ బ్రవీణతఁబలికెన్. బహు. ౫. ౯౯.

గీ. వానిసౌశీల్యగతి నుడువంగ నౌనె, కవుల కైనను మానిపుంగవులకైన. ఇందు. ౪. ౧౮.

ద్వి. చేరి నీ కొకమాటఁ జెప్ప వచ్చితిని, నోరు గా చెవ నన్ను నుడువుదు నీవు. ద్వి.పారిజా. ఉ. ౧౦౩౭ షం. నీలా. ౧౫౦౧.

౨. సంభాషించు, మాటలాడు.

చ...మూర్కొన వావిలి దన్ను వంశములం,బు నుడువ గోఁగు నై తరుణి పూచు నురద్రుమ మన్ని పూవులన్. పారి. ౪. ౧౦.

సీ. చెలి కానిధ ర్గంబుఁ జెఱుపఁ గాంక్షత్సుఁ దేఁగ తిఁ బూసె నని ప్రవగణము నుడువ. ఉ. రా. ౧. ౯౫.

౩. జపించు, జపముచేయు.

సీ.మదనాహితునినామమంత్రంబు నుడుగువాఁ డొడికంపుఁబాములఁ దొడుగువాఁడు.భల్లా. ౨. (శి. ర.)

౪. నేర్పు, బోధించు.

గీ. కూలిఁ గొనునొజ్జ కాఁబోలు కోదమచిలుక, తపసిబుడుతలగమికి వేదంబు నుడువు. కువ ల. ౨. ౭౩.

౫. చదువు, పఠించు.

క. మేలుగ సాయంప్రాతః,కాలంబుల హోమ విధులఁ గావించుచు నే,వేళన్ వేదము ను డువున,లోలాత్ముం డుండు బ్రహ్మలోకము నందున్. కాళ్ళా వి. ౩. ౭౦.

వి.=నుడి. ౧. మాట, పలుకు.

క. ఉడుపతిమకుటుండు చెవుల నొనరనినుడు గుల్, నొడివిన...భీమ. ౨.౧౫౪.

వ...ఒక్కొక్కకడం గడవరానితమచేడియల జెడంగునుడుగుల నడుగు లామడలు గా వచ్చి...వసు. ౪. ౨౩.

మధ్యాక్కర. నుడువులుం జేయు నింకేల యి ప్పాటినోములుం తొల్లి, కడఁగి నోఁచితిని గాకేమి యనుచును గంటె డెందమున. భా ర. ఆది. ౪. ౧౦౨.

౨. లోకోక్తి, నానుడి.

క...కామకస్య కుతో లజ్జా యనెడునుడువు వినిమనుమయ్యెన్. రసిక. ౩. ౧౧౩.

జః నుడుగు ఱేఁడు, నుడుగుల చెలి, నుడుగువాలు, నుడువరి, నుడువరితనము, నుడువులననఁబోఁడి, నుడువులపడఁతుక, నుడువుల ఱేఁడు.

నుడుగుఱేఁడు=నుడువుల ఱేఁడు. వి. (√నుడుగు.) బృహస్పతి, గీర్పతి.

సీ. అరయ వేల్పుల కెల్ల నయగారనం బగునుడుగు ఱేనికిఁ గూర్చి కొడుకుఁగుఱ్ఱ. యయా. ౩. ౩౧.

నుడుగులచెలి. వి. (√నుడుగు.) సరస్వతి.

సీ. జగముల మాఁటిపై జంగఁ జాచినదాఁగ నుడుగులచెలిమామయడుగుఁ జెమరు. యయా. ౨. ౪౪.

నుడుగువాలు. వి. (√నుడుగు.) -గీర్వాణుఁడు- దేవత.

సీ. నుడుగువాల్గమిమైల గడుగువారి మెఱుంగు లుడుగువాఱనిప్రేలిమడుఁగువాఁడ. ప్రబంధ. ౨౧౩.

నుడువరి. విణ. (నుడువు+అరిక్ప్ర.) మాటలమారి, వాచాలుఁడు. (చూ. నుడువరితనము.)

నుడువరితనము. వి. (నుడువరి+తనము.) వాచాలత.

ద్వి. వడుగు చేసిన భక్తి వట్టిపాటుగునె, నుడువరితనమునఁ గడవ నాడెదవు. బస. పు. ౧. ౪౫౪ పం. (శ. ర. పా. "నొడువరితనము" ముద్రి. పా.)

నుడువులననఁబోఁడి. వి. (√నుడువు.) సరస్వతి, వాగ్దేవి.

సీ. నుడువులననఁబోఁడి జడియకు మని వెన్నునుఱచుప్రాణేశు తిప్పవడి చూచె. దశా. ౨. ౫౫.

నుడువులపడఁతుక. వి. (√నుడువు.) వాగ్దేవి, సరస్వతి.

క. పడియెడుశలలఁ బ జేతులు, సదరించులకోరిక నులు నన్నన్న నెటిక్, నుడువులపడఁతుక కైనక్, దడవులనిడుపనిక్షైనఁ దరమే యెన్నక్. అచ్చ. రా. యు. ౫౫౦.

నుడువులఱేఁడు=నుడుగుఱేఁడు.

గీ. వానిచెలువంబు నుడువుల ఱేనికైనఁ, బూనిదిటముగ వాక్రువ్వఁబోల దెందు. నీలా. ౨. ౭౨.

నుతము. సం. విణ. (అ.ఆ.అ.) నుతింపఁబడినది, పొగడఁబడినది.

నుతి. సం. వి. ఇ. స్త్రీ. స్తోత్రము, పొగడిక.

నుతి(యి)ంచు. సం. స. క్రి. పొగడు, కొనియాడు.

సీ. పరమేష్ఠియంచ యీగిరికొలంకులయంచపిండులోఁ దప్పినపిల్ల యొక్కొ... గీ. యని నుతించుచు...మార్క. ౧. ౯౩.

ద్వి. ఆ దంపతులు సొంపు లాత్త రెట్టింప,మోదించి కరములు మోడ్చి నుతించి. ద్వి. పరమ. ౩. ౧౩౨ పం.

సీ. రతినైపుణము చూచి నుతియించువిధమున మణిమయకాంచికింకిణులు మొరయ. వరాహ. ౪. ౧౩౨.

నుతిక(కె). వి. ౧. తెగ, ముత్తము. (శ.ర.) ౨. దళము, దండు. (బ్రౌ.)

ద్వి. నూఱేసిగుఱ్ఱాలనుతికెల రెండు,పొఁజులుగాఁ జేసి పదిలంబు చేసి. పల్నాటివీరచరిత్ర. ౬౦. (బ్రౌ.)

నుత్తము. సం=నున్నము.

నుత్యము. సం. విణ. (అ.ఆ.అ.) నుతింపఁదగినది.

నుదత్. సం. శత్రు. ౧. ప్రేరించుచున్న. ౨. తొలఁగించుచున్న.

నుదమానము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. ప్రే

రించుచున్నది. ౨. తొలఁగించుచున్నది.

నుదము, సం. విణ. (అ. ఆ.అ - సమాసాంతము సందే-ఉదా:-తమోనుదము మొ.) ౧. తొలఁగించునది, పోఁగొట్టునది. ౨. ప్రేరించునది.

నుదుటికన్ను. వి. (√నుదురు.) ఫాలాక్షము, శివునిలలాటనేత్రము.

ఆ. నుదుటికంటిమంట చదలంటి పర్వుచుఁగల సితరతరంబ కప్పికొనఁగ.కు.సం.౧౦.౩౭౧.

నుదురు. వి. దే. నొసలు, ఫాలము.

ద్వి. రాఘవుబంటు శౌర్యం బింత చెడక, గదఁ బుచ్చుకొని మహాకాయుని ప్రేసె, నుదురు భగ్నము గాఁగ...రం.రా.యు. ౩౪౪ పొ. ౨౪ పం.

సీ. వదనంబుకొమరు భావనఁజేసి వేఱుగా నుదుటిపెం పలకలఁ బొదువఁబడఁగ. భార. విరా. ౧. ౨౨౮.

క. చదురునకు బ్రహ్మ వ్రాసిన,నుదుటిలిపులు దుడువఁ గలదె నూల్కొనువెరపుల్.హరి.ఉ. ౯. ౨౯. (బ్రహ్మవ్రాసిననుదుటిలిపి=కర్మఫలము.)

చ. హరిదవధిక్షమారమణు లాతురగాళినుదుళ్లపట్టముల్, తరువులరాయసంబులవిధంబునఁ గన్గొని శ్వేతమానవేశ్వరునకుఁ దెచ్చి యిచ్చిన నువస్తుపరంపరలెక్కఁ గూడునె, స్వారసులరీతిఁ దత్సవనవీతిఖురాంకము లుండు సుర్వరన్. వరాహ. ౧౨. ౬౦.

నుదుట వ్రాసినవ్రాత=కర్మఫలము.

(వ్యవ.)నుదుట వ్రాసినవ్రాత నూరేళ్లు చింతించినను తప్పదు.

నుదురంటు=నమస్కరించు.

ఉ. తప్పు లెఱుంగలేక దురితంబులు సేసితి నంటి నీవు మా,యప్పవు గావు మంటి నిఁక నన్యులకున్ నుదురంట నంటి...

జ: నుదుటికన్ను.

నుద్యమాన ము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. ప్రేరింపఁబడుచున్నది. ౨.తొలఁగింపఁబడుచున్నది.

నును. విణ. (త. నుణి- నునుపుశబ్దము కడవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. వృత్తియందు హల్లు పరమగునపుడు దీనికడపటియచ్చు వికల్పముగ లోపించును.)

౧. నున్ననిది, స్నిగ్ధము.

ఉ...నీరజనాభుఁడు నిండుఁగౌఁగిటం, జేరిచి బుజ్జగించి నునుఁజెక్కుల జాలుకొనంగ జాలుకన్నీరు కరంబునం దుడిచి... పారి. ౧. ౧౩౪.

క. నునుఁగులు తరుమనాసలు, మినుమిను కనుకన్నుదోయి మిహిరుండనవుం, దనువుం గల రొకమీనము,తనయుంజలిఁ దవుల నృపుఁడు దకము న్విడిచెన్. దశా. ౧. ౧౩౧.

ఉ...ఫుల్లకేసరమునందువసింపఁగ నెక్కునాలి నున్, పద్మమునం దసారతమరందసరస్వర విందగోష్ఠికిన్, వెగ్గలమాడుతేంట్లు మరు వింటికిఁ బూని గుణద్వయత్వమున్. ఆము. ౫. ౧౨౨.

౨. మెత్తనిది, మృదులము.

చ...కెంపు మీ,అిననునుఁబట్టుఁజేలఁ గటి తింగులువాఱఁగఁ గట్టి...పార. ౩. ౬౯.

వ... రంభాదిమదుద్రంభోరువుల కలికినునుసోఁగపలుకులకలకలంబునఁ గొలకొలమనువాతు తాగారంబు సొత్తెంచి. మను చ. ౫. ౩౫. పార. ౪. ౧౨.

౩. లేఁత.

సీ. నునుఁదీవె నురపొన్నఁ బెనఁగొన్నఁ గనుఁగొని ప్రాణేశుఁ గౌఁగిలింపఁగఁ దలంచు. ... ౩. ౧౪.

సీ. తనుఁ గొండె యని వచ్చునునుజింకఁ గుచ
ముగారుడశిలాసరదూర్వ లిడి మరల్చె.
వసు. ౫. ౧౫. (నునుజింక = బాలకురం
గము.)

చ. నునుఁజిగురాకు మేయుతతి నోరికెలంకులఁ
జేఁటి గుట్టినన్. మనుచ. ౩. ౭౨.

౪. అల్పమైనది.

సీ. నునునవ్వు నవ్వ నోపనిమృదుస్వన లిటువ
లె నట్టహాసముల్ సలుపు బెట్లు. వరాహ.
౧౧. ౯౫.

క. తలిరులతుదఁ జినుకులు జల, జల వడిశుఁగఁ
దడిసి మెలఁగుచలికరువలిను, న్బ్రలపమున వి
రియుపరువపుఁ, దొలుమొగడలవలపు దెలుపు
తోఁటులలోనన్. పారి. ౬. ౧౦౩.

౫. స్నిగ్ధము, గాటము.

ఉ. ఎక్కడనుండి వచ్చెఁ దర శేక్షణకు న్నును
సిగ్గుదొంతరల్. విజ. వి. ౧. ౧౦౪.

౬. మనోహరమైనది, చక్కనిది.

ఉ. గోపిక వ్రజంబునునుఁగూఁతకుఁ దుమ్మెద
పిండు మ్రోఁతకున్. దశకు. ౫. ౩౩.

గీ. అలకతిమిరంబు తనుఁ గప్ప నమభయమున,
ముఖసుధాసూతి నునువెల్గులికిఁ గూర్చి,
సవదరించినసింగిణిచాయ నొసలి, వంకచూ
పునఁ దగఁ గటివంకబొమలు. పాండు. ౨.
౪౬.

చ... చంద్రురునునుసోఁగవెన్నెలలతోఁ దుల
దూఁగెడుతద్గుణంబులన్. నైష. ౧. ౪౯.

నునుఁదల=నున్ననితల, వెండ్రుకలూడిపోయినతల.

సీ. తులసీదళాంకితతుచ్ఛశిఖాపుచ్ఛ మలవడ
నునుఁదలనంటి మొంద. భా. రా. ఆర. ౨. ౭౨.

నునుమీనుమనుమఁడు=వ్యాసుఁడు.

సీ. నునుమీనుమనుమనినుడిపంట ప్రాయు మేల్
దంటఁగన్న తుపానిబంటువాఁడ. ప్రబంధ.
౨౧౪. ప్రబంధ. ౪.

నును వాఁడి=మెత్తనిపదను.

సీ. జలితఁపుగుబ్బలఁ జట్టి చూడవెకాని నును
వాఁడిగోరున నొక్క రాదు. దశా. ౨. ౩౧౧.

నునుపరి. విణ. (నునుపు + అరి౩.) నునుపుకలది.
(శ. ర. బ్రౌ.)

నునుపారు=నున్పారు. (√నునుపు.) (చూ. నుం
పారు.)

నునుపు(న్పు)=నుంపు. విణ. (క. నుణుపు, నుణ్పు.
త. నునుణ్పు.) ౧. నున్ననిది, స్నిగ్ధమైనది.

చ. నును పగుపచ్చపట్టుఁనఁ గనుంగొన నొప్పగ
దిండు గట్టి ... హరి. పూ. ౫. ౧౪౯.

చ. నునుపుగఁ జందనం బలఁది... ఒకకోమలి
వచ్చె గిరీశుఁ గన్గొనన్. కు. సం. ౭. ౬౯.

ఉ. వాలిక లంబుజాక్షములు వంకలు భ్రూలత
లంద డెందముల్, చాలఁగ నున్పు లంద...
పాంచాలునకైనఁ గాంతల నిజం బిది యిట్టిది
నాఁగఁ జాలునే కు. సం. ౭. ౧౬౯. ఆం.
భా. ౨. ౨౬౨.

౨. మనోహరము.

క. నును పగునలి గానము విని, వనదేవత గరము
మెచ్చి... కు. సం. ౪. ౪౬౨.

వి. ౧. నున్నన, స్నిగ్ధత్వము.

వ... నారికేళపూగావళీకోమలపలాశద్రోణికల
నునుపు గలపొరలరొరల శిరధితరఁగలమీఁ
దనుంబోలె గిటికొని ... మనుచ. ౩. ౨౭.

౨. సొగసు, మనోహరత.

క. యత్నమునఁ దెలియ నన్నియు, రత్నాకరు
ఖ్యాతి దుస్తరం బగు విద్యా, రత్నము గవితా
తత్త్వము, నూత్నముగా నందుఁ గలుగునును
న్గతిఁగితివే. ద్వా. ౪. ౧౭౫.

గీ. నునుపు దళుకొత్తఁ బలుకులు నుడువవేమి.
నీలా. ౨. ౭౭.

నునుపరి, నునుపారు.

నుసువు. వి. కుమ్మరి కుండలపై వ్రాసెడిచిత్రవిశేషము.

గీ. తీర్చిపూదెలు కులుకులు త్రేటగట్లు, బొద్దుటీనెలు నుసువులుమొదలు గాఁగఁ, బసులు నిరించుఁగుండలపైనతండు. హంస. ౫. ౧౩. (ప్రాఁత తాళపత్ర ప్రతుల పా. 'నుసుపులు'. క్రొత్త ప్రతి, బ్రౌ. పా.)

నున్న = నున్నన. విణ. (త. నుఱ్ఱై. దీనికి క గ్రంథారయంబున నిగాగమము బహుళము.) ౧. నును పైనది, స్నిగ్ధము; ఎచ్చుతగ్గులు లేనిది.

సీ. కురులు నున్నగఁ దువ్వి కొప్పుఁ బెట్టిననీటు గనుఁగొన్న మోహాంధకార మొదవు. ఉ. రా. ౪. ౧౯౩. దశా. ౪. ౫౭.

చ ... చెందిరకాచికోఅలుం, దుమికిఫలంబు చందమున నున్ననియాదలమీఁదిపచ్చిగం, దము ... పార. ౧. ౧౫. (పెండ్రుకలు లేనిది అని భావము.)

గీ. రాలి యున్నపువ్వు ప్రకరము విదిర్చి, చెన్నుగా నున్న సేసినసెజ్జ యనఁగ, వేగుటయుఁ జుక్క లన్నియు విరిసి విశద, భాతిఁ జెలువొందెఁ జూడ నంబరతలంబు. భార. విరా. ౨. ౨౩౯.

౨. మృదువైనది, మెత్తనిది.

రగడ. పడఁతి వెనుకకొమ్మ చించెఁ బట్టుపట్టు నున్నచేల, మడఁతి పొగడ పొన్నతో సమానమా వగంగ సేల. వరాహ. ౩. ౯౨.

గీ. కిట్టుఁజెప్పులు దొడి నున్నగట్టితెడుపు, లెల మితోఁ గట్టి ... హరి. పూ. ౫. ౨౫౨.

వ ... అమ్మదాంధగంధసింధురంబు ... తుండం బెత్తి నున్ననియప్పువ్వుదండ గ్రమ్మనఁ గ్రమ్మరించి విసరి ... పార. ౬. ౧౬.

౩. సన్నము.

సీ. కమలమండము నున్నగాఁ జేసి యిరుసుగాఁ గావించి... నిగ. ౨. ౯౪.

౪. అల్పము. (చూ. నున్నగాలి.)

౫. చక్కనిది, మనోహరమైనది.

సీ. మలదాయ దనున్న మలపుగీల్పులు దిండిపెటరాపతిమ కాలి పెంచె సుమర. చంద్రా. ౨. ౩౬.

౬. సుఖకరమైనది.

ఉ. లాలితనీలనీలకచ ంగాలి యగటంచు సువర్ణడోలికాం, దోళనకేళనంబులను నున్ననినిద్దురసోలగింప నా, బాలికఁ బాడుచుండఁదురు పాటలగంధులు జోలపాటలన్. విప్ర. ౨. ౩౮.

వి. ౧. నున్ననిఱుముక. (శ. ర.) ౨. నున్నఁదనము, స్నిగ్ధత.

సీ... తేట నున్నన నున్న తెలివి నునుపు. గీ. నిద్దమన స్నిగ్ధత కసంగు... సాం. ని. స్థా. ౬౦.

జః నున్నఁదనము, నున్నగాలి, నున్నన.

నున్నఁదనము. వి. (√నున్న.) మెత్తన.

ఉ. నున్నఁదనంబుగా నలుఁగు నూఱియుఁ జందన మట్లు రాచియుం, బన్నగఁ గ్రొత్తలైన కలశంబులు గూర్చియు ... భార. విరా. ౨. ౨౧.

నున్నగాలి. వి. (నున్న + గాలి.) మందమారుతము.

చ... నున్నగాలికి నెల వైనపువ్వుఁబొదలే పొద లే పులకింప నేల మిన్నక రుులసాగ నాగ...ప్రియుఁ డప్పుడువిశ్వనాథుక, య్యాదఁ జనవచ్చు వచ్చుమరునమ్ములు వమ్ములు చేసె దంతటన్. కావ్యా. ౨. ౬౩.

నున్నన = నున్న. విణ. నున్ననిది, స్నిగ్ధము.

గీ. నునుపు నున్నన నిద్దము నున్నని దన, స్నిగ్ధనామంబు లెలఁగును జిక్కణరూప. ఆం. నా. ౫౨.

మ. ఉడుమార్గం బఖిలంబు నున్న నయి శాణో
త్తేజనం బొంది పు, ల్కాడుగంబడ్డ నిశాతఖడ్గ
ముక్రియం గన్పట్టె నప్పట్టునన్. హర. ౨.
౨౫.

మ...ఉద్భటా, చలకూటోపలకోటి రూపు చెడ
నిచ్చల్ రాయఁగా నైన మొక్కలు భూ
కాంతకు నున్ననయ్యె...మనుచ. ౧. ౩౫.
ఉ. రా. ౫. ౨౮౭.

వి. నున్నఁదనము, స్నిగ్ధత.

సీ...తేట నున్నన నున్న తెలివి నునుపు. గీ.నిద్ద
మన స్నిగ్ధత కెసంగు...సాం.ని. స్థా.౬౦.

నున్నము. సం. విణ. (అ.ఆ. అ.) ౧. త్రోయఁ
బడినది, తొలఁగింపఁబడినది. ౨. ప్రేరింపఁబడి
నది, ప్రేరితము.

నుయ్యి(యి)= నూయి. వి. కూపము,బావి.(దీనికి
ప్రథమైకవచన మందే ప్రయోగము.)

ఆ. ఒకనిపొలములోన నొకఁడు ధర్మార్థంబు, కొ
లను బావి నుయ్యి గ్రొచ్చుచోట, నడిగి చే
యవలయు నొడయందుఁ జేనికి హాని దేక
యున్న నాఁగఁ దగదు.విజ్ఞా. వ్యవ. ౧౫౧.

శా. అంతర్వాణికు శేశయద్యుమణిఁ బద్ధాక్షుఁడై
మది స్నిల్పి దుర్దాంతానంతభవాంధకూప
తరణప్రార్థిన్ దృఢస్థేమఁ బాటించు శ్వద్దలు
తద్ద నమ్మి నుయి దాఁటేవానికిన్ జింతయూ,
కంతైనం గడ మేనియుం గడమ కాదా
యంచు నూహించుచున్. పాండు. ౮.
౨౩౫.

సా:- ముందటు నుయ్యి వెనుక గొయ్యి. (ఎటు
చూచినను ఆపదయే అనిభావము.)

చ...అతఁ డప్పుడు ముందటు నుయ్యి వెన్క
లోఁ,తగుగొయి యున్నలా గయినఁ దల్లడ
మందె వణంకు మేనితోన్. విక్ర. ౩.౭౧.

నురనుర. వి. నురుఁగుల ధ్వని కనుకరణము.

సీ. నురుఁగులు నురనుర పొరఁగి బోరున జాలి
గుడికొంచుఁ గిఱ్ఱన నడయసూతులు. ఉ.
హరిశ్చ. ౨. ౧౨౬.

నురుఁగు= నురువు. వి. (త. నురై. దీనిని చి. ని.
నిరనుస్వారముగా గ్రహించెను. నిర్ధారక ప్ర
యోగములు గానరావు. ఇంకను విచార్యము.)
ఫేనము.

సీ. కలకంఠిలోచనంబులు గండుమీలు కుసు
మగంధివిమలహాసము నురుంగు. రా.జ.వి.
౧. ౭౮. (శ.ర. పా. 'హాసములునురుఁగు,
లు'... అని ముద్రి.పా.)

సీ...పరఁగు ఫేనము నుర్వు నురుఁగనఁగ.ఆం.
భా. ౧. ౧౫౮.

సీ.కొడుకు రాఁగలఁ డంచుఁ గడుఁ బొంగువా
హినీవరుని యూర్ముల మించు నురుఁ గనంగ.
ఉ. రా. ౮. ౧౬౦.

జః నురుఁగుకొను, నురుఁగుదబ్బ.

నురుఁగుకొను. అ. క్రి. (√నురుఁగు.) నురుఁగు
కట్టు.

వ...లాలావినిర్యాసంబులు పెలవుల నురుఁగు
కొన...కవిక. ౫. ౧౧౦.

నురుఁగుదబ్బ. వి. (√నురుఁగు.) కడుపులో కు
డిప్రక్క నుండు మాంసఖండవిశేషము, కారి
జము, కాలఖండము. (శ. ర.)

నురువు(ర్వు)=నురుఁగు. వి. సముద్రాదులఫేన
ము, డిండీరము.

క. నురువున నొనరించినపం,జరంబులో నున్న
పులుఁగుచాడ్పున మేనం, బురువవర జీవ
ముండుట, పరికింపక యేమఱంగఁ బాడియె
నీకున్. భార. శాం. ౬. ౨౨౩.

ఆ. పెక్కు లయ్యు నీటిబొబ్బిళికల్ నురువులు,
విరియునట్లు లిందు విరియుఁ జాలె. భార.

ఆది. ౭. ౪౩.

శ్లో. బిభీషికా వై గంధర్వ నాస్త్రైస్తు ప్రయుజ్యతే, అస్త్రేషు ప్రయుక్తేషు ఫేనవత్ప్రవిలీయతే. సం. భార. ఆది. ౧౭౬. ౨౩.

౨. పశ్వాదులనోటినుండి వెడలుఫేనము.

వ... మొదవులనోరినురువులుం బెరస్యలశేణం బులును... హరి. పూ. ౫. ౧౪౨.

౩. కొన్నిఫలములనుండి వచ్చుఫేనపచ్ఛిళ మగు ద్రవము.

గీ... కుంకుడుపండ్లనురుదనరంగ, బలసబనిపాం డురాంబుదపంక్తు లమరె. ఆము. ౪. ౧౫౩

క. అనురువుఁ జూచి కృష్ణుం, డానఁగ రాసట్టి కినుక నతిఁడ్వయి కెంపులూన మడిఁజలిలోప లి, కేనెపమున వచ్చెనిట్టియెంగిలి దలఁపన్. చిత్రభా. ౫. ౧౯. కేయూర. ౪. ౩౫.

సీ. కొమరొందు తెలినుర్వు లుమిదయుకక్లలు గాఁగ నెఱయసల్ జీరాడునెఱులు గాఁగ. అచ్చ. రా. కిష్కిం. ౬౬.

నుర్గాడు=నుగ్గాడు. అ. క్రి. (నుగ్గ + అడు.) నుగ్గగు.

శా. భగ్నం డంతకవాహినుల్ శరహతిన్ భంజించున బ్లెమ్మెయిన్, దగ్గంగా రథపత్త్రముల్ విఱుగవేదండాంకురానీకముల్, నుర్గాడన్ భటకోరకంబు లడరన్ నూత్నాశ్వపుష్పౌఘముల్, మర్గింతున్ బరసైన్యపద్మవనముం మద్బాణవర్షంబునన్. కు. సం. ౧౧. ౬౦౪.

స. క్రి. నుగ్గుచేయు. (చూ. నుగ్గాడు.)

నుర్గు(ఱుగు)=నుగ్గు. (క. నుర్గు. త. నుఱుగ్గు.) (చూర్ణము, పొడి.)

క. నుర్గై విశ్వేశ్వరుదోఃర్గళహతిఁ జన్నరిపుల నగు వినుతింపన్, స్వర్ణ...

నిర్గళదంబుపులచేత నిగ్గలు లగుటన్. కావ్యా. ౩. ౩౯.

ఇః నుగ్గాడు.

నుఱిచియాడు=నూఱుచు. స. క్రి. (√నుఱుచు.) సంహరించు.

సీ. ఆమేటి తనదుసైన్యమును బద్ధవ్యూహభంగిఁ జూపట్టంగఁ బన్ని హాతిక్రగప్రహారప్రవర్తనలచేఁ బీకాకుపఱుచుచుఁ గడుఁ జొచ్చి నుఱిచిగాడు, పీరకుంజరుఁ డగద్వినుతవిక్రము... రాఘవ. ౪. ౧౪౨.

నుఱిపిడి=నూఱిపిడి, నూర్పు, నూర్పిడి, నూఱుపుడు. వి. (√నూఱుపు.) ధాన్యముమొ. వానిని కాళ్లు మొదలగువానితోఁ ద్రొక్కి నలుపుట.

వ... నుఱిపిడిగం జొచ్చినప్రబలహాలికునిలీల నేలం బెట్టి కాలం జమరి చంపి పొంపిరివోవు రుగంటిమిం జేసి యార్చిన... భార. ద్రో. ౩. ౨౬౮.

నుఱుచు=నూఱుపు, నూఱుచు. స. క్రి. (త. నూఱు, పెరుక్కు.) ౧. (ధాన్యాదికమును కాళ్లు మొ. వానితో) త్రొక్కి నలుపు, నలఁగఁగొట్టు.

గీ. కాఁచి యొక్కనిఁ జేరితో వైచి యొకని, గ్రుద్ధి యొక్కని పిడికిటఁ గ్రుమ్మి యొకని, నుఱిచి యొక్కని మెడ నొక్కి విఱిచి యొకని, వాత్మజుంబునఁ దెగటార్చె వాలిగురను. రామా. ౬. ౨౧౨.

గీ... లోభియైనపుకల, నుస్పృతవిక్రయము నుఱిచి దరూన్నపు మధిప. మార్క. ౨. ౧౦౦.

(తారకాసురుఁడు.) సీ. గరుడోరగామరతరుణుల నందఱఁ జెకొనితనవిలాసినులఁ జేసె. ఆ. వేదవిహితవృత్తి విప్రుల నుఱిచె ...కు. సం. ౪. ౩౬౩.

౨. నశింపఁజేయు.

సీ. కరిసింహశార్దూలశరభాదిమృగముల నగ్గ నూచంబుగా నుఱుచునవియు. కళా. ౬. ౯.

సీ. పఱప కే లున్నవి పరభృతశ్రేణులు శ్రుతు లలోఁ దమపల్కు-నూదు లెల్ల, నుఱుప కే లున్నవి సైతియ ధైర్యంబును గందంపుమల కోడెగాడ్పుగములు. ప్రభా. ౫. ౧౩౪.

జ: నుఱిచియాడు, నుఱిపిడి, నుఱుపు.

నుఱుపు=నుఱుచు. (√నుఱుచు.) ౧. (ధాన్యాదిక మును కాళ్లు మొ. వానితోఁ ద్రొక్కి-) నలుపు, నలఁగఁజేయు.

గీ. నుఱిపి తూర్పెత్తి కడలకు బిఱుసు దిగిచి, గండ్రలుగఁ జేసి రాశి పొంకముగ నిలిపి. శివధ. ౫. ౯.

౨. ధ్వంసముచేయు.

సీ. శస్త్రభూషణసముచ్చయములు నుఱుపంగఁ గడలొత్తువలుఁద క్రేంకారములును. హరి. ఉ. ౩. ౨౦౯.

వ...గజంబులఁ బఱిపియు గాత్రంబు నుఱిపి యు ... భాగ. ౬. ౩౩౦.

౩. ఖండించు, నఱకు.

లయవిభాతి. తఱిమి వెస రక్కసుల వెఱచఱ వఁ బట్టుకొని, పఱిపఱిగ ప్రేవలలు నుఱిపి యు వలీలన్. భా. రా. యు. ౧౪౩౩.

౪. చంపు, వధించు.

సీ. నీళ్లుల కేటిలోనికి డిగ్గఁగాఁ బెద్దతఱిపి పె య్యలఁ బట్టి నుఱిపె నేఁడు. హరి. పూ. ౬. ౯.

నుఱుమాడు=నఱుమాడు. స. క్రి. (నుఱుము + ఆడు.) ౧. పొడిచేయు; త్రవ్వు.

ఉ. కొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ ను ఱుమాడు నిట్టు ల, య్యన్నిటి నయ్యులూకము రయం బెసఁగన్ వధియించె భూవరా. భార. సౌ. ౧. ౧౯.

సీ. దేవపూజావిపర్ది కలకై లంఘించి గోరిజల నుఱుమాడఁ గొంతపడవు. పరాహ. ౧౧. ౩౬. (ధ్వంసముచేయు అని భావము.)

౨. సంహరించు, చంపు.

ఉ. వారనియల్కతోఁ గినిసి వారిజనాభుఁడు వారిసైన్యముల్, మారిమసంగినట్లు నుఱు మాడినఁ బీనుఁగుఁబెంటలై వెసం, దెరలు వ్రాలె నశ్వములు ద్రెళ్లె... భాగ. ౧౦ ఉ. ౫౧౯.

సీ. చక్కాడె నుఱుమాడెఁ జాఁగఁ ఱలాడెను ...గీ. అడఁచెఁ జెండె ననంగఁ బొందగు వ ధించె, ననుటకు సమాఖ్యలై ... ఆం. భా. ౩. ౧౨౩.

౩. ఖండించు, ముక్కలుచేయు.

సీ. వెస అంపమున నిడ్డవసిగఁ గొన్నిటి నిను మంతలుగా నుఱుమాడి యాడి. భార. విరా. ౫. ౩౫.

చ...న, న్ననుపుఁడు వానిఁ బట్టి నుఱుమాడెద నొద్దికఁ జెల్లఁజేసెదన్. కుచల. ౨. ౭౧.

చ...కొ, మ్మలు నుఱుమాడి కుంజము లమందగ తిన్ వెసఁ ద్రెంచి పాదపం, బుల వెస వేళ్ల తోఁ బెఱికి ... భా. రా. సుం. ౩౩౩.

నుఱుము=నఱుము. స. క్రి. ౧. పొడిచేయు.

మ. కడికండంబులు చేసెదన్ నుఱిమెదన్ ఖం డించెదన్ మించెదన్. వీర. ౪. ౬౫.

౨. బాధించు.

కళిక. పఱిమి తఱిమి చఱిమి నుఱుమఁనవ్ర గ ల్పినవితకరికి. అప్ప. ౪. ౩౨౩.

౩. చంపు.

సీ. దక్షుఁడు దూషింపఁ దత్క్షణంబునఁ గొట్టి నుఱుముటు దలఁచిన వెఱపు రాదొ. పార్వ. ౪. ౧౦౯.

[illegible]

చ... తన్నికటద్రుమవల్లు లెల్ల జర్జరితము లయ్యె
నిష్ఠురవిశాలశిలల్ నుఱు మయ్యె నయ్యె
డన్. భార. ఆది. ౬. ౨౯౭.

గీ. నుఱుము నుగ్గు పొడుము పొడి నురుము సు
న్నిచూ రసంగను విలసిల్లుఁ జూర్ణ మభవ.
ఆం. భా. ౨. ౨౨౦.

క. అతిముఱి సంగము లెల్లను, నుఱుముగ ని
ట్టుడరునర్జునునియముల కున్, వెఱచఱచి సూ
తపుత్త్రుఁడు,పఱచె... భార. విరా. ౫. ౧౦౮.
అచ్చ. రా. యు. ౧౩౧.

జ: నుఱుమాడు, నుఱుముచేయు.

నుఱుముచే(సే)యు = నఱుముచేయు. స. క్రి. (నుఱుము + చేయు.) ౧. సంహరించు, చంపు.

సీ... నుఱుముచేసె. గీ. నడఁచెఁ జెండె ననంగఁ
బొందగు వధించె ననుటకు సమాఖ్యలై...
ఆం. భా. ౩. ౧౨౩.

ఉ. వాతసుతుండు ముట్టికొని వారి బడల్పడ
వ్రేసి యందఱం, జేతులతీఁట వో నుఱుము
సేసె విశృంఖలవిక్రమంబునన్. భార. విరా.
౩. ౨౮.

గీ. మఱియుఁ బే రగుతులుఁగల నుఱుము సేసి.
నీలా. ౧. ౩.

౨. పొడిచేయు, పిండిచేయు.

క. మును గైదువులం బోరిగొని, చని జోళ్లను
నుఱుముసేసి సర్వాంగములం, గొని వ్రచ్చ
రాముశరము ... భా. రా. అర. ౧. ౨౦౩.

సీ. ఉర్వీధరంబు లొండొంటితోఁ దాఁకించి
నుఱుముసేతు సమామనోవసంత. చెన్న.
౫. ౧౮౦.

నులక(లుక). వి. (√నులుచు-క. నులికె.) త్వక్సూత్రము, నారతో పేనినదారము.

సీ... చెలఁగుఁ ద్వక్సూత్రంబు నులక యనఁగ.
ఆం. భా. ౨. ౨౯౪.

ద్వి. ప్రకటింప వేయునులకత్రాళ్లు గూడి, యొ
కమ్రాను పరె సభ్యుఁ డొకఁ డైన వలదె.
పండితా. వాద. ౧౪౬ పొ.

సీ. పరఁగ నుల్కలు గూఁబు బండిమోకులఁ
గాదు ... నీతి. ౭౦.

ఉ... భద్రగజేంద్రము నుల్కత్రాళ్లచే, నోముని
నాథ కట్టుపడి యుండునె... భోజరా. ౪.
౨౦౩.

జ: నులకమంచము.

నులక(లుక)మంచము. వి. (√నులక. క. నులి మంచ.) నులకతో నేసిన మంచము.

ఆ. మలిన మైన నేఁత పలుచ నైనను నల్లుఁబున్న
నుల్కమంచ ముప్ప దొడ్డ్రు. ౫. పు ౪. ౨౧౫.

నులకశయ్య. మి. వి. నులకమంచము.

మ. అహహ బ్రహ్మము వారయే నులకశయ్యం
బ్రెళ్లి నిద్రింతురో. శివరా. ౩. ౯.

నులి. వి. (√నులియు-౩. నులి.) చిక్కు, ములిక.

గీ. నెరులు గలమునునీలంపుటురులసిరుల, నరులు
గొనఁ జాలి నరులను మరులు గొలిపి, యిరు
లు గెలిచిన తుమ్మెదగణాలఁ దెగడు, కురుల
నులి దీర్చి విరులిడి కొప్పు వెట్టి. భాగ. ౧౦.
ఉ. ౨౪౨.

సీ. కౌస్తుభోజ్జ్వలపదకంబునఁ జెనఁగొన్న హార
హారమునులి చక్కఁజేసి. హరి. పూ. ౫. ౯.

శా. తారాప్రోష్ఠులఁ గాలనూతుఁడు వియద్వా
రాశి వేటాడి ప్రాణ్ణరంభం బనుబుట్టఁ బె
ట్టి నులి వాయుం గుంజి యూఁ దాఱఁ జె,
న్నారన్ వైచినబాలమో యనఁగ శోభాకిం
చనత్వంబునన్, దారానాయకమండలం బ
మరు నస్తగ్రావకూటంబునన్. కాశీ. ౪. ౫౬.
ప్రభా. ౨. ౯౨.

ఖణ=నులి. ౧. అల్పము, చిన్నది.

సీ. బలుగోడలఁ బొసంగు నులిపచ్చపగడంపుబా రుదూలంబులవార మాను, పులుదిండితాకం బనుఁలగరిమంబు ... ఉ. రా. ౫. ౧౨౩.

౨. మెలి పడినది, మెలికలు కలది.

ద్వి. పులిగోరు సేవళంబులు నంద మైన, నులి కడియంబులు నూపురంబులును. నవ. ౪. ౧౮౬ పొ. ౩౨ పం.

నులించు = నులుచు, నులుపు. స. క్రి. (√నులియు. శ. ర. చి. ని.) నులి యఁజేయు, నులుపు.

ఉ. తానును దైత్యులావునకుఁ దద్దయు నొచ్చు చుఁ బేర్చి దేవకీసూనుఁడు కొమ్ము లూఁది మెడ స్రుక్కఁగ నెత్తి నులించి త్రిప్పి వే వే నెటఁ దప్పఁ ద్రోచుటయు...హరి. పూ. ౭. ౫౦.

నులికొ(గొ)మ్మ(ల)మెకము. వి. (√నులి.) ఇత్తి, మఁగజింక.

సీ. నులికొమ్ముమెక మన వెలయుఁ గృష్ణమృ గంబు... సాం. ని. తిర్య. ౩౪.

క. నులిగొమ్ములమెక మిఱ్ఱన నిలమృగమన కొ ప్పఁ బేళ్లు...ఆం. సం. తిర్య. ౬.

నులిగాయ. వి. (నులి + కాయ.) దృష్టిదోషము గాలిసోకు మొదలగునవి కలుగకుండుటకు చం టిపిల్లలకును పురుటాండ్రకును గట్టెడి కాయ, దిష్టిపూస.

గీ. త్రాట నులిగాయఁ గూర్చి పాదములఁ గట్టు, నుప్పు వేఁపాకు పైఁ జల్లు నిప్పు లతివ, ద్రిప్పి యిడు దృష్టిదోషంబు దీఱ వీథి, బ్రేమ మీ అంగ బిడ్డలఁ బెంచునపుడు. కాశీ. ౪. ౧౧.

ద్వి. పసిఁడి చే కుచ్చెత్తుపగిది వీడెమునఁ, బొసఁగి నిగ్గులు దేఱుపుక్కిటిత్రోడ, నులిగాయ లెడ ను గాసుఁగ గింజమోవి, నులిచినపేరు చన్ను లతిమీఁద బెళఁక. అ. మ. క. ౧. ౨౬ పొ. ౨౦ పం.

నులిగొను. అ. క్రి. (నులి + కొను.) ౧. చిక్కుపడు, మెలికపడు.

సీ. నులిగొన్న చెలఁదిపుర్వులనూలివల్లు నా నమ రెడుముడుతకన్బొమలవలన. గీ. భావజుఁడు వెల్లిపోయినపాడు మేడ, పగిదిఁ గాన్పించు కు దుసులిపడఁతి యొకతె. కళా. ౩. ౭౩.

సీ. దట్టమై నులిగొన్నయట్టిపందిరిద్రాక్షతీవ లిం దెవ్వరో త్రెంచినారు. శుక. ౧. ౨౭౩.

౨. వలయితమగు, చుట్టుకొనఁబడినదగు.

క. పెనగొనె గితికొనియెను...నులిగొనె నన నాఖ్య లగును. వలయితమయ్యె ననుట కును...ఆం. శే. ౬౩.

నులిగొల్పు. స. క్రి. (√నులిగొను.) మెలివెట్టు.

ద్వి. ముదురుజుంజుఱుమీసముల నులిగొల్పి. ద్వి. హరిశ్చ. పూ. ౨౦౬౨ పం.

సీ. నులిగొల్పి పావడఁ దలజుట్టి నొకయింతి నెమ్మేనిలేడి యొత్తె కొమ్మ యొకతె. చంద్రా. ౬. ౭.

నులిజెముడు. వి. (√నులి.) వృక్షవిశేషము, చిన్న జెముడు.

సీ...నల్లేరు నులిజెము డాకుజెముడు. హంస. ౪. ౧౦.

నులితడ. వి. మహాబల.

గీ...గూబతడ నులితడ, యన మహాబల దనరు వృషాధిరూఢ. ఆం. భా. ౨. ౫౬.

నులిపచ్చి. విణ. (√నులి.) కొంచెముతడిసినది.

ద్వి. పసుపడ నులిపచ్చిపయ్యెదకొంగు, మొనల నానినకుచముల నొప్పు దాని. ద్వి. పరమ. ౪. ౨౯౨ పొ.

నులిప(వ)డు. అ. క్రి. (√నులి.) ౧. దోఁపుడుపడు.

ఆ. దోఁపువోయె ననుట దోఁచు నులిపడె న, నంగ...ఆం. భా. ౩. ౧౧౬.



౨. మెలిపడు.

రగడ. మగువ పలువ ఱం దిగిచి చూచుట మానుమా కలినడిరొ దండలు. పారి. ౪. ౧౭.
గీ. సాలపుసదస్సులఁ గొనలు నులివడంగ,...జత్తురు వేఁజాతికొమిరె లెపుడు. ప్రబంధ. ౧౫. కవు. ౫. ౧౭౦.

నులిపురుగు. వి. (నులి + పురుగు.) కడుపులో పుట్టుచిన్నపురుగు. (బ్రౌ.)
(వ్యవ.) వాయువిళంగములరసము త్రాగినచో కడుపులోని నులిపురుగులు పోవును.

నులిబిల్ల. వి. (√నులి.) చిన్నదయినయొకజాతి నీటిపురుగు, జలచరవిశేషము.
సీ. నులిబిల్ల యొఱబిల్లపురుగు గోఁదురుకప్ప... రొండ్రకాయ జలగ. హంస. ౪. ౧౭౭.
('నులిగుల్ల' ప్రాఁతప్రతిపా.)

నులియచంకె. వి. వృక్షవిశేషము.
సీ... తలపిడు చబ్బెంద నులియచంకె. హంస. ౪. ౧౦. (ప్రాఁత ప్రతిపా.)

నులియు= నలియు. అ. క్రి. ౧. పొడియగు.
వ... మిడియుప్రేగ్గును నలియుకన్నులును నులియు వెన్నులును జడియుచెక్కులును ... చంద్రా. ౭. ౯౩.
౨. (అలయిక మొ. వానిచే) చలించు, అల్లాడు; వడఁకు.
క. అంగంబులు నులియఁగను, నుంగే సురిగే (ఒయ్యరి) యుటుంచు నొకనిమిషము నో,రం గాయ వేయ కేడ్చుచు, నంగీకృతబాల్యచేష్ట నతఁడట్లుండన్. పరమ. ౧. ౧౨౫.
చ. కులుకు లెసంగ నబ్బురపుగుబ్బలు గుబ్బతిలంగ మేనిచాయలు చిలుకంగఁ గొను నులియంగ మెంగముసఁ గ్రమ్మి చెమటల్, జిలిబిలి పొంగఁ బొందళుకుఁజేలమెఱుం గడరంగఁ గంకణావళి గలుగల్లనంగఁ బఱవం గమకించె లతాంగి సిగ్గునన్. క[illegible]. ౩. ౫[illegible].

జ: నులక, నులి, నులించు, నులిగాయ, నులిగొను, నులిగొల్పు, నులికొముడు, నులిచచ్చు, నులిపడు, నులిపురుగు, నులిబిల్ల, నులివంక, నులివాడు, నులివు, నులివెచ్చ, నులివెట్టు, నులివేఁడి, నులుపు, నులుము, నులుసు.

నులివంక. వి. (నులి + వంక.) ౧. కొంచెము వంకర.
సీ. కళలయిక్కువ లంటి గళముల సందిళ్లఁ గ్రొవ్వాడినులివంక గోరు లుంచి. ఘటికా. ౨. ౧౧౭.
౨. పల్లకిబొంగుయొక్క దోషవిశేషము.
వ... నులివంక యగ్గిసోఁకుడు ... నీలధవళరక్తహరిద్వర్ణంబులు మొదలుగాఁ గలదుర్గుణంబులు లేక ... ప్రబంధ. ౭౦౫.

నులివాడు=ఉలివాడు[1]. అ. క్రి. (నులి + వాడు.) కొంచెముగా వాడు.
సీ. నులివాడునాఁచువల్లుల గొంతో గర్చి లేఁబొలవల్పుగాలి చే పోక యొదిగి. ఆము. ౨. ౫౩.
నులివాళ్లువాడు=కొంచెము వాడు.
క. నులివాళ్లువాడుచున్నవి, లలిత మహోత్పల తేహాలతికలు మనకుఁ, జలకేళి యనుచిత మనవుడు, నెలఁతుక కిట్టనిరి చెలులు నిపుణత మెఱయన్. విక్ర. ౫. ౩౮.

నులివు[1]. వి. (√నులియు.) ౧. నులియుట. (శ. ర.) ౨. ఆభరణవిశేషము.
ద్వి... చంద్రాస్య యొప్పార, తనకేలినులిమధ్యమునఁ బొంకించి, యరుదెంచి... ద్వి. పరమ. ౫. ౪౪౧ పా.

నులివు[2]. వి. విధము, రీతి.
ద్వి ... వాఁడు నారీతి నొండు, నుడువనేరక మూఁగనులివున నున్న. ద్వి. పరమ. ౨. ౧౨౩ పా.

నులివెచ్చ. విశే. (√నులి.) కదుష్ణము, కొంచెము వెచ్చనిది.

చ. తెలినులివెచ్చ యోగిరముఁ దియ్యనిచారులుఁ దిమ్మనంబులున్. ఆము. ౧. ౭౧.

సీ. విరహులమై సోఁకి వేఁడి యౌ వెన్నెలఁ బచ్చివెన్నెల నులివెచ్చఁ జేసి. పారి. ౨. ౪౯.

ఆ... కదుమ్మనామ, మలయు గోరువెచ్చ నులివెచ్చ తనివెచ్చ, యన... ఆం. భా. ౧. ౭౩. చంద్రా. ౨. ౩.

నులివెట్టు. స. క్రి. (√నులి.) ౧. మెలివెట్టు.

చ. అన విని నవ్వి యవ్వికసితాంబుజలోచన పైటకొంగు కేలున నులివెట్టుచుం దళుకుఁ దళుక్కనఁ జూపులఁ జూచి... శుక. ౨. ౪౬౯.

సీ. తోఁక నూరక మేను సోఁకఁగ నులివెట్టు వెడ వెడ నాలుక వెడలఁ బెట్టు. భాగ. ౧౦. ఉ. ౫౪౪.

౨. గ్రుచ్చు.

మ. ధర గంపింప మహాసభాభవనరత్నస్తంభ సంభూతుఁడై, కరజంబుల్ నులివెట్టి రక్తకణము ల్గాఁగ వీక్షించి రౌద్రరసద్రోణిక లో యటంచు విబుధవ్రాతంబు వర్ణింప శ్రీ, హరి రక్షోభుజమధ్యమండలము చెండాడెన్ నృసింహాకృతిన్. వరాహ. ౭. ౭౯.

నులివేఁడి. విణ. (√నులి.) కొంచెము వెచ్చనిది.

ద్వి. గుడిగుడిక్ క్రన్నీరు గ్రుక్కుచు నొండు, నుదువ నాలుక రాక నులివేఁడియూర్పు, లం దంద నిగుడ... ద్వి. హరిశ్చం. ఉ. ౧౩౭పం.

చ... ఓరి మనుజాధమ నిచ్చలుఁ దెచ్చువంటకం, బును నులివేఁడికూరలు నపూపములున్ గొని రా కహంకృతిన్. విక్ర. ౫. ౭౧౯.

నులివేఁడియెండన్=సంధ్యాసమయమున.

సీ. ఎచ్చోట నులివేఁడియెండఁ బండులు రాలి పూపొర్కు కదనంబు బోసివడియె. భీమ. ౩. ౩౭.

నులుచు(ల్చు)=నులించు, నులుపు. (√నులియు.) స. క్రి. నులియఁజేయు.

౧. నలుపు, పినుకు.

సీ. భవసంగక నటంచుఁ దలదువ్వి ముడిచిన ముదుపులా యని ముడ్డి మూతి నులుచు. శుక. ౨. ౧౧౫.

సీ. ఉపదర్భి పెండె నుల్చి యూపంబుతోఁ గట్టి ...కు. సం. ౨. ౨౦౦.

౨. సంహరించు, నశింపఁజేయు.

సీ. గర్గులకాదులుకావించె ముగియించె నులిచెను...గీ. వధించె, వసుటుదు నమాఖ్యలు ...ఆం. భా. ౩. ౧౨౩.

గీ. వామనుఁడవై బలీంద్రుగర్వంబు చెఱిచి, భార్గవుఁడవై సమస్తభూపతుల నులిచి, రాఘవుఁడవై దశాస్యువక్త్రములు డులిచి, నిలిచినాఁడవు నీమాయఁ దెలియ వశమె. వరాహ. ౧. ౫౨.

౩. మెలివేయు, మెలివెట్టు.

క. వైరమున నులిచి త్రెంపక, కారాకులు దుల్లినట్లు కరము తెల్లం, దార పెడఁబాయవలయుట, సారకృపం దెలియఁ జెప్పె శౌరి యతనికిన్. భార. భీష్మ. ౧. ౨౦౪.

చ... మేరువు న్విఱుగఁ ద్రోచెద శేషుని బట్టి నుల్చెదన్, వనజభవాండముల్ పగులవైచెద దాఁటెద నేడుదీవులన్. భా. రా. కిష్కిం. ౭౧౯.

సీ. మొలకచ్చకట్టుపై మలఁగినపచ్చనినుసు కొంగు దిండుగా నులిచి చుట్టి. హరి. పూ. ౪. ౧౩. దశకు. ౨. ౪౩.

నులుపు(ల్పు)=నులించు, నులుచు. స. క్రి. (√నులుచు.) నలుపు, నలఁగఁగొట్టు.

వ... అక్కుండలికయనుండు... రాక్షసుల గుండెలన్ బగిలించుచు... శిరంబుల విదలించుచు భూమణంబుల నులుపుచు దూమణంబుల సలుపుచు... ఉ. రా. ౨. ౯౧.

౨. సన్నాగము, సన్నగడ.

కా...నేర్పుల్ పచరించి బొంకిన నెఱుఁగక రాదె యీనుల్పు వీఁడే నిక్కం బగు కన్న గాఁడని ధరిత్రీ శాస్త్రగణ్యం డనక.విప్ర. ౫. ౬౨.

నులుము. స. క్రి. (√నలుచు.) ౧. నులిపెట్టు, కండను రెండువ్రేళ్లతోఁ బట్టి యిటునటు త్రిప్పు.

వ...ఉరవడిఁ గొమ్ముల మొదల నులిమియుఁ దొడలు విఱిచియు...నీలా. ౩. ౪౮.

సీ. ధూర్జటి నే మని దూషించితి వటంచుఁ బువ్వుఁబోణి యొకర్తు బుగ్గ నులిమె.పార్వ. ౪. ౧౨౧. కళా. ౪. ౪౧.

౨. నలుపుకొను.

సీ. కాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు వెడలుకన్నీటితో వెగచువాని. భాగ. ౧౦. పూ. ౩౪౨.

౩. గట్టిగా నొక్కు, పిసుకు.

(వ్యవ.) దొంగలు దారిలో వానిని గొంతు నులిమి చంపినారు.

౪. (ఇతరులనుండి) బలవంతముగ లాగు, ఒడిసి పుచ్చుకొను.

క. అని మరుబాములఁ బడలే,నని కైదువు దుస్సి దాఁటునాయితముబలెక, బెనఁగుసలయుతి యచే నుర్వి,యను నులిమి బలిమి విడిపించి యను నసురక్త్రిక. సారంగ. ౨. ౨౩౫.

వ...ప్రమథగణంబులచేత నచ్చక్రంబు నులిమి తెప్పించి తదనంతరంబ...వీర. ౪. ౧౪౬.

౫. ఉన్మూలించు, పెల్లగించు; నాశముచేయు.

సీ. బలిమి వాసవుచెట్టు నులిమి వాకిటఁ బెట్టుక లిమివాలుగఁ గంటిచెలిమివాని. చంద్రా. ౧. ౭౪

సీ. బంధనంబులఁ బటాపంచలు గావించు నోల యూనాపదలను నులిమి వైచు.సీతారా. ౧. ౬౩.

౬. విడుచు.

సీ.అన నప్పు డెన్నిక నమర...

భీష్ముఁ డనుశంక నులిమివైచి, పలుకుఁబంతము మీఱ...రాఘవ. ౪. ౫౩.

౪. వధించు, చంపు.

సీ...నుగ్గాడె, బరిమార్చె నులిమెను దెగటార్చె జదిపెఁ బుల్పైను సదనుద మొనర్చె...గీ. అడఁచెఁ జెండె సనంగఁ బొదగు వధించె, ననుటకు సమాఖ్య లై...ఆం.భా. ౩.౧౨౩.

నులుసు. వి. (√నులియు.) లోపము, మిగులు.
(న్యూనత అని శ. ర. నిష్ఫలము అని ప్రా.)

తరలము. నలినలోచన...నమ్ము గావుము భీతులక,నులుసు లేక ఫలించె నోచిననోము లెల్లను నీవ య్యె. భాగ. ౧౦. పూ. ౧౩౦.

నుల్లింద. వి. ఒకానొకచెట్టు.

వ...మఱియును బెదపిచ్చి చినపిచ్చి నల్లిందను ల్లింద యిప్ప కప్పురమద్ది...పి.శపం.౨.౧౪.

నువత్. సం. శత్ర. నుతించుచున్న.

నువ్వు(వు)=నూవు.వి.సస్యవిశేషము,తిలసస్యము (దీని భేదములు అడవినువ్వు, పెద్దనువ్వు. అని శ. ర.)

ఆ. నువ్వుఁబువ్వు నవ్వు జవ్వనినాసిక...విజ. ౨. ౧.౭౪.

వ...నువ్వుమష్వంబును...భీమ. ౩. ౫౪.

సీ. ఎడ లేదు నువుగింజ యుడఁగ సప్తద్వీపములయందు యూపముల్ పొదలుకతన. నీలా. ౨. ౧౬.

౨. ధాన్యవిశేషము.

ఆ. నూనె లేనిదివ్వె నువ్వుల మండునా,విశ్వదాభిరామ...వేమన. ౧. ౩౭౦.

ఆ. ఘటము గాన్గఁ జేసి కగణ మొద్దుగఁ జేసి,త విలి కర్తములను నువులఁ జేసి, తెలిసి గాను గాఁడు తిలకారుఁడాత్తయు,విశ్వ...వేమన. ౨. ౨౪౫.

సా: నాల్కపై నువ్వుగింజ నానదు. (మాట దాఁగదని భావము.)

గీ. నాల్కపై నువ్వు గింజైన నానదట్టి, యారివే రంపుఁజెపని కయ్యంపుఁగడుపుఁ, గూడుగాఁ జేసి మెలఁగెడుకోడిగీఁడు, మదురచదువుల బాపనముద్దుపట్టి. చిత్ర. భా. ౫. ౪౫.

జః నువ్వుచేను.

నువ్వుచేను. వి. (నువ్వు + చేను.) తిల్యము, నువ్వులుపండుచేను.

గీ...నువ్వుచే నననఁగఁ దిల్యమనుచు... ఆం. భా. ౨. ౨౭.

నుసము. వి. కసరు.

ద్వి. బలవంత మగుకడి ప్రాణేశుఁ బాపఁ, బలవంతఁ జెందినవరవధూమణికి... పూఁబొదరిండ్ల, క్రంతలు వంతలు కమనీ కుసరసి, బిసములు నుసములు పృథుమకరంద, రసములు విసములు... ద్వి. హరిశ్చ. పూ. ౨౫౨౩ పం.

నుసలు. అ. క్రి. ౧. కదలు, మెదలు.

ద్వి. చాల నీతని తుల్కి సత్యంబుకొఱకు, నూలిపోఁగునఁ జిక్కి నుసల కున్నాఁడు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౨౬ పం.

౨. ఏమఱు, ప్రమాదమొందు.

ద్వి. నుడితప్పు వ్రాతప్పు నుసలక సత్య, మెడలింపఁ గనిపట్టు నెపుడుఁ గౌశికుఁడు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౪ పం.

ద్వి. విసిగినఁ గసిగిన పెడ నిద్ర నొంది, నుసలిన మసలిన నొప్పిఁ జెప్పినను. ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౪౨ పం.

౩. పూను, యత్నించు.

క. మగువలు మగలని యెఱుఁగఁడు, మృగముల కోరసిలఁ డేమి మిడిమేల మితం, డగపడుననితలఁచితి మే, నుఁగుఁ గంబంబునకుఁ దివియ నుసలితిమి సుమీ. రామా. ౨. ౧౧౩. (శ. ర. చి. ని. పా. 'నుసిలితిమి' ముద్రి.)

౪. ఆడితప్పు.

ఉ. నొడివినంతవట్టు నుసలక యిచ్చునో... కట్టు విష్ణుఁ డేఁటిమాట. భాగ. ౭. ౫౯౪.

స. క్రి. పట్టుకొను, గ్రహించు.

మ. పెసరుంగాయకు మెత్తకన్నులకునై పేటాడుమమన్నొక్కొలక్, నుసలం జూచుచు దోసచేల్ చెఱకుచాల్ నుగ్గాడుచున్... రా. వి. ౨. ౬౫.

నుసి. వి. (త. నొచి.) ౧. పురుగులు తొలువఁగా రాలుమ్రానిపొడి.

చ...అప్పడఁతుకభ్రూలతాధనువు పట్టి మనోభవుఁ డింతనుండియున్, విడుచునకాని మానఁడిది నిక్కము వట్టిదకీటజుష్టమై, యుడుగక కమ్మధూళినుసి యొల్కుచునున్న పురాణచాపమున్. నైష. ౫. ౧౨.

క. ఘుణగణవివరణఁ జివికిన, మణిధనువునఁ దొరఁగునుసిసమానములై దర్పణనిభ నభమునఁ బరిణతి, శణకణహారిణములు పాండుజలదము లాలసెన్. ఆము. ౪. ౧౪౧.

౨. నిగులు, కట్టెలు మొదలగునవి కాల్చుటచే కలిగినబూడిద.

(వ్యవ.) కట్టెలు కాలి నుసి అయిపోయినవి.

విణ. నుసి పట్టినది, ప్రాఁతది.

ఉ. చూచి రఘూద్వహుండు నెఱజోదులు వేలకొలంది యెత్తలే, రేచి బలాఢ్యు లయ్యు నిపు డీనుసివి ల్లాకపెద్దకొండగాఁ, జూచెద రెల్లవారు నది కూలికిఁ గా కిట నాకు లక్ష్యమే. రామా. ౪. ౭౭.

నుసిపురుగు. వి. (√నుసిక. క. నుసిహుఱు. మ. నుచ్చుపుఱు.) ఘుణము, మ్రాను తొలిచి నుసి రాల్చెడిపురుగు. (శ. ర, బ్రౌ.)

నుసుఁగు. అ. క్రి. తొలఁగు, అపసరిల్లు.

గీ. అన్నృశంసుఁడు నుసుఁగు వైఖానసులకు, నా దురాత్ముండు శ్రోత్రియు నపహసించు, నాళ్లుఁడు సోమయాజి నిరాకరించు, నక్కురా

తుఁ డనుప్రాత ధిక్కరించు. శైవ. ౬. ౧౩౦.

ఉ. పంది నుసింగిపోయిన నృపాలకనూజుఁడు సిన్నవోయి ... విక్ర. ౩. ౬౩. (చి. ని. పా. 'మొఱంగిపోయిన'. ముద్రి. పా.)

**నుసుమ.** వి. ఎండకాలమున కన్నులందు ముసరెడు చిన్నదోమ. (శ. ర, బ్రౌ.)

**నుసుము.** స. క్రి. ఆకర్షించు, లాగు.

వ...చరణాంగుళిదంశికలం బట్టి నుసిమిన మిట్టిపడి యిట్టట్టు గదలనేరక...వసు. ౪. ౨౩.

**నుసులు.** అ. క్రి. (త. నొసివు.) ౧. కదలు, చలించు.

గీ. మధుఁడు సారంగధరుఁడు మన్మథుఁడు విధుఁడు, వసులపాఁతర లై వీరు నుసులనీయ, రెటుల నిటు తాళఁగల దని యెఱుఁగ నైతి. సారంగ. ౨. ౧౨౯.

ద్వి. రసికుండ వేనియు వస దక్క యాత్మనుసిలిన మటి మీఁద నోరెత్తఁగలవె. పండితా. పురా. ౧౧౪ పా.

౨. (ఒడలు) విఱుచుకొను.

చ...నిద్ర చేఁ గసరినయట్లు మత్కరము గబ్బిచనుంగవపైకిఁ దార్చి పైపై, నుసులుచు నీవిజార్చినమనోహరలీలల నెన్న శక్యమే. కళా. ౪. ౯౨.

౩. ఒదుఁగు, ముడిఁగియుండు.

చ. వెరవున నంగముల్ నుసుల వ్రేటులు వమ్ముగఁ దాఁకినప్డు దిక్కరిరదనప్రహారములఁ గంపము నొందక యుండు మేదినీధరములఁ బోల్పఁ బట్టగునుదగ్రపుమూర్తుల...భార. శల్య. ౧. ౧౭౯.

మ. గద లన్యోన్యసమాహతిఁ మిడుఁగుఱుల్ గ్రక్కంగ సారించుచుం, గదియం బాయఁగ వ్రేటు దప్ప నుసులంగా నేర్పు లంగంబులం, దొదవన్ ఘోరపరస్పరప్రహతు లత్యుగ్రంబుగా నెత్తురుల్, పెదవింపం బదళబ్ధహుంకృతులు దిక్కీమంబులం ...

భార. ద్రో. ౧. ౧౭౫.

స. క్రి. నులుము, నలుపు.

గీ. చంద్రరేఖయు ముఖకాంతి సడలి కనులు, నుసులుకొంచును మేల్కాంచి నుసలఁ జొచ్చె. చంద్ర. వి. ౩. ౧౩౫.

వి. ౧. చలించుట, వెనుదీయుట. (లాఘవము. అని శ. ర.)

వ...నుసులు లేక మానంబు ధనంబునవు ధనంబుగా ధనంబునం గార్చిర్చునం గమిరిన యట్లు రూపు సెడి సీనుంగు పెంట లగుచోట్ల శరంబులు రాలినను శిరంబులు వంపక...ఉ. హరి. ౩. ౭౦.

౨. (త. నుసుల్.) ఒదుఁగుట, ముడుచుకొనుట.

వ...అవ్వడముడి పుడమి మీనివెడఁదయురంబు పలక్షించి లాఘవస్ఫారంబుగ గదాదండంబుఁ ద్రిప్పి పైవ నాతం డది మునినుసులునం దప్పింప నది యిల చలింపంబడిన నన్నుసులు తెలిపిన యుక్తికి యద్భుతవేగుండగు నవ్వాయుపుత్రుండు గద పుచ్చుకొని తిరుగుసందున దుర్యోధనుండు...భార. శల్య. ౨. ౨౯౩.

జః నుసులుకొను.

**నుసులుకొ(ల్కొ)ను.** అ. క్రి. (నుసులు + కొను. స్వార్థమున.) పొదలు, దొరలు.

సీ. కుహనాకిటికి లక్ష్మికుచకుంభములమీఁదికుంకుమంబున నుసుల్కొనఁగఁ గూడె. భీమ. ౧. ౩౪.

## నూ

**నూ.** వృత్తియందు నూవుశబ్దముయొక్కలుప్తశేషము. (చూ. నూఁబువ్వు, నూఁబప్పు.)

**నూఁక.** వి. త. నూక్కం. వృక్షవిశేషము. (శ. ర.)

**నూఁకు=ఊఁకు.** వి. పూనిక, యత్నము.

సీ. చిలుతనూఁకుల నింగి జీర్వాణగేహావప్రముల నిచ్చెన లేక ప్రాఁకిప్రాఁకి. శుక. ౧. ౧౨౦.

నూఁగా(గుటా)రు. వి. (√నూఁగు.) రోమావళి.

ఉ. అరమణీలలామ నవయౌవనసంపద నివ్వటిల్ల శృంగారరసంపుబొమ్మ యనఁగా వలిచన్నులఁ జిన్ని మోము నూఁగారుఁ గృశోదరంబు నలకావలియుం బొలుపొందఁగా దర స్మేర కటాక్షము ల్వ్రాలయఁ జెచ్చెర వచ్చె నిజేశుపాలికిన్. వా. రా. ౫. ౧౭౭.

సీ...నూఁగారు నా నలరు రోమ, రాజి ... ఆం. భా. ౨. ౧౪౬.

సీ. కరికుంభమధ్యసంఘటితనీలాంకుశం బనఁగ గుచంబుల నూఁగుటారు మెఱయ. బలిర కతివేల్పుశతకము. (చి. ని.)

సీ. కమలోద్భవమూర్తి సుముఖంబు భరియింప వారిలీల నూఁగుటా రతిశయింప. ఇందు.౨. ౧౯౧.

నూఁగు=నూఁగుడు. వి. ౧. ఆకులు కాయలు తీఁగలు వడ్లు మొదలగువానిమీఁద బయలుదేఱు చిన్నచిన్న ముండ్లవలె నుండు సూక్ష్మరయవసమూహము. (దీనియామ్రేడితరూపము నూనూఁగు,నూఁగునూఁగు.)

ఉదా: దూలగొండినూఁగు, దోసనూఁగు, ధాన్యపునూఁగు, బెండనూఁగు మొ.

సీ. తాఁగరాయంచలు నూఁగారఁ బెరిఁగిన బిసములు తమపాలఁ బెట్టికొనఁగ.కవి. ౨.౭౦.

ఉ. సమ్మదవారి గన్గడల జాలుగ మై గరుపాఱ నిండుబింబమ్మున దృష్టి నిల్పి పయిఁ బ్రాఁకు మరీచుల నూఁగునూఁగులేఁ,గొమ్మలు వట్టఁ జంచుపుటకోటిఁ గదల్చి తెమల్చికొంచు శాఖ్యమ్మ విహంగమ మ్మయినయాకృతి నొందెఁ జకోర మొక్కెడన్. నిర్వ. ౬. ౫౧.

౨. అప్పుడే క్రొత్తగా బయలుదేఱురోమము, రోమాంకురము.

సీ. పెడపెడ నూఁగారివింతయై యేర్పడుచేరనివ ళుళలో నారునిగుడ.భార.విరా.౧.౭౪౫.

వీణ. లేఁతది.

సీ. నూనూఁగుమీసాలనూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి. కాశీ. ౧. ౭.

సీ. కలికిసింగారంపు మొలకలోయన ముఖాబ్జమున నూనూఁగుమీసములు తనర.దశా.౮.౫౧౨.

నూఁగునూఁగు(బ్రా)యము=నూత్నయౌవనము.

క. తొడరియుఁ దొడరనిసిగ్గునఁ, బొడమి యుఁ బొడమనియురోజములఁ జాపలమున్, విడిచియు విడువనినడపులఁ,బడఁతుకపై నూఁగునూఁగు(బ్రా)యం బయ్యెన్. కవిక. ౩.౧౦.

జ: నూఁగారు,నూఁగుడు,నూఁగుదోస,నూదోస.

నూఁగుడు=నూఁగు.వి. (√నూఁగు.)

(ఆకులు, కాయలు వడ్లు మున్నగువానికి అంటియుండు సూక్ష్మరయవసమూహము.)

క. బ్రదికెడునంతకుఁ బురుషుఁడు, బ్రిదులక నిలువెల్ల వగలఁ బెనఁగొని యుండున్,గుదురకొని దూదినూఁగుడు,పొదివిన కార్పాసబీజమునకుం బ్రతియై.కవిక.౫.౧౧౮. (శ.ర. పా. 'దూదిమూఁగుడు' అని ముద్రి. పా.)

నూఁగుదోస=నూదోస. వి. (√నూఁగు.) కూఁతురుబుడమకి.

ఆ. పెల్లిపప్పు పొట్లు చిల్ల మూలము నూఁగుదోస ముద్దయుంగ మధూకజాతి, జీరకములు గాఁచి నీరంబు లియ్యఁగా,నెట్టి పైత్యములును మట్టుపడును. (చికి. చి. ని.)

నూఁబిండి. వి. (నూవు+పిండి.) నువ్వులపొడి.

సీ. ఉండ్రాళ్ళు నూఁబిండి పుండ్రేక్షులుం దేనె యనఁటిపండ్లు...హార. ౬. ౫౫.

నూఁబూవు. వి. (నూవు+పూవు.) తిలపుష్పము, నువ్వుఁబువ్వు.

వ...నూఁబూవువంటినాసికయు ... హార. ౩. ౨౩.

నూకలు. వి. (దే. నుక్కు.) తండులకణములు.

(నుగ్గు నూచగా= పొడిపొడిగా, మిక్కిలి పొడిగా అనిభావము.)

స్రగ్ధర. కూలుం గుత్తుంబు లేనుంగులు ధరఁ గడయుణ్ గుప్పలై నుగ్గునూచై, వ్రాలుణ్ దేరల్ ... భాగ. ౧౦ ఉ. ౨౨౦.

మ. సమయాంభోనిధిఁ జొచ్చి చండతరచంచద్వాల మల్లార్చుచుణ్, సమరోజ్జృంభితజంభశాసనభుజాస్తంభాగ్రదంభోళిదుర్దమశృంగంబున వేదచోరపురవప్రశ్రేణికల్ నుగ్గునూచము గాఁ డాఁకె సుధాశనాసహానరోషాగర్భనిర్భేదియై. దశా. ౧. ౨౬౪.

(భీముఁడు.) చ ... ఒక్కఁచే నొగల్, వెరవునఁ బట్టి తేరు ప్రజవిస్తయ మందఁగ వీచి వైచినణ్. ఆ. నుగ్గునూచమైన నగ్గురుఁ డొండొక,యరద మెక్కి యల్ల నరిగె సేన, మొగమునకు...భార. ద్రో. ౪. ౧౫౪, ౧౫౫.

క. అబ్బిత్తరికిం గన్నుల,పబ్బమ్ముగఁ జూచునపుడు ప్రమదంబునఁ బె,ల్లుబ్బెడుగబ్బిమె ఱుఁగుచ,న్నుబ్బులచే రవికె నుగ్గునూచములయ్యెణ్. రా. వి. ౩. ౧౩౦. (నుగ్గునూచములగు=ముక్కముక్కలగు నని భావము.)

నూటయెనిమిది. స. (నూఱు² + ఎనిమిది.) నూఱును ఎనిమిదియు, అష్టోత్తరశతము.

గీ. దివ్యములు నూటయెనిమిదితిరుపతులకుఁ,బరమపద మైనశ్రీసర్వపురమునందు. భీమ.౨. ౬౬.

నూటిడి. వి. (√నూవు.) నూవులతో చేసినభక్ష్యవిశేషము.

మ.ఉడువీథీహారినీలరత్నమయపాత్రోత్సంగభాగంబునం, గడుగారామున శేరుపాంకునకు నంకచ్ఛాయ యణ్ కమ్మనూ,టిడితోఁ గూడ సుధాంశుబింబ మమనేయిం బాయసాహారముం,గుడుపం బెట్టెనొ బంతికూళ్లకును జాళోరంబు లేపారఁగణ్. హై

నూతనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నవీనము, క్రొత్తది. ౨. వింత యైనది.

నూతము. సం=నుతము.

నూత్నము. సం= నూతనము.

నూదము. సం. వి. అ. పుం. తూదము, బ్రహ్మదారువు, గంగరావిచెట్టు.

నూదోస=నూఁగుదోస. ౧. నూఁగుదోసచెట్టు. (శ. ర.) ౨. రేణుకలుచెట్టు.

సీ...తెలియంగఁ దగును నూదోస రేణుకలు ... ఆం. భా. ౨. ౬౧.

క. నూదోసన రేణుక లగు...ఆం.పద.అచర. ౪౩.

నూనె(నియ). వి. (నూవు + నెయ్యి.త.నూవునెయ్.)

౧. నువ్వులచమురు, తైలము.

సీ. తైలాభిధానంబు దనరు నూనె యనంగ... ఆం. భా. ౨. ౨౫౭.

వ...ఆకులమోపున ౫౦ ఆకులు నూనెపె(ఱుక) వీసాలు ౨...ద. కా. ౪. ౯౩౫.

ఉ.సంపెఁగనూనె యంటె నొకచంద్రనిభానన కంసవైరికిణ్. పారి. ౨. ౭.

సీ. కమనీయగతిఁ దిలోత్తమ నేర్చుఁగాక నూనియ యంటు సెవ్వారు నేర్తు రనుచు. వసు. ౫. ౪౪.

సీ. అతఁడు తైలాభ్యంగ మడిగినఁ బతి గమ్మనూనియ దెప్పించి మేను శిరము, నభ్యక్తము లు సేయ...భార. అను. ౨. ౩౦౭.

౨. చమురుకలుగఁ జేసెడువిత్తులు కలచెట్టునకు పిదపవచ్చినపుడు చమురు అనునర్థ మిచ్చును.

ఉదా: కొబ్బరినూనె,ఆవనూనె,వేఁపనూనెమొ.

నూనెముంత. వి. (√నూనె.) గుచ్ఛబలచెట్టు.

గీ. నూనెముంత యనంగను నొప్పు గుచ్ఛ, బలయు. ఆం. భా. ౨. ౫౪.

నూనెముడి. వి. (√నూనె.) కీలుగంటు, జాఱుముడి.

సీ. నిడుదవేనలినూనెముడి వీడఁ జిగురాకుఁబోఁడిఁ దూఱుఁ గార్చిచ్చుఁ గడియుకరణి. మనుచ. ౩. ౩౧.

సీ. బెడఁగుఁ జూపెడునూనెముడి లోనుగా నంటఁగట్టినవానెనకట్టుతోడ. శుక. ౪. ౩౮.

గీ. కేశబంధవిశేషాఖ్య కేరుఁ గొప్పుముడి యన వెద యన నూనెముడి యన... ఆం. భా. ౨. ౧౪౫.

నూనెయగిసె. వి. (√నూనె.) నల్లగిసె, అతసి. (శ. ర.)

నూపురము. సం. వి. అ. పుం, న. మంజీరము, అందె.

నూయమానము. సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁబడుచున్నది.

నూయి=నుయ్యి, నుయి. వి. ఔ. కేఁదుడుబావి, కూపము. (బ. నూతులు.)

క. అనఘ యధర్మము ధర్మం, బనుమతిఁ బుట్టించుఁ దృణసమావృతమై ప్రచ్ఛన్నితలముచందమునఁ దోఁచిననూయింబోలె నూక్షిచిత్తతలేమిన్. భార. అను. ౫. ౪౦౯.

చ. నుతజలపూరితంబు లగునూతులు నూఱిటికంటె నూన్నత, వ్రత యొకబావి మేలు... భార. ఆది. ౪. ౬౩.

నూతఁబడెదొ పాతఁబడెదో=కష్టపడుదువా సుఖపడుదువా.

క. జడ లల్లుచుఁ జిన్నప్పుడె, పడఁతులు తను నూతఁబడెదొ పాతఁబడెదో, నుడువు మనుమాట నిజమై, పడె నూతనె యార నూఱుబార లనంగన్. సారంగ. ౩. ౨౨౨.

నూతికప్ప=కూపస్థమండూకము.

క. విను నూతికప్పవిధమున, నిను నీవ యొఱుంగు దెఱుఁగనేరవు గర్వం, బున నావలికొలఁది రణం, బున నొకఘటి నిల్వఁబడక పోనేర్తె

దసే. భార. ఉద్యో. ౪. ౧౯౫.

నూర్చినూతఁబోయు=నశింపఁజేయు.

ఆ. జ్ఞాతికులము నూర్చినూతఁబోయక సాదు, దెండ మించుకైన డిందుపడదు. ప్రబోధ. ౨. ౫౮.

నూర్గోనలపట్టెము. వి. (√నూఱు[2].) నూఱంచులకైదువు, వజ్రాయుధము.

వ... నూర్గోనలపట్టెంబు వట్టుకేల్వ్రేఁజలుపలన్ గట్టినగోపురంబు చూసి... ఉ. రా. ౩. ౨౨.

నూర్వ(ఱువు)రు=నూఱుగురు. స. (√నూఱు[1].) (నూఱునకుమహన్మహత్యార్థకరూపము.) శతసంఖ్య కలవారు.

సీ. అతనికి నూర్వురు సుతులు బుట్టిరాదు లుదయించి రఖిలభూవిదితతేజులు... భార. ఆది. ౩. ౮౦.

ఉ. నూఱుతూర్లు త్రావు సీఁతడు కనుం గొనునంతటిలో మనుష్యులన్, నూఱువు రైనఁ గాని తిన నోటికి నాఁటు దటంచుఁ గూర్పఁగా, నూఱువు రైరి కోఁటికి మనుష్యులు నీవునుఁ గూడ నింతటన్, నూఱును నిండె నిందఱిక నుగ్రహ మీశ్వరుఁడేమి సేయునో. శాళ. ౩. ౨౦౫.

నూర్వే(ఱువే)లు. స. (√నూఱు.) లక్ష.

క. పాడఁగన్నంత సేయును, నుడివినఁ బదిసేలు నగిన నూర్వేలు మనం, బోడఁబడి మెచ్చినఁ గోటియు, నడిగెడువారలకు నిచ్చు పాటకచయముల్. దాన్య. ౨. ౫౩.

నూఱంచులకైదువు. వి. (√నూఱు[2].) శతకోటి, వజ్రాయుధము.

ఉ. మించినపెన్నిరి సేరుమిడల మిన్నులుముట్టెనంగునట్టినా, ఱంచులకైదువున్ దృణకణాకృతియై చెడబాయఁ జేర్చి దర్పించినధీరచిత్తములు పెల్లు... నాఁటి కలంప నాక

మ్యాయంచితచారుచంచలకటాక్షము సమ్మిన
యస్త్ర మిమ్మెయిక్. నృసిం. ౨. ౪౭.

ఇట్లే: నూఱంచులవాలు. ఆం. శం. దేవ. ౧౨.

నూతాఱు(లు, ర్లు). స. (నూఱు² + ఆఱు².) అనేకము.

సీ. సంతలోఁ బ్రతి బిచ్చము లెత్తి నూతాఱు వగలజన్నిదములు వడికి వడికి. శుక. ౪. ౧౦౯.

క. హెచ్చినరాముని శరముల, నొచ్చినతరువాత గిరులు నూతార్లు వడక్, వచ్చునె జలధరము లపై, వచ్చుం బైపైన చెడ్డవారికిఁ జేటుల్. రామా. ౩. ౧౨౯.

నూఁటిపి(ర్పి)డి=నటిపిడి. (శ. ర. √నూఱుచు.)

నూఁటిపోయు. స. క్రి. (నూఱు¹ + పోయు.) పాఠము మొ. నాఁటునట్లు చెప్పు, బాగుగా బోధించు.

క. తనయులకును మనుమలకును, దననేరుపు నూఁటిపోసి తాల్చినసర్గం, బుపభరము వారిఁ బూనిచి, పని దీఱె విధాత యాసభం గొలువుండుక్. కవి. ౩. ౧౨.

నూఱు¹. స. క్రి. ౧. సన్నకిఁటిప్పై మర్దించు.

ఉ. నూఱక త్రావు నీకఁడు కనుంగొను వంతటి లో మనుష్యులక్. కాళ. ౩. ౨౦౫. ౪. ౧౩౭.

ఉ. ఇప్పుడు విశ్వభారమును గేలని నేల నిజాప్తకోటితో, నొప్పన సేసె దస్యునకు నూరక నూఱక త్రావువానికే. హా. స. ౩. ౧౪.

౨. రాచు, నలఁచు.

ఉ. సున్నఁదనంబుగా నలుఁగు నూఁటియుఁ జందన మట్లు రాచియుఁక్. భార. విరా. ౨. ౨౨౧.

౩. ఆయుధము మొ. వాడి యగుటకు ఱాతి మీఁద ఒరపెట్టు.

గీ. మదనుఁ డమ్ముల నూరెఱ హిమంబు పేరె. మనుచ. ౩. ౨౩.

చ... వేటకుక్, దురుసుగ మారుఁ డస్త్రముల నూరెఁ దమంబును పేరె దిక్కులక్. ఉ. రా. ౫. ౨౩౯.

సీ. జలమి గీపెట్టింతు మలుకఁ గోఱలు నూఁటి పైవచ్చుభూదారపతులనైన. హా. న. ౨. ౧౯.

జః నూఁటిపోయు.

నూఱు². స. ఔ. (క. నూఱు.) శతము, వంద.

చ. నతజలపూరితంబు లగు నూతులు నూఁటికంటె నూన్నృత, వ్రత మొకబావి మేలు... భార. ఆది. ౪. ౯౩.

సీ. మనకులం బాదిగా వనగోచరంబుల వేట చాటున నొక్కనూటిఁ జంపె. ద్వా. ౧. ౨౫౭.

ఉ...బాహువుల్, నూఱును జాఁచి పైకనిచి నూఱుశిరంబులు నూర్ధ్వదిక్కటుల్, దూఁటఁగఁ గాలనేమి రణదోహలియై కడఁగెక్ సముద్ధతిక్. హరి. పూ. ౪. ౧౪౪.

నూఱును నిండు=ఆయువుచెల్లు.

ఉ. నూఱును నిండె నిందఱ కను గ్రహ మిాశ్వరుఁ డేమి సేయునో. కాళ. ౩. ౨౦౫.

జః నూటయెనిమిది, నూర్గానలపట్టెము, నూర్వురు, నూర్వేలు, నూఱంచులకైదువు, నూతాఱు, నూఱుగురు.

నూఱుగు(గ్గు)రు. స. (√నూఱు².) నూఱుమంది, వందమంది.

వ...గంధర్వదేవమానవకన్యకలం బదాఱు వేలు న్నూఱుగురు నప్సరోగణంబు లేడింటిం జెఱ లుఁపట్టి...ఉ. హరి. ౧. ౭౪.

వ...పదుండ్రు నూర్గురు వేవురు లక్షకోటిసంఖ్యాకులం గూడుకొని...దశ. ౨. ౧౬౨.

నూఱుచు(ర్చు)=నుఱుచు.

(వ్యవ.) ఈవేళ మాపాలములో కుప్ప నూఱుచున్నాము.

(నలుఁగఁగొట్టు.)
ప్రబోధ. ౨. ౭౮.
జః నూలుపు, నూలిపిడి.

నూలుపు(ర్పు)=నులిపిడి. (క్రి.ర. √నూలుచు.)

నూలిగరసు. వి. ఇంద్రలుప్తకము, బట్టతల.
సీ...ఇంద్రలుప్తకం బగు నూలిగరసం చనఁ గను ... ఆం. భా. ౨. ౧౨౯.

నూలు. వి. దే. అసా. (క. నూలు. త. నూల్.)
౧. తంతువు, ప్రత్తివడికినపోఁగు, దారము.
ఆ. ఆజ్ఞ వలయు నృపతి కాభీరభిల్లాది, కంపకోల నూల నాజ్ఞ చెల్లు, నంతు సార్వభౌముఁడైన భూపతియాజ్ఞ, కెల్లవారుఁ దల్లడిల్లవలదె. ఆము. ౪. ౨౦౭.
చ. సరసులమర్త్త్య మింపుల నొసంగఁ గదంబపు దండఁ గట్టుచోఁ, గరఁగుటఁ జెల్వుదృక్కర శకాంతులు సత్తర మిచ్చునంతరాం, తర ముల నవ్వులు స్థలుపతండము మొల్లలు నంచు మిన్న గ్రుచ్చి రహిని రిత్తనూ లొసఁగిసిగ్గు వహింతురు పువ్వులావికల్. ఆము. ౨. ౨౦.
సీ. తనరు సూత్రము నూలు దార మనఁగ. ఆం. భా. ౨. ౭౯౫.
౨. (తామర మొ. వానిలోని) దారము.
చ. గొనయము తమ్మినూల్ చెఱకుకోల ధనుర్లత... క్రీడా. ౨.
గీ. కోరి తామరనూలునఁ గొండ లెల్లఁ, గట్టువడి నట్లు విశ్వేఁబు గట్టువడిరొ. వా. రా. ౨. ౨౪౭.
౩. మొలనూలు.
సీ. వజ్రాలనూలు నొరగ్వనికటీతటి రొట్లు తాశె వో పటుదర్భదామకాంచి. పాండు. ౪. ౩.
సీ. చాలలరెండెంబు సన్నంపుగిండెంబు భానుపండులచాలు పసిఁడినూలు. వరాహ. ౯. ౭౭.
జః నూలుకొను, నూలుకొలుపు, నూలుకోలు, నూలుపట్టు.

నూలుకొ(ల్కొ)ను. అ. క్రి. (√నూలు.)
౧. పురికొను.
గీ. బీఱువోయి రథ్యంబులు మాఱుమొగము, వడినఁ దానొచ్చి యుండియుఁ దడవి కొరి, నూలుకొనఁ జేసి తఱిమిన వ్రాలి తీవ్రభల్లమునఁ గ్రీడి భీష్మునివిల్లు దునిమె. భార. భీష్మ. ౩. ౨౫౪, ౧. ౨౩౨.
గీ. వెడలి తమతమచతురంగవితతు లెల్ల, నుచిత గతి నూల్కొనంగఁ జేయుచుఁ గడంగి, సంగరోత్సవసంభృతోత్సాహు లగుచు. భార. భీష్మ. ౧. ౮౪.
౨. చక్కఁబడు.
చ. కనుఁగొని ఫల్గునుండు దురగంబుల వాగెలు వట్టి యొత్తి తత్తనువులం నూల్కొనఁ జివిరి... భార. విరా. ౪. ౧౪౪.
౩. పూనుకొను.
వ...యజ్ఞాదికృత్యంబులు ధనసామగ్రి లేక నడపరాదు ధనంబు గలిగెనేనియు లోభంబున సంసారులు తత్కృత్యంబులకు నూలుకొనరు గావున నల్పప్రయాసంబున సకలవర్ణములకు మోక్షంబు గల్గుమార్గం బానతిమ్ము... వరాహ. ౮. ౨.
౪. ఒప్పుకొను.
క. అనుకూలుఁడు నాతఁడు తగ నూల్కొనివం దా నుదితనినదకోదండుం డై యనితరసుల భోద్యమమున, ధనంజయుం డిట్టు లను నతని తో మఱియున్. భార. విరా. ౫. ౧౧౫.
చ...నాకతం, బునఁ బటురోగదుఃఖములఁ బొందుచు నెచ్చెలు లిట్టు లుండఁగా, మనసిజభోగలీలలకు మానస మెట్లయి నాకునూల్కొనున్. మార్క. ౫. ౫౦.
౫. సమ్మతమగు.
చ...ఏను కామధేనువు నిను మెచ్చితిన్ మది నూల్కొనునిష్టము వేఁడు నాపుడున్.

  

ద్వా. ౧౦. ౫౭.

౫. స్థిరపడు.

క. మనము సరస్వతిఁ గనుఁగొని, జననీ నాయన
ను శోకసంతాపమునకు, బొనుఁగుపడి వివే
కమునకుఁ, గొనఁ గొఱయై చాల నూలుకొన
దని పలుకకు. ప్రబోధ. ౫. ౧౭.

చ...నీమది కార్యవృత్తి నూల్కొనియె సు
యోధనుం గని యరంతత నిశ్చయమై...
భార. ఉద్యో. ౨. ౯౬.

౬. వ్యాపించు.

ద్వి. ఓరువరాక బిట్టోకిలిం దొడవ, నోర మ
ద్యపుఁగంపు నూల్కొనఁబలికె. ద్వి. హరిశ్చ.
ఉ. ౧౪౦౨ పం.

౭. కలుగు.

ద్వి. ఇల తులఁగా లేనియారామలక్ష్మణులచేత
నేకీడు నూల్కొను నింక. రం. రా. యు.
౩౨౫ పు. ౨౧ పం.

స. క్రి. ౧. సమ్మతించు.

మ. ధన ముద్యన్నిధనంబు దేహము విపత్సం
తానగేహంబు భ్రమ నితాంతంబు ననర్థసీమ
విషయాస్వాదంబు ఖేదంబు గ్రన్నన లోకం
బున శోక మిట్లెఱిఁగి నూల్కొలేరు ప్రాణు
ల్ కటా, యనవద్యాత్మసమేధ మానసుఖప
ద్యావృద్యసంచారముల్. ప్రబోధ. ౫. ౩౬

౨. స్థిరపఱచు.

చ. పలికిన నేమి యన్నియును బల్క నగుక్
మనరాజునొద్ద మార్పలికెడువారు లేరు విను
పాండవమధ్యము గాండివంబుదీ, ప్తుల మిఱు
మిట్లు గొన్నకనుదోయి గుణధ్వని వ్రయ్య
లైనవీనులు నయినను బలే పలుకు నూల్కొ
నకుండుదు నూతనందనా. భార. ఉద్యో.
౪. ౪౧౭.

నూలుకొ(ల్కొ)లుపు(ల్పు.) స. క్రి. (√నూ
లుకొను.) ౧. చక్కబఱచు, సరిచేయు.

వ...అలికదేశంబునం గలయఁబడినయలకంబులు
నూలుకొలిపి...ఉ. హరి. ౫. ౧౪౦.

చ. ఎదురుగఁ బోవనిమ్ము రథ మీతని తేరికి
సన్న నాతఁడుక్, బదిలముతోడ రథ్యముల
పగ్గము లేడ్చి నూలుకొల్పి యున్మదగతి
సల్ల చేసిన...భార. విరా. ౫. ౧౨౭.

మ. లలనారత్నము నొయ్యనొయ్య మొనత్రే
లక్ నేల వ్రాయించి నిశ్చలవృత్తిక్ వరవర్ణ
పూర్ణఫలకాసంగంబు నొందించి మిన్కులు
వేమాఱుం దదర్థచింతనలతో నూల్కొల్ప
నెయ్యంపుటాజ్ఞలు పైపై నెనయింపసాఁగెఁ
బటుశాస్త్రశ్రేణికాభ్యాసముల్. వసు. ౩.
౧౮౦. (ఇట 'పొందుపఱచు' అని భా
వము.)

౨. పురికొల్పు, ప్రేరించు.

ఉ...ఈనృపునుఁ దమ్ములు నేనును బుట్టినాఁ జ
మూమండలి నూలుకొల్పికొని మార్తుర నో
ర్చినఁగాక యొప్పునే. భార. భీష్మ. ౨. ౧౫.

క. కొనిపొండు పసుల నోడక, యని తా నెలుఁ
గించి వీటికై నూల్కొలిపెక్. భార. విరా.
౪. ౨౮౭.

౩. ప్రసరింపఁజేయు, వ్యాపింపఁజేయు.

సీ. హరిణాక్షిలసదపాంగాలోకనము నూలుకొ
లుపుడు న మ్మరిఁ గొలిపె మరుఁడు. కు. సం
౫. ౫౧౫.

సీ. బంధత్రయంబునఁ బవనంబు మధ్యమనాళి
మార్గమునకు నూలుకొలిపి. వరాహ. ౧౦. ౫౪.
(ఇట 'పూరించు' అని భావము.)

సీ. భ్రమరకంబులఁ బుట్టు ప్రస్వేద కణములు
నొసలికస్తురిబొట్టు నూలుకొలుప. హర. ౫.
౨౯. (ఇట 'అలముకొనఁజేయు' అని భావము.)

౪. కుదురుపఱచు, నెలకొలుపు.

చ. మనముల నూలుకొల్పి యనుమానము లెల్లను
బాచి... భార. విరా. ౪. ౧౯౬.

ఉ... సత్క్రియాదక్షత నాకు నూల్కొలి
పి...దశకు. ౩. ౨౦.

గీ. చెంత నందఱ నిడుకొని చేరఁదేసి,కన్నులను
గ్రమ్ముకన్నీరు కరతలమున, నప్పళించుచు
గాద్గద్య మడఁచి యెప్ప, దెలుఁగు నూల్కొ
ల్పి వారల కిట్టు లనియె. ఉ.రా. ౬. ౨౦౪.

౫. కలిగించు.

గీ. ఎట్టకేలకు ధైర్యంబు హృదయమునకు, నూ
లుకొలుపుచు నారాయణుండు రాముఁడనఁ
గ నున్నాఁడు చిత్రకూటాద్రి మీఁద,రామ
సంజ్ఞను వినుతింతు నామహాత్ము. వరాహ.
౫. ౪౮.

నూలుకోలు. వి. (√నూలుకొను.) నూలుకొనుట.
(శ. ర.)

నూలుపట్టు. అ. క్రి. (√నూలు.) దారము వేసి
నూటిగా నుండునట్లు చేయు.

గీ. కర్ణికారాంబికామహాకాళిగుడికి, నందముగ
నూలుపట్టినయట్టిచాయ, నూర్యవీథికిఁ జనిరి
సంశుద్ధమతులఁ, బళ్ళిమద్వారమునకు నై
పరమమనులు. భీమ. ౩. ౫౯.

నూవు=నువ్వు, నూగు. వి. సస్యవిశేషము, తిలస
స్యము.

క. నూవుంబువ్వును సంపెఁగ,పూవు గెలిచి బి
రుదుము త్రైపుంజల్లి తగఁగ, దా వైచె ననఁగ
ముంగర,తో వనరుహానేత్ర నాస తుల శే
కొప్పుగ. శశిబిందుచరిత్రము. (శ. ర.)

సీ...తిలసంజ్ఞ నూ వనఁ దేజరిల్లు. ఆం. భా. ౨.
౨౩౬.

ఇః నూఁబిండి,నూఁబూవు, నూటిడి, నూనె,నూనె
ముంత, నూనెమడి, నూనెయగిసె.

## నృ

నృ. సం. వి. ఋ. పుం. నరుఁడు.

(దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు. నృ
హరి, నృసింహము మొ.)

నృకేసరి. సం. వి. న్. పుం. నరసింహమూర్తి
యగువిష్ణువు.

నృగుఁడు. సం.వి. అ. పుం. ఒకరాజు. (వైవస్వ
తమనుపుత్త్రుఁడు కారణాంతరమున ఊసరవ
ల్లియై శ్రీకృష్ణునిచే నుద్ధరింపఁబడినవాఁడు.)

నృజలము. సం. వి. అ. న. ౧. మనుష్యునిమూ
త్రము. ౨. మనుష్యునినేత్రజలము, మనుష్యు
నికన్నీరు. (వాచ.)

నృతి. సం. వి. ఇ. స్త్రీ. నర్తనము, నాట్యము.

నృత్తప్రియము. సం=నృత్యప్రియము.

నృత్తప్రియుఁడు. సం=నృత్యప్రియుఁడు.

నృత్తము. సం. వి. అ. న. తాళముతోను లయ
తోడను కూడినయాట, అంగప్రత్యంగములచే
భావమును తెలుపుచు ఆడెడిఆట. (నృత్తనా
ట్యలాస్యతాండవ శబ్దములకుభరత శాస్త్రప్ర
కారము కొంచెము భేద మున్నను అవి కావ్యముల
యందు పర్యాయములుగానే ప్రయోగింపఁబడి
నవి. పదార్థాభినయము నృత్యము, వాక్యార్థా
భినయము నాట్యము, అంగవిక్షేపమాత్రము నృ
త్తము అని సిద్ధాంతకౌముది.)

నృత్తశాల. సం=నృత్యశాల.

నృత్తస్థానము. సం=నృత్యస్థానము.

నృత్యప్రియము. సం. వి. అ. పుం. నెమలి.

నృత్యప్రియుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)
తాండవమునందు ఇష్టము కలవాఁడు. వి.అ.పుం.
శివుఁడు.

నృత్యము. సం= నృత్తము.

నృత్యశాల. సం. వి. అ. స్త్రీ. నాట్యగృహము.

నృత్యస్థానము. సం. వి. అ. న. నాట్యరంగము, నర్తనము చేయుచోటు.

నృదేవుఁడు. సం. వి. అ. పుం. రాజు.

నృధర్ముఁడు. సం. వి. న్. పుం. -మనుష్యధర్ముఁడు- కుబేరుఁడు.

నృపకందము. సం. వి. అ. పుం- కందరాజము- రాజపలాండువు, పెద్దనీరుల్లి.

నృపతి. సం. వి. ఇ. పుం. ౧. రాజు, ప్రభువు. ౨. క్షత్రియుఁడు. ౩. కుబేరుఁడు.

నృపతిపథము. సం. వి. అ. పుం. - రాజు పోవు త్రోవ - రాజవీధి.

నృపతివల్లభము. సం. విణ. (అ. ఆ. అ.) రాజున కిష్టమైనది. వి. అ. పుం. గగననాథునిచే కనుపెట్టఁబడినసర్వరోగనివారకమగు ఔషధభేదము.

నృపత్ని. సం. వి. ఈ. స్త్రీ. ౧. నరులను పాలించుస్త్రీ, రాణి. ౨. మనుష్యునిభార్య.

నృపద్రుమము. సం. వి. అ. పుం. ౧. రాజాదనము, పాలచెట్టు. ౨. ఆరగ్వధము, రేలచెట్టు.

నృపప్రియ. సం. వి. ఆ. స్త్రీ. ౧. కేతకి, మొగలి. ౨. రాజఖర్జూరి.

నృపప్రియఫల. సం. వి. ఆ. స్త్రీ. వార్తాకి, వంగచెట్టు.

నృపప్రియము. సం. విణ. (అ. ఆ. అ.) రాజుల కిష్టమగునది. వి. అ. పుం. ౧. రాజామ్రము, రాచమామిడి. ౨-కోటచుట్టును ఆవరించి దుర్గమును కాపాడుటచే రాజున కిష్టమయినది- ఒకజాతి వెదురు. ౩. రాజపలాండువు, పెద్దనీరుల్లి. ౪. శాలిసస్యము, వరి. న. ఆకుల్యము, నేలతంగేడు.

నృపబదరము. సం. వి. అ. పుం. రాజబదరము, గంగరేఁగు.

నృపమానము. సం= నృపాభీరము.

నృపలక్ష్మము. సం. వి న్. న. రాజులకు పట్టెడుతెల్లగొడుగు.

నృపవల్లభ. సం. వి. ఆ. స్త్రీ. ౧. రాజపత్ని, రాజ్ఞి. ౨. ఒకజాతిమొగలి. (రా. ని.)

నృపవల్లభము. సం. విణ. (అ.ఆ.అ.) రాజుల కిష్టమగునది. వి. అ. పుం. రాజామ్రము, రాచమామిడి. న. (వైద్య.) ౧. తైలభేదము. ౨. ఘృతభేదము.

నృపసభము. సం.వి. అ. న. ౧. రాజులగుంపు. ౨. రాజసభ, రాజుకొలువుకూటము.

నృపసుత. సం. వి. ఆ. స్త్రీ. ౧. గంధమూషిక, చుంచెలుక. ౨. రాజుకూఁతురు.

నృపాంశుఁడు. సం.వి. అ. పుం. రాజపుత్త్రుఁడు, రాజుకొడుకు.

నృపాత్మజ. సం. వి. ఆ. స్త్రీ. ౧. కటుతుంబి, చేఁదానుగు. ౨. రాజుకూఁతురు.

నృపాధ్వరము. సం.వి. అ. పుం. -రాజు చేయఁదగినయాగము- రాజసూయయాగము.

నృపాన్నము. సం. వి. అ. న. ౧. రాజుయొక్క అన్నము. ౨. రాజనములు, ధాన్యవిశేషము.

నృపాభీరము. సం. వి. అ. న. ౧. భక్తతూర్యము, రాజుయొక్క భోజనకాలమును తెలుపువాద్యభేదము. (వాచ.)

నృపామయము. సం.వి.అ.పుం.౧.రోగరాజము, క్షయ. ౨. రాజుయొక్క రోగము.

నృపాలుఁడు. సం. వి. అ. పుం=నృపతి.

నృపాహ్వయము. సం. వి. అ. పుం. ౧.-గంధముచేత రాజును ఆహ్వానించునది- రాజపలాండువు, పెద్దనీరుల్లి. ౨. రాజుయొక్క పేరు.

నృపుఁడు. సం.వి.అ. పుం. ౧.-మనుష్యులను పాలించువాఁడు- రాజు, ప్రభువు. ౨. నాలుగు ఆమడలపరిమితి కలదేశమునకు అధికారి.

నృపోచితము. సం. విశే. (అ. ఆ. అ.) రాజునకుఁ దగినది.వి.అ.పుం.రాజమాషము, బొబ్బరకి.

నృమేధము. సం. వి. అ. పుం. మనుష్యుని పశువుగా ఏర్పఱిచి చేయుయాగము, నరమేధయాగము.

నృయజ్ఞము. సం.వి. అ. పుం. మనుష్యయజ్ఞము, అతిథిసత్కారము. (ఇది పంచయజ్ఞములలో నొకటి.)

నృలోకము. సం. వి. అ. పుం. నరలోకము, భూలోకము.

నృవరాహుఁడు. సం. వి.అ. పుం. నరాంశమును వరాహాంశమును కలవాఁడు,వరాహమూర్తి యగు విష్ణువు.

నృవాహనుఁడు. సం=నరవాహనుఁడు.

నృశంసుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) మనుష్యులను హింసించువాఁడు, ఘాతుకుఁడు.

నృసింహజయంతి. సం. వి. ఈ. స్త్రీ. నృసింహమూర్తిజన్మోత్సవదినము. (ఇది వైశాఖశుద్ధ చతుర్దశినాఁడు వచ్చును.)

నృసింహము. సం. వి. అ. న. ౧. రతిబంధవిశేషము. ౨. ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

వ...గళకత్తెరయుఁ గానెనిల్కడయు నృసింహంబును నాది యగుముప్పదిరెండువిన్నాణముల నాణెంబు పరీక్షించి...హంస. ౧. ౧౦౫.

వ...గళకత్తెరయు నృసింహంబును గానిలుకడయు ననుముప్పదిరెండువిన్నాణంబులను ...ప్రబంధ. ౩౭.

నృసేనము. సం. వి. అ.న. మనుష్యసేన,పదాతి.

నృహరి. సం. వి. ఇ. పుం. నృసింహమూర్తి.

మ. నృహరీ వాదము లేల లేర యితరుల్ నీరీలకుఁ బాత్రముల్. ఆము. ౨. ౭౧.

# నె

నె[1]. విశే. నెఱ నెఱిశబ్దములకు కొన్నిహల్లులు పరమగునపుడు వృత్తియం దంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (దీనికి కొన్నియెడల నుగాగమమును, కొన్నియెడల దీనిమీఁదిహల్లునకు ద్విత్వమును వచ్చును. ఉదా: నెఱశబ్దమునకు నెందోలు, నెచ్చెలి, నెత్తమ్మి, నెమ్మని, నెవ్వగ మొ. నెఱిశబ్దమునకు నెన్నడ, నెన్నడుము, నెమ్మేను నెమ్మొగము మొ.)

నె[2]. వి. నెలవుశబ్దమునకు ఉపశ్లేషము. దీనిమీఁదిహల్లునకు ద్విత్వము వచ్చును. (చూ. నెక్కొను, నెక్కొల్పు మొ.)

నెంజిలి. వి.(త. నెఁజిటిప్పుల్.) మనోవ్యథ, అధి; ఖేదము.

సీ. నెంజిలి యనఁగ మనికిలం బనఁగఁ జుందు డుకనం దగు మనోవ్యథకు సమాఖ్య. ఆం. భా. ౧. ౧౩౭.

ఉ. మంజులపీఠమధ్యమున మన్మణిభూషణపంక్తిఁ బెట్టి యభ్యంజనతత్పరుండ నగునప్పుడు దాని హరించె నెవ్వఁడో, కుంజగుహాంతరంబుల నిగూఢము చేయునొ వానిఁ జూచ్చి యూ, నెంజిలి బాయఁ జేయుటకు నేర్పరులారయ మీరలే కదా. కులశేఖరమహీపాల చరిత్రము. ౪ ఆ. (ది. ని.)

క. నూనుఁ డని చాల నెంజిల్లియాపదగా తల్లిదోస మనకిటు బలిమిన్, బోనీక పట్టి పెనఁగిన, వానిన్ మఱి యేమి సేయ వలయుం జెప్రమా. సారంగ. ౩. ౨౯. పాండు. ౪. ౧౬౩.

క. అలజడి నెఁజిలి పిమ్మట, సిలుగు తలపోటు వంత సేగి నెగుల్ గొంద్ల మలమ టడరు గోడు మ్మలిక వనటు కుందు వానమరు దుఃఖాఖ్యల్. ఆం. శే. ౧౦.

నెండ్ర. వి. గిరిజతృణభేదము. (బోదవంటిగంటు కలిగి బోదకన్న సన్నమయినపరకలు కలది. పశువులు మేయునది. అని చి. ని.)

నెందోలు. వి. (నెఱ + తోలు.) పెద్దతోలు.
ద్వి. కాయ గాచినయట్టిచేయి నెందోళ్లు గోయఁ బాఁకినయసిగోఁతడాచేయి. పండితా. దీక్షా. ౪౦ పా. (క్రొత్తప్రతి పా.)

నెకబిక. వి. పట్టుదల.
క. ఒకని నొకించుకయును పోఁకక యుండెఁ గటారిమొనలు కడు బెట్టు వడిన్, నెకబికలు గఁ బోట్లాడుచు, వికపికలైడుసాకడిందివీరులయుండున్. కళా. ౮. ౧౦౨.

నెక్కురు. వి. ఒకానొకచెట్టు. (శ. ర, బ్రా.)

నెక్కొను = నెలకొను, నెలవుకొను. అ. క్రి. (నెలవు + కొను.) ౧. వసించు; ఉండు.
క. విను మవ్యక్తం బనఁగాఁ జను మూలప్రకృతి పురుషచైతన్యము న్నెక్కొనినం జేతన యగుచు భువనతంత్రం బెల్ల నడపు వైభవ మొనఁగన్. భార. అను. ౧. ౩౩౩.
(ఏవం చేతనశ్చ భగవాన్ పంచవింశశ్చచి స్తే నాధిష్ఠితా ప్రకృతి శ్చేతయతి నిత్యం సహాధర్మా చ... సం. భార. అను. ౩౯. ౩౭.)
సీ. నీకొలంకులఁ జేరి నెక్కొన్నకోకంబు కోక మాఁజూమ్ము చకోరనయన. రసిక. ౩. ౯౨.
క. ఒక్కట భయశోకంబుల, వెక్కుచు మెయిఁ గలవిలాసవిభ్రమలక్ష్మిల్, దక్కుటయును నొకరొయిట పై నెక్కొన ధరణీశు నెదుర నిలిచి వినీతిన్. మను చ. ౪. ౭౯.
౨. పాదుకొను, స్థిరపడు.
ఉ. అక్కజ మైనచెల్వమున నాత్మకు ప్రేగయి పొల్చుపొలిమై, నెక్కొనుచూడ్కిఁ గ్రమ్మఱుప నేరక యూరక నిల్చె... భార. విరా. ౨. ౨౩.
ఉ. నీదెస నాదుచిత్తమున నెక్కొని యుండెడు భక్తి భద్రసంపాదిని గావుటచ్చొరువె... భార. శల్య. ౧. ౨౩౫. మార్క. ౨. ౩౦౯.
౩. తగులు, నాఁటు.
మ. ఇనుఁ డశ్రాముఁడు ప్రేమ సారసవనం బీడేర్పఁగాఁ జొచ్చి మించినసంధ్యారుచి రక్తధారలు ప్రవర్షింపంగ వింటుం గరం బనువొందన్నిగిడించుచో సమయవాయవ్యాస్త్ర మువృత్తి న్నెక్కొన మారీచనిశాచరుం డనమ్మృగాంకుం డంబురాశిం బడెన్. సారంగ. ౨. ౧౭౭.
౪. ప్రసరించు, వ్యాపించు.
చ... వాఁడుము వడి వైచె నార్చుచుఁ గడున్ బెనుమంటలు మింట నెక్కొనం, గనదురువిస్ఫులింగములు గ్రక్కుమహాశనిఁ బోలు కాలమున్. భా. రా. అర. ౧. ౨౪.
౫. పుట్టు, కలుగు.
వ... అఖిలజనంబులకుఁ బ్రీతి నెక్కొన నతఁ డవ్యాహారంబు దీర్చునెడ... భార. భీష్మ. ౨. ౩౪౪.
ఉ... కనుగవదావ్వపూరముల్, నెక్కొని క్రమ్ముదేర... భోజరా. ౩. ౧౪౨.
గీ. వేఁడివెలుఁగెండఁ గ్రాఁగినవిన్నుమేన, నెక్కొనుచెమటబొట్టువాఁ జుక్కలమరె. పాంచా. ౨. ౩౯.
౬. ఫలించు, సిద్ధించు.
ఉ... ఎవ్విధంబులన్, నెక్కొనకున్నె మర్త్యులకు నిక్కము ప్రాక్తనభాగ్యకర్తముల్. పారి. ఉ. ౪. ౭౭.
౭. అతిశయించు, అధికమగు; ఉబ్బు.

  

ఉ. చచ్చె ఘటోత్కచుండు మనసైన్యము లెల్లఁ గలంగి నల్లడ, న్విచ్చుటఁ జూచి రేము వగ నెక్కొన వంతవడము... భార. ద్రో. ౫. ౨౩౮.

ద్వి. చేరి యాదేవుని శ్రీలింగమూర్తిఁ, గోరి సద్భక్తి నెక్కొనఁగ దర్శించి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౮ పం.

ద్వి. నెక్కొన్న చన్నులు నిరుపేదనడుము, పిక్కటిల్లెడువల్దపిఱుఁదు... రం. రా. ఉ. ౧౦౦ పా. ౧ పం.

(ఈయర్థమున నిది కొన్నిపట్ల వాక్యాలంకారముగా నుపయోగింపఁబడుచున్నది.)

క. ముక్కంటివరమునను మన, కెక్కుడుభయ మావహింప హేతు వవధ్యం, డక్కఱుఁడు పగతుఁ డద్దెస, నెక్కొని సిద్ధింప జెట్టినెతికర్జములుగ. హరి. ఉ. ౨. ౨౨౧.

క. లెక్కఁగొనక నరుఁ గృష్ణుని,ను క్కణఁగ బిగించి మూర్ఛనొందించి ధరణ్, గ్రక్కదల వైచి హాయము, నెన్నెక్కొనఁ గొనిపోయి జనకునిం గవి మ్రొక్కెన్. జై. భా. ౯. ౧౬౦.

౨. స. క్రి. పొందు, పడయు.

క. అక్కట సద్ద్విజజన్మము, నెక్కొనియును జేసికొనిన నేరమి నిన్నుం, ద్రెక్కొనఁ గట్టపు బాములఁ, బొక్కుచు నిక్కేండ్లు లెట్లు పొరలితి తండ్రీ. పద్మ. ౩. ౯౨.

జః నెక్కొల్పు, నెక్కొలు.

నెక్కొలుపు(ల్పు). స. క్రి. (√నెక్కొను.) ౧. పెట్టు, ఉంచు; పాదుకొల్పు.

వ... పాండవాగ్రజా నీమనంబున నెక్కొలుపు మిక్కుటయభిప్రాయంబు. భార. అను. ౧. ౭౩.

సీ. వనమాలికలు పొఱవైచి రుద్రాక్షపూసలపేరు లఱంత నెక్కొలుప వచ్చు. శుక. ౩. ౯౯. ('ధరించు' అని

చ. పొలుపగుమావిలేఁజిగురుపొందికపోఁతపిరంగిలోన నెక్కొలిపినపువ్వుగుచ్ఛ మనుగుండు పరాగపుమందు నించి... హంస. ౧. ౨౩౦.

మ. విను నీరూపము చూచి మాన్పపతి యువ్విళ్లూరు నే నెమ్మియిం, బనిగొందుం దగ నింతులం దగిలి నీపైఁ జూడ్కి నెక్కొల్పి నెమ్మనముల్ విస్మయ మందఁ జూచెదరు భామా పల్కు లిం కేటికిన్. భార. విరా. ౧. ౩౨౧.

౨. సంఘటించు, కూర్చు.

క. అక్కట దైవము రాజ్యము, ద్రెక్కొని యాలిం దనూజుఁ దెగ నమ్మంగా, నెక్కొలిపి హరిశ్చంద్రుని, నిక్కడఁ గాఢ్వతిచె నింక నేగతిఁ బోదున్. మార్క. ౧. ౨౪౮.

నెక్కొలు. వి. (√నెక్కొను.) నెక్కొనుట. (శ. ర.)

నెగడి. వి. (త. నెగిటి.) ౧. దుష్టమృగములు రాకుండ కాపాడుకొనుటకును చలికాఁచుకొనుటకును వేసెడుమంట.

గీ... నెగడికిఁ బాచనమున, కింధనము లిచ్చి ధనముల నెసకమెసఁగు. భార. అను. ౨. ౩౭౨.

సీ. శీతంబునకు నరశ్రేణు లొనర్చిన నెగడులు తఱచుగా నెగడె మెఱసె. చిత్రభా. ౨. ౩౪.

౨. అగ్నికుండము.

గీ. ఎపుడు నీవు నముం బాసి యేఁగి తపుడె, నీరసైనను నురినైన నెగడినైన, విడుతుఁ బ్రాణంబు... శివరా. ౩. ౧౩౦.

౩. కొఱవిదయ్యము, పిశాచము.

సీ... గాలి గాము నెగడి. గీ. కొఱవిరాలుపు బూచి సోఁకుడు పిసాసి, దయ్య మనఁగఁ

 ...ధానము లగు. సాం. ని. దేవ. ౧౯.

నెగడించు. స. క్రి. (√నెగడు 1.) నెగడఁజేయు; ప్రవర్తింపఁజేయు.

ఆ. నింగి ముట్టియున్న జంగమపల్లవుల్, గరము నందుఁ గనినవసుకవిత, దగిలి వారియందు నెగడింతు రవికి దీపమున నర్చ లిచ్చుపగిది వో. లె. కు. సం. ౧. ౪౯.

౨. వర్ధిల్లఁజేయు.

ద్వి. మగువఁ బుంసవనసీమంతోత్సవమున, నెగడింపఁ దొమ్మిదినెలలు నిండుటయు. ద్వి. భాగ. ౪. ౭౪ పు.

నెగడు[I] = నెవడు. అ. క్రి. (త. నిహాళ్. క. నెగళ్.) ౧. బయలుపడు, ప్రకటితమగు.

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టు లనియె నీవత్సరగ, పెంకఁడు నెట్టులయిన నడిగి మడిఁగి, సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి పిదప నెగడ వలయు. భార. విరా. ౧. ౧౪౩.

క. గగనంబున కట్టెగసిన, ఖగపతి నంగదుఁడు చూచి కపుల మనుప నీ, ఖగపతి కీ తాకృత్తము, నెగడఁగ వినిపించి చనియె నిజగృహమునకున్. భా. రా. కిష్కి. ౭౫౯.

౨. ప్రసిద్ధికెక్కు, ఖ్యాతమగు.

చ. తగినసుపుత్రులన్ బడసి... పాండుగతుల్ ...దక్షిణ లిమ్ముగ నిచ్చి యజ్ఞముల్, నెగడఁగఁ జేసియుం బడయునేర రపుత్రకు లైన దురతుల్. భార. ఆది. ౨. ౧౪౯.

క. ఏను బకాసురుననుజుఁడఁ, గీనాశుఁడ మానవులకుఁ గిమ్మీరుఁ డనం, గా నెగడుదు నీకావ్యక, కాననమున సర్వసత్త్వఖాదనబుద్ధిన్. భార. ఆర. ౧. ౧౧౨.

ఆ. తనరు ఖ్యాతి మర్యొ ననుటకుఁ జేయగా, నెగడె ననఁగ... ఆం. భా. ౩. ౯౦.

౩. ఒప్పు, తగు.

(నారదుఁడు.) చ... వీణ మీటుచును నేఁడు పడంతులయొద్దనుం గడున్ నెగడెదవిందు...

గల్గె నని నెమది మెచ్చుచు వచ్చెఁ జెచ్చెరన్. కళా. ౩. ౧౭౭.

౪. వర్ధిల్లు, వృద్ధిపొందు.

చ ...నీ, మనమున ధర్మమున్ హితము మంచిగఁ జూచి విధించినట్ల చేసి నెగడువారగాక నినుఁ జేరిన నాపద లొంద నేర్చునే. భాగ. ఉద్యో. ౩. ౨౦౭.

రగడ. నీకను దెఱచిన నెగడును జగములు, నీకను మూసిన నిలువవు జగములు. ఈ. రా. ౪. ౯౨.

గీ. పెంపుచెందెను దామరతంపరయ్యెఁ, బ్రబలె నెగడెను...అనఁగఁ బేర్లయ్యె వృద్ధిఁ బొందె ననుటకు...ఆం. శే. ౫.

౫. అతిశయించు, మిక్కుటమగు.

సీ. చెలువంబు నెగడఁ దీర్చినక్రొత్తకస్తూరిపట్టె లమేల్తావి మట్టుమీఱ. చంద్రి. ౧. ౧౦౭.

సీ. శీతంబునకు నరశ్శ్రేణు లొనర్చిన నెగడులు తఱచుగా నెగడి మెఱసె. చిత్ర. భా. ౨. ౩౪.

౬. గర్వించు, గర్వపడు.

క. తనయింట దివియ యుండఁగ, నను డాయుమనందు నెగడి నాతోఁ గొఱమా, లినమాటల నిసుమంతయుఁ, గొనసందఁగ నాడె నిటికుటిలఁడు కలఁడే. కేయూర. ౩. ౭౭౯.

౭. యత్నించు, పూను.

సీ. పొందమ్మికూండ్లతోఁ బొందు లీనెనుకాను దిగుమ భావి హసింప నెగడునాభి. గంధ. ౧౯౯.

౮. నడచు, ప్రవర్తించు.

ఆ. విదురుమతము పాండవేయహితార్థంబు, వానిబుద్ధి నెగడ వలవ దన్య, పక్షపాతబుద్ధిఁ బరఁగుచు నుండెడు, నట్టివాని నాప్తుఁ డనఁగ నగునె. భార. సభా. ౨. ౧౫౦.

ఆ. అనుడు నగుఁ డిట్టు లను దేవ తమతమ, నేర్పుపనులవెంట నెగడి బ్రదుక, వలయుఁగాక నగరఁ దలము దప్పిన మేలం, బుపల

టుఁ, జెలఁగుచుండిరి రాజశేఖర యఁత. అ. మ. క. ౧. ౪౯ పా. ౧౧ పం. శుక. ౧. ౧౬౮.

నెలవీసము. వి. (నెల$^{2}$ + వీసము.) ఉనికిపట్టుగుఱ్ఱము.
చ. తలఁపులతిట్టు భాసములతానక మాసలప్రట్టి నిల్లు గోర్యులనెలవీడు వల్వాలకాటము ...శు. సం. ౫. ౫౯౪.

నెలపీసము=నెలపాలు. వి. (నెల$^{1}$ + పీసము.) చంద్రకళ. (శ. ర.)

నెలవు. వి. (√నెలయు. సం. నిలయః. ప్రా. నిలఓ. త. నిలై. క. నెలె. మ. నిలా.) ౧. ఉనికి, స్థితి.
క. కొలువున నెలవు వహించిన, నలువను సాష్టాంగ మెరఁగి...విక్ర. ౨. ౭౮.
సీ. అను నాసీరునహంకారగరిమను నిమధావల ముమీఁది నెలవు సాక్షి. హర. ౭. ౨౨.
౨. వాసస్థానము, ఉనికిపట్టు.
గీ. చలువనెల వైనముత్యాలచవికలోన. హర. ౪. ౭౮.
క. ఎయ్యది కుల మెయ్యది నెల, వెయ్యది నీనామధేయ మిచ్చోటికి రా, నెయ్యది ప్రస్తుతమనినఁ, దొయ్యలి యా బ్రహ్మచారితో నిట్లనియెన్. వైజ. ౨. ౫౯.
౩. స్థానము, చోటు.
క. జీవుఁడు శుక్రచ్ఛాయా, భావితుఁ డైనపుడు విష్ణు భావించుటకుం, దావొకరి యగుఁ జిద్ధత, భావ మొసఁగు గుణము లేని పండగు నెలవున్. భార. శాం. ౫. ౪౨౧.
క. ఎయ్యది నీ యుండెడు నెలవు ..విక్ర. ౨. ౨౪౪.
గీ. నాభికందంబు క్రిందట నలినగంధి, కుండలీశక్తిదేవత యుండు నెలవు. కాశీ. ౨. ౨౨౫. ఆం. భా. ౨. ౧౩.
౪. భాగము, ప్రదేశము.
గీ. నేమి విడిచినకతన నన్నెలనెలవు, నేమికొంజయ్యె నదియు తా నైమిశంబు. కాశీ. ౧. ౭౭.
౫=నెళవు. పరిచయము, స్నేహము.
చ. నెలవున రాగసంపద వనీవను చాయపికారవంబునన్, దెలిసి ... సుమనీరము హారోద్గతిఁ బూన మూర్చ్ఛ...చంద్రి. ౪. ౭౨.
౬. పట్టు, ఊఁత.
ఆ. నీకుఁ జూడ ముష్టి నెలవు నాక్షిణ, గాఢతయును బాణతతియుఁ దోఁచె, యిట్లొయొండు ఛంగి నైతోఁచెనో నాకు, నున్న రూపు చెప్పవన్న పార్థ. భార. ద్రో. ౩. ౧౯౭.
శ్లో. కచ్చిద్గాండీవతః ప్రాణ స్తథైవ భరతర్షభ, ముష్టిశ్చ తే యథాపూర్వం భుజయోశ్చ బలం తవ, న వా కచ్చిదయం కాలః...సం. భార. ద్రో. ౧౦౩. ౭.
౭. నెఱవు, వ్యాపనము.
సీ. అవని యెల్లను దాన యైనది యనఁ దనసీడ నొప్పారెడు నెలవు గలిగి. గీ. తనయనొక్క మహావటతరువుఁ గాంచి. హరి. ఉ. ౧. ౩౩.

విణ. (త. నిలవు.) ౧. నలువు, సుందరము.
గీ. ఫాలమునఁ గుంతలంబు తీర్పఁబడినపుడు, నెలవుగాఁ దోఁచె గిరికన్యనెమ్మొగంబు. హర. ౪. ౯౨.
౨. పరిచితము, అలవాటైనది.
చ. నెల వగువాయువేగి బలుసేర్పరి గద్దరి యుక్కుగుండు ... తుపాకి నాఁగఁ జే, ర్లలెడిసార మేయముల నత్తటిఁ దెచ్చిరి కొంద అుద్ధతిన్. ఇందు. ౨. ౫౯.

నెలవేదు=స్థానభ్రష్టమగు.
మ. కలగుండై నెలవేది యట్లు పరటాకారండవాదిద్విజా, వలిఘోషించుటకన్నమున్న... వసు. ౨. ౧౪౨. కవిక. ౬. ౭.

నెలవుకొను. అ. క్రి. (√నెలవు.) ౧. పాదుకొను, స్థిరపడు.

క...నలునియందు... అక్రూరంగ లోచనచూపు నెలవుకొనియె... నైష. ౫. ౧౪౩.

సీ. పరితాపభేదనాపరవశంబునఁ దూలి నెలసిన చిత్తంబు నెలవుకొనఁగ. కు. సం. ౫. ౬౩౮.

౨. వర్తిల్లు, ఉండు.

గీ. బంధులకు నెల్లఁ గన్నులపండు వగుచు, నీవుఁ దమ్ములు సుఖవృత్తి నెలవుకొనుఁడు. భార. శల్య. ౨. ౧౨౩.

౩. కలుగు, జనించు.

సీ. దైవయోగంబునఁ దగినయుద్యోగంబు నీమానసంబున నెలవుకొనియె. భార. సౌ. ౧. ౬౦.

సీ. అనిన నాయింతి నాయందు నిద్ధిరియందు నీకుఁ బ్రియం బెల నెలవుకొనదు. మార్క. ౪. ౨౪౪.

గీ. నిర్భరక్రాంతి నడకల నెలవుకొనియె, నక్రూరంగేక్షణకుఁ జీరచిక్కుటయును. వేం. పంచ. ౫. ౬.

౪. వ్యాపించు, ప్రసరించు.

గీ. జననమరణాదు లైనసంసారదురిత,ములకు నగపడకుండంగఁ దొలఁగు తెరువు, కనుపెలుంగు నీ కిచ్చితి ననిన లేచి, నిలిచి సంతోష మెద నిండ నెలవుకొనఁగ. భార. విరా. ౧. ౨౩.

నెలవుకొలుపు(ల్పు)=నెకొల్పు, నెలకొల్పు. స. క్రి. (√నెలవుకొను.) ౧. పాదుకొలుపు, నిలుపు.

క. నీవును నివ్వాక్యంబులు, భావంబున నెలవుకొలిపి పరమసమాధి, శ్రీ వాటింపుము ... భార. అశ్వ. ౨. ౨౧౫.

క. కావున భూమియుఁ గనకము, గోవును దానార్థ వస్తుకోటికి నెల్లం, దీవినుతా యెక్కు డగుట, నీనిమలోదాత్తబుద్ధి నెలవుకొలుపు మీ. భార. ఆను. ౩. ౧౧౧.

౨. ఉంచు.

సీ. చరణపీఠంబుల గరుడాంకమణిఖండతులసీదళంబులు నెలవుకొలిపి. నైష. ౮. ౧౧౨.

౩. అమర్చు.

సీ. మెఱుఁగులఁ గ్రిక్కిఱుకొను నెలఁ గేతకిదళములతో వేణి నెలవుకొలుప. కు. సం. ౩. ౨౮౫.

నెలవుపడు. అ. క్రి. (నెలవు+పడు.) నెలకొను, నిలుచు. (చూ. నెలవుపఱుచు).

నెలవుపఱుచు. స. క్రి. (√నెలవు.) నెలకొల్పు, నిల్పు.

సీ. భానుతనూభవప్రముఖుల నెల్లను నిజనిజపదముల నెలవుపఱిచి. చం. రా. ౭. ౧౬౪.

నెలవెలుఁగు. వి. (నెల¹+వెలుఁగు.) చంద్రకాంతి, వెన్నెల.

క. నెలఁతుకకన్ను లనం గాఁ, బొలు పగు నెలవెలుఁగు మేపుఁబులుఁగులు దమి చేఁ, గొలఁది యెఱుంగక తిని వెన్నెలఁ గ్రక్కెడు ననఁగ నెసఁగు నెలకొనుఁగవుల్. యయా. ౪. ౩౫.

(నెలవెలుఁగు మేపుఁబులుఁగు=చకోరము.)

నెలవొందు. అ. క్రి. (నెలవు+ఒందు.) నెలకొను, వ్యాపించు.

సీ. లేనవ్వువెన్నెలల్ నెఱవొందెఁ దెఱఁగంటి తెలిగంటిగమిమోవితలిరులందు. సమీర. ౧. ౬౪.

నెలి(ల్లి). వి. అగ్నిమంథము, ఒకవిధమైనకూరాకుచెట్టు.

చ. గురు గొలబొద్ది చెంచలియు గుచ్చలి చిత్తి తగిరస తుమ్మి దు,స్సరి బలుగూటిబొద్ది నెలి చల్లిడి పల్లెరు... హంస. ౪. ౧౩౨.

... నెల్లికొయ్యలు ద్రచ్చి... మను చ. ౪. ౬౦.

సీ. శారుప మురపొన్న వారిజమును బొన్న వె
ల్లి మూలుగ ఁడిల్లు నెమిలియడఁగు. హంస. ౪. ౧౧.

నెళనెళ=నెళినెళి. వి. విఱుగుట మున్నగువాని యొండలిధ్వని కనుకరణము.

సీ. నెళనెళధ్వనులతో ఫెళఫెళ మనుగర్జిత
ములు కర్ణక్షోభిధాటి మొఱయ. హంస. ౪. ౨౨౧.

నెళవరి. విశే. (నెళవు+అరి³.) ౧. పరిచితుఁడు.

క. అళుకుచు మార్చిలి తెలుసుక, కళవళపడి
లేచి మనసు గాసిల్లంగా, భళిరా యని వెలు
వడి తన, నెళవరులను చూచికొనుచు నిలు
చున్నంతటన్. హంస. ౧. ౨౩౧.

౨. మర్మజ్ఞుఁడు, గుట్టు తెలిసినవాఁడు. (శ. ర.)

నెళవు. వి. రహస్యము, గుట్టు.

చ...ఆమదవతీమణి గర్భభరంబుఁ దాల్చె ని,
న్నెళవు గృహంబులోపలను నిక్కముగా
వివరింపఁగాఁ దగున్. అని. ౩. ౧౦౫.

ఆ. నీవు గలుగుచోటునెళవు దెలియువాఁడు,
వసుధయందుఁ ద్రోవ వదలఁ డెందు. వేమ. ౩. ౭౭. వేం. పంచ. ౧. ౨౪౯.

౨. మర్మస్థానము, ఆయువుపట్టు.

సీ. మఱపించి యొల్లనిమర్మంబు లంటుచోఁ బు
ణికిళ్ల నెళవులు పుణికి వైచి. కవిక. ౩. ౨౨౨.

౩. అభ్యాసము, అలవాటు.

సీ. కాలములం దప్పక త్రిసంధ్యలందు సుమా
ధీశుఁ బూజించునట్టినెళవు. చెన్న. పీఠి. ౯౭.

౪. (=నెలవు.) పరిచయము. (చూ. నెళవరి.)

విశే. యుక్తము, సమంజసము.

సీ. నెళవుగ మాటాడ నేర్చునో నేరదో పురు
షుల పను లౌనె పొలఁతిచేత. వేం. మా ౫. ౪.

జః నెళవరి.

నెళినెళి=నెళనెళ.

క. అట్టియెడఁ బుండ్రనఁదను, దట్టించి యుదూ
ద్వహుండు దళముష్టిహతిన్, బిట్టుడువ న
యిదుముష్టుల, నెట్టు వొడిచె నతఁడు నొద
లు నెళినెళి యనఁగన్. ఉ. హరి. ౩. ౪౨.

నెవఁగు=నెగడు. అ. క్రి. వెలయు, ప్రసిద్ధికెక్కు.

గీ. కువలయ ప్రీతికాముఁడై నెవఁగురాజు, గాఢ
రూఢ ప్రసన్నతఁ గాంచి తిరుగ, సాధుబు
ద్ధిని గా వైతిశోంబరారి. వేం. పంచ. ౪. ౧౫౦.

నెవము=నెపము. వి. (సం. నిభః. త. నిపం.)

౧. మిష, వ్యాజము.

క...ఆతనును దత్సేవనతాత్పర్యంబు తగ
నెవం బిడి యేప్రొద్దును వెడమడు గగుమది
తో, ననువర్తింపంగఁ గించిదవళిష్టము గాన్. హరి. పూ. ౧. ౭౩.

గీ. చివురుఁగెమ్మోవిచిఱుగాటునెవము గాఁగ,
తామరసనేత్ర కోపింపఁ దగదునమ్ము.
నైష. ౭. ౪౪. అచ్చ. రా. బాల. ౧౧౦.

౨. తప్పు, నేరము.

ఉ...మహీవల్లభ తత్కథయునెవంబున సర్వ
ము లెల్ల నగ్నిలోఁ, ద్రెళ్లఁగ ... భార. ఆది. ౧. ౧౨౫.

నెవయఁబడు. అ. క్రి. (నెవయన్+పడు -
స్వార్థమున.) ఎగయు, ఎగురు.

క. దివిజులు తొలుదాఁకునఁ ద,న్మెచ్చిన దను
జులను మనఃకులేశ్వరశరముల్, పావయని
మంటలు మింటికి, నెవయుంబడి కెదప వెం
నని నిలిచిరి వారున్. కళా. ౫. ౩౪.

నెవయు=నెగయు. అ. క్రి.

(ఎగయు, ఎగురు.)

క. పవనసఖుఁ డుగ్రకణములు, నెవయఁగఁ దన

నెవ్వడ. వి. (నెఱ+వడ.) మిక్కిలి వేఁడిమి. అధికతాపము.

సీ. పాలయమునిటూర్పుల... వెడ బీఁటువాఱి నెవ్వడ వడమోవితో ముడిఁగి వాడిన రెల్లు వడఁతను మాప. కు. సం. ౫. ౫౪౯.

సీ. వానలు లేక నెవ్వడఁ బైరు లన్నియు వాడఁగఁ దొడఁగిన నోడి ప్రజలు. అచ్చ. రా. బాల. ౫౪. ('నెప్పడి.' అపముద్రి.)

నెవ్వడి. వి. (నెఱ+వడి.) నిండువడి, అధికవేగము.

క. వడముడి యారక్కసు న య్యెడ కష్టధనుః ప్రమాణ మెడ గలుగఁగ నెవ్వడి నీడ్చె... భార. ఆది. ౬. ౨౦౬.

క. కడఁగి ద్రుపదానుజుఁడు నెవ్వడిఁ గవ్వడి నేసె నూఱువాఁడిశరంబులం, గడు వలిగి వాని నన్నియు, నడుమన తునియంగ నేసె నరుఁ డస్త్రములన్. భార. ఆది. ౫. ౧౮౧.

క. అతఁడీ స్తీల్గక చిక్కిన నెత్తురుఁ ద్రావుటల వలన నెవ్వడిఁ జాల్పన్, గుత్తుకలుక్కుసు విని, మెత్తంబా టూని లోన మిగుల వడలుచున్. అచ్చ. రా. యు. ౧౯౬.

నెవ్వలి. విశే. (నెఱ+వలి.) మిక్కిలి వట్రువైనది; మిక్కిలి పెద్దది.

క. నెవ్వలిసన్నుల బ్రేఁగునఁ, జివ్వంకలు వంగఁగాను ... లే, మవ్వంపుఁ బొజిలనూమిడి, క్రొవ్విరులం దొక్కఁకుసుమకోమలకో నెక్. కు. సం. ౯. ౩౧౨, ౭. ౧౨.

నెవ్వీఁగు. విశే. (నెఱ+వీఁగు.) మిక్కిలి నిక్కినది, ఉన్నతము.

క. వలపలిదిక్కున కించుక, మలఁగంగాఁ దుఱుమిడి కుఱుమాపుఁబట్టం, బలవడఁ గట్టి జరలవల్కలమున నెవ్వీఁగు జన్నిఁగవఁ గప్పి తగన్. భార. విరా. ౧. ౨౬౦.

తరవోజ. కెలకు కొబ్బూప్పటవెన సుచ్ఛ్వలించు వెలుపునఁ గలుగు నెక్కోఁగు... కు. సం. ౫. ౫౨౭.

సీ. [illegible] కావ్యా. ౩. ౪౧.

నెసుళ్లు. వి. బ. ఒకజాతికీటకములు, కసుళ్లు.

చ. చిటికినఁ బిల్లిఁ ద్రుంచుటయుఁ జేసిన నొంచుటయును నెసుళ్లు నెక్కన చలమారఁ జంపుటయుఁ గోఁతిని జింకను గిటకించుటల్. అచ్చ. రా. యు. ౧౧౯. (ఇట 'మశ్బలులు' అని భావము.)

## నే

నే=నెయ్యి, నేయి. (ఇది ప్రథమైకవచనమునందును సమాసమునందును గాన్పించుచున్నది.)

(వి. ఘృతము.)

క. నావుడు సంజయుఁ డిట్లను దేవా పాండవులయలుక ద్రుష్టద్యుమ్నుం, డేవెరవుమాటలైనను, నే వోసినయగ్నిభంగి నిగుడం జేయున్. భార. ఉద్యో. ౨. ౨౪౩.

సీ. నేయును నూనియయును వాయుధమ్ములు నౌషధములు... భార. శాం. ౨. ౨౨౪.

ఉ. గుప్పెఁడు పంచదారయును గ్రొత్తగఁ గాఁచిన యాలనే పెసర్పప్పును ...క్రీడా. ౧౬౬. సాం. ని. మాన. ౪౩.

నేదొప్ప=నేతిదొప్ప, నేయిపోసిన పత్త్రపుటము.

శా. ఓరం బెట్టినయప్పళాలు కడలం దొప్పారు నేదొప్పలున్. పాంచాలీ. ౪. ౫౯.

(నేడు+జెల్ల) సం...

నేఁజెల్ల=ఏఁజెల్ల. అవ్య. ~~నేఁడు+జెల్లన్=నేను చెల్లనటు గాన నేఁ జచ్చిపోను. (నేను+జెల్ల. సంతాపకము చెల్లును. అని. శ. ర.)~~

నే... నేఁజెల్ల నేఁజెల్ల పోకుమార, పోక

సూభవ హాపత్స యనుచు నా ర్తి. హ. రి. పూ. ౫. ౧౫౪.

నేఁడు. వి. ఔ. ౧. ఈదినము, జరగుచున్న దినము.

క. నేఁ డీబ్రాహ్మణుచేతం, బోఁడిమి సెడి రేఁను జిక్కి పోవకయుండఁగ, నేఁడిమి మెఱయు శరంబుల, వాఁడిమి సొం పెల్లఁ జూపవలయుం జుమీ. భార. ద్రో. ౧. ౨౩౨.

క. అచ్చట నంతర్హితుఁడై, యిచ్చఁ జనియెఁ దోఁచు నేఁట యెల్లిటిలోనన్. భార. విరా. ౫. ౩౦౧.

౨. ఇప్పుడు, వర్తమానకాలము.

క. నేఁ డింక నెఱిఁగి యెరుపుల, వాఁడఁగఁ దా యనుచు నేను వారిఁ దొలఁగినం, బోఁడిమి సెడదే... భార. ఉద్యో. ౪. ౩౫.

సీ. చక్రవర్తిమహాప్రశస్తి నాఁడును నేఁడుఁ జెలఁగి ధర్మక్రమస్థితి ఘటించె. పారి. పీఠి. ౧౧.

నేఁత. వి. (√ నేయు.) ౧. బట్టలు నేయుట.

సీ. సరి లేని మంచిగుజ్జరి నేఁత పట్టయుఁ బఱపైనరాయంచ గఱులపఱుపు. ఉ. రా. ౬. ౧౬౦.

చ. పగడపుఁగోళ్లు కుందనపుఁబట్టెలు కళ్కుల నేఁతపట్టె యంచగఱులపాన్పు మత్తిమపు జాలి... కడు సొంపు వహింపఁగ నింపు పెంపు సం, పఁగివిరితావిదోమతెరమంచముపై వారి నిందువేడుకన్. ల. వి. ౫. ౧౦౭. ('నేతిపెట్టె' అపముద్రి.)

౨. ఇండ్లు నేయుట.

సీ. కఱవు గేస్తులయిండ్ల కప్పు నేఁతలయంద నుడివడి కలఁగుటల్ మడుఁగులంద. అప్పు. రా. బాల. ౫౧.

బ. సన్నబారచాఁపులు. కవిక. ౩౮. (శ. ర.)

నేఁతకాఁడు. వి. (నేఁత + కాఁడు.) తంతువాయుఁడు, బట్టలు నేయువాఁడు.

సీ. తంతువాయాభిధఁ దనరు మగ్గరి యన నేఁతకాఁ డనఁగను నేఁతరి యనఁ, దోఁచుఁ దద్భేదముల్... ఆం. భా. ౨. ౨౭౩.

ఉ... తొల్లిచే, నేతఁ బరిగ్రహించి యతిశిష్యునిచే నొక నేఁతకానిచే, దూతిక నొచ్చె నాత్మకృతదోషమునం గద... వేఁ. పంచ. ౧. ౨౧౪.

నేఁతపలక. వి. (√ నేఁత.) నేఁతకాఁడు నేయునపుడు పడ గుపేకలను ఉగ్గించునట్టిపలక, వాయదండము.

సీ... వాయదండము నేఁతపల కనఁ దగు. ఆం. భా. ౨. ౨౧౬.

నేఁతపురు(గు)వు. వి. (√ నేఁత.) స్త్రీ, సాలెపురుఁగు.

క. నేసి మణి తాన క్రమ్మఱ, గ్రాసము గొను నేఁతపురువుగతి నీకలుగం, జేసిన యీవిశ్వమును ర, మాసఖ మ్రింగుదువు నీవ మరలన్ లీలన్. కవిక. ౬. ౧౭౨.

నేఁతపూఁబోఁడి. వి. (√ నేఁత.) సాలెపడుచు.

ఉ. అడుబుడక్కవానికి రయంబున భిక్షయొసంగ నేఁతపూఁ, బోఁడి ప్రకోష్ఠకస్థలికిఁ బోయి... హంస. ౨. ౨౧.

నేఁతయంత్రము. మి. వి. మగ్గము.

సీ... నేఁతయంత్రము మగ్గ మనఁగను దనరుచుండు. ఆం. భా. ౧. ౨౧౬.

నేఁతరి. వి. (నేఁత + అరి³.) నేఁతకాఁడు.

సీ. తంతువాయాభిధఁ దనరు మగ్గరి యన నేఁతకాఁ డనఁగను నేఁతరి యనఁ, దోఁచుఁ దద్భేదముల్... ఆం. భా. ౨. ౨౭౩.

నేక్త. సం. విణ. (ఋ. క్రి. ఋ.) = నేజకుఁడు.

నేక్తవ్యము. సం = నేజనీయము.

నేజి(ము) = నేజా. వి. చిల్లకోల, తోమరము.

ఉ. ఆజవరాలిఁ జూచి యసురాళి సురాళి విరాళిఁ గొన్న చో...కల్వపూ, నేజను వైచె సద్దనుజ నేకలచిత్రము లుచ్చి పొఱఁగన్. దశా. ౨. ౩౦౦.

సీ...నేజ బరిచి యీఁటె యనంగఁ బరఁగుఁ గుంతము...ఆం. భా. ౨. ౨౧౩.

మ...అకంతుండు కేలుదోయిఁ గొని నేర్పు లీఁ బూమొుగ్గ నేజను దద్వక్షము గుప్ప నం బొడిచె నోజన్ జెతుఁ డౌనా ననన్. చంద్రి. ౨. ౮౩.

క. నేజముఁ గొని యిప్పోటున, నే జమునిం జేర్తు ననుచు నిశిచరవీరుల్, జేజే లిడ సాహసము న, జేజేలగజంబుకుంభసీమం గుచ్చెన్. శశాం. ౫. ౨౫.

చ. నిగనిగ మించుచెంగలువ నేజముతో వడిఁ జిల్కతేజి పై, మగఁటిమి నెక్కి కూరుఁ డయి మారుఁడు...నరస. ౩. ౩౩.

నేజకుఁడు. సం. విణ. (అ. జిశా. అ.) ౧. శుద్ధిచేయువాఁడు. ౨. బట్టలు ఉదుకువాఁడు. వి. అ. పుం. రజకుఁడు, చాకలి.

నేజనము. సం. వి. అ. న. ౧. శుద్ధిచేయుట. ౨. చాకిపని, బట్టలు ఉదుకుట. ౩. నేజనస్థానము, చాకిరేవు. ౪. బట్టలు ఉదుకుపలక.

నేజనీయము. సం. విణ. (అ. ఆ. అ.) శుద్ధి చేయఁదగినది, ఉదుకఁదగినది.

నేజో=నేజ.

ఉ...కల్వమొుగ్గనే, జానటు చిమ్మి...మానినిఁ జీరిచీరి...భాను. ౩. ౭౩.

సీ. కడవన్నె జిగిపట్టునడికట్టుపడుదలఁ బట్టెంబు నేజాయు బాగుమీఱ. దశా. ౧౦.౧౧౨. నరస. ౫. ౮౦.

తమ్మినేజావజీరుదురము=మదనకదనము, శురభము.

గీ...పొదలలోని కరిగి యమ్మించుచుఁబోఁడి, జారుతోఁ గూడి తమ్మి నేజాఁకజీరు, దురమునను దన్నయాకస్తతో రమించె. శుక. ౨.౫౪౮.

నేజి. సం. విణ. (న్. నీ. న్.) ౧. శుద్ధిచేయువాఁడు. ౨. ఉదుకువాఁడు.

నేజ్యము. సం=నేజనీయము.

నేటించు. స. క్రి. (√నేటు.) సత్యముచెప్పు.

క. కూటము లెఱుఁగవు మాతో, పాటికిఁ బత్యములు చెప్పి చదివెద విది బల్, చేటు సుమీ యని పెద్దలు, నేటించినఁ గుకవి కదుఁ గినిసి జగడించున్. అప్ప. ౨. ౩౫౧.

అ. క్రి. చాఁగిలఁబడు.

అ. నిన్ను సన్నుతించి నేటించి మ్రొక్కుడు, హరి మురారి శౌరి యవధరింపు. భద్రరాజపుత్ర చరిత్రము. ౩. ఆ. (శే.ర.దృఢపదము అని శ.ర.)

నేటు. వి. (క. నేటు.) ౧. సత్యము, నిజము.

గీ. నిజ మనఁగ నిక్కువం బన నిక్క మనఁగ, నేటు నాఁగను సత్యంబు నెగడుచుండు. ఆం. భా. ౧. ౧౧౮.

౨. నిశ్చయము, నిర్ధారణము.

ద్వి. నేటు గా నీకల్లనిజములు రెండుఁ, దేటగా నిప్పుడు తెలుపకయున్న. ద్వి. సారంగ. ౨. భా. (శ. ర.)

దండకము...నీబూటకం బెవ్వరు న్నేటుగా నారయ న్లేదుగా...నీలా. ౨. ౪౧.

౩. లెక్క, గణన.

ఉ. ఆటలఁ బాటలన్ మరఁగి యమ్మునిమానులఁ గూడి యుండుటల్, నేటుకు వచ్చునే సభల ...శుక. చ. ౨. ౧౪౩.

విణ. ౧. దృఢము, గట్టిది.

ఆ. కలఁగి తేటవోదు గడి దప్పు నెఱుచును, నీటి కుప్పునీరు నేటుమాను. అచ్చ. భా. ౪. ౨౧౧.

గీ... మహోదరుతోడ నేటుగ సుషేణుఁ,డును విరూపాక్షుతోడ రాముని యనుంగు, తోడఁ బుట్టువు నేడెఱఁ దొడర మఱియు. అచ్చ. రా. యు. ౧౨౯.

౨. తిన్ననిది, ఋజువైనది.

సీ. నీటిపై నుఱుకుచు నేటు గా నీఁదుచుఁ గ్రమ్మఱ నడవక దొమ్మిఁ జనుచు. అచ్చ. రా. యు. ౭౦.

క... తెలివి నొగి నన్నింటఁ, జాటిలి తొలినుడి మిగులుచు, నే టగుచదువులకు నెల్ల నిక్క మిది యనన్. అచ్చ. భా. ౪. ౧౩.

౩. నర్మగర్భము, మేలముతోఁ గూడినది.

చ... వాలుఁజూపులన్, గిలకిలనవ్వులు న్నిగుల నే టగు గాటపునాటిమాటలన్, గలిగివిటావళిం దిరముగా వలపింతురు వేశ్య లత్తఱిన్. రాజ. వి. ౧.౧౩౫.

జః నేటించు, నేటుకొను, నేటుచేయు.

నేటుకొను. అ. క్రి. (√నేటు.) అతిశయించు, విజృంభించు.

క. నేటుకొని పండ్లు గొఱుకుచుఁ, జీటికిమాటికిని గసరు చిలుకం జెలుకా, బోటుల నలయించెదు నీ, గోటాపన యెన్నఁ డింక గూఁటం బడునో. నీలా. ౩. ౨౬.

నేటుచే(సే)యు. (√నేటు.) స. క్రి. ౧. నిశ్చయించు, దృఢపఱచు; (నిజరూపమున) నిర్ణయించు.

ఆ. పొన్నపువ్వుదీటు పోల్చులోకులమాట, నోటుచేసి వెన్నుబోఁటినాభి, నిస్తరిల్లె నవుకు వెదఁదడాయిని బోల్చు, నేర్పు కాంద్రమాట నేటుచేసి. రసిక. ౬. ౧౦౦.

ద్వి. పాటి దప్పితివయ్య పాపపుణ్యములు, నేటు నేయఁగ లేక నిష్కారణముగ. ద్వి. శ. పా. ౩. ౧౦౦ పా. ౧౬ పం.

౨. పాటిచేయు, గణించు.

ఆ. మాసలివారిమాట ముద్దుమాటయు, నేటుచేసి, యేలు నేల వదలి కటకటా కడిందికార్తె కంబులు గల్పాలము పారఁగఁ దగునె పాలఁతిఁ గూడి. అచ్చ. రా. అరో. ౧౦౯.

నేత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) ౧. ప్రాపకుఁడు, పొందించువాఁడు. ౨. తీసికొనిపోవువాఁడు. ౩. ప్రవర్తకుఁడు, జరపువాఁడు. ౪. నాయకుఁడు, నడపువాఁడు. ౫. నిర్వాహకుఁడు, నెఱవేర్చువాఁడు. ౬. ఒడయఁడు, అధిపతి. ౭. కథానాయకుఁడు. ౮. (దండనాథులను) విధించువాఁడు. వి. ఋ. పుం. ౧. రాజు. ౨. విష్ణువు. ౩. నింబము, వేముచెట్టు.

నేతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పొందింపఁదగినది. ౨. కొనిపోవఁదగినది. ౩. నడపఁదగినది. ౪. నెఱవేర్పఁదగినది. ౫. జరపఁదగినది.

నేతిబీఱ. వి. (√నేయి.) ౧. ఘృతకోశాతకీ.

ఆ... గుమ్మడి, కాయ నేతిబీఱకాయ పుచ్చ, కాయ నక్కదోసకాయ పట్రువసాఱ, కాయ గాదు శ్రాద్ధకర్ములకు. వి. పు. ౪. ౨౭౪.

సీ. బీకర బీఱ నా వెలయుఁ గోశాతకి నేతిబీఱ యనంగ నెగడుచుండుఁ, దద్భేదనామంబు... ఆం. భా. ౨. ౬౦.

నేతిబీఱకాయ=అన్వర్థము కానిది. (సార్థకనామము కానిదాని కుదాహరణముగా దీనిని వాడుదురు.)

గీ. నిగమశర్మాభిధానంబు నేతిబీఱ, కాయయును బోలె నయథార్థగాథఁ దాల్చి, వైదికాచార దూర ప్రవర్తనముల, వీటు విహరించుచుండు నవ్విటప్రగు. పాండు. ౩. ౧౩.

నేతిబీఱపస=నేతిబీఱకాయయొక్క పసవంటిపస గలది.

శా... తోడంబుట్టువునింటిపైఁ దెగవో నిక్

దోషాకరుం డంట కీ,జాడల్ సాక్షులు నే తిబీజపస వో చంద్రాదిసామార్గముల్.కవిరా. 3. ౧3౧.

నేతివసంతము. వి. (√ నేయి.) నేతితో అకుళ వసంతము.

క. ఓతల్లి మాకు( గృష్ణుడు,చేతోవిభుం డైన వాడు చెలులకు మెల్లన్, నేతివసంతము లాడుచు,జాతర నేసెనము భక్తిచాతురితో డన్. భాగ. ౧౦ పూ. ౮౦౯.

నేత్రచ్ఛదము. సం. వి. అ. పుం. కను రెప్ప.

నేత్రజలము. సం. వి. అ.న.బాష్పము, కన్నీరు.

నేత్ర(ము)పట్టు. వి. పట్టువస్త్రభేదము.

వ...ఉదయరాగపట్టులును నేత్రపట్టులునువజ్ర పట్టులును నను పేళ్లుగలపుట్టంబులు...ద్వా. 3. ౧౮౮.

ద్వి. నెతిపట్టు కెలిపట్టు నేత్రంబుపట్టు. బస. పు. 3. ౫౬ శాపం.

నేత్రపర్యంతము. సం. విణ. (అ. ఆ. అ) కంటి కడకును ఉండునది, నేత్రావధికము. వి.అ.పుం. అపాంగము, కడకన్ను.

నేత్రపర్వము. సం. వి. న్. న. కనుపండువు; కనుపండువుచేయువస్తువు.

ఆ...సిరి వరింప సభిసవోజ్జ్వ, లత్వ మొంది దివిజులకు నేత్రపర్వ మై, పొలిచి యింద్రు( డాత్మపురికి నరిగె. భార. శాం. ౫. ౧౫.

నేత్రపాకము. సం. వి. అ. పుం. నేత్రరోగవి శేషము.

నేత్రపిండము. సం. వి. అ. పుం. ౧. నేత్రగో ళకము, కనుగ్రుడ్డు.౨. పిల్లి,బిడాలము. (వాచ.)

నేత్రపుష్కర. సం. వి. ఆ. స్త్రీ. - కంటినుండి దుష్టజలమును స్రవింపజేయునది - రుద్రజట చెట్టు.

నేత్రబంధము. సం. వి. అ. పుం. [illegible]

విశేషము, దాగిలిమూతలు. (వాచ.)

నేత్రమలము. సం. వి. అ. న. దూషిక, కంటి పుసి.

నేత్రము. సం. వి. అ. న. ౧. నయనము, కన్ను. ౨. తరిత్రాడు, కవ్వపుత్రాడు. 3. వస్త్రము; వలిపము, వస్త్రవిశేషము.

గీ. గరుడపచ్చలు నేత్రముల్ తురగవళ్ళు, పాంగవళ్లును పద్మాలు వరిణవళ్లు, మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు. ప్రబంధ. ౨౭౨.

౪. వృక్షమూలము, వేరు. ౫. వస్తికళాక, వస్తి చేయుటకుసాధన మగుకడ్డీ. ౬. రథము, తేరు. ౭. ఏఱు,నది. ౮. జట, జడ. ౯. నాడి. ౧౦. (గణిత.) రెండు అనుసంఖ్య.

నేత్రముషము. సం. విణ. ౧. చూపు నాకర్షించునది. ౨. నేత్రములు మిఱుమిట్లు గొనం జేయునది, దృష్టి చెదరం గొట్టునది.

నేత్రయోని. సం. వి. ఇ. పుం. ౧. -యోనుల వంటికన్నులు కలవాడు- ఇంద్రుడు, వేగన్నుల వేలుపు. ౨. -అత్రి నేత్రము జన్మస్థానముగా కలవాడు- చంద్రుడు.

నేత్రరంజనము. సం.వి.అ. న-కన్నులను రంజిల్లంజేయునది-కాటుక.

నేత్రరోగహము. సం. విణ. (న్.) నేత్రరోగములను పోగొట్టునది. వి. న్. పుం. వృశ్చికాళి, తేలుకొండిచెట్టు.

నేత్రరోమము. సం. వి. న్. న. పక్ష్మము, కను రెప్పవెండ్రుక.

నేత్రవస్త్రము. సం. వి. అ. న. నేత్రచ్ఛదము, కను రెప్ప.

నేత్రవిట్టు. సం. వి. ష్. స్త్రీ. నేత్రమలము, కంటిపుసి.

నేత్రాంతము. సం. వి. అ. పుం. అపాంగము, కడ కన్ను.

నేత్రాంబువు. సం. వి. ఉ. న. బాష్పము, కన్నీరు.

నేత్రాభిష్యందము. సం. వి. అ. పుం. కంట నీరు కాఱుట, నేత్రరోగభేదము.

నేత్రారి. సం. వి. ఇ. పుం. -కంటికి శత్రువు- సింహుండము, జెముడు.

నేత్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. నాయకురాలు. ౨. నది. ౩. లక్ష్మి. ౪. నాడి.

నేత్రోత్సవము. సం. వి. అ. పుం, కన్నులపండువు; కన్నులకు పండువుచేయుపదార్థము.

నేత్రోపమఫలము. సం. వి. అ. పుం- కన్నులవలె నుండుఫలము కలది- బాదము. (వాచ.)

నేత్రౌషధము. సం. వి. అ. న. ౧. పుష్పకాశీసము, అన్నభేది. ౨. కంటిమందు.

నేత్రౌషధి. సం. వి. ఈ. స్త్రీ. అజశృంగి, జుట్టుప్రు.

నేదిష్ఠము. సం. విశే. (అ. ఆ. అ.) అంతికతమము, మిక్కిలిసమీపమం దున్నది. ౨. నిపుణము, నేర్పుకలది. వి. అ. పుం. అంకోలము, ఊడుగు.

నేదీయము. సం. విశే. (న్. యసీ. న్.) అంతికతరము, ఎక్కువసమీపమం దున్నది.

నేని= ఏని.

(అప్యర్థకము.)

మత్తకోకిల...మదీయభాషిత మెన్నఁడు, నేని మోఘము కాదు దిగ్ధరణీరవీందు లెఱుంగఁ గాక. భార. ఆది. ౬. ౧౪౧.

ఉ. నీవును జూచి తట్టిసభ నేని వినంబడ దేయు గంబులక. భార. సభా. ౨. ౯౫.

చ. సలలితసాంద్రకుంకుమము చన్నులపై మెయిఁ బ్రీతి నీవునా, కలఁదినచందనంబు తడియార దు నేఁ యు సంగజన్న నీ, విలసితచారురూపతను విభ్రమసంపద లీక్షణంబులోఁ, బొలుపఱఁ గాలి యా మె...కు. సం. ౫. ౫౫౧.

సీ. అరిగశ్భుశ్వరి వఁటీఁ గండెదు నెలకన్నె యుంగవు నేని... కు. సం. ౭. ౭౩౦.

క. మెట్టుఁడు నారకమార్గం, బెట్టిమహాక్రూరకర్ముఁ డేనియుఁ దుద నిట్టట్టనక నెమ్మనంబున, నెట్టన హరితలఁపు గలిగెనేని మహాత్మా. అప్ప. ౩. ౨౧౪. (ఈపద్యమును అప్పకవి ఉభయవళులలోనినిత్యయతికి ఉదాహరణముగా నిచ్చినాఁడు. కాని పైప్రయోగములఁ బట్టి చూడఁగా దాని కాధారము చింత్యము.)

నేనిజత్. సం. శత్రు. ౧. శుద్ధిచేయుచున్న, ఉదుకుచున్న. ౨. మిక్కిలి శుద్ధిచేయుచున్న.

నేనిజమానము. సం. విశే. (అ. ఆ. అ.)= నేనిజత్.

నేను= ఏను. స. (క. నాను. త. నాన్.) నాశబ్దప్రథమైకవచనము. (దీనిబహువచనరూపము నేము. చూ. నా.)

జః నేఁ జెల్ల.

నేపథ్యము. సం. వి. అ. న. ౧. భూషణము, అలంకారము. ౨. వేషము; నాటకపాత్రముల వేషము. ౩. (నాటక.) వేషస్థానము, తెరకు లోపలిభాగము.

నేపము. సం. వి. అ. న. జలము. (వాచ.)

నేపాలమూలకము. సం. వి. అ. న. హస్తికందమువంటిమూలభేదము, ఒకదినుసుముల్లంగిదుంప.

నేపాళకము. సం. వి. అ. న. తామ్రము, రాగి.

నేపాళజ. సం. వి. ఆ. స్త్రీ. మనశ్శిల, మణిశిల.

ఇట్లే: నేపాళజాత.

నేపాళము. సం. వి. అ. పుం. ౧. ఒకదేశము. ౨. ఒకదినుసుచెఱకు. ౩. ఒకజాతివెంకి, వృక్షభేదము. న. తామ్రము, రాగి.

నేపాళి. సం. వి. ఈ. స్త్రీ. మనశ్శిల, మణిసిల.

నేపాళిక. సం.వి.ఆ. స్త్రీ. ౧. నేపాళపుచెట్టు. ౨. మనశ్శిల, మణిసిల.

నేపుఁడు. సం. వి. అ. పుం. పురోహితుఁడు. (వాచ.)

నేబీఱ=నేతిబీఱ. వి. (√నే.) ఘృతకోశాతకీ.
ఆ. ఉల్లి తెలికపిండి ముల్లంగి నేబీఱ, పుచ్చ
దొండకాయ పుట్టకొక్కు, లూరఁబిండి
మునఁగ మారేడుగాయ లట్లనుభవించువారి
ననఁగి పెనఁగు. పద్మ. ౬. ౧౧౯.

నేబు. వి. పండ్రెండుకానులనాణెము.
చ. పలువలు చెంతఁ జేరి యొకపాతికి నేబులు
చేతి కిచ్చినన్. చంద్ర. వి. ౨. ౩౪.

నేమకము. వి. నేమము, నియమము. (శ. ర.)

నేమగాఁడు. విణ. (నేమము+కాఁడు.) నియమ
వంతుఁడు.
(వేంకటేశ్వరవర్ణనము.) సీ. తల నిల్లు గట్టు
వ్రతంబులరాయని తోమనిపశ్యాలనేమగా
ని. ఘటికా. ౨.౧౩౬. (తోమనిపశ్యాలనే
మగాని=సుప్రసన్నములతో హోమములు చే
యునియమవంతుని)

నేమము. వి. (సం. నియమః. క. నేమవు.)
వ్రతము, విధిగాఁ జేయవలసినపని; నియమము,
కట్టుపాటు.
ఉ...గట్టిగ నిశ్చయించె న్నాభామల జట్టి
యిచ్చి తనపట్టినయట్టి కడింది నేమముం,దా
మదిఁ గొన్నినాళ్లు విహితంబుగ నిల్పెకొనన్
మనంబులోన్. కళా. ౬. ౯౬.
శా. ఏమీ కొంకక పెట్టు జంగములకున్ హేరా
ళమ్ముష్టాన్నముల్, నేమం బొప్పఁగ రేలు
నుం బగలును న్విశ్వాసపూర్వంబుగన్.
హర. ౨. ౭౮.

ఉ. నేమ మెలర్పఁగా గోడుగునీడ వహించు
వసుంధరాస్థలీ,క్షేమ మెక్కి యాడెను
విచిత్రగతిం మదగోత్తమంబు న్నాభూమి
విభుండు...సైన. ౧. ౮౭. ౮౦. భా. ౨.
౧౩౪.
జః నేమగాఁడు, నేమించు.

నేమము. సం. విణ. (అ.ఇ.ఆ.) ౧. తుల్యము,
సదృశము. ౨. సమీపము,నికటము. వి.అ.పుం.
౧. ఖండము, భాగము. ౨. కాలము. ౩. మేర.
౪. ప్రాకారము; కంచె. ౫. వ్యాజము, మిష.
౬. అర్ధము, సగము. ౭. సాయంకాలము.
౮. మూలము, వేరు. ౯. ఊర్ధ్వభాగము, మీఁది
భాగము. ౧౦. అన్నము. ౧౧. గర్తము,గోయి.
౧౨. వజ్రము. ౧౩. పురోహితుఁడు. (వాచ.
కే. ని.)

నేమి. సం. వి. ఇ, న్. పుం. నెమ్మి, తినాసము.
ఇ. పుం. ౧. వజ్రాయుధము. ౨. గాడిద.పుం.
స్త్రీ. ౧. ఘటీయంత్రము, నూతిగిరక. ఇ.ఈ.
స్త్రీ. బండిచక్రము చుట్టుకమ్మి, ప్రధి.

నేమించు. స. క్రి. (√నేమము.) నియమించు.
గీ. మత్రియుఁ గమఁ బేరు గలిగినములల నరసి,
యున్న తావులఁ గదిలింప కునిచి రండు,
మీర లంచును బిలిచి నేమించి పనుప.
యయా. ౩. ౩౪.
మ...చుట్టును ధానుష్కులు కుంతధారు లగు
బంటుల్ నిల్వ నేమించి శం,ఖనినాదంబులు
దుందుభిధ్వనులు ఢక్కానాదముల్ మిం
చఁగన్. ఉ. రా. ౭. ౪౦౭.

నేము. స. క్రి. (ధాన్యము మొ.) చేటలో పోసి
యిటునటు త్రిప్పు. (శ.ర.)

నేముఁడు. సఁ=నేపుఁడు. (శై. ని.)

నేయము=నెయ్యము. వి. (సం. స్నేహః.) ౧.
స్నేహము, మైత్రి.

ఉ. నేయము లజ్జయుం గరుణ నెమ్మి కోపభ
యైకలేశమే, నేయెడఁ జూచిన నదికి నిం
చుక యించక...రస. ౩. (శ. ర.)

ద్వి. నేయుంబు తోడ నాన్నపుఁ దప్పు దతని,
చేయూఁదికొని వార్ధిఁ జేరంగ వచ్చి. రం.
రా.యు. ౩౦ ౭ పా. ౨౦ పం. (చి.ని.పా.)

నేయము. సం.=నేతవ్యము.

నేయార్థము. సం. విణ. (అ. ఆ. అ.) పొందిం
పఁదగిన అర్థము కలది. వి. అ. స. (కావ్యదోష
ములలో నొకటి, స్వసంకేతిత మగు అర్థము గల
పదము.

క. ఇలఁ దనసంకేతంబున, నిలిపినపద మెంచి
చూడ నేయార్థంబౌ, బలుతే నెదిండిగమినగు,
వలసాగర కర్ణయానయలక లవంగా. నరస.
౪. ౭. (సాగరకర్ణ=సాగర మనుపదము
చెవులయందుకలది, ఏనుఁగు.) ౨. న్యాయ
ము. (శ. ర.)

శ్లో. విహాయ చ రూఢింస్వార్థే వ్యత్యస్తనవవృ
త్తయః,కదా భవిష్యతే వాసః కటకేషు
మహీభృతాం." ప్రతాపరుద్రీయము.దోష
ప్రకరణము. (ఇట వ్యత్యస్తనవవృత్తులు=
నవవృత్తులు అని యర్థము.)

నేయి=నెయి, నెయ్యి, నే. (సం. స్నేహః. క.
త. నెయ్.) వి. దే, అనా. ౧. ఘృతము, ఆ
జ్యము.

క. కామములు భోగములఁ దెగు, నే మొఁదుక
నేఁత నాఱు నే చిచ్చు...భార. అను. ౫.
౨౩౩.

సీ. కమ్మఁగాఁ గాఁచినకతియాల నేతితోఁ గమ
నీయపంచభక్ష్యములతోడ. భీమ. ౧.౭౦.

క. ఈయర్థము నిశ్చయముగఁ, జేయక నే లో
కృపమతము నేయుట నెయ్యి నే నేయి

బూని వేల్చిన, నేయినిఁ బోలియును మీఁద
నిష్ఫల మందుర్. వా. రా. ౪. ౬౩.

ద్వి. ధరణిఁ బంతియ సముద్రంబుల నేతి, సరు
ణు దీపముఁ జేసి...నీరజాక్షున కిచ్చె నీ
రాజనంబు. ద్వి. పరమ. ౧. ౪౫ పా.

సా:– రొట్టె నేతిలో పడినట్లు (కార్యము సఫల
మైన దని భావము.)

౨. తైలము, చమురు.

క. నేయి పొలుపఱిన దీపియ,మాయఁకరణిఁ
గ్రసిద్ధి మలిగిన హీన,త్యాయత్తం బై
తోనును, మాయును దైవానుకూల్యమహిమ
మహీశా. భార. అను. ౧. ౧౩౭.

శ్లో. యథా తైలక్షయాద్దీపః ప్రమ్లాని ముపగ
చ్ఛతి, తథా కర్మక్షయాద్దైవం ప్రమ్లాని ము
పగచ్ఛతి. సం. భార. అను. ౬. ౪౬.

౩. క్రొవ్వు, మజ్జ.

గీ...కేరజములు, గుర్వ్యలను మొదలుగ లెక్క
కొలఁది మీఱఁ, గలవు పులుఁగులు నేతులు
గ్రక్కఁ గ్రోవి. చిత్రభా. ౩. ౧౭౨.

నేయిపూసినకత్తి=పయికి అకర్షకముగా నుండి
ద్రోహము చేయునది. (ఇది తేనెపూసినకత్తివంటిది.)

వ...కొండొకకాలంబు నమ్మఁ దిరిగిన నాకె
వాఁడుగక నేయిపూసినకత్తి యగుట దెలి
యక గోముఖవ్యాఘ్రం బగుట వివరింప నే
రక యత్తులువం బరిగ్రహించి... వెం.పంచ.
౧. ౨౭.

జః నేతిబీఱ, నేతివసంతము.

నేయు. స. క్రి. (క. నేయ్.) నేఁతచేయు, నయ
నముచేయు.

చ...తద్భటకోటి చాతురితురి...యశోం, బర
ములు నేయుచుండు బహుభంగులఁ బున్న
... కొనిందుచం, దురునునుసోగవెన్నల

లతోఁ దులఁదూఁగెడుతద్గుణంబులన్. నైష. ౧. ౪౭.

జః నేఁత, నేఁతకాఁడు, నేఁతపలక, నేఁతపురువు నేఁతపూఁబోఁడి, నేఁతరి.

నేరఁబోఁతు. విణ. (నేరమి + పోతు.) తెలియని వాఁడు, అనభిజ్ఞుఁడు. (చి. ని. శ. ర.)

నేరపెట్టు. స. క్రి. (నేరము + పెట్టు.) నెపపెట్టు, దోషియని చెప్పు.

క. కలితనమునఁ జని యలనా, పలుకుం బంతంబుఁ జెల్లుబడి గా రేడ్డిన్, గలసి యొకముడుపు గైకొని, పిలిచిన నీ కిత్తు నేరపెట్టుదు మగనిన్. వేం. పంచ. ౪. ౪౯౪.

నేరమి. వి. (నేరుచు.) ౧. తెలియమి, అజ్ఞానము.

క. ఏ నెఱుఁగమి నిట్లడిగితి, నా నేరమి సైఁప వలయు... భార. అర. ౫. ౩౧౧.

ద్వి. ఘోర ప్రతిజ్ఞఁ గైకొని బేల నైతి, నేరమిఁ జెడిపోయె నేఁడు నాతపము. ద్వి. హరిశ్చ. పూ. ౨౧౭౦ పం.

క. ధనరాజ్యరమామదమునఁ, గనుఁ గానని నిన్ను శిష్యుఁ గాఁ గైకొనుకంటెను నేరమి కలదే ...మనుచ. ౫. ౧౦.

౨. దోషము, తప్పు.

సీ. తగిలి సువ్యాద్యూతధర్మయుద్ధములకుఁ బరులచేఁ బిలువంగఁబడి విభుండు, గడఁగక విముఖుండు గాఁ జన దని శుభశాస్త్ర ధర్మంబు లోకంబులందు, నిలిపెఁ దా నిది పతి నేరమియే దైవదైవకృత్యం బైన వనరఁ దగునె. భార. సభా. ౨. ౨౭౪.

సీ. నేరమి లేకయు నెప మిడి యర్థంబు గొను రాజుఁ బ్రజరక్ష వినికి గలిగి. గీ. యాచరింప నవిభుఁడును...అధోగతి కరుగువారు. భార. అను. ౨. ౮౨.

ఉ. నావుడు దానవేశ్వరుఁడు నవ్వుచు నార్య శిక్షోడ నిట్లనున్, నీ విటు మాఱ నేర్తు నని నేరమి పెట్టితి గాక... ఉ. హరి. ౧. ౬౭. ఆం. భా. ౨. ౧౯౧.

నేరము. వి. (త. నేరం.) తప్పు, అపరాధము.

క. రేయును బగలును విదురుఁడు, నీయొద్దన యునికిఁ జేసి నేరము పలుకన్, మాయిద్దం బెడఁగింపఁగ, ధీయుత యొక గంటి మిన్ను దివసంబులకున్. భార. ఆది. ౭. ౧౭.

గీ. అరి నార్జింప వర్జింప నలవి గాని, ధర్మమ నధర్మమునుఁ జెప్పఁదగిలి మనువు, నేరములు వెట్టి దండువు నిశ్చయించి, ధరణిఁ గలవోటు నర్థ మెత్తంగఁ దలఁచి. నైష. ౭. ౭౭.

ఉ...తోఁటకాళిదాసాదిమహాకవీశ్వరుల కైన ను నేరము లేక యుండునే. వి. పు. ౧. ౧౪. ఆం. భా. ౨. ౧౯౧.

జః నేరపెట్టు, నేరముకొను.

నేరముకొను. అ. క్రి. (నేరము + కొను.) తప్పు పట్టు.

క. ఓరి దురాత్మక విని పల్కుమా యిటు రావలదు హెచ్చి మతి వచ్చితివా, నేరముకొందు గ్రహించుక, యోరక యాపని ఘటింపు మెప్పుడు మాకున్. బిల్హ. ౩. ౧౫౭.

నేరాజే. విణ. సరిగతో నేసినది, జరబాజా. (వస్త్రము మొ. శ. ర.)

నేరిమి (ర్మి.) వి. (నేరుచు + ఇమి.) సామర్థ్యము, శక్తి; ప్రావీణ్యము, చతురత.

ఉ... అంబకజాలవీచికా, స్ఫారము సైనభీష్ముఁ డను సాగరముం గడవంగ నీఁదఁగా, నేరిమి యొట్లొకో కలుగ నేర్చె శిఖండికి నేమి సేయుదున్. భార. భీష్మ. ౧. ౫౪.

క. ఈటేవికి నీశ్వర్తికి, మేటితనంబునకుఁ జాల మెచ్చితిగానం జే, దాఁటుకొనియున్న నీతఁడు

నే పెన్నఁడు లేనినీరుఁ జెన్నారుఁగదా. అచ్చ. రా. సుం. ౧౩.

ఉ. నిక్కముపోలె నప్పు డొకనేరుపుమై ననుఁ ద్రోచిపుచ్చఁగా, నక్కమలాక్షి పొందుఁ దగ నాడి ... ఇక్కడ రాక తక్కునే. భార. విరా. ౨. ౨౯౬.

క. వీరు దమపాలు వడయక, నేరిమి మాటలన తేఱ నేర్తురె చెప్పుమా. భార. ఉద్యో. ౧. ౩౪౦. (నేరిమిమాటలన=చతురవచనముల చేతనే.)

క. సారెయుఁ బలకయుఁ గైకొని, నేరిమిమై నాడి ధనము నేరయఁగఁ గొని దుర్వారం డగు నాజూదరి...దశకు. ౫. ౬౯.

నేరుచు(ర్చు) స. క్రి. (దీనికి 'నేచుచు, నేరచును, నేరఁడు, నేరువఁడు, నేతుక, నేరక' మొ. రూపము లగును. త. నేర్.) ౧. అభ్యసించు, కఱచు.

క. అఱువదినాలుగువిద్యలు, నఱువదినాలుగు దినంబు లంతనవారల్, నెఱవాదు లైనకతమున, నటె నొక్కొక నాఁటివినికి నేర్చిరిలేకా. భాగ. ౧౦ పూ. ౧౪౧౦.

సీ. పద్యంబు గీతికార్భటి నొగిఁ జదువంగ నెల్ల విద్యలసంచు లెఱుఁగ నేర్తు. విక్ర. ౧. ౨౦, ౧. ౪౯.

౨. తెలియు, ఎఱుఁగు.

మ...నాథుల్ నేరమి శ్నేయుఁ బేరలుక౦ జెం దినయట్టికాంత లుచితవ్యాపారము ల్నేర్తురే. పారి. ౧. ౧౨౧.

వ...ఇంత యైన నుపేక్షింపక యీదుష్టద్యూతం బు వారింపు మనిన పుత్రస్నేహంబున బుద్ధి యుఁ జేయునది నేరకధృతరాష్ట్రుండు మిన్నకుండె. భార. సభా. ౨. ౧౫౪.

ఉ. నేరక చేర నొక్కవిన నీఱుఁగ జేయుఁ గృశానుఁడు...భార. శాం. ౧. ౯౩.

ఉ... పరమార్థము మంత్రవిభేదమైనఁ గార్యములు నిర్వహింపఁగ బృహస్పతి కైనను నేరఁ బోలునే. భార. ఆది. ౬. ౧౧౦.

ఉ ... వంకమాట లే, నేరఁ గురుప్రవీరసభ నిశ్చయ మిట్టిది కాఁగఁ జెప్పుమీ. భార. ఉద్యో. ౩. ౯౬.

క. నీచేఁ దా రాద్యంతము, నేచుకొనం గలరు వరుస నఖిలపురాణ, ప్రాచుర్యకరణలీలా, వాచాలుఁడు వ్యాసుఁ డెఱుఁగు వారల లవనక. వరాహ. ౧౨. ౭౭.

క...నా, నేచినగతి నచట నచట నిలిపితి... భార. మా. ౧. ౩౧౫.

ఉ. నేచియు నేరకుండియును ... దశకు. ౩.౧౪౦.

క. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుం...భార. విరా. ౧. ౧౭౬.

క. నేతును మంత్రము లందఱ, నేతును దద్రిపుల ప్రేవు లీరణమునకుక. ప్రబంధ. ౭౭౮.

అ. క్రి. ౧. సమర్థమగు, శక్తమగు.

ఆ. నీవు నీసుతుండు నేర్తురు గా కొరు, లేమి సేయ నేర్తు రిందుకులుఁడ. భార. సభా. ౨. ౩౧౨.

క. కీచకుఁడు ప్రేటుపడి తన, నీచపుదెస యొరు లెఱుంగ నేరకయుండక, లేచి...భార. విరా. ౨. ౧౩౦.

సీ. అతఁడు పాణిగ్రహణార్హుండు విను నీవు పతినిఁ గూర్పఁగ నేర్తు నతివ యేను. సైవ. ౨. ౬౩.

౨. ఇష్టపడు, సమ్మతించు.

క. తిరిగినపందల నేటికిఁ, బురికొల్పఁగ నున్న వారు వోదురు గా కేఁ, గురుపతిజయంబు గొని యిద్ధర యేలం జూడ నేర్చెదనె విను నమ్మక. భార. భీష్మ. ౨. ౧౫౨.

చ...వల్లభులు ప్రాణవిభుం బెడవాయ నేర్తురే. పారి. ౪. ౫౪.

౩. సంభవించు.

ఉ...భీష్ముఁ డనుసాగరముం గడవంగ నీదఁగా, నేరమి యెట్లొకో కలుగ నేర్చె శిఖండికి నేమి సేయుదుల్. భార. భీష్మ. ౧. ౫౪.

వ...యుష్మత్సంఘటితంబు లైనసంబంధములకు వికారం బెన్నండు ను బుట్ట నేరదు...పార. ౪. ౪౯. మనుచ. ౧. ౭౨.

జః నేరమి, నేరిమి, నేరుపరి, నేరుపు, నేరుపులాఁడు, నేర్పుకాఁడు.

నేరుప(ర్ప)రి. (నేరుపు + అరి³.) నేర్పు కలవాఁడు, చతురుఁడు.

క. నేరుపరి పోషాళించిన,హారము వెల యొక్కలీల...ప్రబోధ. ౧. ౨౭.

క. అరిదివిలుకానియుజ్జ్వల,శర మొక్కని నొంచుఁ దప్పి చనినం జను నేర్పరియైనవానినీతి, స్ఫురణము పగరాజు నతినిభూమిం జెఱచుల్. భార. ఉద్యో. ౨. ౩౬.

నేరుపు(ర్పు) స. క్రి. (√నేరుచు.) అభ్యసింపఁజేయు.

మ. మురిపం బొప్పఁగ మందమందగమనంబుల్ నేర్పెదు న్నేదిన్,శ్వరశుద్ధాంతనితంబినీజనులకుల్ సంపూర్ణచంద్రాననా. నైష. ౨.౫౬.

చ. పలుకులు నేర్పువేళఁ గలభాషిణి నీ విటులుండ...మనుచ. ౩. ౫౯.

వి. ౧. (క. త. నేర్పు.) ప్రావీణ్యము, చతురత; సామర్థ్యము, శక్తి.

ఉ. ఇంచినభక్తి నొక్కతరళేక్షణ నైషధభూమిభర్త మన్నించు వరూథినీపతికి నేరుపు మీఱఁగ బట్టివేళ్లఁ గావించినతాళవృంతముల వీచుచు నుండె...నైష. ౬. ౧౧౭, ౧. ౭౪.

క. చిత్తం బూరక కలఁచెదు,సత్తము నాతోడ నాడ నేరుపు గలదే. ఉ. హరి. ౩.౧౧౬.

మ. విని సంశప్తకు లేము దక్క నొరు లావివ్వచ్చు భంగించి శౌ, క్తునిక్కుం బాపి యలంప నేర్పు గలరే...భార. ద్రో. ౧. ౩౯౩.

౨. రీతి, విధము.

చ. ఘనుఁ డతఁ డేఁగుదెంచి సదిగద్దియ నుండ నగారిశైలఖం,డనకథ చారణాళి వొగడల్ నిజసన్నుతి కోసరించున,న్నప్పుడ దల వంచి పీఠతటరూఢమణిల్ బొటువ్రేలమీఁటున,య్యనఘుఁడు కొండ మీఁటినమహాద్భుతకృత్యము దెల్పుకైవడిల్. వసు. ౧.౧౨౨.

గీ...నీయిష్ట మీడేరు నేర్పు, తెలియఁ జెప్పెద వినుమని తెఱవ కపురు. హంస. ౫. ౩౦౪.

నేరుపులాఁడు. విణ. (నేరుపులు + వాఁడు.) నేరుపుకాఁడు.

సీ. వెనుబొజ్జ నిడ్డెనల్ నినుచు నేరుపులాఁడు...గీ...సొరు, నెరపు నెఱవేల్పు నామది నిలుచుఁ గాక. అచ్చ. రా. బాల. ర. (శ.ర.పా. 'తి నెఱు నేరుపువాఁడు' ముద్రి.)

నేరెడల్లులు. వి. బ. (√నేరేడు.) అల్లోనేరేళ్లు, నమస్కారములు.

సీ...బెంకిణాలు నేర్చుడల్లుల్ సలా మన నమరు దండము పెళ్లు...సాం. ని. మాన. ౨౫.

నేరె(రే)డు. వి. ఫ. జంబూవృక్షము.

ఉ... అ,న్నేరెడుమ్రానిమూలమున నెక్కొని యుండు జగత్ప్రశస్తమై. మార్క. ౪. ౧౪౪.

క. విను మేకాదశశతయోజనదీర్ఘము లేతదీయశైలాగ్రములం, దవరుచుఁ బడగలక్రియఁ గడ,పనగము నేరేడు రావి వటమును నొలయుల్. మార్క. ౪. ౧౪౩.

సీ. నేరేడు దనగను నేరెడవంగను జంబూసము

ఖ్యలై చనును... ఆం. భా. ౨. ౪౬.

నేరేడేఱు=జంబూనది.

గీ. నేరెడేటియిసుకల్ దెచ్చి నీరజాక్షు, సానఁ బట్టినరాపాడి చల్లి మెఱపి, పదను సుధ నిడ చేసెనో పద్మభవుఁడు, వీనిఁ గాకున్నఁ గలదె యీమేనికాంతి. మనుచ. ౨. ౩౬.

నేరెటిదీవి=జంబూద్వీపము.

ఉ. నేరెటిదీవి యేలుధరణీవరముఖ్యులు వీరె కంటె... నైష. ౫. ౮౬.

గీ. దీవులం దెల్ల నేరెడుదీవి లెస్స. హర. ౨. ౩.

నేర్పు(రుపు)కాఁడు. విశే. (√నేర్పు.) నేర్పరి, నేర్పుకలవాఁడు.

క. నీవ కడు నేర్పుకాఁడవు, గా వలవదు వీనిఁ గొన్ని గఱచితి మేముౝ. భార. ఆది. ౬. ౩౨.

గీ. పూని యాప్రోలిమేలికడానికోట, వానియును నగ్ర్తపాండును వలనుమీఱఁ, జూడఁ జెప్పఁగా నరిది యాఁజుమ్ము వేయు, కన్నులును నోళ్లుఁ గలనేర్పుకాండ్రకైన. అచ్చ. రా. బాల. ౩౬.

నేఱా=నెఱా.

మ. రవిఁ దీవ్రద్యుతి యండ్రు పావకుని నేఱా వంటమా రండ్రు వాఃరివిభంబుల్ పెనుపం జాక్రిందిదివియల్ రేరాజ ని న్నెన్నుచో. చంద్రా. ౫. ౮౩. (శ. ర. పా. 'జొరా' ముద్రి. పా.)

నేల. వి. ౧. భూమి.

సీ. నేలయు నింగియుఁ దాళముల్ గాఁ జేసి యేపున రేఁగి వాయించి యాడ. భార. విరా. ౨. ౧౩౪.

క. చులుకన గలయొక్కకోలను, గుతిగాఁ దిగ్ప్రోల్లు నేలఁ గూలిచి కడిమిౝ... చు జేజేగములకుఁ, దలఁగని మే లిడినగిబ్బ త త్తకికొరపుౝ. నీలా. ౧. ౧౯. భార. విరా. ౨. ౧౩౪.

౨. భూలోకము.

శా. పాతాళంబును నేలయుం దివిజముం బాలించుసిద్ధుండవో, నాతండ్రీ నను నేల వచ్చినజగన్నాథుండవో చెప్పవే. ఉ. హరి. ౨. ౧౮౩.

౩. ప్రదేశము, తావు.

వ... ధర్త్రనందనుపిఱుఁద నొక్కింత నేల యరిగి ... భార. ఆది. ౬. ౧౪౩.

వ... పటికంపు రాచట్టు నేలల నెట్టుకొని ... మనుచ. ౩. ౨౦.

సీ... ఈప్రోలికి నాఁడు నేల నల్ల, యమునానదీగహ్వరమున బకుం డను రక్కసుం డుండు ...భార. ఆది. ౬. ౨౬౪.

౪. దేశము.

ఆ. నేల ప్రొద్దెఱింగి చాలుమానిసి రణోద్యమ మొనర్చి కాక... భార. విరా. ౪. ౨౨౧.

శ్లో. దేశకాలౌ తు సంప్రేక్ష్య యోద్ధవ్య మితి మే మతిః. సం. భార. విరా. ౫౧. ౩.

౫. మన్ను. (చూ. నేలఁగలయు.)

నేలకుఁదెచ్చు=చంపు, పడఁగొట్టు.

మ... అవ్వీరు లెవ్వ రొకో నేలకుఁదెచ్చి తా ఱ్ఱరునిచే వాఁటేల చిక్కెౝ... భార. ద్రో. ౨. ౨౩౬.

నేలపాలుగఁజేయు=నశింపఁజేయు.

సీ. పాడి దొరఁగి యప్పాపకర్ముఁడు పైచెఁ గాక చక్కటి తోడికయ్యమైన, లీల విమందఱ నేలపాలుగఁ జేయనే,...భార. శల్య. ౨. ౩౨౫.

నేలలోవెడలు=ఇల్లువిడిచి బయటకు వెళ్లు.

చ. పడఁ బడఁ బాలించుౝ వడఁకు బట్టినతల్లిని దండ్రి నేలలో, వెడలనితమ్ముఁగుల్లల నవి

నకులాంగన నోరు లేసియ్యాఁ, తొడుకుల బం
టుఁ బైద విడఁ ద్రోవక ప్రోఁకఁగ నెందు నీక
పొల్పడినది కర్ణునాదలనె భారతసంహిత
నిల్చుచాడ్పునన్. పాండు. ౩. ౩౭.

నేలవాఁపు=ప్రదేశము నుండి తొలఁగఁ జేయు, దూరముచేయు.

చ. నరవర మున్న చెప్పితి రణంబున నర్జునుఁ
డొద్ద నున్న నెవ్వరికిని ధర్మసూనుఁ బొదు
వంగ నశక్య మొకండు పార్థు న్నెదురుఁ డయి
నేలవాపి కొని ద్రోణుల నొప్పఁగఁ బోవఁ జా
లిరన్, వరవునఁ బట్టెదన్ బరులు వేవురు
మార్కొనినం గలంచెదన్. భార. ద్రో. ౧. ౨౧౬.

జః నేలఁగలయు, నేలఁగలుపు, నేలఁబెట్టు, నేలకడిమి, నేలకన్నము, నేలకలిగొట్టు, నేలకాన్పు, నేలగాపరి, నేలగుమ్మడి, నేలగుమ్ముడు మొ.

నేలఁగలయు. అ. క్రి. (నేలన్ + కలయు.) -మంటిపాలగు- నశించు.

(చంద్రోపాలంభము.) సీ. మానక గుప్పించుమ
దనకోదండంబు నిష్ఠురతను దన్ను నేలఁ
గలయ. వరాహ. ౪. ౨౧.

ఆ. ఘోరశిలలవృష్టి గురియించె నొడలు వ్రీఁగించి
యతఁడు వికటగిరులు గాఁడ, గురుతరద్రు
మముల గుదిగ్రుచ్చినట్లుగ, నిఖిలజంతుతతు
లు నేలఁగలయ. కళా. ౫. ౫౪.

నేలఁగల(లు)పు. స. క్రి. (√నేలఁగలయు.) నేలపాలుఁజేయు, ధ్వంసముచేయు.

సీ. అయ్యస్త్రమాశక్తి నద్భుతంబుగ నేలఁగ
లపి యుధిష్ఠిరువలను నిగుడ. భార. ద్రో.
౩. ౨౪౩.

సీ. బలసమేధితపలాశులఁ గాని పెంక్షలాశులఁ
గొమ్ముచే నేలఁగలపఁ బోరు

వరాహమూర్తి. దశా. ౩. ౭౦౭. ౭౦. శ్లో. ౮౭.

గీ. నిద్రవోయెడుసుఖ మెల్ల నేలఁగలిపి, ప్రతి
దినంబును దాఁ జేయురత్నపూజ, శివుని పై
నుండకుండినఁ జింత నొంది, రాత్రి శివ
రాత్రిగా జాగరమ్ముఁ జేసె. కాళ. ౩. ౧౧౭.
('పోఁగొట్టుకొను' అని భావము.)

నేలఁబెట్టు. స. క్రి. (నేలన్ + పెట్టు.) ౧. నేల పైనుంచు. ౨. నశింపఁజేయు.

సీ. తెలికటి సైకతములు వెన్కఁ బడ నొత్తె
నెత్తమ్మి నడుగులు నేలఁబెట్టె. బిల్హ. ౨.
౧౨౦. (రెండర్థములకు నిదియే ఉదాహర
ణము.)

నేలఁబెట్టి కాలరాచు=మిక్కిలిపీడించు.

గీ. నెఱయ పౌరసములు దమ్ము నేలఁబెట్టి కాల
రాచుచు నున్నాఁడు కలువలచెలి, తేతలఁ
బడఁజాల మిది రాహువేణి యనుచు, నతివ
పదములఁ బడె నన నడుగు లమరు. బిల్హ. ౨.
౧౧౪.

నేలకడప=నేలకడిమి.

ఆ. ఉప్పు చింతపండు నొప్పుమీఱిన నేల, కడప
వ్రేళ్ల నూరి యంథకశట్టి, చమర... తలపుం
డ్లు, మానిపోవు...(చికి. చి. ని.)

గీ. నేలకడపయుఁ బెన్నేరు నిలను జెలువు, వె
లయుపల్లెరు వ్రేళ్లను వేఱు వేఱు, మేక
పాలును గొన ... స్త్రీపురుష మోహములు
దీఱు సిద్ధముగను. (చికి. చి. ని.)

నేలకడిమి. వి. (√నేల.) భూకదంబము. ౯. (శ.ర.)

నేలకలిగొట్టు. వి. (√నేల.) భూపాటలి. ౯. (శ.ర.)

నేలకాన్పు. వి. (నేల + కాన్పు.) భూపుత్రి, సీతాదేవి.

గీ. పాగదవురెమ్మ నలపుకప్పురపుదిమ్మ, కాన
వేలమ్మ యీనేలకాన్పుఁగొమ్మ. అచ్చ. రా.
అర. ౯౭.

ఇట్టే: నేలచూలి.

ఆ. నేల యేలుకొనెడుజోలి య దేటికి, నేల చూలిమీఁద నేల యాస. అచ్చ. రా. యు. ౩౯౪.

ఆ. నేలచూలి వెదక గాలిబిడ్డఁడు లోను, గాను గలిగినట్టికడిఁది కొమ్మ, మెకపుగములననుప... యయా. ౩. ౨౨.

నేలగాపరి. వి. (నేల + కాపరి.) రాజు.

సీ. అలగాపరి పూఁపు లచ్చుటఁ దిగఁ ద్రోచి నేలగాపరులఁ దా నేలఁ గల్గె. అచ్చ. భా. ౧. ౕ౫.

నేలగుమ్మడి. వి. (√ నేల.) భూమికర్కారువు.

సీ. నెగడు విదార్యాఖ్య నేలగుమ్మడి యన... ఆం. భా. ౨. ౫౪.

నేలగుమ్ముడు. వి. (√ నేల.) విదారి. (ఇది నల్ల నేలగుమ్ముడు, తెల్లనేలగుమ్ముడు అని ద్వివిధము. శ. ర.)

నేలగొలిమిడి. వి. (√ నేల.) గోలోమి. (శ. ర.)

నేలజమ్మి. వి. (√ నేల.) పిన్నజమ్మి, శమీరము. (చి. ని, శ. ర.)

నేలజేజే. వి. (√ నేల.) భూదేవుఁడు, బ్రాహ్మణుఁడు.

సీ. ఇటు నేలజేజేల కెలు కైనచెంగావినుద సంజఁ దగుకొండఁ జూచినాఁడ. నరస. ౫. ౨౨.

సీ. సీటూర నెదిరిన నేలజేజేదంటు తే జెల్ల నడఁచినగిట్టలెంక. అచ్చ. రా. అయో. ౯౩.

నేలతంగేడు. వి. (నేల.) చిన్నతంగేడు, ఆకుల్యము.

సీ. ములువెంపలి ములుస్తె గలేజేరు గుంటగజ్జెరును దంతిబందారు నేల, తంగేడు... హంస. ౪. ౧౦.

నేలతాడి. వి. (√ నేల.) తా[illegible]



(సానుస్వారమని చి. ని.)

సీ... బీఱ వెంగలిం గోఁదాడు సీఁదాడు ఖర్జూర మీఁత నేల, తాడి... హంస. ౪. ౧౧.

సీ... నేలతాడి యనంగ నెసఁగు ముసలి. ఆం. భా. ౨. ౫౧.

నేలతామర. వి. (√ నేల.) మెట్టతామర, స్థలపద్మిని.

సీ. స్థలపద్మ మగు మెట్టతామర యన... నేల తామర యన... ఆం. భా. ౨. ౫౯.

సీ. దధియుక్తముగ నేలతామరఁ గొన... (చికి. చి. ని.)

నేలతాలుపు. వి. (√ నేల.) ౧. పర్వతము, భూధరము.

సీ. నేలతాలుపు రాచచూలిగాదిలికందు దొసఁగుచీకటిచాల్పుతోఁ గల విందు. అచ్చ. రా. పీఠి. ౭.

౨. రాజు, భూధరుఁడు.

క. కలికపుమానిసి యని నీ, తలఁపున నిపుడల్ల నేలతాలుపుమిన్నుం, జులుకఁగఁ జూచెద వత నిక్క, గెలువఁగ నీవంటివారికిం దర మగునే. అచ్చ. రా. యు. ౨౧.

నేలతీఁటకసింద. వి. (√ నేల.) కసిందలో నొకభేదము, వృక్షవిశేషము.

గీ. నేలతీఁటకసిందయుఁ గోల వెముడు, బొంతవెము డుల్లియును సదాముస్తె వెందలు, గాఁగలుగునట్టి చిఱుచెట్లఁ గాంచి యంత. హంస. ౪. ౧౦.

నేలతొళసి. వి. (√ నేల.) భూతులసి. (శ. ర.)

నేలన(న)మ(మి)లి. వి. (√ నేల.) పక్షివిశేషము.

సీ. కొక్కరల్ కక్కురల్ గువ్వలు వెలినెలు నేలనెమళ్లును బోలుగలును. రసిక. ౧. ౫౪ ౧. ౧౧౫.

  

వ... మఱియుఁ గైదు కక్కెర కారుకోడి లావుక వెలిచ నేలనమలి డాబ గొంగడిగాఁడు మొదలగుపక్షులు పొదలుకొని యుండు పిట్టపట్లును... చంద్రా. ౧. ౨౪.

ఆ. పికిలి నేల నెమిలి పెనుగువ్వ బకదారి, పావురాయి... ఆది యైనపక్షు లతఁడు దీర్చె. హంస. ౩. ౧౩.

నేలనేరేడు. వి. (√నేల.) కాకినేరేడు, భూమిజంబుకీ.

సీ... నేలనేరే డనఁగ... భూజంబునామంబు పొల్చు... ఆం. భా. ౧. ౪౭.

నేలపట్టి. వి. (నేల + పట్టి.) ౧. అంగారకుఁడు, భౌముఁడు. (శ. ర.) ౨. నరకాసురుఁడు. ౩. భూపుత్రి, సీత. (శ. ర.)

నేలపల్లటి(టీ). వి. (√నేల.) పారావతవిశేషము.

సీ. పారావతం బగుఁ బావురాయి యనఁగ... తద్భేదములుగాను దనరుచుండ ను నేలపల్లటి... అనఁగ... ఆం. భా. ౧. ౨౫.

సీ. పావురములు నేలపల్లటీల్ కూకీలు... సుగటీలనఁగఁ బొల్చును గలరవములు... సాం. ని. తిర్య. ౪౭.

నేలపొన్న. వి. (√నేల.) కోలపొన్న, అంఘ్రిపర్ణికీ.

సీ. క్రోష్టుపుచ్ఛికయా నేలపొన్న, నా... ఆం. భా. ౧. ౫౫.

నేలమట్టము. విశే. (√నేల.) నేలతో సమానమైనది; నాశితము.

మ. దిననాథుం డుదయాద్రి శృంగమున కేతెనెల్లి... కూల్తు లంకాపురీ, ఘనసాలాదుల నేలమట్టము గ నాకఁబింప సత్త్వంచుచున్. భా. రా. యు. ౩౧౫.

సీ. ఊర్ధ్వాండకర్పరం బొరయు వింధ్యాద్రికూటంబులు నేలమట్టంబు



గీ. దేవ యొకవానరంబు లీలావనంబు, నేలమట్టంబు చేసి యాఫలపాల, మాఁచి యాడెడుతనుఁ జూచి కోఁచవాలు, దక్కసుల నొక్కి తోరణం బెక్కె నగుచు. రామా. ౬. ౨౦౩.

నేలమామెన. వి. (√నేల.) వృక్షవిశేషము.

సీ. మామెనయును నేలమామెన యటికమామిడి దూలగోవెల మేఁకమేయు. గీ. నాకు నల్లేరు... హంస. ౪. ౧౦.

నేలమాలె. వి. (√నేల.) భూగృహము, భూమిలోపలియిల్లు.

గీ. పాయమునఁ బెద్దవాఁ డొకబ్రాహ్మణుండు, లక్షణజ్ఞుండు సంగతలక్షణాంగి, నొక్కకన్నియఁ బెండ్లి యై యొరులగోష్ఠి, మరగకుండంగ సఖి నేలమాలెఁ బెట్టి. కేయూర. ౩. ౨౧౩.

గీ. నేలమాలె నా భూమ్యంతరాలయమ్ము... ఆం. భా. ౧. ౧౨.

నేలమాలెలద్రవ్య=లోలోపల కట్టుఉపస్సు.

క. వెనిమిటియు నత్త వదినెలు, కనుఁగలిగి మెలఁగ వెడలఁగా నెడ లేమిం, దినదినముఁ దత్తలోదరి, మనమున నే యిట్టి నేలమాలెలద్రవ్యా. శుక. ౧. ౫౦౪.

నేలములక. వి. (√నేల.) వాఁకుడు, వార్తాకీ.

సీ... నేలములక యనఁగ. గీ... సర్వాక్షి ప్రబలు. ఆం. భా. ౧. ౫౯.

నేలమొలత్రాఁడు. వి. (నేల + మొలత్రాఁడు.) సముద్రము.

గీ. వచ్చి యప్పేఁడి వేలుపువంగడంపు, నేలమొలత్రాటినిండుకుం దేటితాల్పు, మ్రోల విల్చి కరంబు ప్రేముడి దలిర్ప, వెరవుతోఁ బల్కెఁ గేలుఁదామరలు మొగిచి. అచ్చ. రా. యు. ౧౫౫.

నేలయడుగు. వి. (√నేల.) పాతాళము.

సీ. పాతాళ నామంబు... నేలయడుగు గనంగ వెగడుచుండు. ఆం. భా. ౧. ౧౪౫.

నేలయునిరిక. వి. (√నేల.) భూధాత్రీ.

గీ... నేలయునిరిక యన,నలరు భూధాత్రి... ఆం. భా. ౨. ౪౭.

నేలయెకిమీఁడు. వి. (నేల+ఎకిమీఁడు.) భూపతి,రాజు.

గీ ... ఓ నేలయెకిమీలకోలముసామి, చేతగు తుర కలపెద్దచెంచువాని,యింటిచెంచెత చెలి మించుగుంటికెలని, పాలముల్గోకలఁ జెలఁగు చెంచులము నేము. ఉ. రా. 2. 3౭౫.

నేలయేలుదంటు. వి. (√నేల.) క్షత్రియుఁడు, రాజు.

సీ... నేలయేలుదంటులు... గీ... రెండవ వంగ డంపుఁ బలుపు లన క్షత్రియాఖ్యలౌ... సాం. ని. మాన. ౨.

నేలరేను. వి. (√నేల.) భూబదరీ. (శ. ర.)

నేలఱేఁడు. వి. (నేల+ఱేఁడు.) రాజు.

గీ. అటప్రోలికి నేలిక యగుచు నెల్ల, నేల ఱేఁడులు దను మేలు మే లటంచుఁ, బొగడ మగుడనికలుముల వెగడి పజలఁ, దద్దయును సాఁకుకొనుచుండు దశరథుండు. అచ్చ. రా. బాల. ౪౪.

చ. కనఁగొనె నేలఱేఁడు మతికాంచనభూష ణభూషితుఁ డ్మృగా,జినయుతు... చెన్న. ౫. 30౪.

నేలవెలఁగ. వి. (√నేల.) భూవెలఁగ.

సీ... నేల వెలఁగాకు నొనరంగఁ గఱుకుఁగాఁజేసి పోసినమాను...(చికి. చి. ని.)

నేలవేము. వి. (√నేల.) భూనింబము.

సీ. శ్రీ తులసియు సంబరేను నేలుసిరికి... నేలవే మూటి చల్లగడ్డ. హంస. ౪. ౧౦.

సీ... నేలవే మనంగ భూనింబ మొప్పు. ఆం. భా. ౨. ౫౦.

నేలవేలుపు(ల్పు) వి. (నేల+వేలుపు.) భూదేవుఁడు, బ్రాహ్మణుఁడు.

గీ.అప్పు డెకిమీఁడు తతిచెయ్యి లమరఁ దీర్చి, పేదలకు నేలవేలుపుఁ బెద్దలకును, బొసఁగ రొక్కంబుఁ దొడవులుఁ జుటుములును, దొడుకులు నొసంగి పడిరేలు గడపె యంత. అచ్చ. రా. బాల. ౭౪.

గీ. నేలవేలుపు మొదలిటి నేమములకు, నెలవు చెలువవుగమికాఁడు పిలుకుమారి, రక్కసుల చేతఁ బోయినదుక్కుచునకు, వగవ కెట్లోరు మె యెల్ల నొగుటఁ దండ్రి. యయా. 3. ౧3౧.

ఆ. పుడమి ఱేనితోడఁ బొడర నీలా వేమి, ఖరునికంటె నల్లగట్లనూఁడు, కొడుకుకంటె గండ్ర గొడ్డలితాలుపు, నేలవేల్పుకంటె నెఱయ చెపుమ. అచ్చ. రా. యు. 33.

నేలసంపెఁగ. వి. (√నేల.) భూమిచంపకము. (శ. ర.)

నేలాఁపు. వి. (నేల+ఆఁపు.) శ్యేనవిశేషము, ఒకవిధముగుడేగ.

సీ. నేలనెమళ్లు నేలాఁపుడేగల విడిచి యేపు నఁ దీఁచ మడపఁజేసి. రసిక. ౧. ౧౧౫.

నేలుసిరిక. వి. (నేల+ఉసిరిక.) భూమ్యామలకి.

సీ. శ్రీతులసియు సంబరేను నేలుసిరి కిశ్వరి నేలవే మూటి చల్లగడ్డ. హంస. ౪. ౧౦.

నేలొద్ది. వి. (√నేల.) వృక్షవిశేషము.

సీ. కలజువ్వి వావిలి గండువావిలి యేటిమద్ది మద్దియును నేలొద్ది యొద్ది. హంస. ౪.

# నై

నైకచరము. సం. విణ. (అ. ఆ. అ.) ఒంటిగా సంచరింపనిది, గుంపుగూడి తిరుగునది. (మేఁక, పంది మొ.)

నైకటికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) సమీపమున నున్నవాఁడు. వి. అ. పుం. -భిక్షాదులకై గ్రామాదుల చాపున వసించువాఁడు- భిక్షువు, యతి.

నైకట్యము. సం. వి. అ. న. సామీప్యము, చాపు.

నైకభేదము. సం. విణ. (అ. ఆ. అ.) అనేక భేదములు కలది. (చిత్తరువు మొ.)

నైకమాయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అనేకమాయలు కలవాఁడు. వి. అ. పుం. పరమేశ్వరుఁడు.

నైకము. సం. విణ. (అ. ఆ. అ.)- ఏకము కానిది- అనేకము, పెక్కు.

నైకరూపుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నానారూపములు కలవాఁడు. వి. అ. పుం. పరమేశ్వరుఁడు.

నైకాత్మ(ము.) సం. విణ. (న్). ౧. అనేక స్వరూపములు కలది. ౨. పెక్కులాత్మలు కలది. వి.న్.పుం. పరమాత్ముఁడు. (రూ. నైకాత్ముఁడు.)

నైకృతికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) శాఠ్యముతో జీవించువాఁడు, వంచకుఁడు.

నైగనిగ్యము. సం. వి. అ. న. నిగనిగలాడుట.

నైగమము. సం. విణ. (అ.ఈ. అ.) ౧. వేదసంబంధమైనది. ౨. పట్టనసంబంధమైనది. 3. వణిక్సంబంధమైనది. వి. అ. న. ౧. ఉపనిషద్రూపమగు వేదభాగము, వేదాంతము. ౨. నయము, నీతి.

నైగమికము. సం. విణ. (అ.ఈ.అ.) ౧. నిగమమున ఉన్నది. ౨. నిగమమువలన కలిగినది. 3. నిగమమునకు వ్యాఖ్యానమైనది.

నైగముఁడు. సం. వి. అ. పుం. ౧. నిగమవిదుఁడు, వేదార్థము తెలిసినవాఁడు. ౨. నాగరుఁడు, పౌరుఁడు. 3. వణిజుఁడు, వర్తకుఁడు.

నైఘంటుకము. సం. విణ. (అ.ఈ.అ.) నిఘంటువును గుఱించి రచింపఁబడినది. (గ్రంథము.) వి.అ.న. వేదనిఘంటుగ్రంథ ప్రథమకాండము.

నైచికము. సం. వి. అ. న. గోశిరః ప్రదేశము, ఆవుతలభాగము.

నైచికి. సం.వి. ఈ. స్త్రీ. ఉత్తమమైనయావు.

నైచ్యము. సం. వి. అ. న. ౧. నీచత్వము. ౨. (భక్త్యాదులచే కలుగు) నమ్రత్వము.

నైజము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. స్వకీయము, తనది. ౨. స్వాభావికము, సహజము.

నైతలము. సం. వి. అ. న. నరకము.

నైతలసద్ముఁడు. సం. వి. న్. పుం. యముఁడు.

నైత్యకము. సం. విణ. (అ.ఈ.అ.)=నైత్యికము.

నైత్యము. సం. విణ. (అ. ఈ. అ.) నిత్యము చేయఁదగినది. (దానకర్మాది.) వి. అ. న. నిత్యత్వము, శాశ్వతత్వము.

నైత్యశబ్దికుఁడు. సం.విణ. (అ.ఈ.అ.) శబ్దము నిత్యమని వాదించువాఁడు. (పూర్వమీమాంసకుఁడు.)

నైత్యికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిత్యమును కలుగునది, ఎప్పుడును సంభవించుచుండునది. ౨. నిత్యమును చేయవలసినది. (కర్మము.)

నైదాఘము. సం. విణ. (అ. ఈ. అ.) నిదాఘసంబంధమైనది, గ్రీష్మసంబంధమైనది. వి. అ. న. నిదాఘము, వేసఁగి.

నైదానికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. (రో॰గ) నిదానము నెఱిఁగినవాఁడు. ౨. (రో॰గ) నిదాన ప్రతిపాదక మగు గ్రంథమును చదువువాఁడు.

నైదానుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) రో॰గ మూలకారణము నెఱిఁగినవాఁడు.

నైదేశికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) -నిదేశ మును చేయువాఁడు-కింకరుఁడు, సేవకుఁడు.

నైధనము. సం. విణ. (అ. ఈ. అ.) మరణసంబం ధమైనది. వి. అ. న. ౧. నిధనము, మరణము. ౨. (జ్యోతి.) లగ్నమునకు అష్టమస్థానము. ౩. జన్మనక్షత్రమునకు ఏడవదియు, పదునాఱవ దియు, ఇరువది యైదవదియు నగు నక్షత్రము.

నైధానము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిధా నసంబంధమైనది, నిధిసంబంధమైనది. ౨. ని ధాన సాధ్యమైనది. (వాచ.)

నైపథ్యము సం= నేపథ్యము.

నైపము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నీపసం బంధమైనది. ౨. నీపవికారమైనది.

నైపాతికము సం. విణ. (అ. ఈ. అ.) ప్రస్తావ వశమున చెప్పఁబడినది. (అ. ని.)

నైపాళము. సం. విణ. (అ. ఈ. అ) ౧. నేపా ళదేశసంబంధమైనది. ౨. నేపాళదేశమునఁ బుట్టినది. వి. అ. పుం. నేపాళనింబము, నేపా ళపువేము॰.

నైపాళి. సం. వి. ఈ. స్త్రీ. ౧. నవమల్లిక, విర జాజి॰ ౨. మనశ్శిల, మణిసిల. ౩. శేఫాలిక, నల్లవావిలి॰. ౪. నీలి॰.

నైపాళికము. సం. విణ. (అ. ఈ. అ.) నేపాళ దేశమునఁ బుట్టినది. వి. అ. న. రాగి.

నైపుణము. సం. వి. అ.న. నిపుణత్వము, కౌశ లము.

నైపుణి. సం. వి. ఈ. స్త్రీ. నిపుణత్వము, కౌశ లము.

నైపుణ్యము, సం= నైపుణము.

నైబిడ్యము. సం. వి. అ. న. నిబిడత్వము, దట్ట ముగానుండుట. ౨. (సంగీ.) సంగీతశాస్త్రోక్తస్వర గుణభేదము, నిబిడముగా ఎవరైనను నిధ్వనివచ్చు నట్లు పిల్లనగ్రోవి మొదలగునవి ఊదుట.

శ్లో॰. నైబిడ్యం ప్రోథతా చాపి సుస్వరత్వంచ శీఘ్రతా,మాధుర్య మితిపం చామీ ప్రోక్తా శేషు గుణాః స్మృతాః॥

నైభృత్యము. సం. వి. అ. న. -నిభృతభావము- ౧. అచాంచల్యము, నిశ్చలముగానుండుట. ౨. అడఁకువ, వినయము ౩. రహస్యము.

నైమంత్రణకము. సం. వి. అ. న. ఆతిథ్యము, అతిథిసత్కారము.

నైమయుఁడు సం. వి. అ. పుం. -నిమయము- (సరకుల వినిమయము) వలన జీవించువాఁడు- వర్తకుఁడు, బేహారి.

నైమిత్తము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిమి త్తసంబంధమైనది. ౨. నిమిత్తమువలనఁగలిగినది. వి. అ. న. శకునగ్రంథముయొక్క వ్యాఖ్యా నము.

నైమిత్తికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిమిత్తమువలనఁగలుగునది. ౨. నిమిత్తమునాశ్ర యించి చేయఁదగినది, నిమిత్తమునుబట్టి చేయఁ బడినది. (అద్దికాది.) వి. అ. న. -నిమిత్తమును (కారణమును) అనుసరించి వచ్చినది- కార్యము, ఫలము.

శ్లో॰. ఉదేతి పూర్వం కుసుమం తతఃఫలం, ఘ నోదయః ప్రాక్తదనంతరం పయః, నిమిత్త నైమిత్తికయో రయంక్రమః, తవప్రసా దస్య పురస్తుసంపదః. శాకుం. ౭. ౩౦.

౨. ఒకానొకనిమిత్తమును బట్టి ఆయాకాలమునఁ జేయఁబడు కర్మము. (కర్మము- నిత్యము, నైమిత్తికము, కామ్యము అని మూఁడువిధములు.)

నైమిత్తికుఁడు. సం. వి. అ. పుం. నిమిత్తములను చక్కఁగాఁ దెలిసినవాఁడు; శకునశాస్త్రము తెలిసినవాఁడు (జోస్యుఁడు, వెం.)

నైమిశము. సం. వి. అ. న (బ్రహ్మ సృజించి విడిచినమనోమయచక్రముయొక్క నేమి ఏస్థలమున ఊడిపడిపోయినదో అట్టిపుణ్యారణ్యము నైమిశము.)

సూతుఁడు శౌనకాదిమహర్షులకు పురాణాదులు వినిపించినపుణ్యారణ్యము.

శ్లో. ఏతన్మనోమయం చక్రం మయా సృష్టం విసృజ్యతే, యత్రాస్య శీర్యతే నేమి స్స దేశ స్తపస శ్శుభః ... ప్రయయు స్తస్య చక్రస్య యత్ర నేమి ర్వ్యశీర్యత, తద్వనం తేన విఖ్యాతం నైమిశం మునిపూజితం. (వాయుపు. వాచ.)

నైమిషము. సం. విణ. (అ.ఈ.అ.) ౧. నిమిష సంబధమైనది. ౨. నిమిషమాత్ర ముండునది. వి. అ. న.- సూతుఁడు శౌనకాదిమహర్షులకు పురాణాదులు వినిపించిన పుణ్యారణ్యము (ఇందు నిమిషమాత్రముచే దానవబలము హతమైనది.)

శ్లో. ఏవం కృత్వా తతో దేవో మునిం గౌరముఖం తదా, ఉవాచ నిమిషే ణేదం నిహతం దానవం బలమ్, అరణ్యే స్మిం స్తత స్త్వేత న్నైమిషారణ్యసంజ్ఞితం, భవిష్యతి యథార్థం వై బ్రాహ్మణానాం విశేషకం. (వరా. వాచ.)

నైమేయము. సం. వి. అ. పుం. వినిమయము సరకులమార్పు.

నైయంకవము. సం. విణ. (అ.ఈ.అ.) న్యంకు సంబంధమైనది, ఇఱ్ఱికి సంబంధించినది. (శబ్దా.)

నైయగ్రోధము. సం. విణ. (అ.ఈ.అ.) న్యగ్రోధ వృక్షసంబంధమైనది. (దండాది.) వి. అ. న. న్యగ్రోధఫలము, మఱ్ఱిపండు.

నైయత్యము. సం. వి. అ. న. ౧. నియతముగా నుండుట, ౨. ఆత్మనిగ్రహము.

నైయమికము సం. విణ. (అ. ఈ. అ.) నియమప్రాప్తము, నియమముచే సంభవించునది. (ఋతుకాలమున భార్యను గలియుట వెం.)

నైయాయము. సం. విణ. (అ. ఈ. అ) ౧. న్యాయ సంబంధమైనది. ౨. న్యాయశాస్త్రమునకు వ్యాఖ్యానమైనది.

నైయాయికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) న్యాయశాస్త్రము నెఱిఁగినవాఁడు, న్యాయశాస్త్రమును జదివినవాఁడు, తార్కికుఁడు.

నైయాసికుఁడు సం. విణ. (అ. ఈ. అ) అంగన్యాసకరన్యాసమాతృకాన్యాసాదులు తెలిసినవాఁడు.

నైరంతర్యము సం. వి. అ. న. -నిరంతరత్వము- ౧. ఎడతెగకుండుట, విచ్ఛేదము లేమి. ౨. ఎడము లేకుండుట, మిక్కిలి క్రిక్కిఱిసి యుండుట.

నైరపేక్ష్యము. సం. వి. అ. న. -నిరపేక్షత్వము- అపేక్ష లేకుండుట, కోరిక లేకుండుట.

నైరర్థ్యము సం. వి. అ. న. -నిరర్థకత్వము- ౧. ప్రయోజనము లేకుండుట. ౨. అర్థము లేకుండుట.

నైరాశ్యము. సం. వి. అ. న. -నిరాశత్వము.- ౧. ఆశలేనితనము. ౨. ఆశ లుడుగుట, ఆశ వదలుకొనుట.

నైరుక్తికుఁడు. సం. వి. అ. పుం. నిరుక్తమును -వేదాంగభేదమును- దెలిసినవాఁడు.

నైరుక్తుఁడు. సం. = నైరుక్తికుఁడు.

నైరుజ్యము. సం. విణ. (అ. ఈ. అ.) రోగములులేకుండుట, ఆరోగ్యము.

నైరూహికము. సం. విణ. (అ. ఈ. అ.) ఊహము లేక చేయఁబడినది, విమర్శము (తత్త్వనిర్ణయము) చేయకయే ఆచరింపఁబడినది. వి.అ. పుం. వస్తికర్మభేదము.

నైరృతము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిరృతికి సంబంధించినది. ౨. నిరృతిదేవతాకము. (పశువు మొ.) వి. అ. న. మూలనక్షత్రము.

నైరృతి. సం. వి. ఈ. స్త్రీ. దక్షిణపశ్చిమముల నడిమిదిక్కు.

నైరృతుఁడు. సం. వి. అ. పుం. ౧. - అధర్ముని భార్య యగునిరృతియొక్క సంతతివాఁడు -రాక్షసుఁడు. ౨. నిరృతి, దక్షిణపశ్చిమ దిక్పాలకుఁడు.

నైర్గుణ్యము. సం. వి. అ. న- నిర్గుణభావము- ౧. గుణములులేమి. ౨. సద్గుణములు లేకుండుట. ౩. సత్త్వాదిగుణములు లేమి.

నైర్ఘృణ్యము. సం. వి. అ. న- నిర్ఘృణత్వము- ఘృణలేమి, కనికరములేకుండుట.

నైర్దేశికుఁడు. సం. వి. అ. పుం. -నిర్దేశమును (ఆజ్ఞను) చేయువాఁడు- భృత్యుఁడు, సేవకుఁడు.

నైర్మల్యము. సం. వి. అ. న. ౧. నిర్మలత్వము, పరిశుద్ధత. ౨. భోగ్యవస్తువులందలివైరాగ్యము.

నైర్వాహికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిర్వాహకుఁడు, నిర్వహించువాఁడు. ౨. (జలాదులను) పెరచికొని పోవువాఁడు.

నైల్యము. సం. వి. అ. న. నీలత్వము, నల్లఁదనము.

నైవాసికము. సం. విణ. (అ. ఈ. అ.) నివాసమునకుఁ దగినది. (ఇల్లు మొ.)

నైవేద్యము. సం. వి. అ. న. నివేద్యము, దేవతలకు నివేదింపఁదగిన వస్తువు.

నైవేశము సం. విణ. (అ. ఈ. అ.) ౧. వివాహమూలమున లబ్ధమైనది. ౨. వివాహసంబంధమైనది. ౩. గృహసంబంధమైనది.

నైవేశికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. వివాహార్థ మియ్యఁబడునది (నగలు మొ.) ౨. గృహోపకరణము.

నైశము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిశాసంబంధమైనది, రాత్రిది. ౨. రాత్రియందు పుట్టినది. ౩. రాత్రియం దుండునది.

నైశికము. సం=నైశము.

నైశ్చల్యము. సం. వి. అ. న. నిశ్చలత్వము, చలింపమి.

నైశ్చిత్యము. సం. వి. అ. న. నిశ్చితత్వము, నిశ్చయము.

నైశ్శ్రేయసము. ~~నిశ్శ్రేయసము~~ సం. విణ. (అ. ఈ. అ.)-నిశ్శ్రేయసమునకు (ముక్తికి) హితము- ౧. ముక్తి గలిగించునది. ౨. ముక్తిసంబంధమైనది. ౩. శుభము కలిగించునది, శుభమునకు సాధన మగునది. ౪. శుభసంబంధమైనది.

నైశ్శ్రేయసికము. సం=నైశ్శ్రేయసము.

నైషధీయము. సం. విణ. (అ. ఈ. అ.) నైషధునకు (నలునకు) సంబంధించినది.

నైషధుఁడు. సం. వి. అ. పుం. ౧. నిషధదేశపు రాజు. ౨. నలుఁడు. ౩. నిషధదేశపువాఁడు.

నైషాదకము. సం. విణ. (అ. దిశా. అ.) నిషాదుఁడు సిద్ధము చేసినది. (ధాన్యము మొ.)

నైషాదము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. నిషాదసంబంధమైనది. ౨. నిషాదునిసంతతి.

నైషాదికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) నిషా

దుసిసంతతివాఁడు.

నైష్కర్మ్యము. సం.వి.అ.న. ౧. శాస్త్రప్రకారము విహితకర్మములను విడుచుట, కర్మత్యాగము; కర్మఫలత్యాగము. ౨. పని చేయకుండుట, నిర్వ్యాపారత్వము, సోమరితనము.

నైష్కశతికము సం.విశ. (అ.ఈ.అ.) నూఱు నిష్కములపరిమాణము కలది. ౨. నూఱు నిష్కములకు కొనఁబడినది.

నైష్కించన్యము. సం. వి. అ.న. -నిష్కించనత్వము- కొంచెమైనను లేమి, మిక్కిలి పేదఱికము.

నైష్కికము. సం. విశ. (అ.ఈ.అ.) ౧. నిష్కమునకు కొనఁబడినది. ౨. నిష్కవికారమైనది, నిష్కముతో చేయఁబడినది.

నైష్కికుఁడు. సం. వి. అ.పుం.కోశాధ్యక్షుఁడు, టంకసాలయధికారి.

నైష్క్రమణము. సం. విశ. (అ. ఈ. అ.) ౧. నిష్క్రమణమున - శిశువును గృహము నుండి తొలుసారి బయటికి తీసికొనివెళ్లునపుడు- ఈయఁబడునది. ౨. నిష్క్రమణకాలమున చేయఁదగినది. (సంస్కారము, పదార్థము మొ.)

నైష్ఠికము. సం.విశ. (అ.ఈ.అ) ౧. నిష్ఠకలది, ఆసక్తము. ౨. నిశ్చితము, నిష్కృష్టము. ౩.అంత్యకాలమున చేయఁదగినది, మరణకాలమున చేయవలసినది. (కర్మము మొ.)

శ్లో. మృతదేహవిసర్జనః పితుః చిర మశ్రూణి విముచ్య రాఘవః, విదధే.విధి మస్య నైష్ఠికం, యతిభి స్సార్థ మనగ్ని మగ్నిచిత్.సం. రఘు. ౮. ౨౫.

౪. స్థిరమైనది, నిలుకడ గలది.

నైష్ఠికుఁడు. సం. విశ. (అ. ఈ. అ.) ఆసక్తుఁడు, నిష్ఠ కలవాఁడు. వి. మరణపర్యంతము బ్రహ్మచర్యమును పూని గురుకులమున వసించు బ్రహ్మచారి. (స్మృతి.ఉపకుర్వాణుఁడు.)

నైష్ఠుర్యము. సం. వి. అ. న. -నిష్ఠురత్వము- ౧. కాఠిన్యము ౨. పారుష్యము, పరుసఁదనము

నైసర్గికము సం. విశ. (అ. ఈ. అ.)-నిసర్గాగతము-స్వభావమువలన వచ్చినది,స్వాభావికము.

నైస్త్రింశికుఁడు. సం. విశ. (అ. ఈ. అ.) నిస్త్రింశము (కత్తి) ఆయుధముగాఁగలవాఁడు, కత్తిని చేఁబూని పోరువాఁడు.

నైస్పృహ్యము. సం. వి. అ. న. నిస్పృహత్వము, ఇచ్ఛలేమి.

నైస్స్వము. సం. విశ. (అ. ఈ. అ.) నిస్స్వని సంబంధమైనది. వి. అ. న. నిస్స్వత్వము, దారిద్ర్యము.

నైస్స్వ్యము. సం. వి. అ. న. నిస్స్వత్వము, దారిద్ర్యము.

## నో

నోంచు. స. క్రి. (√నొచ్చు.) ౧. (శరీరమును గాని, మనస్సును గాని) నొచ్చునట్లు చేయు,నొప్పించు, బాధించు.

ఉ. నోంచినఁ గెంపుసొంపునఁ గనుంగవ యొప్పఁగ నూతుఁ ద్రుంచి విల్ ద్రుంచి తురంగకక్ష్ములఁ దూపులు నించి యులంచి మేను నొప్పించిన... భార. ద్రో. ౨. ౩౪.

గీ. చంపె నత్తెఱఁగుల్లంబు నొంపమున్న. భార ద్రో. ౧. ౧౫౪.

చ. కరితురగాదిఘట్టనయు గాలియు నొంపదె యొంటి యున్నయత్తఱవును... భార. ఉద్యో. ౨. ౮౮. (ఇట పడఁ జేయు అని భావము.)

దిగ్గజములధృతిసన్నగిలెఁ...భూరిభేరీభాంకారమునఁ. గా. వి. ౨. ౪౨.

గీ. ఘనజరాభూతహుంకృతి నెనయ దగ్గు, నొ
ఉల సద్వృత్తి కర్ణవిస్ఫురణ నొగులఁ. దశా. ౨. ౧౩౯.

వి. ౧. వికలమగుట. (శ. ర.) ౨. నొప్పి. బాధ, వ్యథ.

క. తనువు నొగిలించుకంటెను, మనము నొగుల్చు
టరయ హింస మదిఁ బరికింపఁ, దనువు నొగు
లవుడ తీఱును, మనము నొగులు మనిసదనుక
మానదు సుమ్మీ. (శ. ర.)

సీ. బారి నొగులు నొప్పి బాధ సెకులు నొవ్వి
వందురు దురపిల్లు కొందలంబు, సలుపు నోవి
యనంగఁ జను వ్యథ... ఆం. భా. ౧. ౧౫౦

జః నొగిలించు, నొగుల్చు.

నొగుల్చు(లుచు)=నొగిలించు, స. క్రి. (√నొగులు)
(ముక్కలుచేయు, పాడిచేయు.)

గీ...తదారవంబున నతఁడు మూర్ఛఁ, దెలిసి
యొకకొలఁ దెగనిండఁ దిగిచి యేసె, వాని
వక్షంబు వగుల జీవంబు లేదు, కల దనఁగఁ
దేరు పదిబాణముల నొగిల్చె. ఉ. హరి. ౩. ౫౩.

చ...అంకిలిగొన కెమ్ము లమ్ములఁ బగిల్చి నొగి
ల్చిత రేతరుల్ తలల్, నలియఁగ మొత్తి... భాగ. ౧౦. ఉ. ౨౪౯.

నొచ్చిలు. అ. క్రి. (√నొచ్చు) రాలు, పడు.

మ. కలికీ యత్తిలు నీవు పోవు టెఱుఁగుం గాఁ
బోలు నిప్పాటి నిక్కలరంభాతరువుల్
నుడింబడి వడంగంపించె జ్యోత్స్నలతల్,
తలవాంచెఁ బెటి చూతజాతములు చింతం
బల్లవశ్రేణి నొచ్చిలు నీహారము పేర వక్త్రము
లు రాల్చెం గంటివే కోమలీ. కృ. శతం. ౩. ౧౫౩.



నొచ్చిళ్లు. వి. బ. లాల, చొంగ. (శ. ర, చి. సి, బ్రౌ.)

నొచ్చు. (దీనికి తుమున్నాద్యర్థకరూపములు నొవ్వఁ, నోవఁ, నోఁ, వెం. వ్యతిరేకార్థమున-నొవ్వక, నోవక, నోక, నొవ్వకుము, నోవకుము, నోకుము, మొదలగు రూపములును అగును.) అ. క్రి. (క. నోచ్చు.)

౧. (మనస్సునఁగాని శరీరమునఁగాని) బాధపడు.

గీ. నొవ్వఁబలుకుదు సభలోనఁ జివ్వ కొల్లఁ, కేవు
గురుపతిఁ జూచి సహించి పోము. భార. ఉద్యో. ౪. ౨౩౮.

క. సేవకుల రైనదానికి, నోవకుఁడీ మీరు లఘు
మనోవృత్తుల రై. భార. ఉద్యో. ౧. ౨౦౮

ఉ... సత్పురుషచిత్తము నొచ్చిన రిత్తవో
వునే. ప్రభా. ౧. ౯౫.

౨. శ్రమపడు, కష్టమొందు.

క. నొచ్చినవారికి నాపదవచ్చిన నది పరిహ
రించువాని ప్రభుత్వం, బె చ్చౌను...దశా. ౨. ౨౧౩.

క. ఓరిమురాంతక కౌమా, రారామలతోడ నీ
వఱచుపల్లఱపుల్, సైరించితి మింక నూరక,
నోరత్తితి వేని మిగుల నొత్తువు సుమ్మా.
వరాహ. ౧౧. ౯౧.

ఉ. ఉన్నటు లుండఁగా నె పిరు లూరక చావక
నోవ కల్చునే. ఆము. ౩. ౫౩.

౩. మృతినొందు; నశించు.

ఉ. ఈనలినాక్షి యెవ్వతె మహేశ్వర నారద
మీ రెఱుంగరే, దానవసార్వభౌము వనితా
మణి యాతని సంగరంబులో, నాని జయిం
చితే నహహ నాతఁడు ఘోరతపంబుచేత
నస్థానినై నొత్తురే తపము సల్పిన వార లె
ఱుంగ నేమియుఁ. దశా. ౪. ౫౮.

సీ. ఉపవాసములచేత నుడివోనికలుషముల్
పరిహీతంబులఁ బోసి పాతకములు, వ్రతము
లచేత నొవ్వనిదుష్కృతంబులు క్రతువుల,
బొలియనికల్మషములు. వి. పు. ౩. ౧౩౫.

నోఁగొను=నోఁనాటు.

గీ. బాణహతి నించుకయు డిల్లపాటు గలిగి,
తోన తిర మైనధైర్యంబుతోడఁ బొలిచి,
తోరఁగు నెత్తుట నొడలెల్లఁ దోఁగ నట్లు
సెలను నోఁగొన్నయకోర్కెలఁ బెఱికి వైచి,
భా. రా. యు. ౧౦౪౭.

నోఁబడు=బాధను అనుభవించు.

ఉ. ఆయుబలాలలామ భవనాస్యము వేడుక
తోడఁ జూచి పుష్పాయుధుచేత నోఁబడి
రాము నంతయు రాజున కేన చెప్పి నిక్కరోయఁ
గ పత్తు...దశకు. ౧౦. ౪౨.

నోఁబలుకు=నొవ్వఁబలుకు.

ఉ. ఈరస మెత్తి నోఁబలికి తేనియుఁ జెప్పుదు
నూతనందనా. భార. కర్ణ. ౨. ౫౨.

ఉ. గంధగజాసురారిఁ బురకాయజకాలబల
ప్రహారి...దృప్యంధవిదారి నోఁబలుక బ్రా
హ్మణ నీ వధికారివే మహీశ. కు. సం. ౩.
౭౫౯.

నోనాడు= ౧. నోనాఁటు, నొవ్వనాఁటు.

క. తోడన హయసూతుల నోనాడఁగ నేయు
టయు నతఁడు వలిగి కడఁక విల్, గ్రీడయ
పోలెం గొని మెయి, నాడఁగ నిగిడించెఁ
ద్రిదశనారాచంబుల్. భార. కర్ణ. ౨. ౨౪౫.
(శ. ర. కరాల ప్రతి. పా.)

గీ. హరుల నొప్పించి సూతు నోనాడ జేసి,
యంగముల బాణములు నించి యతనిఁ బఱ
పె. భార. విరా. ౫. ౨౭౨.

౨. నొవ్వఁబలుకు.

ఉ. వేడుక నీకకాని మతి జేటొకయింతకినైన
పెడత్రోవ, పాడెద కేల యిష్టమ్...

డు మానకపోయి తీవు పెం, బ్రోడవు గాన
నిన్ను కనుఁబో యతఁ డెవ్వరిఁ జూడఁ
డంచునో, నాడె సపత్ని నొక్కటె మురారి
కనుంగొనువేళ నీసునన్. పారి. ౩. ౧౫.

నోనేయు=నొవ్వనేయు.

సీ. అర్జునుపైఁ గూర్చి యతని నోనేయఁడు...
భార. ఉద్యో. ౪. ౨౨౯.

క. మొగి రెంట మూఁట నిరసులు, నొగలు
విఱుగ నొంటి వాని నోనేయుటయున్.
భా. రా. అర. ౧. ౨౩౭.

జః నొంచు, నొంచువాఁడు, నొచ్చులు, నొచ్చు
కొను, నొచ్చుకోలు, నొప్పి, నొప్పించు, నొప్పి
గుంటు, నొప్పివడు, నొవ్వి, నొవ్వు, నోవరి,
నోవి, నోవిక, నోవు.

నొచ్చుకొను. అ. క్రి. (నొచ్చు+కొను. స్వార్థ
మున) పశ్చాత్తాపపడు.

(వ్యవ) వాఁడు తొందరపడి అన్నగారిని తిట్టెను
కాని తరువాత చాల నొచ్చుకొన్నాఁడు.

స. క్రి. నిందించు.

క. విపరీతకాల మింతే, యిపు డెవ్వరి నొచ్చుకొ
నఁగ నేఁటికి నీచే, నపవాద మగుట నిజమని,
తపియించి సుమిత్రిపట్టి తరలఁగ నంతన్.
చం. రా. ౫. ౭౭.

నొచ్చుకోలు. వి. (నొచ్చుకొను.) పశ్చాత్తాప
పడుట. (చి. ని. శ. ర.)

నొడలదొంతి. వి. సంశయము. బ్రా. చిని. (అ.
ప్ర. అని శ. ర.)

నొడి=నుడి, నొడువు. వి. (త. నొడి.) మాట,
పలుకు, పదము.

సీ. నుడుగు నుడువు నుడి నుడికారము నొడువు
నొడి నొడికారము నొడుగు నాఁగఁ, బన
మొప్పు...అం. భా. ౧. ౧౧౧.

...నొడికారము, నొడికాడు.

నొడికాఁడు. విణ. (నొడి + కాఁడు.) మాటకారి.

ఉ. నందనుచావు నిక్కమయినం జను టుప్పుడ కల్గు దేవకీ, నందన యొల్లభంగి నరనందను పాలికి నాజి కేచి పోవం దనతోడి తెంపు నకు వారక యిచ్చినభాసత ప్పెనింకం దనుఁ గన్న దెప్పునొడికాఁ డని కొంకవఁ గాని యచ్యుతా. భార. అశ్వ. ౩. ౧౮౧.

నొడికారము=నుడికారము. వి. (నొడి + కారము[1]. స్వార్థమున.) పలుకు, మాట; మాటల యందలి చమత్కారము, సరసత.

సీ...నొడి నొడికారము నుడుగు నాఁగఁ బద మొప్పు...ఆం. భా. ౧. ౧౧౧.

వ...కళావతీ నీవు నొడికారపుమాట లాడం బ్రోడ వని విందుము...నైష. ౮. ౫౫.

నొడికారి. విణ. (నొడికారము + ఇ[3].) మాటచమత్కారము కలవాఁడు.

ఉ. అప్పన మెంత గావలె నహంకరణంబుఁ దొలంగి యిచ్చినం, గప్పము పేర నేఁడు నొడికారితనంబున మోసపుచ్చఁగా, నుప్పులు దెత్తురే సమరయోగ్యతలంబున వైరికోటితో, నుప్పనఁబట్టె లాడునెడ నుప్పులు దెత్తురగాక యాదవుల్. ఉ. హరి. ౪. ౧౫౫.

ఉ. కాఁగిటి కాన చేసి నొడికారితనంబున నిన్నుఁ దేల్చి రా, రాఁ గొఱగానివాఁడ నయి రాములలోనఁగుఁబాటు దేను నీకేఁ గలుగంగ సంపదల కేల విచారము పద్మగంధి నీ, లోఁగిటఁ జేర్చ నే యుభయలోకసుఖంబులునన్నుఁ బొందినవ్. ఉ. హరి. ౧. ౭౪.

నొడుగు=నొడువు.

(నొడి, మాట.)

సీ. నుడుగు నుడువు నుడి నుడికారము నొడువు నొడి నొడికారము నొడుగు నాఁగఁ, బద మొప్పు...ఆం. భా. ౧. ౧౧౧.

నొడుచు. స. క్రి. తప్పుఁబట్టు. (శ. ర, చి. ని.) జః నొడుపు.

నొడుపు. వి. (√నొడుచు.) తప్పుఁబట్టుట. (శ. ర, చి. ని.)

నొడువరి. విణ. (నొడువు + అరి[3].) వాచాలుఁడు.

ద్వి. కడు యంత్రతంత్రముల్ నొడువరితనము, లు...పండితా. పురా. ౧౧౭ పా. బస. పు. ౧౯ పా. ౪౫౫. పం.

నొడువు=నొడుగు, నుడువు, నుడుగు. స. క్రి. ౧. వచించు, చెప్పు.

క...ఎగ్గుల్, నొడివెడువివేకశూన్యుల, కడ నుండెడునంతకంటెఁ గష్టము గలదే. భార. ఆది. ౨. ౧౪౯.

సీ. కూఁతు లిద్దఱు నీకుఁ గొడుకు లిద్దఱు నీకు నని మోము చూచి సత్యంబు నొడువు. కాశీ. ౬. ౭౦.

౨. (గ్రంథము, కవిత్వము.) రచించు, చెప్పు.

సీ. నూనూఁగుమీసాలనూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి. కాశీ. ౧. ౭.

౩. పఠించు, ఉచ్చరించు.

గీ. కుతిక మోయఁగ నెత్తురుల్ గ్రోలి కడుపు, నిమిరికొంచు నగస్త్యమంత్రములు నొడివి. దశా. ౨. ౪౩౫.

క...నే, నొడివిననొడువులు నొడువఁడు, దుష్కనిఁ జదివింప మాకు దుర్లభ మధిపా. భాగ. ౭. ౨౫౩.

సీ. పద్మాసనస్థులై ప్రణవంబు నొడువుచు ముక్కుఁ బట్టఁగఁ జూచె మునివరులకు. ఉ. రా. ౧. ౩౧౧.

౪. స్తుతించు, కొనియాడు.

సీ. నలినసంతతి చెంత నాగంబు స్తుతిచేయు నలగ కల్లభుపొంత గరుడు నొడువు. కళా. ౧. ౨౫.

గీ. వెత్తిమాడ్కి ని లీలతో విశ్వమయుని, నొడువుచును లోకబాహ్యత నొందవలయు. భాగ. ౧. ౪౪.

చ. కరుణుఁడు వైచెఁ బాశమున వైచిన నబ్బలి తంపుఁగైదువుం, గరమునఁ బట్టి దానవుఁడు క్రమ్మఱ వైచెఁ దదస్త్ర మంబుధీశ్వరునకు నొవ్వి సేయుచు... ఉ. హరి. ౧. ౩౦.

౨. వ్యాధి, రోగము.

క... నామెయిఁ, గ్రొవ్విసమాంసంబు గలదు కోసు మాఁకలియుణ్, నొవ్వియును దీఱు నంతట, నశ్వల నారోగ్య మగు మృగాధిప నీకున్. నా. పంచ. ౧. ౩౯౯.

నొవ్వు=నొవ్వి, నోవు. (√నొచ్చు.) వేదన, బాధ.

క. ఇవ్విధమున నిత్యంబును, నవ్వసుధాధిపుఁడు ప్రజల కనురాగలతల్, నివ్వటిలఁ జేయుఁ దనమది నొవ్వులుఁగకయుండ బహువినోదపరుం డై. నిర్వ. ౯. ౭౬.

ఆ. తనతలంపువెంటఁ దమకించి ప్రజకు నొవ్వు గఁ జరించుటయును దగదుపతికి. భార. శాం. ౨. ౧౩౭.

గీ. వారయు వంగంబునందు దుర్వ్యాప్తిఁ గదిరి, నొవ్వుఁ దెవులును బుట్టించుఁ గ్రొవ్వుఁ జెఱుచు. భార. అశ్వ. ౧. ౧౭౬. భార. భీష్మ. ౨. ౧౪౧.

౨. వ్యాధి, తెవులు.

ఆ. ఇన్ని సంకటముల నిబ్బంగి నెంతయు, నొగులుచిత్తవృత్తి నొవ్వు దీర్ప, వెజ్జ వీవ కావె వేరొుల యేగతి, నడపఁ దలఁచి తడియ నాకుఁ బ్రియము. భార. ఉద్యో. ౩. ౨౬.

నొవ్వారు=బాధనొందు.

ఉ. శారదకోటి నేఁ బొడిచి క్రిందుగఁ గయ్యము సేయుఁ గర్ణుఁడా, భూరమణుణ్ వడిం గదిసి భూరిశరంబులు మేననింప, నొవ్వారుటయుణ్ దొలంగె నతఁ డాహవరంగము నఁదు లేఁడు... భార. కర్ణ. ౩. ౨౧.

నొసలిచూపువేల్పు. వి. (√నొసలు.) ఫాలాక్షుఁడు, శివుఁడు.

క. అనిన నరుఁబ్బున్వేఁకున్న యప్పతియెడం జిత్తం బొప్పింగ కున్కి వెళసి యాచాటు నొక్క స్తుతిం జూచి నొసలిచూపువేల్పు జవరా లాచివురాటపోఁడికి జ్జననెమె. చంద్రి. ౫. ౧౦౫.

నొసలు. వి. దే. (క. నొసలు, నొసల్.) నుదురు, లలాటము. (బ. నొసళ్లు, నొసళులు.)

గీ. భసితరేఖా త్రిపుండ్రంబు నొసటఁ దీర్చి. హర. ౨. ౧౦౪.

ద్వి. పసుపులు పంకించి పచ్చరిసేస, నొసలారఁ బెట్టి సన్నుతులు గావించి. ద్వి. భాగ. ౧౦. (చి. సి.)

ఉ. కట్టిననీలిదిండ్లు పెలకిట్టియవిఁడ్గను విండ్లుగా నెనల్, చుట్టి నొసళ్లపై నిడినజుంజుఱుఁ బల్లసిగల్... మను. ౪. ౩౩.

సీ. తిగరేక లేర్పడ దిద్దిననొసలిను వ్వొలిబూది బొట్టురంగులు పెలంగ. నీలా. ౧. ౬౦. ఆం. భా. ౨. ౧౪౩.

జః నొసలిచూపువేల్పు.

## నో

నోఁచు=నోము. స. క్రి. (వ్రతము, యజ్ఞము మొ.) ఆచరించు.

మధ్యాక్కర. నుదువులు వేయు నింకేల యిప్పాటినోములు దొల్లి, కడఁగి నోఁచితిని గాకేమి యనుచును గందె డెందమున. భార. ఆది. ౪. ౧౦౨.

ఉ. నోఁచినవారిసొమ్ము లవి నోమనివారికి వచ్చునే ధరణ్. ఉ. హరి. ౧. ౧౬౭.

ఉ... ఇంతఁగా, నోఁచితి నింక నెట్టిది కనుంగొన నిమ్మెయి నున్నదాన నో. పారి. ౧. ౯౦.

చ. వనరుహగంధి నీపలుకుపద్ధతి చాలదు వాఁడు దివ్యులన్, మునులను దిల్చి నోము నెనుచూశక నోఁచిననోముఁగాక... వీర. ౧. ౧౧౪.

జః నోఁత.

నోఁత. వి. (√నోఁచు. త. నోట్రు.) నోఁచుట, (వ్రతము) ఆచరించుట.

చ. వెలిచవిఁ గోరకుండఁగపువేడుకకత్తెలనోము నోఁత...చీకటి పర్వె నుర్వరన్. కవిక. ౪. ౭౬. ('వ్రతఫల' మని భావము.)

నోటిగయ్యాళి. వి. (నోరు+గయ్యాళి.) నోటి దురుసుఁదనము కలది.

పీ. మాటనూ పెఱుఁగదో నోటిగయ్యాళియో యాచారహీనయో యలమురాలో. చెన్న. ౪. ౩౯.

నోటిబీగము=నోరితాళము. వి. (నోరు+బీగము.) దేవతలకు మ్రొక్కుబడిగా మౌనవ్రత మవలంబించుటకై దవుడలయందు కుట్టుకొను లోహపుకడ్డి.

వ...కొందఱు నోటిబీగముల దాసర్లపెల్లున నోరులఁ బూరులు గఱచువారును...ప్రబంధ. ౩౭౭.

సీ. అనశనవ్రతముచే నతులకార్శ్యంబుచేఁ గను పట్టు నోటిబీగములవారు. చంద్ర. ౫. ౪౧. (చి. ని. పా.)

నోటుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) నటుఁడు.

నోతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁ దగినది, నవనీయము.

నోత్త. సం. విణ. (ఋ. త్రీ. ఋ.)=నోదకుఁడు.

నోత్తవ్యము. సం=నోదనీయము.

నోదకుఁడు. సం. విణ. (అ. దికా. అ.) ౧. ప్రేరకుఁడు. ౨. తొలఁగించువాఁడు.

నోదన. సం. వి. ఆ. స్త్రీ=నోదనము.

నోదనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రేరించునది. ౨. తొలఁగించునది. (అ. ఈ. అ.) నోదన సాధనమైనది. వి. అ. న. ౧. చోదనము, ప్రేరణము. ౨. తొలఁగించుట, తఱిమివేయుట. ౩. (తర్క.) శబ్దాజనకసంయోగము, ధ్వనిని కలిగింపనిసంయోగము.

నోదనీయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రేరింపఁదగినది. ౨. తొలఁగింపఁదగినది.

నోదయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. తొలఁగింపఁజేయువాఁడు. ౨. ప్రేరకుఁడు.

నోది. సం. విణ. (న్. నీ. న్.)=నోదకుఁడు.

నోద్యము. సం=నోదనీయము.

నోపస్థాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) దగ్గఱలేనివాఁడు, దూరమందున్నవాఁడు. (వాచ.)

నోము=నోఁచు; స. క్రి. (త. నోము.) ౧. (నోము) నోఁచు, (వ్రతము, యజ్ఞము) ఆచరించు.

గీ. మతియు నాదిమరాజులు మత్తవైరిరాజి ఘోరాజిసీమఁ బరాజితంబు, చేసి నిష్కంటకంబుగా నాసముద్రభూమి యేలిరి యీ నోము నోమి కాదె. వరాహ. ౯. ౭౫.

గీ. వ్రతము నోమించుదినవాసరములు దెలుపు. కాశీ. ౬. ౬౦.

వ...క్రీడదళిధూపధూమంబులుం బరిథవిల్ల నోమినను ధాధాతనూతనపూర్ణకలశంబుల సొంపు సంపాదించునమందమకరందపూరితోదర దరవికస్వరపుండరీకషండంబుల మెండునకు నిండువేడుక నెరపుచు...వసు. ౩. ౧౫౪.

౨. పూజించు, అర్చించు.

క. అంగన లపుడు చతుర్విధశృంగారము లలవరించి చెలువవిలుతు నోముం గ్రమయత్నరసీప్రాంగణనిద్రితునిఁ జంద్రహాసునిఁ గాంచెన్. జై. భా. ౮. ౭౫.

క. అన్నెలఁత విన్నునన్నత సన్నుతమణిచంద్రశాలాలలోనన్, గ్రొన్ననవిలుతుని నో

ముచు, వెన్నెల నెచ్చెలులుఁ దాను విహ
రించుచుఁటిన్. విక్ర. ౧. ౧౨౦.

౩. పోఁగొట్టు. (చి. ని, శ. ర.)

వి. ౧. వ్రతము.

శా. నానోముల్ ఫలియించె నావయసు ధన్యం
బయ్యె విప్రోత్తమా. మనుచ. ౩. ౧౦౭.

ద్వి. మానసంబను రంగమందిరం జేరి,యానోము
తా నోఁచి యానోముకరణి. ద్వి. పరమ.
౫. ౪౦౯ పా.

౨. యజ్ఞము.

ఉ. పాచ్చెము లేదు కన్యలకుఁ బుట్టినయిండ్లనుఁ
బోవ లోకమున్, మెచ్చును బ్రాహ్మ నోము
నకు మాతలిదండ్రులుఁ జూడఁ బైదలీ. వీర.
౧. ౧౧౫.

చ...వాఁడు దివ్యులన్, మునులను బిల్చి నోము
పెనుమాధత నోఁచిన నోముఁ గాక...వీర.
౧. ౧౧౪.

౩. వ్రతఫలము.

వ...వీరపసేనికూంతురు అక్కసాని నో
ముగా అర్జునదేవుండు ధారాపూర్వ
(కము) చేసి ఆచంద్రార్కముగం బెట్టిన
మడువాడ [ను] యూరు ఒక్కండు...
దా. శా. ౪. ౧౩౭౩.

నోయు. అ. క్రి. (క. నో. నోయ్. నోయు, త.
నో.) నొచ్చు, బాధపడు; కష్టమనుభవించు.

వ. వినత యోటుపడి కద్రువకు దాసియై నోసి
పనులు సేయుచున్నంత...భార. ఆది.
౨. ౩౭.

క. నాయాఁకలి కోర్వ వెపుసు, వే యైనను నేఁ
గానంగ వెండి యనుభవిం, తాయాసపడు
టఁ గనుఁగొని, నోయుదు ననుఁ బాసి
యిటు సనుట తగ వగుసే. భార. శాం.
౩. ౩౩౦.

సీ. క్రొవ్విరితోవకంబెఁ గోవలం బగుహేమ
రేయెండ మట్టిననోయుఁ దద్ద. కు. సం. ౩.
౩౭౦.

సీ. వేసవి వడగాలి నోసినలేఁడీగ క్రొక్కారు
గని మవ్వ మెక్కినట్లు. కు.సం.౭.౭౮.

నోరఁబట్టు. స. క్రి. (నోరన్ + పట్టు.) ప్రక్కటఁ
బట్టు, త్రాఁగు.

ఉ...అగస్త్యమూర్తియై, యాశ్వవకేతసుందరి
మహేశబలాంబుధి నోరఁబట్టెడున్. జై.
భా. ౧. ౧౦౦.

నోరితాళము=నోటిబీగము.

గీ. లలన యొక్కర్తు నోరితాళంబు లిచ్చె, శక్తి
జాతర సద్భక్తి శక్తు లెనఁగ. పాండు. ౩.
౩౩.

నోరిసని. వి. (√నోరు.)నోఁచికని, తినుటకు యో
గము లేకపోవుట, అనుభవించుటకు అదృష్టము
లేకపోవుట.

క. నోరిసని సుండ కే నో,రోరి యకట మాప
మాపపూరక మనియుం, దూరము నోయి
తిన సా, మ్మేరితిని నీకు దక్కునే కానీరా.
అమ. ౩. ౭౨.

నోరు. వి. జా. (బ. నోరులు, నోళులు, నోళ్లు.)

౧. వాయి, ఆస్యము.

క. కాని తెఱఁగైన వింతటి,మానిసిఁ గా సేల
చేయు మనుజేంద్రుఁడు న, న్నానెతి దప్పిన
మాటలు, నీనోరన్ వెడలఁదగునె నిండిన
సభలోన్. భార. ఉద్యో. ౨. ౧౫౯.

చ. వెడలఁపుగల్గునోరు లాకవేయి ధరించి వియ
న్నదీజలం, బడరఁగఁ బుక్కిలించి రయ మా
రఁగఁ దెచ్చి మహానిలంబుపై,నెడపడకుండఁ
జల్ల...హరి. ఉ. ౭. ౭౨.

క. వడులఁడు ప్రహ్లాదేవుండునా,బ్రకటభుజాహ్పు
రణమున నరాతిబలము నోళ్ళలకుఁ గోలకు

దత్తుర నోరికి వచ్చినయట్లు లాడిరే యి
బ్బంగిన్. భార. కర్ణ. ౩. ౭౭.

౨. పశులమొక్క; పశ్వాదులముకై.

సీ. ఛేదోయిరొత్తునఁజేసి కెత్తురు తైనయవ
యవంబులు నోర నవరఁ జేయు. నైష. ౨. ౫.

౩. మాటలాడుశక్తి.

క. అన నయ్యంగన నాకే, మన నోరున్నయది
మీర లనినంతయుఁ జెల్లున మీ కాఁగా
ములు దెల్ప నుపాయం బొకటి గానఁబడ
నంచాఁకన్. కళా. ౩. ౧౭౦.

నోటఁ(ర)గాయవేయు=ఊరకుండు.

ఆ. క్రమకములు కావరపుజాతులు కజా, తా
శ్రయములు మీర లగుటఁ జపల, వృత్తి నో
టఁగాయవేయక కదరుచుఁ, గలఁచెదరు
లతాంగిఁ జిలుకలార. కవిరా. ౩. ౧౪౫.

క. అంగంబులు నులియంగను, నుంగేయుఁగే య
టంచు శోకనిమిషము నోరంగాయవేయ
కేడ్చుచు, నంగీకృతబాల్యచేష్ట నతఁడట్లుం
డన్. పరమ. ౧. ౧౨౫.

నోటనాలుక కలుగు=మాటాడనేర్చు.

సీ. నరునకుఁ దననోట నాలుక గలిగిన వింతదే
శంబు లెవ్వియును లేవు. రామలిం. ౭౨.

నోటిమాట నోటనె యుండ=నోటిలోమాట నోటి
లో నుండఁగానే, అత్యవధానముగా.

గీ. తన్ను ధరణికిఁ బొమ్మన్నధాతనోటి, మాట
నోటనె యుండ భూమండలంబుఁ, జేరఁజను
దెంచె సింగంపుఁదేరిజోదు, వింధ్యగిరి నున్న
రాక్షసవితతిమీఁద. కాళ. ౨. ౩౬.

నోరదుము=నోరునొక్కు. మాటలాడనీయకుండు.

గీ. అత్తమామల కృపాకర్త లగుచు మెలఁగు,
నట్టిభూపుల నెల్ల నోరదిమి గదిమి, పొంచి
యుపనాథుతోడఁ గ్రీడించి... శుక. ౧.
౫౫.

నోరాడు=నోరు మెదలు, మాట [illegible]

క. బవరము గీడని యెఱుఁగుదు, నవనీతుం
డైన కొడుకు నగలించి యుడుపం, దివిరియు
నోరాడమి దైవ, పపళం బప్పనికి వసకు వగ
పిం కేలా. భార. ఉద్యో. ౪. ౧౯౩.

ద్వి. మీమఁబోఁదు మన నెట్లు మీకునోరాడె.
ద్వి. హరిశ్చం. పూ. ౧౦౩౬.

గీ. చెప్ప నోరాడ దేమని చెప్పవాఁడ, నెటిఁ
గినరుంబు చెప్పి రెట్టుడంతు. కాశీ. ౪.
౩౫.

నోరార్చు=నోరాడించు, బూకరించు, బొంకు.

ద్వి. దంటమాటలు గొన్ని తడవాటి వన్ని, గం
టక నోరార్చి గెల్వఁ జూచెదవు. ద్వి.
హరిశ్చం. పూ. ౩౦౦.

నోరికిఁబోవు=నోరికింపగు, ఇష్టమగు.

ఉ. తుప్పలు పట్టె నేర బలుతూపులు నీగురి
గింజదండకున్, దప్పితి వేమి నావుడు నతం
డాను దిగ్గన లేచి దేవరా, యిప్పటి కష్ట
లింత చెడిరెుంగడి నోరికిఁ బోదు దూప
కుం, జిప్పలనీరె మాగురులతీయని పాలు రు
చింప క్షమియున్. కళా. ౪. ౫౧.

నోరికివచ్చినట్లుపలుకు=ముందు వెనుక లరయక
మాటలాడు.

ఉ. పాండవపక్షపాతమునఁ బల్కెడు నోరికి
వచ్చినట్లు నిన్నొండు దనరామిఁ జేసి యిది
యొప్పునె... భార. విరా. ౪. ౬౭.

నోరిమాట నోరన వసియించు=నోటిమాట నోట
నె యుండు.

చ. మనుజవిభుండు పద్మజకుమారుఁ గనుంగొని
నోరిమాట నోరన వసియింప వచ్చె రథ
రాజసమాజము... కవి. ౨. ౯౫.

నోరిమాట నోరనే యుండగ=చెప్పియుఁ జెప్పక
ముందే, అత్యవధానముగా.

గీ. అది కనుంగొని నిదియు మాయాబలంబు, వి
[illegible]ండు శ్రీవిష్ణుఁ డనుచు, ధారుణీ

భర్త పలికిన నోరిమాట, నోరసేయుండ దత్స భాగారమునను. వరాహ. ౧. ౧౪౫.

నోరఁగొలఁది=దుర్భాషణము. కు. సం. ౧. ౩౭.

నోరు కాయు=నోటి కిష్టమైన దెల్లఁ దినకుండు పథ్యము చేయు.

(వ్యవ.) మాపిల్లవాఁడు జ్వరపడి నోరుకాయ లేఁడు.

నోరు కాయలు గాచు=పలుమాఱు పిలుచుటచే నోరునొప్పిచెందు.

(వ్యవ.) నిన్ను పిలిచి పిలిచి నోరుకాయలు గాచినది.

నోరుచేయు=మాటలాడు. (ఇది ఇతరపదవ్యవధానముగాను గన్పట్టుచున్నది.)

సీ. కూడనిత్తునె మాటంకొని మోఱ యెత్తినఁ గదిమెద నో రింతకంటెఁ జేయు. బహు. ౨. ౩౧.

నోరుమాలినది=౧. నోరు లేనిది, మాట లాడ లేనిది. (తిర్యగ్జంతువు.)

గీ. శర్వ యీ నోరుమాలినజంతువునకు, మొదల వర మిమ్ము వర మిమ్ము పిదప నాకు. కాశీ. ౫. ౩౩౫.

౨. నోరు లేనివాఁడు, గడుసుఁదనముతో మాట లాడ నేరనివాఁడు.

(వ్యవ.) ఆనోరుమాలిన వాని నెగతాళి చేయకుము.

నోరు మెదపు=మాటాడు.

(వ్యవ.) వాఁడీమధ్య కొంచెము నోరుమెదపుచున్నాఁడు.

నోరుమెదల్చు=నోరెత్తి మాటాడు, చెప్పు.

ఉ. ఎన్నఁగ నింత రత్నచయ మింక గభీరిమ యింత దానసంపన్నత యింత శుద్ధి యని బ్రహ్మయు నోరుమెదల్ప లేనియ, ట్లున్నతిఁ గన్నపెన్నధి నుతింప మై తెలిదీవి చెన్ను గుల్కు. పాండు. ౩. [illegible]

నోరు లేనివాఁడు = పొందికగా మాటలాడలేని వాఁడు.

(వ్యవ.) వాఁడు బొత్తిఁగ నోరులేనివాఁడు.

నోరు వాయెత్తు=నోరెత్తు.

గీ. తపసిజనములు నుతిమంత్రజపము లుడిగి, వచ్చియుండక పికశిఖావళులు లాడి, గా వనంబునఁ గలవిహంగమకులంబు, తత్తరము నొంది నోరు వాయెత్త వెఱచు. వి. శకుం. ౨. ౪౫.

నోరువాయిలేనిది= అధికముగా మాటలాడనేరనిది.

(వ్యవ.) ఆమెనోరు వాయి లేనిది.

నోరువ్రిగ్గూరు=నోరూరు, తినవలెనను నాస కలుగు.

క. గువ్వలుఁ గౌఁజులు కూఁకటి, మువ్వలు లావుకలు కోళ్లుపూరేళ్లు మొదల్, క్రొవ్వినపులుఁగులఁగని నోళ్లువ్రిగ్గూరంగ నప్పు డుర్వీశవ్రాతెల్. ఇందు. ౨. ౪౦.

నోరూరు=౧. అపేక్ష కలుగు. see on page 912.

గీ. గబ్బిగుబ్బలఁ బతియెదఁ గ్రమ్మి క్రమ్మియున్న సకియలఁ జూచి నోరూరసాగె. కలు. ౪. ౨౨.

౨. పులుపుగాని కారముగాని గలవస్తువులను చూచినపుడును తలఁచినపుడును నోట ద్రవము పుట్టు.

క. శ్రీరాముని దయచేతను, నారూఢిగ సకలజనులు నారా యనఁగా, ధారాళ మైననీతులు, నోరూరఁగఁ జవులు పుట్ట నుడివెద సుమతీ. సు. శ. ౨. (రెండర్థములకు నిది యుదాహరణము.)

నోరోన్నొరన్=నోటిలోనుండి నోటిలోనికి.

సీ. హంస పెద్దకు నిచ్చె హంసకి నోరోన్నొర [illegible]. హ. సం. ౪. ౪౯.

దెత్తురు నోరికి వచ్చినయట్టు లాడితే యి
బ్బంగిక. భార. కర్ణ. ౩. ౨౨.

౨. పశువులమూర్కా; పశ్వాదులముట్టె.

సీ. చేదోయియొత్తునఁజేసి నెత్తురు లైనయవ
యవంబులు నోర నవరఁ జేయు. నైష. ౨. ౫౩.

౩. మాటలాడుశక్తి.

క. అన నయ్యంగన నా కేమన నోరున్నయది
మీర లనినంతయుఁ జెల్లున మీ కొఁగా
ములు దెల్ప నుపాయం బొకటి గానఁబడు
నంబాఁకక. కళా. ౩. ౧౭౦.

నోట(ర)ఁగాయవేయు=ఊరకుండు.

ఆ. రక్తముఖులు కావరపుఁజాతులు కజా, తా
శ్రయములు మీర లగుటఁ జపల,వృత్తి నో
టఁగాయవేయక వదరుచుఁ, గలఁచెదరు
లకాంగిఁ జిలుకలార. కవిరా. ౩. ౧౮౫.

క. అంగంబులు నలియంగను, నుంగేయుఁగే య
టంచు నొకనిమిషము నో,రంగాయవేయ
కేడ్చుచు, నంగీకృతబాల్యచేష్ట నతఁడ ట్లుం
డక. పరమ. ౧. ౧౨౫.

నోటనాలుకకలుగు=మాటాడనేర్చు.

సీ. నరునకుఁ దననోట నాలుక గలిగిన వింతదే
శంబు లెవ్వియును లేవు. రామలిం. ౭౨.

నోటిమాట నోటనెయుండ=నోటిలోమాట నోటి
లో నుండఁగానే, అవ్యవధానముగా.

గీ. తన్న ధరణికిఁ బొమ్మన్న ధాతనోటి,మాట
నోటనెయుండ భూమండలంబుఁ, జేరఁజను
దెంచె పింగంపుఁదేరిజోదు,వింధ్యగిరి నున్న
రాక్షసవితతిమీఁద. కాశీ. ౨. ౩౭.

నోరడచు=నోరునొక్కు, మాటలాడనీయకుండు.

గీ. అత్తమామల గృహకర్తలగుచు మెలఁగు,
నట్టిభూర్తుల నెల్ల నోరడిమి గదిమి, పొంచి
యుపనాథుతోడఁ గ్రీడించి...శుక. ౧.
౫౫.

నోరాడు=నోరుమెదలు,

క. బవరము గీడని యెఱుంగుదు, నవనీతుం
డైనకొడుకు నదలించి యుడుమఁగ, దివిరియు
నోరాడమి దై, వవశం బప్పనికి వగసు వగ
పిం కేలా. భార. ఉద్యో. ౪. ౧౭౩.

ద్వి. మిముఁబోఁదు మన నెట్లు మీకునోరాడె.
ద్వి. పారిజా. పూ. ౧౦౩౭.

గీ. చెప్ప నోరాడ దేమని చెప్పవాఁడ, నెటిఁ
గినరంబు చెప్పక యుట్టుడంతు. కాశీ. ౪.
౩౫.

నోరార్చు=నోరాడించు, బూకరించు, బొంకు.

ద్వి. దంటమాటలు గొన్ని తడవాటి వన్ని, గం
టక నోరార్చి గెల్వఁ జూచెదవు. ద్వి.
పారిజా. పూ. ౩౦౦.

నోరికిఁబోవు=నోరికింపగు, ఇష్టమగు.

ఉ. తుప్పులు పట్టె నేర బలుతూపులు నీగురి
గింజదండకుఁ, దప్పితి వేమి నావుడు నతం
డాను దిగ్గన లేచి దేవరా,యిప్పటి కమ్మ
లింత చెడిగెను గడి నోరికిఁ బోదు దూప
కుం, జిప్పలనీరె మాగురులతీయనిపాలు రు
చింప క్షమియుఁ. కవ. ౪. ౫౧.

నోరికివచ్చినట్లుపలుకు=ముందు వెనుక లరయక
మాటలాడు.

ఉ. పాండవపక్షపాతమునఁ బల్కెదు నోరికి
వచ్చినట్లు ని,న్నొంచ దనరామిఁజేసి యిది
యొప్పెనె...భార. విరా. ౪. ౭౨.

నోరిమాట నోరన వసియించు=నోటిమాట నోట
నె యుండు.

చ. మనుజకళుండు వజ్ఞజుమారుఁ గనుంగొని
నోరిమాట నో,రన వసియింప వచ్చె రథ
రాజసమాజము...కవ. ౨. ౯౫.

నోరిమాట నోరనే యుండగ=చెప్పియుఁ జెప్పక
మునుపే, అవ్యవధానముగా.

గీ. అది కనుంగొని చిదియు మాయాబలంబు, వి
రుండు శ్రీవిష్ణుఁ డనుచు, ధారుణి

భర్త పలికిన నోరిమాట,నోరనేయుండ దత్న
భాగారమునను. వరాహ. ౧.౧౭౮.
నోరఁగొలఁది=మర్యాదమైనది. కు.సం.౧.౩౫.
నోరు కాయు=నోటి కిష్టమైన దెల్లఁ జిహ్వకుండుప
థ్యముచేయు.
(వ్యవ.) మాపిల్లవాఁడు జ్వరపడి నోరుకాయ
లేఁడు.
నోరు కాయలుగాచు=పలుమారు పిలుచుటచే
నోరునొప్పిచెందు.
(వ్యవ.) నిన్ను పిలిచి పిలిచి నోరుకాయలు
గాచినది.
నోరుచేయు=మాటలాడు. (ఇది ఇతరపదవ్యవ
ధానముగాను గన్పట్టుచున్నది.)
సీ. కూడనిత్తునె మాటుకొని మోము రొత్తినఁ
గదిమెద నోరింతకంటెఁ జేసు. బహు.
౨.౩౧.
నోరుమాలినది=౧. నోరు లేనిది, మాట లాడ
లేనిది. (తిర్యగ్జంతువు.)
గీ. శర్వ యీ నోరుమాలినజంతువునకు, మొదల
వర మిమ్ము వర మిమ్ము పిదప నాకు. కాశీ.౫.
౩౩౫.
౨. నోరు లేనివాఁడు, గడుసుఁదనముతో మాట
లాడ నేరనివాఁడు.
(వ్యవ.) ఆనోరుమాలిన వాని నెగతాళి చేయ
తగుమ.
నోరు మెదపు=మాటాడు.
(వ్యవ.) వాఁడీమధ్య కొంచెము నోరుమెదపు
చున్నాఁడు.
నోరుమెదల్చు=నోరెత్తి మాటాడు, చెప్పు.
ఉ. ఎన్నఁగ నింత రత్నచయ మింత గభీరిమ
యింత దానసంపన్నత యింత శుద్ధి యని
బ్రహ్మయు నోరుమెదల్ప లేనియ,త్యున్నతిఁ
గన్న పెన్నడలి స్తుతిత మై పెలిదీవి చెన్న
గుణ. పాండు. ౩. ౧౫౧.

నోరు లేనివాఁడు = పొందికగా మాటలాడలేని
వాఁడు.
(వ్యవ.) వాఁడు బొత్తిగ నోరులేనివాఁడు.
నోరు వాయెత్తు=నోరెత్తు.
గీ. తపసిజనములు నతిమంత్రజపము లుడిగి,
వచ్చి యుండక పికశిఖావళులు లాదిగా
వనంబునఁ గలవిహంగమకులంబు, తత్తరము
నొంది నోరు వాయెత్త వెఱచు. వి. శకుం.
౨. ౭౫.
నోరువాయిలేనిది= అధికముగా మాటలాడ నే
అనిది.
(వ్యవ.) ఆమెనోరు వాయి లేనిది.
నోరుల్విల్లూరు=నోరూరు, తినవలె నను నాశ
కలుగు.
క. గువ్వలు కోఁజులు కూఁకటి,మువ్వలు లావు
కలు కోళ్లుపూరేళ్లు మొదల్,క్రొవ్వినపులుఁ
గులగమి నోళ్లుల్విల్లూరంగ నప్పు డుర్వీశ
వ్రాలెఁ. ఇందు. ౨. ౩౦.
నోరూరు=౧. అపేక్ష కలుగు. *see on page 912.*
గీ. గబ్బిగుబ్బలఁ బతియెదఁ గ్రమ్మి క్రమ్మి,యు
న్న సకియలఁ జూచి నోరూరసాగె. కళా
౪. ౨౨.
౨. పులుపుగాని కారముగాని గలవస్తువుల;
చూచినపుడును తలఁచినపుడును నోట ద్రవ
పుట్టు.
క. శ్రీరామునిదయచేతను, నారూఢిగ సకల
నులు నౌరా యనఁగా,ధారాళ మైననీతుల
నోరూరఁగఁ జవులు పుట్ట నుడివెద సుమ
సు. శ. ౨. (రెండర్థములకు నిది యుదా
రణము.)
నోరోన్నరన్=నోటిలోనుండి నోటిలోనికి.
సీ. హంస పెన్కువ నిచ్చె హంసికి నోరోన్న
రన్... కు. సం. ౪. ౪౫.

సీ. సంపెంగపాదరింటిచక్కి— గోరంటం గాంచి
యును రంచు మగిడి నోరూరనవియు. ఆ.
అగుచుం దేటికదుపు లామని దలసూపె.
పారి. ౩. ౫౨.

నోళ్లంబడు=పదుగురు చెప్పుకొను, నిందాపాత్రమగు.

సీ. నీమాట వినలేక నిర్లోహపాశ మై ప్రాణికో
టులనోళ్లంబడిరె వసిష్ఠ. కిలు. ౪. ౭౪.

సా:-నోరున్న తల గాచును. (మాటలనేర్పున్నచో మరణదండనము నైనతప్పించుకొనవచ్చు.)

సా: నోరుమంచిదైన నూరు మంచిదగును. (మంచిమాటలాడిన నందఱు ప్రేమింతురు.)

జ: నోటిగయ్యాళి, నోటిబీగము, నోరంబట్టు, నోరితాళము, నోరిసని, నోరుగొట్టు, నోరుదెఱచు, నోరునొక్కు, నోరుమూయు, నోరుమెంగ, నోరెత్తు.

**నోరుగొట్టు.** స. క్రి. (నోరు+కొట్టు.) అనుభవింపకుండం జేయు, తినకుండం జేయు.

సీ. కొలుచువారల నోరుగొట్టి లెక్కలు వ్రాసి
హారువుమిగులంగ మణియములుచేసి. శుక.
౩. ౩౭౫, ౩౫౩.

**నోరుదెఱచు.** అ. క్రి. (నోరు+తెఱచు.) ౧. మాటలాడు.

ఆ. శిఖలు చూపకుండ శిక్షించి హాతికిన్, నోరు
దెఱవకుండ మేరవెట్టి, సేడి యొల్ల నుడిపి
విబుధారి కినుకమై, భీతిపాత్రుం జేసె వీతి
హగోత్రు. నృసిం. ౨. ౧౧౮.

౨. ఆశ్చర్యపడు, ఆశపెట్టుకొను.

క. గతమునకును వగవ కన్నా, గతమునకును నోరు
దెఱచి కడుం గోరక ప్రీనతం బొందక దైవం
బే గతిం బుచ్చిన దానం బోదుం గా కవవల
యుగా. భార. శాం. ౩. ౩౦.

౩. బదులుచెప్ప కుండు, నిరుత్తరుం డగు.
(వ్యవ.) సేన ట్లుసుగంగా సమాధానము చెప్పలేక వాఁడు నోరుదెఱచెను.

**నోరునొక్కు.** స. క్రి. (నోరు+నొక్కు.) మాటాడకుండం జేయు.

గీ. ఎవ్వ డిది యని పల్కిన నవ్వఘూటి, నోరు
నొక్కుచుం గౌంగిటం జేరం దిగిచి, మగువ
చెవిలోన నలుకుకుం మూను మేను, వాసవుండ
నిన్నుం గని కూర్మి వచ్చినాండ. జాహ్నవీ.
౪. ౮౭.

**నోరుమూయు.** అ. క్రి. (నోరు+మూయు.) మాటాడకుండు.

అ. అనిన నాతుగఱచి యనురద్విషుం డోరి,
పడుచ నాకుం బుట్టి చెడుగ వైతి, పేర్చి
నోరుమూయుము పెదతల వాపోరె, దిట్టవదర
గలండె యుచటనైన. నృసిం. ౪. ౩౪.

**నోరుమెంగ.** విణ. (√నోరు.) మూంగ.

క. త న్నట్లు పలికి ద్రొబ్బంగ, మిన్నక చన నం
తనోరు మెంగయె యదిర యా, ముశ్శాడిన
మాటలబిరు, కొన్నంగ నిది గనిరె యతం
డుపేక్ష యొనర్చెనా. కళా. ౩. ౨౩౮.

**నోరెత్తు.** అ. క్రి. (√నోరు.) మాటాడు.

ఉ. అత్తఱి భీష్మముఖ్యు లగు నచ్చటివృద్ధజనం
బు లెల్ల నోరెత్తక యూరకుండిరి మహీ
శ్వరుచిత్తమెఱుంగకున్కి... భార. ఉద్యో.
౧. ౩౪౮.

ఉ. అత్తను నేము మార్పలుక మాయమచి త్తము
లోనివార మెవ్వత్తుము పెద్దవారు గలవారికి
నన్నియుం జెల్లుంగాక సేం, డి త్తఱి మమ్ముం
బుచ్చి పని యెవ్వరు గొందురు మిమ్ముం జూ
చి నోరెత్తంగ నోడి యేపలుకు లెన్నండుం
జెప్ప మెఱింగి యుండితిమి. భోజరా.

నోవరి విణ. (నోవు+అరి.) వ్యాధి కలవాఁడు. (శ. ర.)

నోవి=నొవ్వి. వి. (√నొచ్చు.) బాధ, నొప్పి. (శ. ర, చి. ని.)

నోవిక. వి. ఉసులు, అనుకూల్యము.

సీ. జీరాల జంటించి సికతాళి నెప్పైన వైచుక నోవికల్ చూచువారు. మల్లుపు. ౨. ౪.

నోవు=నొవ్వు. (క. త. నోవు.)

(వ్యాధి.)

ఉ...జింకలు నక్కలు గొంకనక్కలుఁ, న్దోమలు మ్రాఁకులుం బొదలు నోవులఁ బీడలఁ బొందువారముక్, తామసభాగు లట్ల మతి తద్విధ జంతువు లెన్ని యన్నియుక్. భార. అశ్వ. ౨. ౧౧౪.

(బాధ.)

క. చావును నోవును మనయోధావలికిక్ గెలుపు నబ్బు నావలికిని నీ,చే వినియెదఁ దుది నెట్టులు, శ్రీవిభవము పాండవులకుఁ జేపడున కదే. భార. భీష్మ. ౨. ౧౯౯.

జః నోవరి.

## నౌ.

నౌ=నవు, నవ్వు. (శ. ర.)

నౌక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నావ, ఓడ. ౨. చిన్నపడవ.

నౌకర్ణధారుఁడు. సం. వి. అ. పుం. మాలిమి కాఁడు, ఓడ నడపువాఁడు.

నౌకర్మము. సం. వి. న్. న. నావికవృత్తి, పడవ నడపువ్యాపారము.

నౌకాదండము. సం. వి. అ. పుం. క్షేపణి, నావను నడపుతెడ్డు; ఓడ నడపుగడ.

నౌకు=నవుకు.

ద్వి. వల్లువుల్లుకుఁ గ్రింద నౌకుకాపువయు... నివాల్చుక్క తెగి పడ్డరీతిఁ, గనిపించె... ద్వి. శ. సా. ౧. ౨౦౩౩, ౦౧ పం. ('నాకు.' ముద్రి.)

నౌచరుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) -పడవతో తిరుగువాఁడు- నావికుఁడు, పడవవాఁడు.

నౌజీవికుఁడు. సం. వి. అ. పుం. ఓడ నడపు వృత్తిచే జీవించువాఁడు.

నౌజు. వి. భక్ష్యవిశేషము.

(గ్యవ.) కొబ్బెరనౌజు పిల్లలకు ఇష్టము.

నౌడుకొట్టు=నవుడుకొట్టు. (శ. ర.)

నౌతార్యము. సం. విణ. (అ. ఆ. అ.) నావ్యము, ఓడచే దాటఁదగినది. (నది మొ.)

నౌదండము. సం=నౌకాదండము.

నౌబత్తు=నవుబత్తు. వి. (హిం. నౌబత్.) చర్మవాద్యవిశేషము.

సీ. నక్కందిరంబును నాదు పాదుకొనంగ నౌహేబు నౌబత్తు చఱవఁ బనిచి. రంగా. ౨. ౧౫౨.

నౌయానము. సం. వి. అ. న. నౌకాయాత్ర, ఓడలో పయనము చేయుట.

నౌయాయి. సం. విణ. (న్. నీ. న్.) ఓడలో పోవువాఁడు, నావలో ప్రయాణము చేయువాఁడు.

నౌరు=నవురు. విణ. మృదువు. (శ. ర.)

నౌవాహుఁడు. సం. వి. అ. పుం. ఓడనడపు వాఁడు.

## న్య.

న్యంకుభూరుహము. సం. వి. అ. పుం. -ఇఱ్ఱి కొమ్ములవంటి కొమ్మలు శాఖలుఁ కలది- శ్లేష్మాతకము ...

న్యంకువు. సం. వి. ఉ. పుం. గ. ఇఱ్ఱి. ౨. ఒకా నొకముని.

న్యంచనము. సం. వి. అ. న. గ. న్యగ్భావము, తక్కువపాటు. ౨. వంపు, వంకర. ౩. పల్లము.

న్యంచితము. సం. విణ. (అ. ఆ. అ.) గ. అధః క్షిప్తము, క్రిందికి త్రోయఁబడినది. ౨. వంపఁబడినది.

న్యంతము. సం. వి. అ. పుం. చరమభాగము, చిట్టచివరభాగము.

న్యక్కరణము. సం. వి. అ. న. తిరస్కారము, అవమానము.

న్యక్కారము. సం. వి. అ. పుం=న్యక్కరణము.

న్యఙ్కు. సం. విణ. (చ్. నీచీ. చ్.) గ. క్రిందికి పోవునది; క్రిందికి వంగునది. ౨. నిమ్నము, పల్లము. ౩. నీచము.

న్యక్కృతము. సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కృతము, అవమానింపఁబడినది.

న్యక్కృతి. సం. వి. ఇ. స్త్రీ=న్యక్కరణము.

న్యక్తము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి చఱచఁబడినది, మిక్కిలి పూయఁబడినది.

న్యక్షము. సం. విణ. (అ. ఆ. అ.) గ. నీచము, తక్కువైనది. ౨. అంతయు, సమస్తము. వి. అ. పుం. మహిషము, దున్నపోతు. న. గ. సాకల్యము, పూర్ణత. ౨. మహిషతృణము.

న్యక్షుఁడు. సం. వి. అ. పుం. పరశురాముఁడు. (వాచ.)

న్యగ్భావము. సం. వి. అ. పుం. గ. నీచత్వము, తక్కువపాటు; అవమానము, తిరస్కారము. ౨. నీచముగా చేయుట, క్రిందుపఱుచుట.

న్యగ్భావితము. సం. విణ. (అ. ఆ. అ.) గ. నీచముగా చేయఁబడినది, క్రిందుపఱుపఁబడినది. ౨. గుణీకృతము, అప్రధానముగా చేయఁబడినది.

న్యగ్భూతము. సం. విణ. (అ. ఆ. అ.) గ. నీచమైనది ౨. అవమానము నొందినది, తిరస్కారము నొందినది.

న్యగ్రోధపరిమండల. సం. వి. అ. స్త్రీ. కఠినస్తనములును విశాలనితంబమును సూక్ష్మమధ్యమును కలస్త్రీ.

శ్లో. స్తనౌ సుకఠినౌ యస్యా నితంబే చ విశాలతా, మధ్యే క్షీణా భవేద్యా సా న్యగ్రోధపరిమండలా. (వాచ.)

న్యగ్రోధపరిమండలుఁడు. సం. వి. అ. పుం. వ్యామపరిమితమైనయుచ్ఛ్రాయమును పరిణాహమును కలపురుషుఁడు, బారెఁడు పొడుగును పొడవును కలవాఁడు, బారమట్టుకొలత కలదేహము కలవాఁడు.

శ్లో. న్యగ్రోధౌతు స్మృతౌ బాహూ వ్యామో న్యగ్రోధ ఉచ్యతే, వ్యామేన ఉచ్ఛ్రయో యస్య అధ ఊర్ధ్వం చ దేహినః, సమోచ్ఛ్రయపరిణాహో న్యగ్రోధపరిమండలః. మత్స్యపురాణము. (వాచ.)

న్యగ్రోధము. సం. వి. అ. పుం. గ. మఱ్ఱి. ౨. శమి, జమ్మి. ౩. వ్యామము, బార.

న్యగ్రోధి. సం. వి. ఈ. స్త్రీ. మూషికపర్ణి, ఎలుకజీడి.

న్యచ్ఛము. సం. వి. అ. న. దేహమునందు పుట్టుమచ్చ.

న్యయము. సం. వి. అ. పుం. గ. నాశము. ౨. అపచయము, తఱుగుట.

న్యర్బుదము. సం. విణ. (అ. ఆ. అ.) పదియర్బుదములయందుండుసంఖ్య కలది. వి. అ. న. పదియర్బుదములు.

న్యసనము. సం. వి. అ. న. ౧. ఉంచుట. ౨. అప్పగించుట. ౩. ఇల్లడపెట్టుట. ౪. విడిచిపెట్టుట.

న్యసనీయము. సం. విణ. (అ. ఆ. అ.) న్యసింపఁదగినది, ఉంచఁదగినది.

న్యసించు. సం. స. క్రి. ౧. ఉంచు. ౨. ఇల్లడపెట్టు. ౩. జపాదిసమయమున దేహావయవములయందు మంత్ర బీజాక్షరము లుంచు, న్యాసముచేయు. ౪. స్పృశించు, తాఁకు.

వ... కేశవాదినామంబులతోడ గోకర్ణహస్తంబున మాషమజ్జనపరిమితశుద్ధోదకంబుల ముమ్మాఱు లోనికిఁగొని యినుమాఱు పరిమార్జనంబు చేసి దక్షిణపూర్వకంబుగా నేత్రనాసాశ్రోత్రద్వయశిరోబాహుద్వయనాభి హృదయంబుల న్యసించి యాచమనంబు చేసి... వి. పు. ౪. ౧౯౩.

న్యసిత. సం.విణ. (బు. త్రీ. బు.) న్యాసకుఁడు.

న్యసితవ్యము. సం=న్యసనీయము.

న్యస్తదేహుఁడు. సం.విణ. (అ. ఆ. అ.) దేహమును విడిచినవాఁడు, మృతుఁడు.

న్యస్తము. సం.విణ. (అ.ఆ. అ.) ౧. నిహితము, ఉంచఁబడినది. ౨. క్షిప్తము, త్రోయఁబడినది. ౩. త్యక్తము, విడువఁబడినది. ౪. అప్పగింపఁబడినది. ౫. ఇల్లడపెట్టఁబడినది. ౬. మంత్రోచ్చారణముతో అంటఁబడినది. (శేత్రాది.)

న్యస్తశస్త్రుఁడు. సం.విణ. (అ.ఆ. అ.) సన్న్యస్తశస్త్రుఁడు, శస్త్రములను విడిచినవాఁడు, అస్త్రసన్న్యాసము చేసినవాఁడు.

న్యస్యత్. సం. శత్ర. న్యసించుచున్న.

న్యస్యమానము. సం.విణ. (అ. ఆ. అ.) న్యసింపఁబడుచున్నది.

న్యస్యము. సం. = న్యసనీయము.

# న్యా

న్యాక్క్యము. సం. వి. అ. న. భృష్టతండులము, వేఁపుడుబియ్యము. (వాచ.)

న్యాదము. సం. వి. అ. పుం. ౧. భోజనము తినుట. ౨. ఆహారము.

న్యాయపథము. సం. వి. అ. పుం. ౧. ధర్మమార్గము; నీతిమార్గము. ౨. మీమాంసాశాస్త్రము.

న్యాయము. సం. వి. అ. పుం. -దీని ననుసరించి ప్రవర్తింతురు.- ౧. పద్ధతి. ౨. పాడి, ధర్మము. ౩. వ్యవహారము, తగవు; దాయభాగాదివ్యవహారము. ౪. వేదార్థనిర్ణయసాధన మగు అధికరణము. ౫. గౌతమమునిప్రణీత మగుతర్క-న్యాయ-శాస్త్రము. ౬. (న్యాయ.) ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయనిగమము లనుపంచావయవములు కలవాక్యసముదాయము. ౭. లోకమందును శాస్త్రమందును ప్రసిద్ధమగుదృష్టాంతవిశేషము. ఉదా:-

అండకుక్కుటీన్యాయము:- గ్రుడ్డు ముందా ? కోడి ముందా? (చూ. బీజాంకురన్యాయము.)

అంధకూపపతనన్యాయము:- ౧. నాలుగురు అంధులు కలసి పోవుచుండఁగా వారిలో మొదటియంధుఁడు ఒక నూతిలోఁ బడెను. వాఁడట్లు నూతిలోఁ బడినట్లు ఎఱుఁగని మిగిలినయంధు లందఱు నొకరివెంట నొకరు నూతిలోఁ బడిరి. ఒక అజ్ఞుని అనుసరించి పోవుమిగిలినఅజ్ఞులుకూడ మొదటివానివలెనే హానిఁ బొందుదురు.

౨. మార్గదర్శి చెప్పినత్రోవ వదలి గ్రుడ్డివాఁడు నూతిలోఁ గూలినట్లు వేదాదిసదుపదేశము లను వదలి అజ్ఞుఁడు నరకమునఁ బడును. (కాశ.)

న్యంకువు. సం. వి. ఉ. పుం. గం. ఇఱ్ఱి. ౨. ఒకా నొకముని.

న్యంచనము. సం. వి. అ. న. గ. న్యగ్భావము, తక్కువపాటు. ౨. వంపు, వంకర. ౩. పల్లము.

న్యంచితము. సం. విణ. (అ. ఆ. అ.) గ. అధః క్షిప్తము, క్రిందికి త్రోయఁబడినది. ౨. వంపఁబడినది.

న్యంతము. సం. వి. అ. పుం. చరమభాగము, చిట్టచివరభాగము.

న్యక్కరణము. సం. వి. అ. న. తిరస్కారము, అవమానము.

న్యక్కారము. సం. వి. అ. పుం=న్యక్కరణము.

న్యక్కు. సం. విణ. (చ్. నీచీ. చ్.) గ. క్రిందికి పోవునది; క్రిందికి వంగునది. ౨. నిమ్నము, పల్లము. ౩. నీచము.

న్యక్కృతము. సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కృతము, అవమానింపఁబడినది.

న్యక్కృతి. సం. వి. ఇ. స్త్రీ=న్యక్కరణము.

న్యక్తము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి చఱపఁబడినది, మిక్కిలి పూయఁబడినది.

న్యక్షము. సం. విణ. (అ. ఆ. అ.) గ. నీచము, తక్కువైనది. ౨. అంతయు, సమస్తము. వి. అ. పుం. మహిషము, దున్నపోతు. న. గ. సాకల్యము, పూర్ణత. ౨. మహిషతృణము?.

న్యక్షుఁడు. సం. వి. అ. పుం. పరశురాముఁడు. (వా చ.)

న్యగ్భావము. సం. వి. అ. పుం. గ. నీచత్వము, తక్కువపాటు; అవమానము, తిరస్కారము. ౨. నీచముగా చేయుట, క్రిందుపఱుచుట.

న్యగ్భావితము. సం. విణ. (అ. ఆ. అ.) గ. నీచముగా చేయఁబడినది, క్రిందుపఱుపఁబడినది. ౨. గుణీకృతము, అప్రధానముగా చేయఁబడినది.

న్యగ్భూతము. సం. విణ. (అ. ఆ. అ.) గ. నీచమైనది ౨. అవమానము నొందినది, తిరస్కారము నొందినది.

న్యగ్రోధపరిమండల. సం. వి. ఆ. స్త్రీ. కఠినస్తనములును విశాలనితంబమును సూక్ష్మమధ్యమును కలస్త్రీ.

శ్లో. స్తనౌ సుకఠినౌ యస్యా నితంబే చ విశాలతా, మధ్యే క్షీణా భవేద్యా సా న్యగ్రోధపరిమండలా. (వా చ.)

న్యగ్రోధపరిమండలుఁడు. సం. వి. అ. పుం. వ్యామపరిమితమైనయుచ్ఛ్రాయమును పరిణాహమును కలపురుషుఁడు, బారెఁడు ఒడ్డును పొడవును కలవాఁడు, బారచుట్టుకొలత కలదేహము కలవాఁడు.

శ్లో. న్యగ్రోధౌతు స్మృతౌ బాహూ వ్యామో న్యగ్రోధ ఉచ్యతే, వ్యామేన ఉచ్ఛ్రయో యస్య అథ ఊర్ధ్వం చ దేహినః, సమోచ్ఛ్రయపరిణాహో న్యగ్రోధపరిమండలః. మత్స్యపురాణము. (వా చ.)

న్యగ్రోధము. సం. వి. అ. పుం. గ. మఱ్ఱి?. ౨. శమి, జమ్మి?. ౩. వ్యామము, బార.

న్యగ్రోధి. సం. వి. ఈ. స్త్రీ. మూషికపర్ణి, ఎలుకచెవి?.

న్యచ్ఛము. సం. వి. అ. న. దేహముమీఁది పుట్టుమచ్చ.

న్యయము. సం. వి. అ. పుం. గ. నాశము. ౨. అపచయము, తఱుగుట.

న్యర్బుదము. సం. విణ. (అ. ఆ. అ.) పదియర్బుదములయందుండు సంఖ్య కలది. వి. అ. న. పది అర్బుదములు.

న్యసనము. సం. వి. అ. న. ౧. ఉంచుట. ౨. అప్పగించుట. ౩. ఇల్లడపెట్టుట. ౪. విడిచిపెట్టుట.

న్యసనీయము. సం. విణ. (అ. ఆ. అ.) న్యసింపదగినది, ఉంచదగినది.

న్యసించు. సం. స. క్రి. ౧. ఉంచు. ౨. ఇల్లడపెట్టు. ౩. జపాదిసమయమున దేహావయవముల యందు మంత్రబీజాక్షరము లుంచు, న్యాసము చేయు. ౪. స్పృశించు, తాఁకు.

వ... కేశవాదినామంబులతోడ గోకర్ణమాత్రంబు లైన మాష మజ్జనపరిమిత శుద్ధోదకంబుల ముమ్మాఱు లోనికింగొని యనుమాఱు పరిమార్జనంబు చేసి దక్షిణపూర్వకంబుగా నేత్ర నాసా శ్రోత్ర ద్వయ శిరో బాహుద్వయ నాభి హృదయంబుల న్యసించి యాచమనంబు చేసి... వి. పు. ౪. ౧౯౩.

న్యసిత. సం. విణ. (బు. త్రి. బు.) న్యాసకుఁడు.

న్యసితవ్యము. సం=న్యసనీయము.

న్యస్తదేహుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దేహమును విడిచినవాఁడు, మృతుఁడు.

న్యస్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నిహితము, ఉంచఁబడినది. ౨. క్షిప్తము, త్రోయఁబడినది. ౩. త్యక్తము, విడువఁబడినది. ౪. అప్పగింపఁబడినది. ౫. ఇల్లడపెట్టఁబడినది. ౬. మంత్రోచ్చారణముతో అంటఁబడినది. (నేత్రాది.)

న్యస్తశస్త్రుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సన్న్యస్తశస్త్రుఁడు, శస్త్రములను విడిచినవాఁడు, అస్త్రసన్న్యాసము చేసినవాఁడు.

న్యస్యత్. సం. శత్ర. న్యసించుచున్న.

న్యస్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) న్యసింపఁబడుచున్నది.

న్యస్యము. సం. = న్యసనీయము.

## న్యా.

న్యాక్యము. సం. వి. అ. న. భృష్టతండులము, వేఁపుడుబియ్యము. (వాచ.)

న్యాదము. సం. వి. అ. పుం. ౧. భోజనము తినుట. ౨. ఆహారము.

న్యాయపథము. సం. వి. అ. పుం. ౧. ధర్మమార్గము; నీతిమార్గము. ౨. మీమాంసాశాస్త్రము.

న్యాయము. సం. వి. అ. పుం. -దీని ననుసరించి ప్రవర్తింతురు.- ౧. పద్ధతి. ౨. పాడి, ధర్మము. ౩. వ్యవహారము, తగవు; దాయభాగాదివ్యవహారము. ౪. వేదార్థనిర్ణయసాధన మగు అధికరణము. ౫. గౌతమముని ప్రణీత మగుతర్క-న్యాయ-శాస్త్రము. ౬. (న్యాయ.) ప్రతిజ్ఞా-హేతూదాహరణోపనయననిగమము లనుపంచావయవములు కలవాక్యసముదాయము. ౭. లోకమందును శాస్త్రమందును ప్రసిద్ధమగుదృష్టాంతవిశేషము. ఉదా:-

అండకుక్కుటీన్యాయము:- గ్రుడ్డు ముందా ? కోడి ముందా? (చూ. బీజాంకురన్యాయము.)

అంధకూపపతనన్యాయము:- ౧. నూఱుగురు అంధులు కలసి పోవుచుండఁగా వారిలో మొదటియంధుఁడు ఒక నూతిలోఁ బడెను. వాఁ డట్లు నూతిలోఁ బడినట్లు ఎఱుఁగని మిగిలినయంధు లందఱు నొకరివెంట నొకరు నూతిలోఁ బడిరి. ఒక అజ్ఞుని అనుసరించి పోవుమిగిలినఅజ్ఞులుకూడ మొదటివానివలెనే హానిఁ బొందుదురు.

౨. మార్గదర్శి చెప్పినత్రోవ వదలి గ్రుడ్డివాఁడు నూతిలోఁ గూలినట్లు వేదాదిసదుపదేశములను వదలి అజ్ఞుఁడు నరకమునఁ బడును. (వాచ.)

అంధగజన్యాయము:-అంధులు ఏనుఁగును స్పృశించి వారివారిబుద్ధ్యనుభవములనుబట్టి దాని రూపమును నిర్ణయించుకొనునట్లు అజ్ఞానులు వారివారిబుద్ధ్యనుభవముల ననుసరించి భగవద్రూపములను గల్పించుకొందురు.

అంధగోక్షేత్రన్యాయము:—(గ్రుడ్డియెద్దు చేనిలోఁ బడినట్లు. చేనిలోఁ బడ్డగ్రుడ్డియెద్దు గడ్డి గాదము ఎన్నులు అనువిభాగము తెలియక నోటి కందిన దెల్ల తినునట్లు వివేచనము లేనివాఁడు సారాసారములు ఎఱుఁగక తోఁచినట్లు పని చేయును.

అంధగోలాంగూలన్యాయము:-ఒక గ్రుడ్డివాఁడు దారితప్పి యొకయడవిని బడెను. "ఈగిత్త తోఁక పట్టుకొని నీవు పోవుచోడల నిన్నది దారికిఁ దీసికొనివచ్చు" నని వానితో నొక కొంటెవాఁడు చెప్పెను. అట్లుచేయఁగా నతఁడు తిన్ననిత్రోవను బడకపోవుటయే కాక దానిచేఁ దన్నులు తినుచు కంటకమార్గములఁ బడి యార్తిచెందెను. అట్లే చెడ్డమార్గముపదేశించినచో దాని నవలంబించి పోవు అజ్ఞునకు లాభములేకపోవుటే కాక కష్టములను సంభవించును.

అంధచటకన్యాయము:—దైవవశమున పిచ్చుక గ్రుడ్డివానిచేతఁ జిక్కఁగా అంధుఁడు దానిని పట్టుకొనె నని పామరు లెంచెదరు. అట్లే జనులు దైవికముగా జరిగినపనికి కారణము కానిదానియందుఁ గారణత్వము కల్పించెదరు. (చూ. ఘుణాక్షరన్యాయము.)

అంధదర్పణన్యాయము:—గ్రుడ్డివానికి అద్దము చూపుట నిష్ప్రయోజనమైనట్లు చెప్పినదానిని గ్రహింపనేరనివాని కుపదేశము చేయుట వ్యర్థము.

అంధదీపికాన్యాయము :—అంధునకు దీపము ఉన్నను లేకపోయినను ఫలము సమానమగునట్లు శక్తి లేనివానికి సాధనసామగ్రివలనఁ బ్రయోజనము వ్యర్థము.

అంధపంగున్యాయము:— నడవలేనికుంటివాఁడును త్రోవ కానలేనిగ్రుడ్డివాఁడును ప్రయాణము చేయవలసినపుడు కుంటివాఁడు గ్రుడ్డివానిబుజములపై నెక్కి త్రోవ చెప్పుచుండ గ్రుడ్డివాఁడును కుంటివాఁడును గూడ గమ్యస్థానమునకుఁ బోయిరి. అట్లే శక్తిలోపము కలవారు పరస్పరసాహాయ్యమువలన కార్యము నెఱవేర్చుకొనఁ గలరు.

అంధపరంపరాన్యాయము:-ఒకయంధునిచే నుపదిష్టమైనదానిని మిగిలినయంధులు పరంపరగా నమ్మి పాడగు నట్లొక యజ్ఞాని చెప్పినదానిని వివేచనములేనిఇతరులు నమ్మి భ్రష్టులగుదురు.

అంధాంజనన్యాయము:—గ్రుడ్డివాని కంటికి కాటుక పెట్టుట వ్యర్థమైనట్లు ప్రయోజనము మాలినపనికై కృషిచేయుట వ్యర్థమగును.

అంధాంధన్యాయము:—ఒకగ్రుడ్డివాఁడు మఱియొకగ్రుడ్డివానికి త్రోవ చూపినట్లు ఒక మూర్ఖుఁడు మఱియొకమూర్ఖునకు ఉపదేశము చేయుట నిష్ఫలమగును.

అంధాక్షిమీలనన్యాయము:—గ్రుడ్డికన్ను మూసినను తెఱచినను ఒకటే. అట్లే అసమర్థుఁడు కార్యప్రయత్నము చేసినను చేయకున్నను ఫలము ఒక్కటే యగును.

అంధాశ్వపాళిన్యాయము:—గుఱ్ఱము గ్రుడ్డి దైనను గుగ్గిళ్లకు కొఱఁత లేదు. (గుఱ్ఱము గ్రుడ్డిదైనను దాణకు తక్కువ లేదు.) సోమరికి కార్యసామర్థ్యము లేకున్నను కడుపునిండ తిండి తప్పదు.

అక్ష్యండభేషజన్యాయము :—కంటికి పెట్టఁదగినమందు అండములకుఁ బెట్టినట్లు ఒక దానికి చేయవలసినపనిని మఱొకదానికి

చేసినచో అది వికటించును. (కంటికి పెట్టు కాటుక తుంటికి పెట్టినట్లు.)

అగ్నివమ్రిన్యాయము:— నిప్పులను చెదలు పట్టనట్లు ధర్మాత్ములను పాప మంటదు.

అచలచలన్యాయము:— పడవ మున్నగువాని మీఁద ప్రయాణము చేయువారికి ఒడ్డున నున్న చెట్లు నడచుచున్నట్లు కనఁబడురీతిని అజ్ఞానికి భ్రాంతిచేత లేనిది ఉన్నట్లు తోఁచును.

అజగరన్యాయము:— కొండచిలువ ప్రయత్నింపక దగ్గఱకు వచ్చిన జంతువులనే తిని బ్రతుకు నట్లు ప్రయత్నములేక లభించిన దానితో తుష్టి నొంది యుండుట శ్రేయస్కరము.

అజాకృపాణీయన్యాయము:— మేఁక కండూతి పోగొట్టు కొనుటకై వచ్చుటయు కత్తిపడి దాని ప్రాణముపోవుటయు నొకసారి సంభవించినట్లు దురదృష్టవంతులకు ఆకస్మికానిష్టప్రాప్తి యగును. (చూ. కాకతాళీయన్యాయము.)

అజాగళస్తనన్యాయము:— మేఁక మెడ క్రింద వ్రేలాడుచన్నులు పాలు స్రవింపక నిష్ప్రయోజనమగునట్లే మిథ్యాపురుషుల వలనఁ బ్రయోజనము లేదు.

అజాతపుత్రనామోత్కీర్తనన్యాయము:— పుట్టని కొడుకునకు పేరు పెట్టునట్లు ఎప్పుడో రాబోవుదానిని గూర్చిన పన్నగడలతో కాలము గడపుట వ్యర్థము. ('ఆలు లేదు చూలు లేదు కొడుకుపేరు సోమలింగము.')

అణుకులాచలన్యాయము:— సూక్ష్మాణువునకును కులపర్వతమునకును ఎంత తారతమ్యముండునో అంతయెక్కువ తారతమ్య ముండుటను తెలుపును. (ఇది హస్తిమశకాంతరము వంటిది.)

అతిపరిచయన్యాయము:— అతిపరిచయము అవజ్ఞాహేతు వగును.

అనిషిద్ధానుమతన్యాయము:— నిషేధింపఁబడనిది అనుమతింపఁ బడినదే యగును.

అపరాహ్ణచ్ఛాయాన్యాయము:— అపరాహ్ణకాలమందలినీడ మొదట పొట్టిగా నుండి క్రమముగా పెరుగునట్లే సజ్జన స్నేహాదికము మొదట కొంచెముగా నుండి క్రమక్రమముగా పెరుగును. (వ్యతి. పూర్వాహ్ణచ్ఛాయాన్యాయము.)

అభావవిరక్తిన్యాయము:— మానవుడు ఎంత యత్నించినను దొరకనిదానియందు వైరాగ్యము నొందును. ఇది "నక్క ద్రాక్షపండ్లు" అను సామెత వంటిది.

అయస్కాంతసూచీన్యాయము:— సూదంటు రాయి సూదిని ఆకర్షించునట్లు పరస్పరాకర్షక మగు ఒకవస్తువును మఱియొకటి ఆకర్షించును.

అరణ్యరుదితన్యాయము:— అరణ్యమందలి ఏడ్పువలె ఆదరించువారు లేనిచోట మొఱపెట్టుట నిష్ప్రయోజనమగును.

అరుంధతీదర్శనన్యాయము:— సూక్ష్మమగునట్టి యరుంధతీనక్షత్రమును చూపఁదలఁచి దాని ప్రక్కనున్న స్థూలనక్షత్రమును చూపునట్లు సూక్ష్మవిషయమును దెలుపఁదలఁచి దానిని సులభముగా గ్రహింపఁజేయుటకై దానికి సంబంధించిన స్థూలవిషయమును ముందు బోధింతురు. (దీనికి స్థూలారుంధతీన్యాయ మనియు వాడుక కలదు.)

అర్ధజరతీయన్యాయము:— సగము దేహమున పడుచుఁదనమును సగము దేహమున ముసలితనమును కల స్త్రీ యుండనట్లు ఒక భాగమున ఒక ప్రయోజనమును మఱియొక భాగమున మఱియొక ప్రయోజనమును కలపదార్థము

సంభవింపదు.

అర్ధవైశసన్యాయము:— దేహమున సగముభాగము చంపఁబడినప్పుడు మిగిలినభాగమును చంపఁబడినట్లే యగును.

శ్లో. సిద్ధిసాకృతమర్ధవైశసమ్. సం. కు. సం. ౪. ౩౧.

అలంకృతశిరశ్ఛేదన్యాయము:— శరీరము నలంకరించి తర్వాత తల తెగఁగొట్టుట యెట్టిదో ఒక విషయమును మిక్కిలి ప్రశంసించి తుదకు నిరాకరించుట యట్టిదగును.

అశోకవనికాన్యాయము:— ౧. ఛాయాసౌరభ్యములు కలఅశోకవనమున నున్నవారికి ఇతరస్థలమునకుఁ బోవ బుద్ధిపుట్టనట్లు ఎవరికిని ఇష్టస్థలమును వీడి పోవ బుద్ధి కలుగదు.

౨. అనేకము లైనచూతాదివనము లుండఁగా రావణుఁడు అశోకవనమునందే సీత నుంచుటకు కారణమును చెప్పలేనట్లు ఒకకార్యమును నిర్వహించుటకు సమానబలము కల పెక్కుసాధనము లుండఁగా వానిలో నొకసాధనమునవలంబించుటకుఁ గలకారణమును చెప్పుట కష్టము.

అశ్మలోష్టన్యాయము:— మంటిగడ్డ ఱాతితోఁ బోల్చినపుడు కఠినపదార్థ మగును. అట్లే గుణములు సాపేక్షములు గాని నిరపేక్షములు గావు. (పాషాణేష్టకన్యాయము ఇట్టిదే.)

అశ్వతరీగర్భన్యాయము :— మగగాడిదవలన ఆఁడుగుఱ్ఱమునందు పుట్టినయాఁడుపిల్ల అశ్వతరి. ఈగాడిద ఈనునపుడు దానిగర్భమును జీల్చుకొని పిల్లపుట్టునని ప్రసిద్ధి. ఆపిల్ల తనజననహేతు వగుతల్లియొక్క నాశమునకుఁ గారణ మగునట్లు దుష్టులు తమపుట్టుకవలన తమజన్మస్థానమును నశింపఁ జేయుదురు. "వృశ్చికీగర్భన్యాయము, కర్కటీగర్భన్యాయము" ఇట్టివే.

అసిధారామధులేహనన్యాయము:— కత్తివాదరమీఁది తేనె నాకునప్పుడు మధుమాధుర్యమువలన సుఖమును కత్తివాదర తగిలి నాలుక తెగుటవలన దుఃఖమును తటస్థించు నట్లు కొన్నిటియందు సుఖదుఃఖములు మిశ్రములై యుండును.

అస్నేహదీపన్యాయము:- చమురు లేనిచో దీపమాఱిపోవునట్లు కారణసామగ్రి క్షీణించినచో కార్యముకూడ క్షయము నొందును.

అహికుండలన్యాయము :— అహిశబ్దము సర్పమునంతను తెలుపును. కుండలశబ్దము చుట్టలు చుట్టుకొనుట అనెడి వికారరూపభేదమును తెలుపును. ఒకవస్తువే వికృతి చెందుటచే భిన్నముగా వ్యవహరింపఁబడును. అని శాంకరబ్రహ్మసూత్రభాష్యము. సర్పములకు చుట్టలు చుట్టుకొనుట స్వాభావిక మగు నట్లు ఒక్కొక దానికి ఒక్కొక స్వభావముండు నని తెలుపును. (వాచ.)

అహిభుక్కైవర్తన్యాయము:— (అహి = అహిఫేనము, నల్లమందు) నల్లమందు తిని మత్తుగొన్నవాఁ డొకఁడు ఓడ నెక్కి తాను మాఱిపోకుండుటకై గుఱుతుగా కాలి కొకత్రాడును కట్టుకొని నిద్రపోయెను. పడవవాఁడు పరిహాసార్థము ఆత్రాడు విప్పి తన కాలికి కట్టుకొనెను. ఓడ రేవునకు వచ్చినపుడు అహిభుక్కు (నల్లమందు తిన్నవాడు) పడవవాని కాలికి కట్టియున్నత్రాడును జూచి అదిగో! ఆత్రాడు కట్టుకొన్నవాఁడను నేను. నేను వాఁడు అని వాదింపసాఁగెను. అట్లే జీవుఁడు అవిద్యావశమున స్వస్వరూపమును మఱచుటయే కాక తాను కానిదానియందు తా ననుభ్రాంతి చెందును.

ఆకాశముష్టిహననన్యాయము:-ఆకాశమును పిడికిలితో [illegible]చుటవలె అసాధ్యకార్యమునకై

